

# మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు

శ్రీ వ్యాసాశ్రమము

# అన్నమాచార్య సంకీర్తనామృతము

## ప్రథమ, ద్వితీయ భాగములు




వ్యాఖ్యాత :

శిరోమణి

**సముద్రాల లక్ష్మణయ్య**, ఎం.ఏ.

తిరుపతి


**2000**

# నీరాజనం

పూజ్యశ్రీరామకృష్ణానందస్వాములవారు.
గండిక్షేత్రం, కడపజిల్లా.

''మధురాక్షరములైన మామాటలు వినంగ
నమృతాంధసులె యోగ్యు లనుపమాంగి!'' -

అని శృంగారనైషధంలో రాజహంస తన మాటలను వినుటకు అమృతాంధసులే - అమృతభోజనులే - అమరులే అర్హులని సగర్వంగా చెప్పుకొంది. తాళ్ళపాకవారి పరమహంస తన సంకీర్తనామృత నివేదనకు తిరుమలపతి శ్రీవేంకటేశ్వరుని పాత్రముగ వరించాడు.

''భక్తిప్రియో మాధవః'' - ''భక్తిబిఖారీ భగవాన్.''

అన్నమాచార్యుల వారి అధ్యాత్మకీర్తనలకు వ్యాఖ్యతో వెలువడిన ప్రథమ సంపుటి యీ గ్రంథము. తిరుపతి శ్రీవేంకటేశ్వర స్వామివారిని కొలిచి వారి సాక్షాత్కారాన్ని పొందిన రససిద్ధకవీశ్వరులు వీరు.

భక్తుడు గానప్రియుడు. భగవంతుడు గానలోలుడు. శివుడు సర్పభూషణుడై డమరుకం మ్రోగిస్తే శ్రీకృష్ణుడు పాము పడగపై నెక్కి వేణుగాన మాలపించాడు.

''శిశురే త్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ'' - పశువుయొక్క చపలాన్ని, శిశువుయొక్క చపలాన్ని, ఫణియొక్క చపలాన్ని అరికట్టి ఆకట్టి అద్వైత రసానుభూతి సమాధికి చేర్చే విద్య గానవిద్య. పశువు నందీశ్వరుడు; శిశువు కుమారస్వామి; ఫణి ఆదిశేషుడు - అంతకు మించి శివుని, కేశవుని సైతం డోల లూగించే విద్య గానవిద్య. వేదములలో ఒకభాగమే గానరూపమై వెలసింది.

వీరి కీర్తనలలో తత్త్వము వుంది; తన్మయత వుంది; భక్తి వుంది; విరక్తి వుంది; నీతులున్నాయి; రీతులున్నాయి. దృష్టాంతాలు, ఉపమానాలు, లోకోక్తులు, నానుడులు పట్టుపట్టుకు గుప్పిళ్లు గుప్పిళ్లు. దాసరయ్యలు, శరణప్పలు, జానకవులు, గేయకవులు, సాహిత్యకవులు, శతకకవులు, భగవద్గీత, భర్తృహరి, వేమన్న, పోతన్న, ధూర్జటి, నరసీమోహతా, పరమహంస, విశాలకవిలోకం, విస్తృతభక్తలోకం వీరి కీర్తనలలో గోచరిస్తారు. శ్రీలక్ష్మణయ్యగారు ఆపరిచయాన్ని యథాస్థానంలో దిగ్దర్శనం చేసివున్నారు.

---

*ఇది ఈ గ్రంథములోని ప్రథమభాగాన్ని ఉద్దేశించి వ్రాసినది.

1. రాగము 2. కీర్తన, 3. సందర్భం, 4. భావము, 5. విశేషాంశములతో ప్రతి కీర్తనా సమగ్రంగా రూపొందింది. మచ్చుకు కొన్ని ఉదాహరణలు.

(1) ఇందులో ప్రతి కీర్తనలోని పల్లవి కీర్తనయొక్క ఆశ్చర్యాత్మకమైన సారాంశం చెప్పి వుంచింది

(2) ఇందు కీర్తనలోని భావము, అనేక విజ్ఞానము గమనార్హమై వున్నాయి.

(3) "కాదనో కాదనో పిలుపు" అనే యిరవై యొకటవ కీర్తన గోపన్నగారి కీర్తనలు, పురందర దాసుగారి కీర్తనను పోలికగా వుంది.

(4) ఇరవై నాల్గవ కీర్తనలో సన్న్యాసుల విషయకంగా ఇచ్చిన సమర్థనలో శ్రీ లక్ష్మణయ్యగారు తమ ప్రత్యేకతను నిరూపించుకొన్నారు. వీరు "అపూర్వవాక్ ప్రదుములు". ఈనాటి సన్న్యాస ద్వేషి యుగంలో సాంప్రదాయిక సిద్ధాంతాలు మన్నన చేశారు. వారి సద్బుద్ధి పరిణతి వర్ధిల్లుగాక !

(5) "వలె వదలవలెదె వైష్ణవము" అనే యిరువైయేడవ కీర్తన నరసింహమెహతాగారి "వైష్ణవజనతో తేనే కహియే" అనే గేయాన్ని తలపిస్తుంది.

(6) ముప్పై రెండవ కీర్తన (మైనర్) ఉపనిషత్తులోని "పూర్ణస్యావాహనం కుతః" అనే బోధకు, నరసింహశతకంలోని ఒకానొక పద్యానికి పోలికగా వుంది.

(7) నూట యెనభైనాల్గవ పుటలోని "పుట్టు బ్రహ్మచారికి బుద్ధి చెడదు" అనే మాట పరమహంసగారి ఒకానొక సూక్తిని అందుకొంటుంది.

(8) డెబ్బైరెండవ కీర్తనలోని బోధ అత్యంతము హృద్యమైన బోధ. గ్రంథంలో పఠించండి.

శ్రీలక్ష్మణయ్యగారు నా ఆరోగ్యాన్ని, అవకాశాభావాన్ని గుర్తించి "రెండు మాటలు వ్రాసి యిచ్చినా సరే" అన్నారు. కాని మహాకవి భారవి చెప్పిన "గుణలుబ్ధా స్స్వయమేవ సంపదః" అనే సూక్తి నన్ను చిక్కించుకొంది.

సజ్జనుడైన లక్ష్మణయ్యకు నావల్లని దీవనలు.

మకాం : తిరుపతి. – శ్రీ రామకృష్ణానందస్వామి.

8-2-1983

# అభినందన గీతమాలిక

కరుణశ్రీ - శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు
సంపాదకులు - పోతన భాగవతం
తి.తి. దేవస్థానములు, తిరుపతి.



సమ్యగాధ్యాత్మికసమృద్ధి సౌమ్యబుద్ధి
రమ్యవాక్శుద్ధి భక్తిపారమ్యసిద్ధి
వెలయువాడు గిరాందేవి కొలువుతీర్పు
లలితశయ్య సముద్రాల లక్ష్మణయ్య.

౨

వ్యాసభగవానునకు కాళిదాసునకును
శ్రీధరస్వామివలె మల్లినాథునివలె
అన్నమయ్యకు మంచి వ్యాఖ్యానకర్త
లభ్యమయ్యె సముద్రాల లక్ష్మణయ్య.

౩

తరువ దరువ సముద్ర మధ్యమున పొడమె
అన్నమాచార్య సంకీర్తనామృతమ్ము
అమృత మెపుడు "సముద్రాల" యందు గాక
పుట్టలను గుట్టలను సముద్భూత మగునె?

౪

తేటగీతుల నడకల తీరు, స్థైర్య
మునకు గాంభీర్యమునకు 'పెట్టినది పేరు'
దాన నిమిడిన నీప్రబంధమ్ము సౌరు
స్వామి వక్షాన వరలు 'వజ్రాల పేరు'.

౫

ఆంధ్రవాగ్గేయకారుల కందరకును
అన్నగా రయ్యెను గదయ్య అన్నమయ్య
అడుగు తడబాటు లేకుండ అనుగమించి
"అన్న పదములు గొలుచు లక్ష్మన్న" వీవు.

౬

శ్రుతి పురాణేతిహాస సంస్కృతుల తోడ
అతిమనోజ్ఞము లగు సుదాహృతులతోడ
సుందరమ్మౌ త్వదీయ వాఙ్మందిరమున
నర్తన మొనర్చెనయ్య "సంకీర్తనములు".

౭

క్షుధితులు బుభుక్షులగు ముముక్షులకు నెల్ల
అన్నమయ్య సాహితి 'పరమాన్న' మయ్యె
అమృత మయమైన తత్ప్రసాదమును సాధు
జనుల కందించు 'ఉత్తమార్చకుడ' వీవు.

౮

అన్నమాచార్య సంకీర్తనామృతమ్ము
విబుధులకు పంచిపెట్ట నావిర్భవించె
వియ్యది వహించు 'విశ్వమోహిని' సమాఖ్య
తిద్యుతియ్యని మన లక్ష్మణయ్య వ్యాఖ్య.

౯

సద్గురు స్వామి 'ఆశీః ప్రసన్నదృష్టి'
అన్నమయ్య 'సాహిత్య సౌహార్ద పుష్టి'
శేషశైలేశు 'కరుణా విశేష వృష్టి'
మిళితమైన 'త్రివేణి' 'సౌమిత్రి' వాణి.

౧౦

ఈ 'సముద్రాల' లో నింక నెన్ని మణులు
మేలి పగడాలు మంచి ముత్యాలు గలవొ
అవి యలంకృతు లవుత శేషాచలేశు
శ్రీచరణ కంజ మంజు మంజీరములకు.

ఇతి శుభమ్.

తిరుపతి.
20-9-83.

– కరుణశ్రీ

# ప్రశంసా ప్రసూనాలు

విద్వత్కవి
శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులవారు
ప్రచురణ విభాగము, తి.తి. దేవస్థానములు, తిరుపతి.



భక్తి శృంగార రసధునుల్ పార మొరసి
పరవ తంబుర మీటుచు పాదయుగళి
గజ్జియలు మ్రోయ వృషశైలకాంతు మ్రోల
ఆడుచుం బాడు అన్నమయ్యకు నమోఽస్తు.

౨

ఆడినట్టిమాట అమృత ప్రబంధమ్మ
పాడినట్టి పాట పరమగాన
మగుచు నెగడ తిరుమలప్ప మెప్పులు గొన్న
అన్నమయ్యగారి కంజలింతు.

3

తీయ తీయనైన తేట తేట తెనుంగు
నుడుల వినని కనని కడు బెడంగు
పదము లెవడు మూడు పదివేలు సెప్పె నా
తాళ్ళపాక కవివిధాత గొలుతు.

౪

జోలలు సువ్వాలలు ని
వ్వాళులు జాజఱులు గొబ్బిపాటలు కొట్నాల్
లాలలు తందాన లహో !
మేలు కొలుపు లితడు శౌరిమీద రచించెన్.

౫

ఫణిరాజ పర్వతాధిపు
ప్రణుతించెన్ పదకవిత్వ పరమేష్ఠి రస
ధ్వని గర్భ మృదుల కృతులన్
నినిచి నిగమ సారభూత నిభృతార్థమ్ముల్.

౬

కప్పురంపు చలువ కన్నెనేదగి తావి
పుట్టతేనె తీపి పుక్కిలించు
అన్నమయ్య కవిత లాస్వాద మొనరించి
తనివి నొందువారె ధన్యతములు.

౭

అన్నమయ్య పాట లాంధ్రవేదమ్ములు
తరుచ దరుచ సుధలు దండడించు
విమలబుద్ధి జ్ఞాన విజ్ఞాన సంపన్ను
డొకడె చూఱ లిడగ యుక్తతముడు.

౮

అన్నమయ్య కీర్తనామృత మనుపేర
లక్ష్మివర్ధనుండు లక్ష్మణయ్య
వ్యాఖ్య నవదరించి వందనీయుండయ్యె
పరమహర్ష మంద భక్తకోటి.

౯

మలయాళ మౌని సేవా
ఫలమగు నధ్యాత్మవిద్య బరిణతుడు సము
జ్జ్వల బుద్ధిశాలి శుభగుణ
కలితుడు లక్ష్మణబుధుండు ఘనయశు డెన్నన్.

౧౦

చెలికాడని విద్వత్కవి
తిలకుండని వాగ్మి యనుచు తెలచుటయును గా
దిల మెచ్చెడి విష్ణు తులసి
మొలకవి లక్ష్మణు గణింతు పుణ్యచరిత్రున్.

పచ్చి కస్తురి కుంకుమ ప్రసవరజము
పునుగు మేదించి వేంకట భూధరేంద్రు
నవకమగు మేని కలదిన నలుగుబాణి
సురభిళించు సముద్రాల సూరి వాణి.

తిరుపతి.

2-10-83. – ముదివర్తి కొండమాచార్యులు

# పరితోషం

డా॥కె. సర్వోత్తమన్‌గారు, ఎం. ఏ.

(తెలుగు, సంస్కృతం) పిహెచ్. డి.

విద్వాన్, రాష్ట్రభాషా ప్రవీణ.

రీడర్. (అన్నమాచార్యపీఠం), తెలుగుశాఖ.

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.

ఆంధ్రవాగ్గేయకారుల్లో అగ్రగణ్యుడు తాళ్లపాక అన్నమయ్య. ఆయనను గురించి నేడు విస్తృతమయిన ఉపోద్ఘాతం వ్రాసి పరిచయం చేయవలసిన అవసరం లేదు. తిరుమల తిరుపతి దేవస్థానంవారి కృషి, ఆకాశవాణి కడప, విజయవాడ కేంద్రాలు తీసుకొంటున్న ప్రత్యేక శ్రద్ధ అందరికీ తెలిసిందే. అయితే కీర్తనలు వినడం వేరు. పాడ్డం వేరు. కీర్తనల్ని అర్థం చేసుకొని ఆనందించడం అంతకు మించిన అంశం.

తాళ్లపాక అన్నమయ్య సంకీర్తనల్లో ఎన్నో ప్రత్యేకాంశాలున్నాయి. మొదటిది అన్యమయ్య సంస్కృతాంధ్రాల్లో కీర్తనలు వ్రాయడం, రెండవది ఆయన రచనల్లో ప్రబంధకవులకు భిక్షపెట్టిన ఎన్నో ఊహాచిత్రాలు కనిపించడం, మూడవది సాహిత్యానికీ, సంగీతానికీ సమ ప్రాధాన్యమివ్వడం, నాల్గవది తనకాలంనాటి జానపద గేయ ఫణితుల్ని ఆసరాగా తీసుకొని మాండలిక భాషకు అస్కారం కలిగించడం, ఈలాంటి విశిష్టతలున్న అన్నమయ్యకీర్తనలకు వ్యాఖ్య వ్రాయడం సామాన్యమైన పని కాదు. ఇందుకు ఉభయభాషా పాండిత్యం, వేదపురాణేతిహాస పరిజ్ఞానం, సంగీతసాహిత్యాల్లో చొరవ అన్నీ అవసరం.

అన్నమయ్య పాటలకి వివరణ ఇవ్వడంలో మాన్యశ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు. శ్రీకామిశెట్టి శ్రీనివాసులు శెట్టిగారు కొంత కృషి చేశారు. శ్రీగౌరిపెద్ది రామసుబ్బశర్మగారు తమ అన్నమయ్య సంకీర్తనల పరిష్కరణ పీఠికల్లో స్థాలీపులాకన్యాయంగా కొంత వ్యాఖ్య వ్రాశారు. వీరే కాకుండా అన్నమయ్య జయంతి - వర్ధంతి ఉత్సవాలలో పాల్గొంటున్న విద్వాంసులు తమ ఉపన్యాసాల్లో అన్నమయ్య సాహిత్యంలోని అందచందాలు వివరిస్తూ అనురక్తి పెంచుతున్నారు.

అన్నిటికి మించి తలమానికంగా శ్రీసముద్రాల లక్ష్మణయ్యగారు

'అన్నమాచార్య సంకీర్తనామృతం' అనే పుస్తకం వ్రాయడం ప్రశంసించదగ్గ విషయం. అన్నమయ్య కీర్తనలకి వ్యాఖ్య వ్రాయడానికి తగిన అధికారం వారికి వుంది. శ్రీలక్ష్మణయ్యగారు సంస్కృతాంధ్రభాషల్లో విద్వాంసులు. అమరవాణి, శ్రీరమణయోగసద్గురు శతకం, శ్రీరమణయోగిస్వామి జీవితచరిత్ర లాంటి పుస్తకాలు వ్రాసి ఆంధ్రదేశంలో ప్రశస్తి గడించినవారు, పైగా సద్గురుసేవవల్ల, సాధుసంసేవనం వల్ల, నిరంతర పఠనానుభవంవల్ల వేదాంతం ఆకళించుకొన్నవారు. యోగవాసిష్ఠంవైరాగ్య ప్రకరణానువాదం వీరికెంతో పేరు తెచ్చిపెట్టింది. ఇవే గాకుండా 'యథార్థభారతి', 'సద్గురువాణి' మొదలయిన పత్రికల్లో వీరి వ్యాసాలు ప్రచురింపబడుతూనే వున్నాయి. అన్నిటినీ మించి అన్నమయ్య రేకుల్ని స్వయంగా పరీక్షిస్తూ సప్తగిరిపత్రికలో కీర్తనలకి వివరణ ఇస్తూ పాఠకుల్ని ఆకట్టుకొన్నవారు వీరు.

ప్రౌఢప్రబంధాలకు వ్యాఖ్య వ్రాయడం మనకు తెలుసు. బృహద్గ్రంథాలకు గద్యవ్యాఖ్య వెలువడడం కూడా కద్దు. అయితే కీర్తనలకి వివరణ వ్రాయడం ఇంచుమించు లేదనాలి. కాకపోతే శ్రీకల్లూరి వీరభద్రశాస్త్రిగారి 'త్యాగరాజకీర్తనలు - విశేషవివరణము' అనే పేరుతో రెండు సంపుటాలు కనిపిస్తున్నాయి. అటు తమిళంలోగాని, ఇటు కన్నడంలోగాని కీర్తనలకి విశేషవివరణ వ్రాయడం లేదనే చెప్పాలి. శ్రీసముద్రాలవారు ఈదారిలో ముందడుగు వేసి కృతకృత్యులయ్యారని నా అభిప్రాయం.

ఈవ్యాఖ్యలో కఠినపదాలకు అర్థవివరణ ఇవ్వడం, తాత్పర్యం సంగ్రహంగా వ్రాయడం, కీర్తనలకు మూలభూతంగా ఉండే వేదపురాణోపనిషద్వాక్యాలను చూపడం, అలాగే కీర్తనలకి సరిదీటయిన పద్యాలు, శ్లోకాలు ఉదాహరించడం విశేషాంశాలు. సుమారు డెబ్భైకిపైగా పుస్తకాలను సంప్రదించడంలో వ్యాఖ్య సమగ్రంగా ఉండాలనే సంకల్పం ఈ గ్రంథమంతటా అర్థం పట్టినట్లు కనిపిస్తుంది.

శ్రీసముద్రాల లక్ష్మణయ్యగారి కృషిని - కీర్తనల అర్థం తెలిస్తే చాలనుకొనే సామాన్యులు, అన్నమయ్య వేదాంతంపట్ల మొగ్గుచూపే ముముక్షువులు, అన్నమయ్య పదప్రయోగ వివరణ తెలుసుకొనగోరే పరిశోధకులు మెచ్చుకొంటారనడంలో ఆశ్చర్యమేమీ లేదు.

తిరుపతి. – కె. సర్వోత్తమన్.

1-2-83

# నివేదన

సకలవేదములు - సంకీర్తనలు చేసి
ప్రకటించి నిను బాడి - పావనుఁడైన,
అకలంకుఁడు, తాళ్లపా - కన్నమాచార్యుల
వెకలియై యేలిన శ్రీ - వేంకటనిలయ ! (అ.సం- 6-24)

ఇది అన్నమయ్య సంతతివారు శ్రీవేంకటేశ్వర స్వామి నుద్దేశించి పాడిన పాట. పద కవితాపితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యులు పాడిన పదాలన్నీ వేదాలకు మారు రూపాలే అని దీని వల్ల తెల్లమవుతున్నది.

భగవదంశంతో అవతరించిన మహామహులు అప్పుడప్పుడూ ఈలోకంలో సాక్షాత్కరిస్తూ వుంటారు. వారు చేప్పే మాటలు, చేసే పనులు దైవత్వాన్ని స్ఫురింపజేస్తాయి. వారి మూర్తి అదృశ్యం కావచ్చు, కాని కీర్తి అజరామరం. ఆకృతి అశాశ్వతమైనా కృతి శాశ్వతమే గదా !

అలాంటి మహాపురుషుల కోవకు చెందినవాడే అన్నమయ్య. చిన్ననాటనే జీవితపరమార్థాన్ని చేజిక్కించుకొన్న ధన్యాత్ముడాయన. సర్వపాప ప్రణాశనమైన భగవన్నామ సంకీర్తనమే ఆయనకు తరణోపాయ మయింది. ఆ సంకీర్తనాచార్యుడు వేంకటగిరినాథుని వైభవాన్ని ముప్పది రెండువేల కీర్తనలతో కీర్తించాడు. తన పాటలను ఆస్వామి పాదాలకు చేసిన పూజలుగా పేర్కొన్నాడు. అందులో ఒక్క సంకీర్తనే తమ్ము రక్షించటానికి చాలన్నాడు. తన కవితల మీదా, తాను వలచిన పరమాత్ముని మీదా ఆయనకున్న విశ్వాసం అంత గాఢమైనది. అందుకే -

విన్ను నమ్మి విశ్వాసము - నీపై నిలుపుకొని
ఉన్నవాడ నిక వేరే - ఉపాయ మేమిటికి ? (అ.సం. 6-202)

అని ఏడుకొండలయ్యతో చెప్పుకొన్నాడు. పరమపదప్రాప్తికి భగవద్విశ్వాసాన్ని మించిన ఉపాయం లేదని ఆయన సిద్ధాంతం. ఆవిశ్వాసాతిశయమే ఆయన్ను ఆడించింది; పాడించింది. అత్యద్భుతమైన పదకవితావాఙ్మయాన్ని ఆయనచే సృష్టింపజేసింది. భక్తిభావంతో మైమఱచి ఆయన పాడిన పదాలు ఆయనకే కాక ఇతరులకు గూడా తారక మంత్రా లయ్యాయి.

అన్నమయ్య భక్తి - శృంగార [illegible] ఆధ్యాత్మిక క్షేత్రంలో [illegible] ముఖ్యమైనది భక్తిమార్గ మతం. [illegible] ప్రాతిపదికగా ప్రముఖంగా ప్రజానీకానికి అన్నమయ్య శ్రీరామానుజుల సిద్ధాంతాన్నే అనుసరించాడు. ఆయన సంకీర్తనలు ప్రబోధిస్తున్నాయి. గీతలో శ్రీకృష్ణభగవానుడు సంక్షేపంగా ఉపదేశించిన తత్త్వం కూడా అదే.

ఈ పద కవితాపితామహుని సాహిత్యవైభవం అమేయమైనది. రసవత్తరాలైన ఈ సంకీర్తనలు విని పాడగానే సహృదయులు పరవశించిపోతున్నారు. ఆయన సమస్తాల పరిపూర్ణమైన వాఙ్మయంలో ఎన్నో వింతపోకడలు పోయాడు. పదాల మేళవింపులో, అర్థాల పొందింపులో అసామాన్యమైన ప్రతిభను ప్రదర్శించాడు.

వివరణ లేకున్నా సాధారణపాఠకలోకానికి సులువుగా అర్థమయ్యే పాటలు ఈ వాఙ్మయంలో అనేకం ఉన్నాయి. అలాగే విపులవివరణ లేకుండా ఏమాత్రం బోధపడని కీర్తనలుకూడ ఎన్నో కనపడతాయి. తాళ్ళపాకవారి వాఙ్మయం అర్థభావ ప్రధానమైనదనీ, త్యాగరాజాదుల కృతులవలె నాదరచనాప్రధానం కాదనీ శ్రీరాళ్లపల్లి వారు తెలిపియున్నారు. తాము స్వరపరచిన కొన్ని కీర్తనలకు వారు లఘుటీక కూడ వ్రాసియున్నారు.

అన్నమయ్యది నేటి కడపమండలంలోని రాజంపేట తాలూకాకు చెందిన తాళ్లపాకగ్రామం. లక్కమాంబా నారాయణ సూరులనే పుణ్యదంపతులకు ఆయన శ్రీవేంకటేశ్వరస్వామి వరప్రసాదంగా క్రీ. శ. 1408 లో జన్మించాడు. 1424లో ఆయన జన్మమని కొందరంటారు.

నారాయణుని నందకాంశంలో అన్నమయ్య ప్రభవించాడని ప్రతీతి. ఆయన అవతరించిన పదునారేండ్లకు తిరువేంగళనాథుడు ప్రత్యక్షమైనాడట !

అన్నమయ్య పసిబిడ్డగా వున్న తరుణంలోనే తిరుమలప్ప ప్రసాదమని చెప్పకుంటే ఉగ్గు త్రాగేవాడు కాడట ! స్వామిపై జోలలు పాడకుంటే నిదురించేవాడు కాడట !

ఐదేండ్ల ప్రాయంలో అన్నమయ్యకు ఉపనయనం జరిగింది. విద్యలన్నీ కరతలామలక మయ్యాయి. ఆడిన మాటెల్లా అమృతకావ్యంగా, పాడిన పాటెల్లా పరిమళానంగా భాసించాయి. వింత వింతలుగా వేంకటపతిమీద ఆయన ఎన్నో సంకీర్తనలు పాడినాడు.

ఎనిమిదేండ్ల వయస్సులో వున్న అన్నమయ్య ఇంటి పెద్దల ఆదేశానుసారం ఒకరోజు కొడవలి చేతబట్టి గడ్డి కోయడానికి వెళ్లాడు. చేతివ్రేలు తెగింది. వెంటనే 'హరి ! హరీ' అంటూ భగంతుని స్మరించాడు. విరక్తుడై తిరుమలకు వెళుతున్న కొందరు యాత్రికులవెంట బయలుదేరాడు. తిరుపతి చేరాడు. గ్రామ దేవతకు మొకరిల్లాడు. కొండ నధిరోహించాడు. మోకాళ్లపర్వతం చేరేసరికి ఆకలితో అలసి పోయాడు. ఒక వెదురుపొద క్రింద కాలి చెప్పులతో అలాగే పడి నిదురించాడు.

అలమేలుమంగ అతని అలసట గుర్తించింది. ఆ పెద్ద ముత్తైదువ దగ్గఱకు వచ్చి ''నాయనా! ఎందుకిక్కడ వున్నావు ? లేచిర''మ్మన్నది. ఆమె కృపామృతధారతో అన్నమయ్య అలసట తీరింది. '' ఇది సాలగ్రామ పర్వతం. చెప్పుకాళ్లతో ఎక్కరాదు సుమా'' అని ఆతల్లి హెచ్చరించింది.

అన్నమయ్య చెప్పులు తీసి నలుదిక్కులా తేరిపార జూచాడు. పర్వతం భగవత్స్వరూపంగా గోచరించింది. ప్రసాదాన్నంతో మహాదేవి అతని ఆకలి తీర్చి భగవత్సందర్శనానికి వెళ్లమని చెప్పింది. అతని నోట ఆశువుగా అప్పుడే అలమేలుమంగమ్మమీద ఒక శతకం వెలువడింది.

అన్నమయ్య కొండమీదికి చేరాడు. పుష్కరిణిలో స్నానం చేశాడు. ఆదివరాహస్వామిని సేవించాడు. కొంగులో ముడిచివున్న కాసును కానుకగా స్వామికి సమర్పించాడు. జగన్మంగళవిగ్రహుడైన శ్రీనివాసుని సందర్శించి పలువిధాల ప్రస్తుతించాడు. పర్వతంమీది పావన తీర్థాలలో మునిగాడు. పిడిచిన గుడ్డ ఆరే లోపల వేంకటపతిమీద ఒక శతకం చెప్పాడు.

ఆపై అతడు గుడికి వచ్చాడు. తలుపులు మూసివున్నాయి. భగవంతునికి శతకం విన్నవించేసరికి తాళాలు వూడిపడ్డాయి. కవాటాలు తెరచుకొన్నాయి. అర్చకుడు అన్నమయ్య మహిమకు అబ్బురపడి చందన తీర్థప్రసాదాలు ఇచ్చాడు.

ఆరాత్రి స్వప్నంలో దర్శనమిచ్చి స్వామి ఆదేశించిన విధంగానే మరునాడు ఘనవిష్ణువు అనే ముని అన్నమయ్యను పంచసంస్కార సంపన్నుణ్ణి చేశాడు.

పిమ్మట భగవదాదేశానుసారం అన్నమయ్య తాళ్లపాకకు తరలివచ్చాడు. ఆయనకు పెళ్లీడు వచ్చింది. తిరుమలమ్మ, అక్కలమ్మ అనే ఇరువురు కన్యలతో అతనికి వివాహం జరిగింది. సంసారం సాగిస్తూనే ఆ మహాభక్తుడు భక్తిరసభరితాలైన సంకీర్తనలతో భగవంతుణ్ణే వినుతిస్తూ కాలం గడుపుతున్నాడు. ప్రజలు అతణ్ణే

నారదుడో, తుంబురుడో అని భావించారు. ఆయన యశం దిశదిశలా గుబాళించింది.

ఆకాలంలో టంగుటూరు పట్టణం పరిపాలిస్తున్న సాళువ నరసింగ రాయలు అన్నమయ్యను తన ఆస్థానానికి పిలుచుకొని పోయి సత్కరించాడు. సంకీర్తనాచార్యుని ఆశీస్సులతో ఆరాజు రాజ్యం విస్తరిల్లింది. రాయలు పెనుగొండ సింహాసనం అధిష్ఠించి అన్నమయ్యను అక్కడికి రప్పించుకొన్నాడు. వెన్నునిపై విన్నవించిన సంకీర్తనలు తనకు వినిపించమని అర్థించాడు. పదకవితా పితామహుడు -

''ఏమొకో చిగురుటధరమున – నెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన – పత్రిక కాదు గదా !'' (శృం. సం. 12-82)

అనే శృంగార సంకీర్తనను మధురంగా గానం చేశాడు.

''కవిత్వమంటే ఇది గదా !'' అని ఱేడు పులకించిపోయాడు. తన మీద గూడ అలాంటి పదం చెప్పమని అడిగినాడు.

ఆమాట వింటూనే అన్నమయ్య 'హరి హరీ' అని రెండు చెవులూ మూసుకొన్నాడు. ''హరిని కొనియాడిన నోట నిన్ను కీర్తించడమా ? ఛీ పో''మ్మంటూ లేచి వెళ్లాడు.

రాజు ఆగ్రహోదగ్రుడయ్యాడు. సంకెళ్లు తగిలించి అన్నమయ్యను మొగసాలలో త్రోయమన్నాడు. భటులు రాజాజ్ఞను వెంటనే నెరవేర్చారు. అప్పుడు అన్నమయ్య -

''సంకెల బెట్టినవేళ – చంప బిలిచిన వేళ
అంకిలిగా నప్పులవా – రాగిన వేళ,
వేంకటేశు నామమే –విడిపించ గలిగాక
మంకుబుద్ధి పొరలిన – మరిలేదు తెరగు.'' (అ. సం. 5-100)

అంటూస్వామిని శరణు జొచ్చాడు.సంకెళ్లు విడిపోయాయి. భటులు సంభ్రమంతో పరుగిడి వెళ్లి రాజుకు విషయం నివేదించారు.

నరసింగరాయలు అక్కడికి వచ్చి మళ్లీ సంకెల వేయించి - ''ఏదీ నీ సంకీర్తన ప్రభావం ఇప్పుడు చూప'' మన్నాడు. అన్నమయ్య అదే పాట పాడాడు. తత్క్షణం శృంఖలలు ఊడిపడ్డాయి.

ప్రభువు భయభ్రాంతుడయ్యాడు. సంకీర్తనాచార్యుని చరణ సరోజాలకు సాగిలి మ్రొక్కి- చేసిన తప్పు మన్నించమన్నాడు. అన్నమయ్య రాజు ననుగ్రహించాడు.

లోకమంతా ఆయన మహిమలను వేనోళ్ల కీర్తించింది. భక్తాగ్రేసరుడైన పురందరదాసు అన్నమయ్యను సందర్శించాడు. భక్తాగ్రగణ్యు లిరువురూ పరస్పరం సంభావించుకొన్నారు.

ముప్పదిరెండు వేల సంకీర్తనలే కాక ద్విపదరామాయణం, వేంకటాద్రి మాహాత్మ్యం, శృంగారమంజరి అనేక శతకాలు అన్నమయ్య చెప్పినట్లు ఆయన చరిత్ర చెబుతున్నది.

అన్నమయ్యపాటలు అధ్యాత్మ సంకీర్తనలు, శృంగారసంకీర్తనలు అనిరెండు రకాలు. వాటిని తరువాతివారు రాగిరేకుల్లో చెక్కించారు. ఇప్పుడు ఆపాటలలో సూానికి తక్కువగానే మనకు లభిస్తున్నాయి.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు అన్నమయ్యకీర్తనల నన్నింటినీ గ్రంథరూపంగా ముద్రించారు. ఉపలబ్ధమైన మొత్తం అన్నమాచార్యుని అధ్యాత్మసంకీర్తనలు 2211. ఇందులో 150కీర్తనలను ఎన్నుకొని నేను వ్యాఖ్యవ్రాశాను. మొదటి 75కీర్తనల వ్యాఖ్య ప్రథమసంపుటంగానూ, తరువాతి 75 పాటల వ్యాఖ్య రెండవ సంపుటంగానూ 1983లో ముద్రించడమైనది. ఇప్పుడు పైరెండు సంపుటాలను కలిపి ఒకే గ్రంథంగా ప్రకటించడం జరిగింది.

నేను 1976 ఆగస్టులో ఈవ్యాఖ్యారచన కుపక్రమించాను. అప్పట్లో శ్రీవేంకటేశ్వర ప్రాచ్యకళాశాలకు అధ్యక్షులుగా ఉండిన ప్రొఫెసర్ యస్. నాగయ్యగారు నన్నీరచనకు పురికొల్పారు. ఆనాటి దేవస్థానాధికారులు నన్ను ప్రోత్సహించారు. 1978 జూన్ నాటికి వ్యాఖ్య పూర్తిచేశాను.

తాళ్లపాక వాఙ్మయాన్ని వెలుగులోకి తెచ్చిన మాన్య చరిత్రులలో శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు చిరస్మరణీయులు. వారి రచనలు నాకీపనిలో ఎంతగానో ఉపకరించాయి. వ్యాఖ్య కొనసాగించేటప్పుడు ఎడనెడా నాసంశయాలు నివారిస్తూ శ్రీగౌరిపెద్ది రామసుబ్బశర్మగారు తోడ్పడ్డారు. ఈ పెద్దలందరికీ నాప్రణామాలు.

నేను వివరించిన 150కీర్తనల్లో 84 కీర్తనల వివరణ 'అన్నమాచార్య సంకీర్తనామృతం' అన్నపేరుతో తి.తి.దేవస్థానంవారి సప్తగిరి మాసపత్రికలో 1976 నవంబరు నుండి 1980 సెప్టెంబరువరకు అవిచ్ఛిన్నంగా ప్రచురితమయింది.

ఈగ్రంథం ప్రథమభాగానికి 'నీరాజన' మనుగ్రహించిన పూజ్యపాదులు శ్రీరామకృష్ణానందస్వాములవారికి నా నమోవాకాలు. ''పరితోషం'' ప్రకటించిన డా॥ కె. సర్వోత్తమరావుగారికి నాధన్యవాదాలు. ఈగ్రంథ ప్రథమ ముద్రణకు ఆర్థిక సహాయ మందజేసిన దేవస్థానపరిపాలక వర్గానికి నా అభివాదాలు.

'అభినందన గీతమాలిక'తో ఈకృతినలంకరించి నన్ననుగ్రహించిన పూజ్యులు మహాకవులు శ్రీజంధ్యాల పాపయ్యశాస్త్రిగారికి నా ప్రణామాలు. ఈరచనను సమగ్రంగా పరిశీలించి తగు సలహాలిచ్చి ప్రశంసా ప్రసూనాలు వర్షించిన విద్వత్కవులు శ్రీముదివర్తి కొండమాచార్యులవారికి నావందనాలు.

ఇందలి ద్వితీయభాగానికి సమగ్రసుందరమైన ప్రస్తావన ప్రసాదించి నన్నాశీర్వదించిన పెద్దలు శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారికి నా నమస్కృతులు.

ఈగ్రంథానికి ప్రూఫులు దిద్దడంలో సహకరించిన ఆత్మీయులు శ్రీనైనారు అప్పాస్వామిగారికి, చిరంజీవులు యస్. దక్షిణామూర్తికి, యస్. దశరథకు నా కృతజ్ఞతలు.

హైదరాబాదు - శ్రీపరాశరాశ్రమ వ్యవస్థాపకులు పూజ్యశ్రీ ఆచార్య పరిశుద్ధానంద గిరి స్వాములవారు ఈ గ్రంథముద్రణకై ఉదారంగా అయిదు వేల రూపాయలు విరాళం అందజేశారు. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములు.

అన్నమయ్య మాటలు అనల్పార్థాల మూటలు. వాటిని విప్పి చెప్పడం ఎంతో కష్టమని తెలిసికూడా ఇందుకు సాహసించాను. నావివరణలో దొరలిన దొసగులను పెద్దలు దయతో తెలియజేస్తే కృతజ్ఞుడనై మరుముద్రణలో సవరించుకొంటాను.

శ్రీవ్యాసాశ్రమ స్థాపకులు మహర్షి శ్రీసద్గురు మలయాళస్వాములవారి కృపాకటాక్షంవల్ల ఆధ్యాత్మిక వాఙ్మయంతో నాకు పరిచయ మేర్పడింది. సద్గురు దేవులవద్ద గురుకులవాసం చేసి వుండక పోతే ఈ భాగ్యం నాకు లభించేది కాదు. అందుకే ఈగ్రంథాన్ని శ్రీసద్గురు స్వాములవారి చరణారవిందాలకు పూజాసుమంగా సమర్పించుకొంటున్నాను.

**తిరుపతి.** — సముద్రాల లక్ష్మణయ్య

**5-9-2000.**

# ఉదాహృత గ్రంథసూచిక



అ. చ. - అన్నమాచార్య చరిత్రము
అ.చ.పీ. - అన్నమాచార్య చరిత్రపీఠిక
అమృత. - అమృతబిందూపనిషత్తు
అవ. గీ. - అవధూత గీత
అష్టా. - అష్టావక్రగీత
అ.సం. - అధ్యాత్మ సంకీర్తనలు
అన్న. సం. - అన్నమాచార్య సంకీర్తనలు
ఆ.స్తో. - ఆళవందార్ స్తోత్రము
ఈశ.- ఈశావాస్యోపనిషత్తు
ఉ. గీ.- ఉత్తరగీత
కఠ.- కఠోపనిషత్తు
కలిసం. - కలిసంతరణోపనిషత్తు
కవితా. - కవితామృత కూపము
కాదం. - కాదంబరి
కావ్యా. - కావ్యాదర్శము
కా.శ. - కాళహస్తీశ్వర శతకము
కిరా. - కిరాతార్జునీయము
కువ. - కువలయానందము
కుమార. } కుమారసంభవము
కు.సం.
కైవల్యా. - కైవల్యోపనిషత్తు
గీత. - భగవద్గీత
గీ.మా. - గీతామాహాత్మ్యము
గు. గీ.- గురుగీత
ఛాందోగ్య. - ఛాందోగ్యోపనిషత్తు
తా.పా.- తాళ్లపాక పాటలు ( ప్రథమ, ద్వితీయ సంపుటములు)
తైత్తి. - తైత్తిరీయోపనిషత్తు
త్యా.కీ. - త్యాగరాజ కీర్తనలు
ద.శ. -దయాశతకము
ధ్వన్యా. - ధ్వన్యాలోకము
న.కు.సం. - నన్నెచోడకుమారసంభవము
నా.భ.సూ. - నారద భక్తిసూత్రములు
నారద. - నారదీయ పురాణము
ని. రే. - నిడురేకు
నీతి ప్ర.- నీతి ప్రదీపము
నైషధ. -.నైషధకావ్యము
న్యా. తి.-న్యాసతిలకము
పం.తం. } పంచతంత్రము
పంచతం.
పద్మ. - పద్మపురాణము
పే.రే.- పెద్దరేకు
ప్ర.రు. - ప్రతాప రుద్రీయము
ప్రసంగ. - ప్రసంగాభరణము
బ్రహ్మ. - బ్రహ్మచర్యము.
భజగో. - భజగోవింద స్తోత్రము
భర్తృ. - భర్తృహరి సుభాషితము
భల్లట. - భల్లట శతకము
భాగ. - భాగవతము
భార. - భారతము
మం. పు. - మంత్రపుష్పము

మ. చ. - మదాలసా చరిత్రము

మనుచ. - మనుచరిత్రము

మను. - మనుస్మృతి

మహానా. - మహానాటకము

మా.పం. - మాయాపంచము

ముండక. - ముండకోపనిషత్తు

ము. మా. - ముకుందమాల

యోగతత్త్వ. - యోగతత్త్వోపనిషత్తు

యో. వా. - యోగవాసిష్ఠము

యోగ.
యో.సూ. } యోగసూత్రములు

రఘు. - రఘువంశము

రామా. - రామాయణము

రా.సి. సా. - రామానుసిద్ధాంత సారము

వ. గీ. - వసిష్ఠగీత

వరాహ. - వరాహోపనిత్తు

వాయు.- వాయుపురాణము

విక్రమ .- విక్రమచరిత్రము

వి. ధ. - విష్ణుధర్మోత్తరము

వి.చూ.
వివే. } వివేకచూడామణి

వి.పు.
విష్ణు . } విష్ణుపురాణము

వి.స.నా. - విష్ణుసహస్రనామము

వి.స. నా. భా. - విష్ణు సహస్రనామ భాష్యము

వి.స.స్తో. - విష్ణుసహస్రనామస్తోత్రము

వే.డిం. - వేదాంత డిండిమము

వేం. ప్ర. - వేంకటేశ ప్రపత్తి

వేమ. - వేమనపద్యములు

శ.గ. - శరణాగతి గద్యము

శాకుం. - శాకుంతలము

శా.ప. - శార్జ్గధర పద్ధతి

శివ.స్తో. - శివమహిమ్నః స్తోత్రము

శృం. సం. - శృంగార సంకీర్తనలు

శ్వేతాశ్వ. - శ్వేతాశ్వతరోపనిషత్తు

సా.రే. - సాధారణ రేకు

సీ.రా.సం. - సీతారామాంజనేయ సంవాదము.

సుభా. - సుభాషితావళి

సు.ర.భా.
సు.భా.భా. } సుభాషిత రత్నభాండాగారము

సు. శ.- సుమతిశతకము

సూ.ప్ర.- సూత్రార్థప్రకాశిక

స్తో.ర. - స్తోత్రరత్నములు



# సంకీర్తనల అకారాది సూచిక ( ప్రథమభాగము)



# సంకీర్తన సుమాంజలి

దాచుకో నీపాదాలకుఁ - దగనేఁ జేసినపూజ లివి
పూఁచి నీకీరితి రూప - పుష్పము లివి యయ్యా !

ఒక్క సంకీర్తనే చాలు - వొద్దికై మమ్ము రక్షించఁగ
తక్కినవి భండారాన - దాచి వుండనీ,
వెక్కసమగు నీనామము- వెల సులభము ఫల మధికము
దిక్కై నన్నేలితి వికనవి - తీరని నాధనమయ్యా !

నానాలికపై నుండి - నానాసంకీర్తనలు
పూని నాచే నిన్ను - బొగడించితివి,
వేనామాల వెన్నుఁడా - వినుతించ నెంతవాఁడ
కానిమ్మని నాకీపుణ్యము- గట్టితి వింతే యయ్యా !

ఈమాట గర్వము గాదు - నీమహిమే కొనియాడితిఁగాని
చేముంచి నా స్వాతంత్ర్యము - చెప్పినవాఁడఁగాను,
నేమానఁ బాడేవాఁడను - నేరము లెంచకుమీ
శ్రీమాధవ ! నే నీదాసుఁడ - శ్రీవేంకటేశుఁడవయ్యా !

(అధ్యాత్మసంకీర్తనలు : 7-104)

ఓమ్

శ్రీ వేంకటేశ్వర పర బ్రహ్మణే నమః

# అన్నమాచార్య సంకీర్తనామృతము

## ప్రథమ భాగము

శ్రీమత్పద్మావతీనాథం శేషశైల నికేతనమ్ ।
కలికల్మషహర్తారం వందే శ్రీవేంకటేశ్వరమ్ ॥

సకల వేదములను సంకీర్తనములుగా
సంఘటించి హరిని సన్నుతించి,
ముక్తిఁ జూఱగొన్న మునివర్యు నన్నమా
చార్యు భక్తి తోడ సంస్మరింతు.

తెలుఁగు పాల మున్నుపవనమై
వెలయఁగఁ ననవద్య వేదవిద్యా బీజ
మ్ములు సల్లినట్టి సద్గురు
మలయాళస్వామి నెపుడు మదిలోఁ దలఁతున్.

## 1

**అవతారిక :** - సంకీర్తనాద్యుపాసనలతో భగవంతుని భజించుటే వేదసమ్మతమైన సంసార తరణోపాయ మనుచున్నాడు.

### సామంతం

ఏవం శ్రుతిమత - మిద మేవ త -
ద్భావయితు[1] మతః - పరం నాస్తి. ॥ పల్లవి ॥

---

(1) 'భావైతుం' అను రేకులోని పాఠము గానానుకూలమైన వికృతరూపము. మూడవ చరణములోని 'ప్రశంసైవా' కూడ ఇట్టిదే.

1. అతులజన్మ భో - గాసక్తానాం
హితవైభవ సుఖ - మిద మేవ,
సతతం శ్రీహరి - సంకీర్తనం త -
ద్వ్యతిరిక్త సుఖం - వక్తుం నాస్తి. ॥ ఏవం ॥

2. బహుళ మరణ పరి - భవచిత్తానా -
మిహపరసాధన - మిద మేవ,
అహిశయన మనో - హర సేవా త -
ద్విహరణం వినా - విధిరపి నాస్తి. ॥ ఏవం ॥

3. సంసార దురిత జాడ్య పరాణాం
హింసావిరహిత - మిద మేవ,
కంసాంతక వేం - కటగిరిపతేః ప్ర -
శంసైవా ప - శ్చా దిహ నాస్తి. ॥ ఏవం ॥

ప ॥ ఏవం = ఈ చెప్పబోవురీతిగా, తత్ = ప్రసిద్ధమైన, శ్రుతిమతం = వేదమతము, ఇదం ఏవ=ఇదియే, భావయితుం = భావించుటకు, అతః పరం = దీనికంటె వేఱైనది (శ్రేష్ఠమైనది), నాస్తి = లేదు.

1. అతుల జన్మభోగాసక్తానాం = సాటిలేని జన్మభోగములయందు ఆసక్తులైన వారికి, హితవైభవసుఖం = మేలు గూర్చు ఐశ్వర్యసుఖము, ఇదం ఏవ = ఇదియే, (అది), సతతం= ఎల్లప్పుడు, శ్రీహరిసంకీర్తనం - శ్రీమన్నారాయణుని సంకీర్తనయే, తద్వ్యతిరిక్తసుఖం= దానికంటె వేఱైన సుఖము, వక్తుం = చెప్పుటకు, నాస్తి = లేదు.

2. బహుళమరణపరిభవచిత్తానాం = అనేకములైన మరణావమానములతో గూడిన మనస్సుగలవారికి, ఇహపరసాధనం = ఇహలోకమందును, పరలోకమందును (ఉత్తమగతికి) సాధనమైనది, ఇదం ఏవ = ఇదియే, అహిశయన మనోహరసేవా= శేషశయనుడైన శ్రీహరియొక్క మనోహరమైన సేవయే, తద్విహరణం వినా = ఆ సేవా విహారము దప్ప, విధిరపి = (మరొక) విధానము గూడ, నాస్తి = లేదు.

3. సంసార దురితజాడ్యపరాణాం = సంసారపాపమనెడు రోగమునకు వశులైన వారికి,

---

*(1) పల్లవిలోని కఠిన పదముల కర్థములు ''ప ॥'' అను గుర్తుతోను, తక్కిన చరణములలోని కఠినపదముల కర్థములు ''1; 2; 3;'' ఇత్యాది చరణముల సంఖ్యతోను సూచింపబడినవి.

హింసావిరహితం = హింసలేనిది, ఇదం ఏవ = ఇదియే, (అది), కంసాంతకవేంకటగిరి పతేః = కంసనాశకుడైన శ్రీవేంకటాచలపతి యొక్క, ప్రశంసా ఏవ = గుణకీర్తనమే, ఇహ= ఈ విషయమునందు, పశ్చాత్ = దీని వెనుక (దీనికంటె), నాస్తి= (మరొకమేలైన త్రోవ) లేదు.

**భావము :-** జనులారా ! ఇదిగో నేనిప్పుడు ప్రకటించునదే వేదమతము. ఆలోచించి నిర్ణయించుట కింతకంటె శ్రేష్ఠమైన మతము మరొకటి లేదు.

మాటిమాటికి సాటిలేని పుట్టుకలయందును, వాటికి సంబంధించిన సుఖాను భవముల యందును ఆసక్తులైనవారికి మేలైన ఐశ్వర్య సుఖమిది యొక్కటే. అనవరతము శ్రీమన్నారాయణుని గుణకర్మనామముల సంకీర్తనమే ఆ సుఖము. దానిని మించిన సుఖము చూపి చెప్పుట కేమియు లేదు.

చీటికి మాటికి చావునకు గుఱి యగుట అను పరాభవముతో నిండిన హృదయము గలవారికి ఐహికాముష్మికములలో ఉత్తమగతికి సాధనమైనది ఇది యొక్కటే. అది శేషశాయియైన శ్రీమన్నారాయణుని రమ్యమైన సేవయే. ఆ సేవా వినోదమునకన్న మరొక వేదసమ్మతమైన విధానము లేదు.

సంసార కాలుష్యమనెడు రోగమునకు జిక్కి చీకాకైన వారికి హింసావిహీనమైన మార్గమిది యొక్కటే. అది కంసాంతకుడైన శ్రీ వేంకటేశ్వరుని మహిమలను ప్రశంసించుటయే. దానికంటె మరొక మేలైన త్రోవ లేనే లేదు.

**విశేషాంశములు :** - చావుపుట్టుక లనెడిక్లేశములతో నిండినది సంసారము. దానినుండి విడివడుటే వివేకవంతుల ముఖ్యకర్తవ్యము.

**తం హ దేవ మాత్మబుద్ధి ప్రకాశం**
**ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే[1] ॥**

అని శ్రుతి చెప్పినట్లు మోక్షాపేక్ష గలవారెల్లరు భక్తియుక్తులై మనోబుద్ధులను ప్రకాశింపజేయు ఆ పరమాత్మనే శరణు పొందవలెను.

భగవన్నామసంకీర్తనము, భగవత్సేవ, భగవద్గుణప్రశంస అనునవియే సంసార క్లేశమునుండి ముక్తులై భగవంతుని జేరుటకు ముఖ్యోపాయములని అన్నమయ్య ఈ సంకీర్తనమందు ప్రబోధించుచున్నాడు. తాను ఏ మార్గము ననుసరించి బ్రహ్మానందము నొందెనో, ఆ మార్గమునే అనుసరింపుడని ఆ మహాభాగవతుడు తోడి మానవుల నుద్బోధించుట సమంజసమే కదా !

---

(1) శ్వేతాశ్వ., 6-18.

ద్వాపరయుగాంతమున నారదుడు బ్రహ్మచెంత కరిగి కలిని తరించు ఉపాయమును బోధింపుమని అడిగెను. ఆదిపురుషుడైన నారాయణుని నామోచ్చారణ మాత్రముననే కలి తొలగునని బ్రహ్మ చెప్పెను. ఆ భగవన్నామ మేదో సెల విమ్మని మరల నారదు డడిగెను. బ్రహ్మ 'హరే రామ' అను షోడశనామ మంత్రము నుపదేశించి కలికల్మషమును పోగొట్టుకొనుటకు దానిని మించిన ఉపాయము మరొకటి సర్వవేదములయందును లేనేలేదని బోధించెను. ఈ వృత్తాంతము కలిసంతరణోపనిషత్తున గలదు --

ద్వాపరాన్తే నారదో బ్రహ్మాణం జగామ. కథం భగవన్ ! గాం పర్యటన్ కలిం సంతరేయమితి. సహోవాచ బ్రహ్మా సాధు పృష్టోఽస్మి. సర్వశ్రుతి రహస్యం గోప్యం తచ్ఛృణు యేన కలిసంసారం తరిష్యసి. భగవత ఆదిపురుషస్య నారాయణస్య నామోచ్చరణ మాత్రేణ నిర్ధూతకలిర్భవతి. నారదః పునః పప్రచ్ఛ - తన్నామ కిమితి? సహోవాచ హిరణ్యగర్భః --

హరే రామ హరే రామ రామరామ హరే హరే ।
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే ॥
ఇతి షోడశకం నామ్నాం కలికల్మషనాశనమ్ ।
నాతః పరతరోపాయః సర్వవేదేషు దృశ్యతే ॥ [1]

అనన్య మనస్కుడై యెవడు తన్ను నిరంతరము స్మరించునో, అట్టి నిత్య సమాహితచిత్తుడైన యోగికి తాను సులభుడ నని గీతలో శ్రీకృష్ణుడు నుడివెను --

అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః ॥ [2]

భగవంతుని గుణకర్మ నామములను కీర్తించుటయే పాపములను దొలగించుకొనుటకు ఉపాయమని భాగవతమున వ్యాసుడు వచించెను --

ఏతావతాఽల మఘనిర్హరణాయ పుంసాం
సంకీర్తనం భగవతో గుణకర్మ నామ్నామ్। [3]
నామసంకీర్తనం యస్య సర్వపాప ప్రణాశనమ్ [4]।

---

(1) కలిసం. (ఈశాద్యష్టోత్తరశతోపనిషదః - P. 546) (3) భాగ., 6 - 3 -24.

(2) గీత, 8 - 14. (4) భాగ., 12 - 13 - 28.

నారదాదులు భగవంతుని సంకీర్తనాదులచే భజించి ముక్తులైరి. ఇతర చింతలు మాని ఎల్లవేళల అన్ని విధముల భగవంతునే సేవించవలె ననియు, భక్తులచే కీర్తింపబడువాడై ఆ దేవుడు వెంటనే ప్రత్యక్షమై వారిని స్వస్వరూపానుభవము గలవారినిగా జేయుననియు నారదభక్తి సూత్రములు చెప్పుచున్నవి --

సర్వదా సర్వభావేన నిశ్చింతితైర్భగవానేవ భజనీయః [1]।
సంకీర్త్యమానః శీఘ్రమేవావిర్భవత్యనుభావయతి భక్తాౝ [2] ।

## 2

అవతారిక :- దీనుల కాపాడుటే దేవుని కర్తవ్యము గాని ధీరుల కాపాడుట కాదను చున్నాడు-

### గుండక్రియ

తెలియఁ జీఁకటికి - దీపమెత్తక పెద్ద
వెలుఁగు లోపలికి - వెలుఁగేలా ? ॥ పల్లవి ॥

1. అరయ నాపన్నుని - కభయ మీవలెఁగాక
ఇరవైన సుఖిఁగావ - నేలా ?
వఱుతఁ బోయెడివాని - వడిఁదీయవలెఁగాక
దరివానిఁ దివియఁగ- దానేలా ? ॥ తెలి ॥

2. ఘనకర్మారంభుని - కట్లు విడవలెఁ గాక
యెనసి ముక్తునిఁగావ - నేలా ?
అనయము దుర్బలుని - కన్నమిడవలెఁ గాక
తనిసిన వానికిఁ - దానేలా ? ॥ తెలి ॥

3. మితిలేని పాపక - ర్మికిఁ దావలెఁ గాక
హిత వెఱుఁగు పుణ్యుని - కేలా ?

---

(1) నా. భ. సూ., 79. (2) నా. భ. సూ., 80.

ధృతి హీనుఁ గృపఁజూచి - తిరువేంకటేశ్వరుఁడు
తతిఁ గావకుండినఁ - దానేలా ? ॥ తెలి ॥

1. ఇరవైన = స్థిరమైన ; వఱతఁ = వెల్లువయందు ; తివియఁగ = తీయుటకు.

2. ఘనకర్మారంభుని కట్లు = దొడ్డ కర్మములలో పూనికగలవాని బంధనములు ; అనయము = అత్యంతము, ఎల్లప్పుడు ; తనిసినవానికి = తృప్తినొందినవానికి.

3. ధృతిహీనుఁ = ధైర్యములేనివానిని ; తతిఁ = అదనులో.

**భావము :** - చీకటి నలుదెసల క్రమ్ముకొన్నప్పుడు వస్తుపరిజ్ఞానమునకై దీపము చేబూనవలెను. అంతే కాని గొప్ప ప్రకాశములోనికి దీపము జూపవలసిన పనిలేదు గదా !

ఆపదపాలై దుఃఖించువానికి అభయమిచ్చి రక్షింపవలెను. గాని ఎట్టి చీకు చింతలు లేక హాయిగా సుఖించువానిని కాపాడవలసిన పనిలేదు. వెల్లువలో కొట్టుకొని పోవువానిని వడిగా గట్టుకు దీయవలెను గాని గట్టుననే ఉన్నవానిని తీయవలసిన పని తనకు లేదుగదా !

పెద్ద పెద్ద కర్మలలో పూనిక వహించి అందు తగులుకొన్నవాని బంధనములు ఊడదీయవలెను గాని ఏ బంధము లేక ముక్తుడైయున్నవానిని రక్షింప నవసరము లేదు. స్వయముగా అన్నము సంపాదించుకొన జాలని దుర్బలుని కెల్లవేళల అన్నము బెట్టి పోషింపవలెను గాని తృప్తిగా దిని త్రేపినవానికి తాను పెట్టవలసిన దేమియు లేదు గదా !

అంతులేని పాపము లాచరించి హీనుడైనవానిని నుద్ధరించుటకు తాను కావలెను గాని హితము దెలిసి పుణ్యకర్మము లొనర్చు సుకృతాత్మునికి తనతో (భగవంతునితో) పనిలేదు. ధైర్యము గోల్పోయిన దీనునిపై కృపబూని సమయమునకు రక్షింపకుండినచో శ్రీవేంకటేశ్వరు డుండి ప్రయోజనమేమి ?

**విశేషాంశములు :** - దీనులను, అనాథులను, ఆర్తులను రక్షించుటే భగవంతుని ముఖ్య కర్తవ్యము. అందవలననే ఆపద్బాంధవుడుగా, అనాథ రక్షకుడుగా భగవంతుడు ప్రసిద్ధి వహించినాడు. మార్జాల కిశోరన్యాయము ననుసరించి అనన్యగతికులై ప్రపన్నులైన దీనజీవులనెల్లి దేవుడు అభయమిచ్చి రక్షించవలసి యున్నాడు.

కర్మ బంధముల కతీతులైన పుణ్యాత్ములు మర్కట కిశోరన్యాయము ననుసరించి తమ సుకృతబలమున తామే తరింపగలరు. వారికి భగవద్రక్షణ తనకు తానుగనే సిద్ధించును గాన ప్రయత్నపూర్వకముగా పరమాత్ముడు వారిని రక్షింపవలసిన పనిలేదు. పాపాత్ముల పట్లనే భగవంతుడు విశేషించి తన కృపాదృష్టిని ప్రసరింపజేయవలసి యున్నదనుట ఇందలి సారాంశము.

ప్రకృత సంకీర్తనమునే పోలిన మరొక సంకీర్తనమును పరికింపుడు --

## దేశాక్షి

నిన్నుఁ దలంచి నీపేరు దలంచి
నన్నుఁ గరుణించితే నెన్నిక గాక ॥ పల్లవి ॥

అధికునిఁగాచు టేమరుదు నన్ను
నధమునిఁ గాచుట యరుదుగాక నీకు
మధురమౌ టేమరుదు మధురముా, చేఁదు
మధురమౌటే మహిలో నరుదు గాక ! ॥ నిన్ను ॥

అఘునిఁ గరుణింప నరుదు గాదు నీకు
ఘన పాపుని నన్నుఁగాచు టరుదు గాక
కనకము కనకము గానేల, యినుము
కనక మవుటే కడు నరుదుగాక ! ॥ నిన్ను ॥

నెలకొన్న భీతితో నిన్నుఁ జెనకితిఁ గాక
తలకొన్న సుఖినైనఁదలఁచనేల నిన్ను
ఎలమితోఁ దిరువేంగళేశుఁడ నాపాలఁ
గలిగి నీ కృప గలుగఁ జేతువు గాక[1] ! ॥ నిన్ను ॥

## 3

అవతారిక : - తనకు కలలో ప్రత్యక్షమైన శ్రీవేంకటేశ్వరుని స్వరూపమును వర్ణించుచున్నాడు --

---

(1) అ. సం., 5 - 27.

## భూపాలం

ఇప్పుడిటు కలగంటి - నెల్లలోకములకు
నప్పఁడగు తిరువేంక - టాద్రీశుఁగంటి. ॥ పల్లవి ॥

1. అతిశయంబైన శే - షాద్రిశిఖరము గంటి
ప్రతిలేని గోపుర - ప్రభలు గంటి
శతకోటి సూర్యతే - జములు వెలుఁగఁగఁగంటి
చతురాస్యుఁ బొడగంటి - చయ్యన మేల్కాంటి ॥ ఇప్పు ॥

2. కనకరత్నకవాట - కాంతు లిరుగడఁ గంటి
ఘనమైన దీప సం - ఘములు గంటి,
అనుపమ మణీమయ - మ్మగు కిరీటము గంటి
కనకాంబరము గంటి - గ్రక్కన మేల్కాంటి. ॥ ఇప్పు ॥

3. అరుదైన శంఖ చ - క్రాదు లిరుగడఁ గంటి
సరిలేని యభయహ - స్తము గంటిని,
తిరువేంకటాచలా - ధిపుని జూడఁగఁ గంటి
హరిఁ గంటి గురుఁగంటి - నంతట మేల్కాంటి[1]. ॥ ఇప్పు ॥

ప ॥ అప్పఁడు = తండ్రి.

1. ప్రతిలేని = సాటిలేని ; చతురాస్యుౕ = నాల్గుముఖముల బ్రహ్మను.

**భావము :** - ఇప్పుడు ఈ విధముగా నేనొక కల గంటిని. ఆ కలలో సమస్తలోకములకు తండ్రియైన శ్రీవేంకటాచల ప్రభువును జూచితిని.

మహోమహిమతో గూడిన శేషశైలము యొక్క శిఖరమును చూచితిని. సాటిలేని అచటి గోపురకాంతులు చూచితిని. నూరుకోట్ల సూర్యులప్రకాశము లొక్కుమ్మడి ప్రకాశించుచుండగా జూచితిని. చతుర్ముఖబ్రహ్మను చూచితిని. వెంటనే నిద్రనుండి మేల్కాంటిని.

---

(1). ఈ పాటలో ''మేలుకంటి, మణిమయమగు'' అను రేకులోని పాఠములు తాళపు నడకకై పైరీతిగా శ్రీరాళ్లపల్లి వారిచే సవరింపబడినవి. (చూడు - తా. పా.II.; P. 28.)

ఇరుప్రక్కల రత్నములు దాపిన బంగారు తలుపుల కాంతులు చూచితిని. గొప్పవైన అనేక దీపములు చూచితిని, సాటిలేని మణులతో నిర్మింపబడిన దేవుని కిరీటమును చూచితిని, ఆ దేవుడు దాల్చిన కాంచన వస్త్రమును చూచితిని, ఆ క్షణముననే మేల్కాంటిని.

ఆ దేవున కిరువైపుల అరుదైన శంఖ చక్రాదులను చూచితిని. తులలేని అభయ హస్తమును చూచితిని. శ్రీ వేంకటాచలాధీశ్వరుని జూచు భాగ్యమునకు నోచితిని. శ్రీహరిని గంటిని. ఆచార్యుని[1] గనుగొంటిని. వెను వెంటనే మేల్కాంటిని.

**విశేషాంశములు :** - అన్నమయ్యకు పదునారవ యేట స్వామి ప్రత్యక్ష మయ్యెనని "తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను" అను తొలి రాగిరేకు మీది వ్రాతను బట్టి తెలియుచున్నది. అది మొదలు ఆయన భగవంతునిపై అంకితముగా సంకీర్తనములు పాడినట్లు గూడ ఆ రేకుమీదనే వ్రాయబడియున్నది. తనకు స్వామి బాల్యమున దర్శనమిచ్చుటనే ప్రకృత సంకీర్తనములో ఆయన చెప్పుకొన్నాడని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిరి[2].

శ్రీ వేంకటేశ్వర విగ్రహము చెంత మన కిపుడు చతుర్ముఖ బ్రహ్మ కానరాదు. ఐనను ఇది అన్నమయ్యకు కలలో దోచిన రూపు కనుక ఇట్టివిశేషము లాయనకు కనిపించుట వింతగాదు.

## 4

**అవతారిక :** - శ్రుతి స్మృత్యాదులలో వర్ణింపబడిన పరమాత్ముడే శ్రీవేంకటేశ్వరుడని చెప్పుచున్నాడు --

### శ్రీరాగం

నిత్యాత్ముఁడై యుండీ - నిత్యుఁడై వెలుఁగొందు
సత్యాత్ముఁడై యుండీ - సత్యమై తానుండు,
ప్రత్యక్షమై యుండీ - బ్రహ్మమై యుండు సం
స్తుత్యుఁడీ తిరువేంక - టాద్రివిభుఁడు. ॥పల్లవి॥

---

(1) ఆయన చూచిన ఆచార్యుడెవ్వరో తెలియదు. "తన కాచార్యుడై ముక్తి ననుభవించుచున్న శ్రీశఠకోపయతి" యని శ్రీరాళ్ళపల్లివారు వివరించిరి. (చూడు - తా. పా.II P. 29.)

(2) అ. చ. పీ. P. 4

1. ఏమూర్తి లోకంబు - లెల్ల నేలెడు నాతఁ
డేమూర్తి బ్రహ్మాదు - లెల్ల వెదకెడు నాతఁ
డేమూర్తి నిజమోక్ష - మియ్యఁజాలెడు నాతఁ
డేమూర్తి లోకైక - హితుడు,
ఏమూర్తి నిజమూర్తి - యేమూర్తియును గాఁడు
యేమూర్తి త్రైమూర్తు - లేకమైన యాతఁ
డేమూర్తి సర్వాత్ముఁ - డేమూర్తి పరమాత్ముఁ
డామూర్తి తిరువేంక - టాద్రి విభుఁడు. ॥ నిత్యా ॥

2. ఏ దేవు దేహమున - నిన్నియును జన్మించె
నే దేవు దేహమున [1] - నిన్నియు నణంగె మరి
యే దేవు విగ్రహం - బీసకల మింతయును
ఏ దేవు నేత్రంబు - లిన చంద్రులు,
ఏ దేవుఁ డీజీవు - లిన్నింటిలో నుండు
నేదేవు చైతన్య - మిన్నిటికి నాధార
మేదేవుఁ డవ్యక్తు - డే దేవుఁ డద్వంద్వుఁ
డా దేవుఁడీ వేంక - టాద్రి విభుఁడు. ॥ నిత్యా ॥

3. ఏ వేల్పు పాదయుగ - మిలయు నాకాశంబు
ఏ వేల్పు పాదకే - శాంతం బనంతంబు
ఏ వేల్పు నిశ్వాస - మీ మహామారుతము
ఏ వేల్పు నిజదాసు - లీ పుణ్యులు
ఏ వేల్పు సర్వేశుఁ - డే వేల్పు పరమేశుఁ
డే వేల్పు భువనైక - హితమనోభావకుఁడు
ఏ వేల్పు కడు సూక్ష్మ - మేవేల్పు కడు ఘనము
ఆ వేల్పు తిరువేంక - టాద్రి విభుఁడు. ॥ నిత్యా ॥

1. త్రైమూర్తులు = బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనబడు త్రిమూర్తులు.

---

(1) మేనిలో - పె. రే. 2.

2. విగ్రహంబు = శరీరము ; ఇనచంద్రులు = సూర్యచంద్రులు ; అవ్యక్తుడు = ప్రకాశము గానివాడు ; అద్వంద్వుఁడు = ద్వంద్వములేనివాడు. అద్వితీయుడు.

3. భువనైకహితమనోభావకుఁడు = లోకమునకు ముఖ్యహితమునే మనస్సున భావించువాడు.

**భావము :** - ఈ శ్రీవేంకటేశ్వరుడు నిత్యస్వరూపుడై యుండుట వలననే 'నిత్యుడు' అనబడి ప్రకాశించుచున్నాడు. సత్యస్వరూపు డగుటవలననే తాను 'సత్యుడు' అనబడుచున్నాడు. లోకములో ఎల్లవారికి ప్రత్యక్షమై యుండి పరబ్రహ్మముగా నున్నాడు గావుననే భక్తులచే స్తుతింపదగి యున్నాడు.

ఏ దివ్యమూర్తి లోకములనెల్ల పాలించుచున్నాడో, ఎవనిని బ్రహ్మాది దేవతలెల్ల అన్వేషింతురో, ఎవడు ప్రపన్నులకు తనదైన (నిక్కమైన) మోక్షము నొసంగ జాలియున్నాడో, ఎవడు లోకమునకు ముఖ్యహితము గూర్చువాడో, ఎవడు ఏ యాకారమును తన యాకారముగా గలిగియుండుట లేదో (నిరాకారుడో), ఎవడు బ్రహ్మ విష్ణు మహేశ్వరు లనబడు త్రిమూర్తులు ఏకమైన మూర్తిగా నున్నాడో, ఎవడు సర్వాత్ముడో, ఎవడు పరమాత్ముడో ఆ దివ్యమూర్తియే శ్రీవేంకటగిరినాథుడు.

ఏ దేవుని శరీరమున ఈ సమస్తభువనములు పుట్టినవో, ఎవని శరీరమున ఇవన్నియు లయమగుచున్నవో, ఈ చరాచరమైన సృష్టియంతయు ఎవ్వని శరీరమో, సూర్యచంద్రు లెవ్వని నేత్రములో, ఎవడు ఈ సర్వజీవులలో అంతరాత్ముడై యున్నాడో, ఎవని చైతన్య మీచేతనములకెల్ల నాధారమో, ఎవడు ప్రకాశము గానివాడో, ఎవడు అద్వితీయుడో, ఆ దేవుడే ఈ వేంకటాచలనాథుడు.

భూమి, ఆకసము ఏ వేల్పు పాదయుగ్మమో, ఎవని పాదముల తుదియు, కేశముల తుదియు అంతము లేనివో. ఈ మహావాయు వెవ్వని నిట్టూర్పో, పరమభాగవతులైన ఈ పుణ్యాత్ము లెవ్వనికి నిక్కమైన దాసులో, ఎవడు సర్వేశ్వరుడో, ఎవడు పరమేశ్వరుడో, ఎవడు ప్రపంచమునకు ముఖ్య హితమునే మనస్సున భావించువాడో, ఎవడు మిక్కిలి సూక్ష్మమైనవాడో, ఎవడు మిక్కిలి స్థూలమైనవాడో, ఆ దేవుడే శ్రీ వేంకటేశ్వరుడు.

**విశేషాంశములు :** - చరాచరాత్మకమైన ఈ విశాల విశ్వము యొక్క సృష్టి స్థితిలయములకు హేతువైన పరబ్రహ్మమును శ్రుతులు, స్మృతులు, పురాణములు మున్నగునవి అనేక విధముల వర్ణించుచున్నవి. ఆ పద్ధతిలో ఆ పరతత్త్వమును వర్ణించుచు నిత్యసత్య స్వరూపుడైన ఆ దేవుడే భక్తానుగ్రహకాంక్షతో శ్రీ

వేంకటేశ్వరుడుగా రూపొందియున్నాడని సంకీర్తనాచార్యు డీ సంకీర్తనములో వర్ణించినాడు.

'నిత్యో నిత్యానాం[1]' అని శ్రుతిమాత పరమాత్ముని నిత్యములలో నెల్ల నిత్యునిగా వర్ణించినది. 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ[2]' అని సత్యస్వరూపునిగా గూడ పేర్కొన్నది. మరియు కృష్ణుడు సత్యమున ప్రతిష్ఠితుడు. సత్యమతనిలో ప్రతిష్ఠితమైయున్నది. సదసత్తులు అతడే, కాన సజ్జను లతనిని 'సత్యుడు' అని భావింతురని భారతము చెప్పుచున్నది --

సత్యే ప్రతిష్ఠితః కృష్ణః సత్యమస్మిన్ ప్రతిష్ఠితమ్ ।
సత్తాసత్తే చ గోవింద స్తస్మాత్సత్యః సతాం మతః[3]॥

అట్టి పరబ్రహ్మము సామాన్య నేత్రములకు గోచరము గానిదైనను వేంకటాద్రిపై అర్చామూర్తిరూపమున ప్రత్యక్షమై స్తుతింపదగియున్నదని పల్లవిలోని తాత్పర్యము.

'స ఏవ కాలే భువనస్య గోప్తా విశ్వాధిపః[4]' అను శ్రుతివచనము చెప్పున లోకముల రక్షించు లోకపాలకు డతడే. 'త్రీన్ లోకాన్ పాలయామ్యహమ్[5]' అని వరాహపురాణమున తానే పేర్కొన్నాడు గదా! 'న హి పాలన సామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్[6]' అని పరాశరుడు గూడ జగత్పరిపాలన సామర్థ్యము విష్ణుని కొక్కనికే కలదని నుడివెను.

బలగర్వితులైన రక్కసులచే బాధింపబడిన బ్రహ్మేంద్రాది దేవతలు దుష్టనిగ్రహమున నేర్పరియైన ఆభగవంతునే అన్వేషించుచుందురు. జీవులకు మోక్ష మిచ్చుట కతడే సమర్థుడు. అందువలననే అతడు ముకుందుడు (ముకుం=మోక్ష భూమిం దదాతీతి) అని కీర్తింప బడుచున్నాడు. 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే[7]' అని ఆ దేవుడే చెప్పినట్లు ఎన్నో అవతారములెత్తి ధర్మమును స్థాపించుచున్నాడు గాన లోకమునకు హితము చేకూర్చువాడు అతడే.

నిర్గుణ తత్త్వ దృష్టితో చూడగా ఆ పరమాత్ముడు నిరాకారుడు. ఐనను

---

(1) శ్వేతాశ్వ., 6 - 13. (2) తైత్తి. ఆనం., 1. (3) భార. ఉ., 69 - 13.
(4) శ్వేతాశ్వ., 4 - 15. (5) గీ. మా., 7. (6) వి. పు., 1 - 22 - 21.
(7) గీత., 4-8

బ్రహ్మవిష్ణు శివమూర్తులకు కూటస్థమైన మూర్తియు అతడే. కావుననే విష్ణు సహస్రనామము 'అమూర్తిమాన్' 'అనేకమూర్తిః'[1] అని ఆ దేవుని పేర్కొన్నది.

స బ్రహ్మ స శివః సేన్ద్రః సోఽక్షరః పరమః స్వరాట్ ।
స ఏవ విష్ణుః స ప్రాణః స కాలోఽగ్నిస్స చంద్రమాః[2] ॥

అని కైవల్యోపనిషత్తు పేర్కొన్నట్లు సకల దేవతామూర్తియు అతడే. అన్నమయ్య వంరొకచో త్రిమూర్తుల ఏకమూర్తిత్వమును ప్రకటించుటకే 'భవకమలభవ మాధవరూప ![3]' అని దేవుని సంబోధించినాడు. ఆ దేవుడు సర్వాత్ముడు మరియు 'మత్తః పరతరం నాన్యత్కించిదస్తి[4]' । అను గీతోక్తి ననుసరించి అయనకంటె పరతరమైన దెద్దియు లేనందున ఆయన పరమాత్ముడనబడుచున్నాడు.

ఆ పరమాత్ముని దేహమునుండియే సమస్తము జన్మించినది. సృష్టిక్రమమును వర్ణించుచు శ్రుతి యిట్లు చెప్పినది --

''తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నమ్, అన్నాత్పురుషః . . . .[5]''

అనగా ఆత్మనుండి ఆకాశము, దానినుండి వాయువు, దానినుండి అగ్ని, దానినుండి జలము, దానినుండి పృథివి, దానినుండి ఓషధులు, వాటినుండి అన్నము, దానినుండి పురుషుడు - జన్మించిరని యర్థము.

కావున ఈ సకలసృష్టియు అతని శరీరమే. ఇది అంతయు కడకు లయమగునది గూడ ఆ దేవునియందే. సృష్టి స్థితి లయములకు కారణమై ఆత్మభువుడైన పరమాత్మను భాగవత మిట్లు వర్ణించినది --

యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం య ఇదం స్వయమ్ ।
యోఽస్మాత్పరస్మాచ్చ పరస్తం ప్రపద్యే స్వయం భువమ్[6] ॥

మరియు 'చక్షుషీ చంద్ర సూర్యౌ'[7] అని శ్రుతి సూర్యచంద్రులను ఆ

---

(1) వి. స. నా., 77. (2) కైవల్య., 1 - 7. (3) అ. సం., 11 - 2 - 37.
(4) గీత., 7 - 7. (5) తైత్తి. ఆనం., 1. (6) భాగ., 8-3-3.
(7) అగ్ని ర్మూర్ధా చక్షుషీచంద్ర సూర్యౌ దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చవేదాః ।
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాన్తరాత్మా ॥
- ముండక 2 - 1 - 4

పరమాత్ముని నేత్రములుగా వర్ణించినది.

'అంగుష్ఠమాత్రః పురుషః మధ్య ఆత్మని తిష్ఠతి[1]' - 'అంగుష్ఠమాత్రుడైన పురుషుడు ఆత్మ మధ్యలో నున్నాడు, - అను శ్రుతి ననుసరించియు, 'ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి[2]' సర్వభూతముల హృదయదేశమున ఈశ్వరుడున్నాడు అను స్మృతి ననుసరించియు జీవు లందరిలో ఆ దేవు డంతర్యామిగా నున్నాడని తెలియుచున్నది. 'చేతనశ్చేతనానాం[3]' అని శ్రుతి చెప్పినట్లు చేతనులకాధారమైన చైతన్య మతడే.

'నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః[4]' - యోగమాయచే ఆవరింపబడిన నేను అందరికి ప్రకాశమైనవాడను గాను - అను గీతావచనము ననుసరించి భగవంతుని నిజరూపము జీవులకు వ్యక్త మగుట లేదు.

'ఏకమేవాద్వితీయం బ్రహ్మ[5]' అను శ్రుతిననుసరించి ఆ పరబ్రహ్మ అద్వితీయమైనది. అనగా దానికి సాటియైనది మరొకటి లేదు.

'పద్భ్యాం పృథివీ[6]' అని భూమినే పరమాత్ముని పాదములుగా శ్రుతి పేర్కొనుచున్నది. ఇచ్చట భూమ్యాకాశములు రెండును పాద యుగ మనుటచే వామనావతారములో రెండుపాదములతో భూమ్యాకాశముల నాక్రమించిన దేవుని స్వరూపమును భావింప వలసియున్నది. అతడు సర్వవ్యాపిగాన పాదాంతము కేశాంతము అంతరహితమై యున్నవి.

'వాయుః ప్రాణః'[7], అనుటచే ఆ పరమాత్ముని నిశ్వాసమే వాయువని తెలియుచున్నది. పుణ్యాత్ములైన భాగవతోత్తములు ఆయనకు దాస్యము చేయుదురు. 'సర్వస్య ప్రభుమీశానం తమీశ్వరాణాం పరమం మహేశ్వరం'[8], అను శ్రుతి వచనముల ననుసరించి సర్వేశ్వరుడు, పరమేశ్వడును ఆ దేవుడే.

**అణోరణీయాన్ మహతో మహీయాన్ [9]।**
**అణోరణీయా నహమేవ తద్వన్మహా నహమ్ [10]।**
**యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్ [11]॥**

---

(1) కఠ, 4 - 12. (2) గీత.; 18 - 61. (3) శ్వేతాశ్వ., 6 - 13.
(4) గీత., 7 - 25. (5) ఛాందోగ్య., 6 - 2 - 1. (6) ముండక., 2 - 1 - 4.
(7) ముండక., 2 - 1 - 4. (8) శ్వేతాశ్వ., 6 -7. (9) కఠ., 2 - 20.
(10) కైవల్య., 20. (11) శ్వేతాశ్వ., 3 - 9.

ఇత్యాది శ్రుతులు ఆ పరమాత్మను సూక్ష్మములలెల్ల సూక్ష్మమైనవానినిగాను, మహత్తులలో మహత్తైన వానిని గాను వర్ణించుచున్నవి.

వేదార్థములను అన్నమయ్య ఈ సంకీర్తనమున నెట్లు పేర్కొనెనో పరిశీలించినచో -

'సకల వేదములు సంకీర్తనములు చేసి
ప్రకటించి నినుబాడి పావనుండైన
అకలంకుడు తాళ్లపాకన్నమాచార్యులు[1]'

అనుమాట ఎంత యథార్థమో స్పష్టము కాగలదు.

## 5

అవతారిక: - చావు పుట్టుకలతో గూడిన సంసారచక్రములో పరిభ్రమించు జీవుని స్వభావమును వర్ణించుచున్నాడు --

### నాట

ఎవ్వరెవ్వరివాఁడొ - యీ జీవుడు - చూడ
నెవ్వరికి నేమౌనొ - యీ జీవుఁడు ? ॥పల్లవి॥

1. ఎందరికిఁ గొడుకు గాఁ - డీ జీవుడు - వెనక
కెందరికిఁ దోఁబుట్టఁ - డీజీవుడు ?
ఎందరిని భ్రమయించఁ -డీజీవుఁడు - దుఃఖ
మెందరికిఁ గావింపఁ - డీజీవుడు ? ॥ఎవ్వ॥

2. ఎక్కడెక్కడఁ దిరుగ - డీజీవుఁడు - వెనక
కెక్కడో తనజన్మ - మీజీవుఁడు ?
ఎక్కడి చుట్టము తనకు - నీజీవుఁడు - ఎప్పు
డెక్కడికి నేగునో - యీ జీవుఁడు ? ॥ఎవ్వ॥

---

(1) అ. సం., 6

3. ఎన్నఁడును జేటులే - నీజీవుఁడు - వెనక
కెన్ని తనువులు మోవఁ - డీజీవుడు ?
ఎన్నఁగల తిరువేంక - టేశు మాయలఁ దగిలి
యెన్ని పదవులఁ బొందఁ - డీజీవుఁడు ? ॥ఎవ్వ॥

**భావము :** - ఈ జీవుడు ఎన్నో జన్మములలో ఎందరికో జన్మించుచున్నాడు. జనన మరణాత్మకమైన సంసారచక్రములో పరిభ్రమించుచున్నాడు. ఇట్టి జీవుడు ఏ యే జన్మలలో ఎవ్వరెవ్వరికి ఏయే వావివరుసలలో సంబంధపడియున్నాడో నిర్ణయించుట కెవరి తరము ? విచారించగా జీవులలో ఒకరితో నొకరి కెట్టి సంబంధమును లేదు.

ఈ జీవుడెన్నో జన్మములలో ఎందరికో కొడుకై జన్మించినాడు. పూర్వము తానెందరికో తోబుట్టువుగా బుట్టినాడు. ఎందరినో ఎన్నో విధముల పుత్రమిత్ర కళత్రాది సంబంధములతో భ్రమింపజేసినాడు. ఎందరినో ఎన్నో రీతుల దుఃఖముల పాలు చేసినాడు.

ఈ జీవుడు తిరుగని చోటే లేదు. ముందటి జన్మలలో ఎన్నో చోట్ల పలు రూపులతో జన్మించి తిరిగి యున్నాడు. తానున్న జన్మములో ఇత డెక్కడ పుట్ట నున్నాడో ? ఈ జన్మములో మాత్రము తనకీజీవు డేవిధముగా అనుగు చుట్టము కాగలడు[1] ? ఇత డెప్పు డెక్కడికి పోవునో తెలియదుగదా !

ఇన్ని జన్మలు దాల్చుచున్నను, ఇన్నిసార్లు మరణించు చున్నను నిజముగా ఈ జీవునకు మాత్రము ఎట్టి చేటును లేదు. పూర్వ మిత డెన్నో తనువులు దాల్చినాడు. తాను దాల్చిన శరీరములే చేటొందుచున్నవి గాని సనాతనుడైన జీవాత్మున కేమాత్రము చేటు లేదు. శ్రీవేంకటేశ్వరుని మహా మాయా ప్రభావమునకు లోబడి ఈ జీవు డెన్నో పదవులు పొందుచున్నాడు.

**విశేషాంశములు :** - సంసార భ్రాంతికి లోనై వెత జెందు జీవులస్థితి ఈ సంకీర్తనములో వర్ణింపబడినది. జీవులు అనాదిగా కర్మకు వశులై సంసార ప్రవాహములో దిరుగు

(1) 'ఎక్కడి చుట్టము తనకు నీ జీవుడు ?' అనుటకు శ్రీరాళ్లపల్లి వారు తమ లఘుటీకలో ఇచ్చిన వివరణమిది - ''తాను ఈ జీవునికంటె వేఱుగాడు. కాని ఈ జీవితదశలో తన్ను ఇది వరకున్న, ఇక ముందు రాబోవు జీవావస్థల కంటె ఎక్కువ ప్రీతితో చూచుట ప్రాణిస్వభావము కనుక భూత భవిష్యత్తులలో లేని క్రొత్త యనురాగము తన యందు తానిప్పుడేల చూప-వలయునని తాత్పర్యము.'' (తా. పా. II, P. 18.)

యున్నారు. వర్తమాన జన్మమునే వారు నిక్కముగా దలంతురుగాని అతీతములు, అనాగతములు అయిన జన్మలనుగూర్చి భావింపలేరు. ఇది మాయా ప్రభావము.

జీవునకు వేలకొలంది తల్లిదండ్రులు, వందలకొలది భార్యలు, బిడ్డలు గలిగించినారు. ఇందులో ఎవరితో ఎవరికి సంబంధము నేమని నిర్ణయింప గలము ? సంసారమున మనకు లభించిన మనలను విడిపోయిన బంధువు లెందరున్నారో, అన్ని యిసుక రేణువులు గంగలో గూడ లేవని పెద్దల సూక్తి -

మాతాపితృ సహస్రాణి పుత్రదార శతాని చ ।
తవానన్తాని యాతాని కస్య తే కస్య వా భవాన్ ? [1]॥
లబ్ధా స్త్యక్తాశ్చ సంసారే యావన్తో బాంధవాస్త్వయా ।
న సన్తి ఖలు తావన్తో గంగాయామపి వాలుకాః [2]॥

పూర్వాపర జన్మలను గూర్చిన భావన గల తత్త్వవేత్తలు మాత్రము సామాన్య జీవులవలె శోకమోహములకు లొంగరు. ఇట్టి విజ్ఞానమును మనకు గలుగ జేయుటకే అన్నమయ్య ఈ పాటలో జీవుని పరిస్థితి నిట్లు వర్ణించినాడు.

శ్రీకృష్ణుడు గీతలో జన్మములను గూర్చి వివరించుచు తనకును, అర్జునునకును ఎన్నో జన్మలు గడచినవనియు, ఆ జన్మలన్నియు తనకు తెలియును గాని, అర్జునకు తెలియ వనియు చెప్పినాడు --

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున !
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప ![3]

ఇందుచే మాయ కధీనులైన జీవుల జ్ఞానశక్తి మరుగుపడి యుండుటవలన వారు తమ జన్మ వృత్తాంతముల నెరుంగజాల కున్నారని స్పష్టమగుచున్నది.

శరీరము నశించిన పిమ్మట జీవు డున్నాడా ? లేడా ? అను విషయము మిక్కిలి ముఖ్యమైనది. కఠోపనిషత్తులో ఈ విషయమును గూర్చి నచికేతుడు ప్రశ్నింపగా యమధర్మరాజు దేవతలు గూడ ఈ విషయమున సంశయాత్ములై యున్నారనియు, అది మిగుల సూక్ష్మమైన విషయము గావ తెలిసికొనుట కష్టమనియు వచించెను -

---

(1) సుభా., 3288. (2) శా. ప., 4133. (3) గీత., 4-5.

దేవై రత్రాపి విచికిత్సితం పురా న హి సుజ్ఞేయ మణురేష ధర్మః [1]।

ఉపనిషత్తులు మున్నగు బ్రహ్మ విద్యా ప్రబోధకములైన గ్రంథములన్నియు ముఖ్యముగా ఈ ఆత్మతత్త్వమును వివరించుటకే వెలువడినవి.

గీతలో ద్వితీయాధ్యాయమున జననమరణములు ఆత్మకు లేవు. అది ఎల్లవేళల పుట్టుక లేనిదై, నిత్యమై, శాశ్వతమై యున్నది. శరీరము హతమైనను, అది హతము గాదు - ఇత్యాదిగా ఆత్మ స్వరూపము విపులముగా నిరూపింపబడినది-

న జాయతే మ్రియతే వా కదాచిన్నాయం భూత్వా భవితా వా న భూయః॥
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే [2]॥

కఠోపనిషత్తులో గూడ ఈ విషయమే ఇట్లు చెప్పబడియున్నది -

న జాయతే మ్రియతే వా విపశ్చిత్ నాయం కుతశ్చి న్న బభూవ కశ్చిత్ ।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే [3]॥

కాబట్టి జీవుడు తన నిత్యత్వమును గుర్తించినప్పుడే సుఖదుఃఖాదుల కతీతమైన స్థితి నొందగలడు.

సకల వేదార్థములను సంకీర్తనములుగా పాడదలంచినవాడు గాన అన్నమయ్య ఎడనెడ ఇట్టి ఆత్మతత్త్వ ప్రబోధకములైన విషయములను లలిత లలితములైన పదములుగా వెలయించినాడు.

## 6

**అవతారిక :** - ఒక పెద్దభూతమును వర్ణించు వ్యాజమున భగవంతుని దశావతారములను కీర్తించుచున్నాడు -

### వరాళి

పుడమి నిందరిఁ బట్టె - భూతము కడు
బొడవైన నల్లని - భూతము ॥ పల్లవి ॥

1. కినిసి వోడ మిం - గెడి భూతము
పునుక వీఁపు పెద్ద - భూతము
కనలి కవియు చీఁ - కటి భూతము
పొనుగు సోమపు - మోము భూతము ॥ పుడమి ॥

(1) కఠ., 1-21. (2) గీత., 2-20. (3) కఠ, 2-18.

2. చేటకాళ్ల మిం - చిన భూతము
పోటుదా రల పెద్ద - భూతము,
గాటపు జడల బిం - కపు భూతము
జూటరి నల్లము - సుగు భూతము. ॥ పుడమి ॥

3. కెలసి భిత్తలే తిరి - గేటి భూతము
పొలుపు దాంట్ల పెద్ద - భూతము,
బలుపు వేంకటగిరి - పయి భూతము
పులుగు మీఁది మహా - భూతము. ॥ పుడమి ॥

1. కినిసి = కోపించి, సమీపించి; పునుక = పుఱ్ఱె, ఎముక చిప్ప; కవలి = కోపించి, కవియు= వ్యాపించు; పెనుగు సోమపు మోము భూతము = ఉజ్జృంభించు పరాక్రమముతోడి ముఖము గల భూతము.

2. పోటుదారు = యుద్ధ నిపుణుడు, పరాక్రమశాలి; జూటరి = మోసగాడు.

3. కెలసి = విజృంభించి; బిత్తలే = నగ్నముగనే, పులుగు = పక్షి.

భావము : - ఇది ఒక పెద్ద యత్తైన నల్లని భూతము, భువిలో వారు, వీరు అను భేదము లేక ఇది అందరిని పట్టినది.

కోపముతో పైబడి పెద్ద ఓడనే అమాంతముగా మ్రింగివేయు భూతమిది. వీపున ఈ పెనుభూతమున కొక యెముక చిప్ప గలదు. చీకటివలె నల్లనైన (తామసికమైన) ఈ భూతము కోపముతో పైకొను స్వభావము గలిగియున్నది. విజృంభించు విక్రమముతో నిండిన ముఖముగల భూతమిది.

ఈ భూతము చేటలవలె వెడల్పైన కాళ్లతో అతిశయించి యున్నది. ఇది పెద్ద బీరము గల పోటుదారు. దట్టమైన జడలుగల పొగరైన భూత మిది. ఈ మాయదారి భూతము నల్లని ముసుగు వేసికొని యున్నది.

ఈ భూతము దిస మొలతో అడ్డమాక లేక తిరుగుచుండును. అవలీలగా ఇటునటు లంఘించు వడిగల భూతమిది. ఇది సమున్నతమైన వేంకటాచలముపై నుండును. ఈ మహాభూతము పక్షిపై నుండును.

విశేషాంశములు : - ఈ పాటలో ఒక పెద్దభూతము యొక్క స్వభావము వర్ణింపబడినది. పొడవుగా నల్లగా నుండుట; ఓడల వంటి పెద్ద పెద్ద వస్తువులు మ్రింగుట; పుఱ్ఱెలు మోసికొని తిరుగుట; కోపముతో పై కొనుట; భయంకరమైన ముఖము, చేటలవంటి కాళ్ళు బిరుసైన జడలు, నల్లని ముసుగు గల్గియుండుట; దిసమొలతో సంచరించుట; వడివడిగా దాటిపోవుట; కొండలపై నుండుట;

బోరువలవంటి కొన్ని పక్షులనావేశించి వాటిపై పయనించుట - మున్నగునవి మహాభూతముల స్వభావము అనుట లోక ప్రసిద్ధము.

ఇట్లు పైకి భూతము యొక్క స్వరూప స్వభావములు వర్ణించుచున్న ఈ సంకీర్తనమున పల్లవి తరువాత రెండున్నర చరణములలోని పది పంక్తులలో వరుసగా దశావతారములు పేర్కొనబడినవి.

సముద్రములో తిమింగిలము లనబడు పెద్ద పెద్ద చేపలు ఓడలనే మ్రింగివేయగలవని వినుచుందుము. కాన 'ఓడ మింగెడి భూతము' అనుటచే మత్స్యావతారము నిర్దేశింపబడినది. సోమకుని నిగ్రహించి వేదముల నుద్ధరించుటకు దేవుడు మత్స్యావతారము ధరించెను.

'పునుక వీఁపు భూతము' అనగా కూర్మము. క్షీరసాగర మథన సమయమున మందర పర్వతమును ధరించుటకై భగవంతుడు కూర్మావతారము దాల్చెను.

'కవియు చీఁకటి భూతము' అనగా నల్లని రూపుగల, లేదా, తామసిక ప్రవృత్తిగల వరాహము అని భావము. హిరణ్యాక్షుని సంహరించుటకై పరమాత్ముడు వరాహావతారము ధరించెను[1].

ప్రబల పరాక్రమము గల సింహము యొక్క ముఖముతో నవతరించి హిరణ్యకశిపుని గూల్చిన నరసింహుడు 'సోమపు మోము భూతము' అను పదముచే నిర్దేశింపబడెను.

త్రివిక్రముడై దేవుడు మిక్కిలి వెడల్పైన అడుగులతో భూమ్యాకాశముల నాక్రమించెను. కాన 'చేట కాళ్ళ భూతము' అనగా వామనుడని యర్థము.

'పోటుదారు భూతము' అనుటచే ఇరువదేడు పర్యాయములు క్షత్రియులను రణరంగమున నురుమాడిన వీరుడగు పరశురాముడు పేర్కొనబడెను.

'జడల బింకపు భూతము' అనగా తండ్రి యానతి ననుసరించి అరణ్యవాసమున జడలు దాల్చి చరించిన వీరుడైన శ్రీరాముడని గ్రహింపనగును.

---

(1) పద్మపురాణమున భూమిని పైకెత్తిన మహావరాహము నీలాద్రివలె నల్లగా నుండెనని వర్ణన కలదు -

తతః సముత్క్షిప్య ధరాం స్వదంష్ట్రయా మహావరాహః స్ఫుటపద్మలోచనః ।
రసాతలా దుత్పలపత్ర సన్నిభః సముత్థితో నీల ఇవాచలో మహాన్ ॥ (పద్మ - 1-3-41.)
భాగవతమునందు గూడ ఇట్టి వర్ణనయే కలదు.

నీలాంబర ధారి యైన బలరాముడు 'నల్లని ముసుగు భూతము' అను పదముచే నిర్దేశింపబడినాడు.

నగ్నుడై పోయి త్రిపురాసుర స్త్రీల మానము దూలపుచ్చిన బుద్ధుడు, 'బిత్తలే తిరిగేటి భూతము' అని చెప్పబడెను.

'పొలుపు దాంట్ల పెద్దభూతము' అను మాట కల్క్యవతారమున తురగము నధిరోహించి దుష్టుల జెండివైచుచు కడు వేగమున దాటి పోయెడు భగవంతుని తెలియ జేయుచున్నది. ఇట్లు -

మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః ।
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కలికి రేవచ ॥

అను దశావతారములు వరుసగా ఇట కీర్తింపబడినవి. పరమాత్ముడు వేంకటాద్రి నివాసి, గరుడవాహనుడు అనుటను సంకీర్తనమునందలి చివరి రెండు పంక్తులు చెప్పుచున్నవి.

అసలు భూతము ఏ కొందరినో పట్టును. ఈ పొడవైన నల్లని భూతము పుడమిగల వారందరిని పట్టెనని పల్లవిలో చెప్పబడినది. దీనిచే నీలమేఘశ్యాముడు సర్వోన్నతుడు అయిన భగవంతుని విశ్వవ్యాపకత్వము సూచింపబడినది -

యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽథవా ।
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః[1] ॥

అన్నట్లు నారాయణుడు వినబడు, కనబడు జగమెల్ల వ్యాపించియున్నాడు గదా !

## 7

అవతారిక : - దోషభూయిష్ఠమైన ఆటోపపు జీవితముకంటె నిర్దుష్టమైన సామాన్య జీవితమే మేలనుచున్నాడు -

### గుజ్జరి

అప్పులేని సంసార - మైనపాటే చాలు
తప్పులేని జీత మొక్క - టారమైనఁ జాలు ॥ పల్లవి ॥

(1) మం. పు., 5.

1. కంతలేని గుడిసొక్క - గంపంతయినఁ జాలు
చింతలేని యంబలొక్క - చేరెఁడే చాలు,
జంతగాని తరుణి యే - జాతైన నదే చాలు
వింతలేని సంపదొక్క - వీసమే చాలు ॥ అప్పు ॥

2. తిట్టులేని బ్రదుకొక్క - దినమైన నదె చాలు
ముట్టులేని కూడొక్క - ముద్దెఁడే చాలు,
గుట్టుచెడి మనుకంటె - కొంచెపు మేలైనఁ జాలు
వట్టి జాలిఁబడుకంటె - వచ్చినంతే చాలు ॥ అప్పు ॥

3. లంపటపడని మేలు - లవలేశమే చాలు
రొంపికంబమొకంటె - రోయుటే చాలు,
రంపపుఁ గోరికకంటె - రతి వేంకటపతి
పంపున నాతనిఁజేరే - భవమే చాలు ॥ అప్పు ॥

వి॥ :- తారము = నాలుగు కాసుల నాణెము

(1) జంత = ధూర్తురాలు, వీసము = ఒకట పదునారవ భాగము.

(2) రొంపికంబము = బురదలోని స్తంభము. రంపపుగోరిక = రంపపు కోతవలె బాధించు ఆశ.

**భావము :** - అప్పుచేసి ఆటోపముగా సంసారము జరుపుటకంటె అప్పులేని కాపురము జరిగినంతవరకే చాలును. అదే సుఖప్రదము. అట్లే తప్పు త్రోవలో ఆర్జించిన అధిక ధనముకంటె తప్పులేని జీతము నాలుగు కాసులైనను చాలును.

ఎండవానలవలని బాధ తప్పని పెద్ద గృహముకంటె చక్కగా కప్పబడిన యిల్లు చిన్నదైనను మేలు. నానా చింతలకు లోనై తిను పంచ భక్ష్య పరమాన్నములకంటె చీకుచింత లేని యంబలి చేరెడైనను సుఖకరమే. ధూర్తురాలైన కులస్త్రీకంటె గుణవతి యయిన వనిత తక్కువ జాతిదైనను మేలు. ''స్త్రీరత్నం దుష్కులాదపి [1]'' అని పెద్దల వచనము. అన్యాయముగా క్షణములో ఆర్జింపబడి పదిమందికి వింతగొల్పు దొడ్డ సంపదకంటె న్యాయార్జితమైన విత్తము మిక్కిలి కొద్దిదైనను చాలును.

(1) మను., 2-238.

ఇతరుల దూషణకులోనై శత సంవత్సరములు జీవించుటకంటె ఎట్టి దూషణ లేక ఒక్క దినము జీవించినను మేలే. అపరిశుద్ధమైన అన్నము కడుపునిండ దినుట కంటే పరిశుద్ధమైన అన్నమొక్క కబళమైనను సుఖావహము. పెద్ద పెద్ద ఆశలతో ప్రాకులాడి పదిమందిలో గుంట్టుచెడి బ్రతుకుటకంటె ఏ కొంచెపు మేలుగలిగినను దానితో తృప్తి నొందుట మేలు. లేనిపోని ప్రయాసలకు గురియై జాలిబడుటకంటె వచ్చినదానితో తనివి పొందుట మేలు.

పలు తగులములకు గురియై బాధపడుటకంటె ఏ లంపటము లేక వచ్చు మేలు కొద్ది పాటిదైనను చాలును. బురదలోని స్తంభమువలె నిలకడలేని జీవితముకంటె ఐహికసుఖములపై రోతపడి నిశ్చలముగా నుండుట మేలు. రంపము వలె బాధావహమైన కోరికలకు లోనగుటకంటె 'మామేకం శరణం వ్రజ [1]' అను భగవదాదేశము ననుసరించి ఆ దేవుని సన్నిధి జేరుటకు ప్రయత్నించు మానవుని పుట్టుకే శ్రేష్ఠమైనది.

## 8

అవతారిక : - భగవంతుని మాయా విలాసమును వర్ణించుచున్నాడు -

### కేదార గౌళ

పరమాత్ముని నోరఁ - బాడుచును ఇరు
దరులు గూడఁగ దోసి - దంచీ మాయ.[2] ॥ పల్లవి ॥

1. కొలది బ్రహ్మాండపుఁ - గుందెనలోన
కులికి జీవులను - కొలుచు నించి,
కలికి దుర్మోహపు రో - కలి వేసి
తలఁచి తనువులను - దంచీ మాయ. ॥ పర ॥

2. తొంగలి రెప్పల రా - త్రులుఁ బగలును
సంగడి కన్నులుగా - సరిఁదిప్పుచు

---

(1) గీత., 18-66

(2) పా.రే., ని. రే. లలో ఈ పాటకు పెక్కు పాఠభేదము లున్నవి. శ్రీరాళ్ళపల్లివారి సవరణ ఇచట అనుసరింపబడినది. (చూ. తా. పా.II P. 114)

చెంగలించి దిక్కులనే - చేతు లూచుచు
దంగుడు బియ్యాలుగా - దంచీ మాయ ॥ పర ॥

3. అనయముఁ దిరువేంక - టాధీశ్వరుని
పనుపడి తనలోఁ - బాడుచును,
వొనరి విన్నాణి జీ - వు లనెడి బియ్యము
తనర నాతనికియ్య - దంచీ మాయ. ॥ పర ॥

ప॥ :- ఇరుదరులు = రెండు ప్రక్కలు, సుఖదుఃఖాది ద్వంద్వములు,

(1) కులికి = అల్లాడించి; కొలుచు = ధాన్యము; కలికి దుర్మోహపు = నేర్పరియైన దుష్టమోహమనెడు.

(2) తొంగలి రెప్పల = వాలురెప్పల, సంగడికన్నులు = జతగూడిన కన్నులు, చెంగలించి= విజృంభించి; దంగుడు = మెదుగుడు.

(3) పనుపడి = అలవాటుపడి, విన్నాణి = విజ్ఞాని.

**భావము** :- మాయ యనునది ఒక ఇల్లాలు. ఆమె పరమాత్ముడు విషయముగాగల దంపుడుపాట నోరార బాడుచు జీవులు అను ధాన్యమును రోటవేసి దంచుచున్నది. సుఖదుఃఖములు, పుణ్యపాపములు అను ద్వంద్వములే ఆ రోటిమీది ధాన్యమునకు ఇరు దరులుగా నున్నవి. వాటిని కూడ ద్రోసికొనుచు మాయ తన దంపుడు పని కొనసాగించుచున్నది.

మాయ స్వల్పమైన బ్రహ్మాండము అను కుందెనలో జీవులు అను ధాన్యమును అల్లాడించి నింపుచున్నది. ఆ పైన జీవులను లొంగదీయుటలో నేర్పరియైన వ్యామోహము అను రోకలి వేసి బుద్ధి పూర్వకముగా వారి శరీరము లనెడు పొట్టు ఊడిపోవునట్లు దంచుచున్నది.

వాలు రెప్పలు గల (రెప్పల బోలు రెండు సంధ్యలు గల) రేయుంబవళ్ళు అను జంట కన్నులను సరిగా ద్రిప్పుచు విజృంభించి దిక్కులనెడు చేతులు ఇటునటు ఊపుచు మాయ జీవులను మెదుగుడు బియ్య మగునట్లుగా దంచుచున్నది.

ఎల్లప్పుడు శ్రీవేంకటేశ్వరుని తనలో తాను అలవాటు చొప్పున పాడుకొనుచు జ్ఞాన స్వరూపులైన జీవులనెడు బియ్యమును ఆ దేవున కర్పించుటకై మాయ పై విధముగా దంచుచున్నది.

విశేషాంశములు :- ధాన్యము దంచువారు దంపుడుపాట పాడుచుందురు. కుందెన కిరువైపుల బడు ధాన్యమును కాళ్ళతో కూడ(ద్రోయుచుందురు. చేతులు విసరుచు రోకలి వేయుచుందురు. పొట్టూడునట్లు దంచి బాగుగా మెదిగిన బియ్యమును యజమాని కప్పగింతురు. ఈ లోక వృత్తముతో మాయావిలాస మిట పోల్చబడినది. అవిద్యకు లోబడి ద్వంద్వములకు జిక్కి వ్యామోహమునకు వశమై నలిగిపోయిన జీవులు తుదకు విద్యాప్రభావముచే విజ్ఞులై భగవంతుని జేరుచున్నారనుట ఇందలి పరమార్థము. 'మాయాం తు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరమ్ [1]' అని శ్రుతి వచనము. మాయయే ప్రకృతి. దానిని ప్రవర్తింపజేయువాడు పరమాత్ముడే. తన వినోదమునకై ఆయన ప్రకృతి నట్లు వినియోగించినాడు.

అనంతకోటి బ్రహ్మాండములతో నిండిన ఈ విశాల విశ్వములో మనము నివసించు బ్రహ్మాండము మిక్కిలి స్వల్పమైనది. అందుచేతనే ఇక్కడ అది చిన్న కుందెనగా రూపింపబడినది. సుఖదుఃఖములు, పుణ్యపాపములు మొదలైన ద్వంద్వముల మధ్య జీవు లిటునటు కొట్టుమిట్టాడుచున్నారు. కాంతా కనకాదులపై వారికి గల వ్యామోహమే వారిన్ని బాధలకు లోనై జన్మజరామరణాత్మకమైన సంసార చక్రములోబడి నలిగిపోవుటకు కారణమగుచున్నది. దుర్మోహ మిట రోకలిగా పేర్కొనబడుటకు హేతువిదే.

మాయా పరిమోహితుడైన జీవుడు శరీరము దాల్చి స్త్రీలు, అన్నపానములు మున్నగు విచిత్రభోగములనుభవించుచున్నాడని కైవల్యోపనిషత్తు చెప్పుచున్నది -

> స ఏవ మాయా పరిమోహితాత్మా శరీర మాస్థాయ కరోతి సర్వమ్ ।
> స్త్రియన్నపానాది విచిత్రభోగైః స ఏవ జాగ్ర త్పరితృప్తి మేతి [2] ॥

ప్రకృతిచే ఇట్లు బహుకాలము నానా బాధలకు గురి కావింపబడిన జీవులు చివరకు తమ అజ్ఞానమును గుర్తించి పశ్చాత్తాపము నొందుచున్నారు. భగవంతుని చేరుటకై పరితపించుచున్నారు. భగవత్ప్రాప్తి కవసరమైన విజ్ఞానమును పొందుచున్నారు. అట్లు విజ్ఞానస్వరూపులైన వారిని ప్రకృతియే తుదకు పరమాత్ముని సన్నిధికి జేర్చుచున్నది. 'ఆతని కియ్య దంచీ' అనుటలో సారార్థ మిదే.

భగవత్పరమైన అనన్యభక్తితోనే ఈ మాయ దాటవలసి యున్నది. ఎవరు

(1) శ్వేతాశ్వ., 4-10. (2) కైవల్య., 1-12.

తన యెడల ప్రపన్ను లగుదురో వారే త్రిగుణాత్మకమై దాట శక్యముగాని దైవ మాయను దాటిపోగలరని శ్రీకృష్ణుడు నుడివెను -

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ॥[1]

9

అవతారిక : - ఎట్టి కష్టదశలయందైనను హరినామ మొక్కటే దిక్కనుచున్నాడు.

## ముఖారి

ఆకటివేళల - నలపైన వేళలను
తేఁకువ హరినామమే - దిక్కు మరి లేదు ॥ పల్లవి ॥

1. కొఱమాలియున్న వేళ - కులము చెడిన వేళ
చెఱవడి యొరులచేఁ - జిక్కిన వేళ,
ఒఱపైన హరినామ - మొక్కటే గతిగాక
మఱచి తప్పిననైన - మఱి లేదు తెఱఁగు. ॥ ఆఁక ॥

2. ఆపదవచ్చినవేళ - ఆఱడిఁ బడినవేళ
పాపపు వేళల - భయపడిన వేళ,
ఓపినంత హరినామ - మొక్కటే గతిగాక
మాపు దాఁకాఁ బొరలిన - మఱిలేదు తెఱఁగు. ॥ ఆఁక ॥

3. సంకెళఁ బెట్టినవేళ - చంపఁ బిలిచినవేళ
అంకిలిగా నప్పుల వా - రాఁగినవేళ,
వెంకటేశు నామమే - విడిపించ గతిగాక
మంకు బుద్ధిఁ బొరలిన - మఱి లేదు తెఱఁగు. ॥ ఆఁక ॥

వి : - తేఁకువ = ధైర్యము.

1. ఒఱపైన = అందమైన, దృఢమైన, ప్రకాశమానమైన

(1) గీత., 7-14.

2. అజాడి = నింద

3. అంకిలి = అడ్డగింత; అఁగిన = నిలబెట్టిన; మంకుబుద్ధిఁ = మూర్ఖత్వముతో.

**భావము :-** ఆకలి గలిగినప్పుడు, శ్రమకు లోనైనప్పుడు, ధైర్యము చేకూర్చి రక్షించునది శ్రీహరినామ మొక్కటే. అది తప్ప మరొక దిక్కు లేదు.

తాను ఎందుకు కొఱగాని దుఃస్థితి ఏర్పడినప్పుడు, కులము చెడినప్పుడు, ఇతరులచే చెఱలో బంధింపబడి కృశించునప్పుడు, ప్రకాశమానమైన (దృఢమైన) హరినామ మొక్కటే గతి, దానిని మరచినచో మఱొక గతి లేదు.

ఆపద గలిగినప్పుడు, నిందకు లోనైనప్పుడు, పాపము పైకొన్నప్పుడు, భయపడినప్పుడు చాలినంతగా స్మరింపబడిన హరినామ మొక్కటే గతి. దానిని విడిచి కడవరకు ప్రయత్నించినను ఆ దుర్దశలనుండి కాపాడుటకు మరొక మార్గము లేదు.

శత్రువులు సంకెళ్ళతో బంధించినప్పుడు, చంపుటకు బిలిచినప్పుడు, అప్పులవారు అడ్డగించి నిలదీసినప్పుడు విడిపించుటకు శ్రీవేంకటేశ్వరుని నామ మొక్కటే ఉపాయము. దానిని వదలి మూర్ఖత్వముతో ఎంత ప్రయత్నించినను మరొకదారి లేనే లేదు.

**విశేషాంశములు :-** అన్నమయ్య కవితావైభవము నలుదిక్కుల వ్యాపించి ఆయనకు ఎనలేని కీర్తి ఘటించెను. ఆ కాలమున పెనుగొండ రాజధానిగా రాజ్యమేలుచుండిన సాళువ నరసింగరాయలు అన్నమయ్యను పిలిపించి సంకీర్తనలు పాడించి విని సంతసించి ఘనముగా సత్కరించెను. రాజు కోరికపై ఈ పదకవితా పితామహుడు కొంతకాలమతని యాస్థానమున నుండి తన రచనలు వినిపించుచుండెను. ఒకనాడు-

ఏమొకో చిగురు టధరమున ఎడనెడఁగస్తురినిండెమ
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా ! ॥ పల్లవి ॥

కలికి చకోరాక్షికిఁ గడకన్నులు గెంపై తోచిన
చెలువం బిప్పు డిదేమో చింతింపరె చెలులు;
నలువునఁ బ్రాణేశ్వరుపై నాటిన యా కొనచూపులు
నిలువునఁ బెరుకఁగ నంటిన నెత్తురు కాదుగదా ! ॥ ఏమొ ॥

పడతికి చనుఁగవ మెఱుఁగులు పైపైఁబయ్యెద వెలుపల
కడు మించిన విధమేమో కనుఁగొనరే చెలులు,

ఉడుగని వేడుకతో బ్రియుఁడొత్తిన నఖశశిరేఖలు
వెడలఁగ వేసవికాలపు వెన్నెల కాదుగదా ! ॥ ఏమొ ॥

ముద్దియ చెక్కుల కెలఁకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దిక లాగులివేమో వూహింపరె చెలులు,
గద్దరి తిరువేంకటపతి కౌఁగిటి యధరామృతముల
అద్దిన సురతపువేళల అందము కాదుగదా ! ॥ ఏమొ [1] ॥

అను రసవత్తరమైన శృంగారసంకీర్తన పాడగా విని రాజు ఆనందపరవశుడై "నాపై నిట్టి కీర్తన మొకటి రచింపుము" అని అడిగెను. "ముకుందు గొనియాడు నాజిహ్వ నిను గొనియాడ నేరదు" అని సంకీర్తనాచార్యుడు తిరస్కరించెను. అంతట నరపాలుడు కోపించి "మూరురాయరగండ" అను సంకెల వేయించి ఆయనను చెరలో బెట్టించెను.

అప్పుడా భక్తశిరోమణి 'ఆఁకటివేళల' అను ప్రకృత కీర్తనము పాడి భగవంతుని ప్రార్థింపగా సంకెళ్ళు తమకు తామే వీడిపోయెనట ! రాజీ సంగతి విని ఇది యతడు పన్నిన మాయ కాబోలు నని మఱల సంకెళ్ళు వేయించగా అవియు ఆ రాజు చూచుచుండగనే ఊడి పడిపోయెనట ! అంతట రాజు పశ్చాత్తాపము నొంది అన్నమయ్యకు సాష్టాంగ నమస్కృతి యొనర్చి తప్పు మన్నింపుమని వేడుకొనగా ఆయన "నిన్ను శ్రీహరి రక్షించుగాక" ! అని అతనిని దీవించెనట! ఈ విషయము అన్నమయ్య మనుమడు చిన్నన్న వ్రాసిన అన్నమాచార్య చరిత్రలో కలదు.

"సంకెల లిడువేళఁ జంపెడువేళ- నంకిలి ఋణదాత లాఁగెడు వేళ
వదలక వేంకటేశ్వరుని నామంబె- విదలింప గతి గాని వేఱొండు లేదు
వనమాలి యతఁడె నావగ పెల్లనుడుపు- నను నర్థములతోడ నలవడియుండ
సంకలితాత్ముడై సరగున నొక్క-సంకీర్తనముఁ జెప్పి శరణు సొచ్చుటయు
ఘల్లున వీడి శృంఖల లూడి గుండె- ఝల్లని చూచి యచ్చటి వారు బొగడి
యా విధం బంతయు నారాజుతోడ- వేవేగఁ బఱతెంచి విన్నవించుటయు
నగి వడి సింహాసనము డిగ్గనుఱికి-పగొన్న బెబ్బులి పగిది నే తెంచి
అన్నయార్యుని జూచి యయ్యరో వర్ద-నున్న వారలకెల్ల నొగిలించి మించి

(1) శృం. సం., 12-82.

వేయ నీ సంకెళ్ళు వీడె నటంచు-మాయురె నీవెంత మాయ వన్నినను
నేనేల పోనిత్తు నిది నిక్కమైన-నేనుండి తిరుగ వేయించెద నిప్పుడు
కిదుకక నీదు సంకీర్తనంబునకు-నది వీడెనా నిజంబని యెన్నువచ్చు
నీ పాలిదైవంబు నెన్ను నీ మహిమ-బాపురే ! యని మెచ్చి పాటింపఁదగును
ననుచు నొద్దనె యుండి యానిగళంబు-తనికి చేనెత్తి యద్దఱు దేర మగుడ
నెక నక్కమునకు వేయించిన గురుఁడు-నగి తొంటి సంకీర్తనము
సేయుటయును
కాలి సంకెల చిటికన వ్రేలిఫలుము-చీలలు వీడి చెచ్చెర నూడిపడిన [1]."

పూర్వము గజేంద్రుడు గూడ మొసలిచే పట్టువడి పెక్కుదినములు పోరాడి విఫలుడై కడకు లావు సెడి ధైర్యము గోల్పడి -

**నీవే తప్ప నితః పరం బెఱుఁగ మన్నింపఁ దగుఁ దీనునిఁ**
**రావే యీశ్వర ! కావవే వరద ! సంరక్షించు భద్రాత్మకా [2]!**

అని ప్రార్థింపగా భగవంతు డతనిని రక్షించెను. ప్రహ్లాదుడు హిరణ్యకశిపునిచే పెక్కువిధముల బాధింపబడియు -

**ఓ పన్నగశాయి ! యోదనుజభంజన ! యో జగదీశ !**
**యో మహాపన్న శరణ్య ! యో నిఖిలపావన [3]**

అని హరిని స్మరించి భయ విరహితు డయ్యెను. ఇంకను ద్రౌపది మున్నగు వారనేకులు హరిస్మరణచే ఆపదలు తొలగి సుఖించిరి. అందవలననే భగవద్భూతలు భగవన్నామ స్మరణ ప్రశస్తి నిట్లు పేర్కొనిరి -

**కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట మహాజ్వరాదులం**
**బ్రేలినచోట సర్పముఖ పీడల నందినచోట నార్తులై**
**తూలినచోట విష్ణు భవదూరునిఁ బేర్కొనిరేని పీఁద న**
**క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభారముల్ [4]**

మరియు ఆర్తులు, విషణ్ణులు, భీకరవ్యాధి పీడితులు మున్నగువారు నారాయణ శబ్ద సంకీర్తన మాత్రమున దుఃఖము బాసి సుఖింతురని విష్ణు సహస్రనామ స్తోత్రము చెప్పుచున్నది -

---

(1) అ. చ., PP 38-39.(2) భాగ., 8-90.(3) భాగ., 7-193.(4) భాగ., 6-123.

ఆర్తా విషణ్ణా శ్శిథిలాశ్చ భీతా ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః ।
సంకీర్త్య నారాయణ శబ్ద మాత్రం విముక్తదుఃఖా స్సుఖినో భవన్తి [1] ॥

## 10

అవతారిక :- అధ్యాత్మ శృంగార భావములను మేళవించుచు జగత్ప్రభువును వర్ణించుచున్నాడు -

### శ్రీరాగం

ఏత దఖిలంబునకు - నీశ్వరుండై సకల
భూతములలోనఁ దాఁ - బొదలు వాఁడితఁడు ॥ పల్లవి ॥

1. గోపాంగనల మెఱుఁగు - గుబ్బచన్నులమీఁద
చూపట్టు కమ్మ క - స్తురి పూఁత యితఁడు,
తాపసోత్తముల చిం - తా సౌధముల లోన
దీపించు సుజ్ఞాన - దీప మితఁడు ॥ ఏత ॥

2. జలధి కన్యాపాంగ - లలితేక్షణములలో
కలసి వెలుగుచు నున్న - కజ్జలం బితఁడు,
జలజాసనుని వదన - జలధి మధ్యమునందు
అలర వెలువడిన పర - మామృతం బితఁడు. ॥ ఏత ॥

3. పరి వోని సురతసం - పదల నింపులచేత
వర వధూ తతికి పర - వశమైన దితఁడు,
తిరువెంకటాచలా - ధిపుఁడు దానై యుండి
పరిపాలనము సేయు - భారకుండితఁడు. ॥ ఏత ॥

ప ॥ :- ఏత దఖిలంబునకు = ఈ సమస్తమునకు.

1. చింతాసౌధములలోన = ధ్యానమను భవనములయందు.
2. జలధికన్యాపాంగలలితేక్షణములలో = సముద్రుని పుత్రికయైన లక్ష్మీదేవియొక్క కడగంటి విలాసపు చూపులలో; కజ్జలంబు = కాటుక; జలజాసనుని వదనజలధి మధ్యమునందు= బ్రహ్మముఖము లనెడు సముద్రముయొక్క మధ్యలో.
3. పరివోని = కొఱత వడని; భారకుండు = బరువు మోయువాడు.

---

(1) వి.స.స్తో., 32.

భావము :- ఈ సమస్త విశ్వమునకు ప్రభువై సర్వప్రాణికోట్ల అంతరంగములలో వర్తిల్లు వాడీ పరమాత్ముడు.

ఇతడు మెఱుగు లీను గోపికల గుండ్రని చన్నులపై కనిపించు పరిమళము గల కస్తూరి పూత. ఇతడు మునిశ్రేష్ఠుల ధ్యానములను మేడలలో ప్రకాశించు సుజ్ఞానమనెడు దీపము.

ఇతడు సముద్రుని బిడ్డయైన లక్ష్మీదేవియొక్క కడగంటి విలాసపు చూపులలో కలిసి వెలుగుచున్న కాటుక. ఇతడు చతుర్ముఖుని ముఖములనెడు సముద్ర మధ్యమునుండి పైకి దేలిన పరమామృతము. అనగా బ్రహ్మవదనములనుండి పుట్టిన వేదములలో సారము పరమాత్మ డనుట.

ఇతడు కొఱతలేని సురతసంపదల సమృద్ధులతో కాంతారత్నములైన గోపికల కధీనమైనవాడు. మరియు నితడు తాను శ్రీవేంకటాచల ప్రభుడై యుండి సమస్త లోక పరిపాలన భారము వహించినవాడు.

**విశేషాంశములు :-** భగవంతుని అన్నమయ్య అధ్యాత్మ యోగసాధ్యునిగానే కాక పరమ శృంగారమూర్తిగా గూడ భావించి భావించి వేలకొలది సంకీర్తలను రచించినాడు. ప్రకృత సంకీర్తనములో పై రెండు భావములను మేళవించినాడు. పాటలోని మూడు చరణములలోను పూర్వార్ధములు శృంగారపరముగను, తక్కిన భాగము లధ్యాత్మపరముగను సాగినవి. కామముతో గోపికలు, ధ్యానముతో పరమర్షులు ఆ పరమాత్ముని జేరినారను తత్త్వమును ఈ పాట ప్రకట మొనర్చుచున్నది.

సమస్త ప్రపంచమునకు కర్తయై భరించువాడు పాలించువాడు ఆ పరమాత్ముడే యనుటకు 'భువనస్య గోప్తా విశ్వాధిపః' [1] ఇత్యాది శ్రుతివచనములు ప్రమాణములు.

సర్వేశ్వరుడైన శ్రీహరికి దప్ప జగత్పాలన సామర్థ్యము మరి యెవ్వనికిని లేదని విష్ణుపురాణము చెప్పుచున్నది -

**న హి పాలన సామర్థ్య మృతే సర్వేశ్వరం హరిమ్ ।**
**స్థితం స్థితౌ మహాప్రాజ్ఞ ! భవత్యన్యస్య కస్యచిత్ ॥[2]**

---

(1) శ్వేతాశ్వ., 4-15. (2) వి.పు., 1-22-21.

ఏకోదేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా ।[1]

ఇత్యాది శ్రుతులు,

'ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।[2]

ఇత్యాది స్మృతులు భగవంతుడు సమస్త ప్రాణులలో పొదలుచున్నాడని ఘోషించుచున్నవి.

కృష్ణుడు నల్లనివాడు గాన గోపికలు ఎదల నంటిన కస్తూరిపూతగా, లక్ష్మి కడగంటి చూపులలోని కాటుకగా వర్ణింపబడినాడు. ఇందుచే గోపికలకు కృష్ణుడొసంగు సతతాలింగన సౌఖ్యము, లక్ష్మి కతనిపై గల యభిలాషాతిశయము వ్యక్తమగుచున్నవి. ఆ దేవుడే అధ్యాత్మ దృష్టితో పరమర్షుల ధ్యానమును సౌధములోని దీపముగా, బ్రహ్మనోట వెలువడిన పరమామృతముగా రూపింపబడినాడు. దీపము వలె తేజోమూర్తి యనియు, అమృతమువలె మృత్యురహిత స్థితి నొసంగు వాడనియు దీనిచే గ్రహింపవలెను.

ఋషులు ధ్యానయోగముచే పరమాత్మను దర్శింతురు. ఈ విషయమునే కృష్ణుడు -

'ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మాన మాత్మనా[3]'

అని చెప్పెను. మరియు వేదములలోని సారము పరమాత్ముడనుటకు 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః[4]' అను భగవద్వచనమే ప్రమాణము.

## 11

**అవతారిక** :- సంపదలపై మోహము నొందక చలము, కోపము, పరనింద మున్నగు దుర్గుణములు వీడి భగవత్సేవలో జీవనము గడపవలెనని ప్రబోధించు చున్నాడు -

### ధన్యాసి

ఎంత విభవము గలిగె - నంతయును నాపదని
చింతించినది గదా - చెడని జీవనము. ॥ పల్లవి ॥

1. చలముఁ గోపంబుఁ దనుఁ - జంపేటి పగతులని
తెలిసినది యదిగదా - తెలివి,

(1) శ్వేతాశ్వ., 6-11. (2) గీత., 18-61.
(3) గీత., 13-25. (4) గీత., 15-15

తలకొన్న పరనింద - తనపాలి మృత్యువని
తొలఁగినది యదిగదా - తుదగన్న ఫలము. ॥ఎంత॥

2. మెఱయు విషయములె తన - మెడనున్న యురులుగా
ఎఱిఁగినది యదిగదా - యెఱుక,
పఱివోని యాస దనుఁ - బట్టుకొను భూతమని
వెఱచినది యదిగదా - విజ్ఞానమహిమ. ॥ఎంత॥

3. ఎనలేని తిరువేంక - టేశుఁడే దైవమని
విన గలిగినదిగదా - వినికి,
అనయంబు నతని సే - వానందపరులయి
మనఁ గలిగినది గదా - మనుజులకు మనికి. ॥ఎంత॥

ప॥:- విభవము = సంపద.

1. చలము = మాత్సర్యము; పగతులు = శత్రువులు; తలకొన్న = కలిగిన; తుదగన్న ఫలము = పరమావధి నొందిన ఫలము. 'బలము' అను పాఠమునకు సర్వోత్కృష్టమైన బలము అని యర్థము.

2. విషయములు = శబ్దస్పర్శరూపాదులు; పఱివోని = చీలిపోని, తగ్గని.

3. ఎనలేని = సాటిలేని; అనయంబు = అత్యంతము, సతతము.

(కవిత్రయము వారి ప్రయోగములలో ఈ పదమునకు 'అత్యంతము' అను నర్థము తప్ప మరొక యర్థము లేదనియు, 'సతతము' అను అర్థము ఆధునిక గ్రంథములలోనే కనబడుచున్నదనియు శబ్ద రత్నాకరకారుడు).

**భావము :**- ఎంత ఐశ్వర్యము గలిగినను అది యంతయు ఆపదయేగాని సంపద గాదని భావించి గర్వగ్రస్తుడు గాని వాని బ్రతుకే చెడని బ్రదుకు.

మచ్చరము, కోపము అను తన దుర్గుణములే తన్ను జంపు శత్రువులని తెలిసి వాటిని దరికి రానీయకుండుటే నిజమైన తెలివి. పరదూషణము తనపాలి మృత్యువని తలచి దానిని వర్జించుటే శ్రేష్ఠాతిశ్రేష్ఠమైన ఫలము.

శబ్ద స్పర్శ రూపాదులైన విషయములే తన మెడకు దగులుకొన్న ఉరులుగా గ్రహించి వాటికి దూరమగుటే నిజమైన విజ్ఞత. బలవత్తరమైన ఆశయే తన్ను బట్టుకొన్న దయ్యమని యెంచి దానికి వెఱచి తొలగుటయే విశిష్టమైన తెలివి.

సాటి లేని శ్రీవేంకటేశ్వరుడే దైవమని పెద్దలవలన విన్నదియే నిజమైన వినికి. ఎల్లప్పుడు ఆ దేవుని సేవించుచు ఆనందముతో బ్రదుకువారిదే నిజమైన బ్రదుకు.

**విశేషాంశములు :-** సంపద లున్నవని గర్వపడరాదు. మాత్సర్యము, కోపము, పరనింద మున్నగు దుర్గుణములు విడనాడవలెను. విషయములకు, ఆశకు లోబడరాదు. సర్వదా శ్రీవేంకటేశ్వరుడే దైవమని నమ్మి ఆ పరమాత్ముని సేవించుచు జీవితము గడపవలెనని భావము.

తత్త్వజ్ఞుల దృష్టికి సంపదలు ఆపదలుగానే గోచరించును. సంపదల నార్జించుట యందును, రక్షించుటయందును, వాటి ఆయ వ్యయములయందును, దుఃఖమే లోకములో అనుభవమున నున్నది. కాన అవి విపత్తులుగానే భావింపబడవలసి యున్నవి. అందువలననే పెద్ద లిట్లనిరి -

అర్థానా మార్జనే దుఃఖ మార్జితానాం చ రక్షణే ।
ఆయే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాః కష్టసంశ్రయాః[1] ॥

మఱియు పూర్వ పుణ్యములకు ఫలములైన సంపదలు ఆ పుణ్యములను నశింపజేయుచున్నవి గాన ఆపదలే యగుచున్నవి -

"పూర్వపుణ్య విభవవ్యయ లబ్ధాః సంపదో విపద ఏవ విమృష్టాః[2]।"

అని శ్రీహర్షుని వచనము.

మాత్సర్య కోపాదులు తుదకు తనకే హాని చేయును గాన తన పాలిటి శత్రువు లగుచున్నవి. 'తన కోపమె తన శత్రువు[3]' అని సుమతి శతకము. అందువలననే కామక్రోధాదులు అరిషడ్వర్గములుగా పేర్కొనబడినవి.

పరుల యశస్సు నోర్వజాలనివారే పరనింద కొడిగట్టుదురు. వారి కీర్తికి హేతువులైన సద్గుణముల నలవరచుకొను శక్తి వీరికి లేదు. కాన పరనిందకులు తమ నైచ్యమును తామే ప్రకటించుకొనుచున్నారని ఈ క్రింది శ్లోకముచే తెలియుచున్నది-

దహ్యమానా స్సుతీవ్రేణ నీచాః పరయశోఽగ్నినా ।
అశక్తా స్తత్పదం గన్తుం తతో నిందాం ప్రకుర్వతే[4] ॥

విషయ త్యాగము మిక్కిలి కష్టసాధ్యము. ముముక్షువైనవానికి

(1) సు.ర.భా., P. 64. (2) నైషధ., 5-17. (3) సు.శ., 50. (4) సుభా., 347.

విషయసుఖములు మిక్కిలి అపాయకరములు. అందుచే ప్రయత్నపూర్వకముగానైనను విషయములను విషమువలె పరిత్యజింపనగును.

'ముక్తి మిచ్ఛసి చేత్తాత ! విషయాన్ విషవత్త్యజ [1]'

అని అష్టావక్ర మునీంద్రుడు జనకున కుపదేశించెను. మనస్సు యొక్క నిర్విషయ స్థితియే మోక్షము. కాన సదా మనస్సును విషయరహిత మొనర్చవలె నని అమృతబిందూపనిషత్తు బోధించుచున్నది -

యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తిరిష్యతే ।
తస్మా న్నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా [2]॥

ఆశకు వశులైన మానవులు అనర్థపరంపరల ననుభవించుచున్నారు -

ఆశైవ రాక్షసీ పుంసా మాశైవ విషమంజరీ ।
ఆశైవ జీర్ణమదిరా ధిగాశా సర్వదోషభూః [3]॥

అని సర్వదోషములకు ఉత్పత్తిస్థానమైన ఆశ రాక్షసిగా, విషయమంజరిగా, పులిసినకల్లుగా వర్ణింపబడినది.

ఆశను వీడుటచే గల్గు సుఖములో పదునారవ కళకు గూడ కామసుఖము స్వర్గసుఖము సరిపోలవని వ్యాసమునీంద్రుడు నుడివెను -

య చ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ ।
తృష్ణాక్షయ సుఖస్యైతే కలాం నార్హన్తి షోడశీమ్ ॥ [4]

## 12

అవతారిక :- భగవంతుని పాదమును స్తుతించుచున్నాడు -

### ముఖారి

బ్రహ్మ గడిగిన - పాదము
బ్రహ్మము దానె నీ - పాదము. ॥ పల్లవి ॥

1. చెలఁగి వసుధ గొలి - చిన నీ పాదము
   బలితల మోపిన - పాదము,

(1) అష్టా., 1-2. (2) అమృత., 3. (3) సు.ర.భా., P. 76 (4) భార., 12-6503.

తలఁకక గగనము - దన్నిన పాదము
బలరిపుఁ గాచిన - పాదము. ॥ బ్రహ్మ ॥

2. కామిని పాపము - గడిగిన పాదము
పాము తలనిడిన - పాదము,
ప్రేమపు శ్రీసతి - పిసికెడి పాదము
పామిడి తురగపుఁ - బాదము. ॥ బ్రహ్మ ॥

3. పరమ యోగులకుఁ - బరిపరి విధముల
పర మొసఁగెడి నీ - పాదము,
తిరువేంకటగిరి - తిరమని చూపిన
పరమ పదము నీ - పాదము ॥ బ్రహ్మ ॥

1. వసుధ = భూమి; తలఁకక = జంకులేక; బలరిపుఁ = ఇంద్రుని

2. కామిని పాపము = కాముకురాలైన అహల్యయొక్క పాపము; పామిడి తురగపుఁ బాదము= అడ్డమాక లేక ఉద్దండముగా సంచరించు గుఱ్ఱముగల పాదము. (పామిడి = ప్రామిడి. 'పామిడి కోరికలకు బంట్లైనవారలు' (7-27) అను మరొక ప్రయోగమునగూడ 'పామిడి' శబ్దమునకు 'ఉద్దండమైన' అను అర్థము సరిపోవుచున్నది.)

3. పరము = మోక్షము; తిరము = స్థిరము; పరమపదము = ఉత్కృష్టస్థానము.

**భావము :-** శ్రీవేంకటేశ్వరా ! నీ పాదము బ్రహ్మచే కడుగబడినది. మరియు తానే బ్రహ్మమైనది. వేంకటేశ్వరుడే పరబ్రహ్మముగాన తదేకదేశమైన పాదముగూడ బ్రహ్మమే అని భావము.

నీ పాదము భూమిని గొలిచినది. బలిచక్రవర్తి తలపై మోపబడినది. జంకు గొంకు లేక ఆకసమును తన్నినది. ఇంద్రుని రక్షించినది.

మరియు నీ పాదము కాముకురాలైన అహల్యాపాపమును క్షాళనమొనర్చినది. కాళియుని పడగలపై నుంచబడినది. ప్రేమమయమూర్తియగు శ్రీలక్ష్మీదేవిచే ఒత్తబడుచున్నది. అడ్డమాక లేక స్వచ్ఛందముగా ఉద్ధతమై సంచరించు తురగము వధిష్ఠించినది.

మరియు శ్రేష్ఠులైన యోగులకు నానావిధముల నీ పాదము ముక్తి నిచ్చుచున్నది. శ్రీవేంకటాద్రియే శాశ్వతమైనదని భక్తులకు చూపుచున్నది. కాన నీ పాదమే మాకు పరమ పదము (కైవల్యము) అని భావము.

విశేషాంశములు :- ఈ పాటలో వామన - శ్రీరామ - శ్రీకృష్ణ - కల్క్యవతారముల లోని సంఘటనలు పేర్కొనబడినవి. వామనావతారములో బలిని మూడడుగుల నోలడిగిన విష్ణుడు ఒక పాదముతో భూమిని, మరొక పాదముతో ఆకసమును ఆక్రమించి మూడవపాదమును బలితలపై మోపి అతనిని పాతాళమున కణగద్రొక్కి ఇంద్రుని రక్షించిన కథ భాగవతమున గనదగును.

భగవంతుడు పాదముతో ఆకసము నాక్రమించినప్పుడు బ్రహ్మ ఆ పాదమునం తన కమండలములోని జలముతో గడిగెననియు, అట్లు కడుగగా స్రవించిన జలమే ఆకాశ గంగగా ప్రవహించినదనియు భాగవతమున జెప్పబడినది.

అథాఙ్ఘ్రయే ప్రోన్నమితాయ విష్ణో రుపాహరత్ పద్మభవోఽర్హణోదకమ్ ।
సమర్చ్య భక్త్యాఽభ్యగృణాచ్ఛుచిశ్రవా యన్నాభి పంకేరుహ సంభవః స్వయమ్॥
ధాతుః కమండలు జలం తదురుక్రమస్య పాదావనే జనపవిత్రతయా నరేంద్ర ! ।
స్వర్ధున్యభూ న్నభసి సా పతతీ నిమార్ష్టి లోకత్రయం భగవతో విశదేవకీర్తిః ॥[1]

రామావతారములో భగవంతుని పాదధూళిసోకి అహల్య శాపవిముక్తి నొందెనను కథ, కృష్ణావతారములో కాళియుని పడగలపై ఆయన ఎక్కి త్రొక్కినను వృత్తాంతము, కలియుగాంతమున తురగమునెక్కి దుర్జనుల సంహరించుటకై నలు వైపుల పరమాత్ముడు సంచరించునను పురాణవచనములును ఇచ్చట అనుసంధింపదగి యున్నవి.

పరమాత్ముని పాదమును మరొక సంకీర్తనమున అన్నమయ్య ఇట్లు వినుతించినాడు -

ఈ పాదమేకదా యిల యెల్లఁ గొలిచినది
యీ పాదమే కదా యిందిరా హస్తముల కితవైనది. ॥ పల్లవి ॥

ఈ పాదమే కదా యిందరును మ్రొక్కెడిది
యీ పాదమే కదా యీ గగన గంగ పుట్టినది
యీ పాదమే కదా యెలమిఁ బెంపొందినది
యీ పాదమే కదా యిన్నిటికి నెక్కుడైనది. ॥ ఈ పా ॥

(1) భాగ., 8-21-3,4

ఈ పాదమే కదా యిభరాజు దలఁచినది
యీ పాదమే కదా యింద్రాదులెల్ల వెదకినది
ఈ పాదమే కదా యీ బ్రహ్మ గడిగినది
ఈ పాదమే గదా యెగసి బ్రహ్మాండ మంటినది. ॥ఈ పా ॥

ఈ పాదమే కదా యిహపరము లొసొగెడిది
యీ పాదమే కదా యిల నహల్యకుఁ గోరికైనది
యీ పాదమే కదా యీక్షింప దుర్లభము
ఈ పాదమే కదా యీ వేంకటాద్రిపై నిరవైనది. ॥ఈ పా ॥[1]

## 13

అవతారిక :- వ్యర్థమగుచున్న కాలమును భగవచ్చింతనతో సార్థకము జేసికొనవలెనని ప్రబోధించుచున్నాడు -

### కన్నడగౌళ

పోయఁ గాలం బడవికి - గాయువెన్నెల కరణిని,
శ్రీయుతుఁ దలఁచుఁడీ నరులు - మాయఁబడి చెడక. ॥పల్లవి ॥

1. చిత్తము చేకూరుచుకొని - చిత్తైకాగ్రతను,
చిత్తజగురునిఁ దలఁచుఁడీ - చిత్తజుఁజొరనీక. ॥పోయ ॥

2. బూరుగు మాఁకునఁ జెందిన - కీరము చందమున,
ఆరయ నిష్ఫలమగు మరి - యన్యులఁ జేరినను. ॥పోయ ॥

3. కూరిమి మా తిరువేంకటగిరి - గురు శ్రీపాదములు,
చేరిన వారికి భవములు - చెందవెపుడు నటుగాన. ॥పోయ ॥

1. చిత్తైకాగ్రతను = మనసు నొక్కటిగ నిలుపుటతో, చిత్తజగురుని = మన్మథుని తండ్రియగు మాధవుని.
2. కీరము = చిలుక.

---

(1) అ.సం., 5-66.

3. భవములు = జన్మములు, సంసారములు.

భావము :- నరులారా ! అడవి గాసిన వెన్నెలవలె అమూల్యమైన కాలము వ్యర్థముగా పోవుచున్నది. కాన మాయకు వశులై చెడిపోక లక్ష్మీనాథుని స్మరింపుడు.

చంచలమైన చిత్తమును నిగ్రహించుకొనుడు. నిశ్చలభావమును పొందుడు. మనసులోనికి మన్మథుని (కామప్రవృత్తిని) ప్రవేశింపనీయక మాధవునే భావింపుడు.

మాధవుని కాక అన్యుల నాశ్రయించినచో బూరుగు చెట్టు నాశ్రయించిన చిలుకవలె మీ జన్మము విఫలమగును.

తిరువేంకటగిరినాథుని శ్రీచరణము లాశ్రయించిన వారి నెప్పటికిని భవబంధము లంటజాలవు.

విశేషాంశములు :- చిత్తము కోతివలె చంచలమైనది. దానిని నిగ్రహించుట మిక్కిలి కష్టము. ఐనను అభ్యాసవైరాగ్యములతో దానిని నిగ్రహింపవచ్చును.

'అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః'[1]

అని పతంజలి యోగసూత్రము. చంచలమైన చిత్తము నెట్లు నిగ్రహింపవలెనో చెప్పుమని అర్జును డడుగగా 'అభ్యాసేన చ కౌన్తేయ ! వైరాగ్యేణచ గృహ్యతే'[2] అని గీతలో శ్రీకృష్ణుడు నుడివెను.

బూరుగుచెట్టు పూలు చూచుటకు రమ్యముగా నుండును. అవి చూచి ఒక చిలుక ''ఈ చెట్టు పూలే ఇంత అందముగా నున్నవే ! ఇంక దీని పండ్లెంత మధురముగా ఉండునో !'' అని ఆశించి ఆ పూలు పిందెలై ముదిరి పండ్లగునంతవరకు కాచుకొని యుండెను. కాని కడకు దాని ఆశ వమ్మైనది. అది చూచుచుండగనే ఆ బూరుగు పండ్లు పగిలి అందలి దూది గాలికి కొట్టుకొనిపోయినది. ఈ విషయమునే భల్లటు డిట్లు వర్ణించెను -

> విశాలం శాల్మల్యా నయనసుభగం వీక్ష్య కుసుమం
> శుక స్యాసీద్బుద్ధిః ఫలమపి భవేదస్య సదృశమ్ ।
> ఇతి ధ్యాత్వోపాస్తం ఫలమపి చ దైవాత్పరిణతం
> విపాకే తూలోఽన్త స్సపది మరుతా సోఽప్యపహృతః [3]

## 14

అవః- ఎంత చదివినను మనోనిగ్రహములేని అవివేకిని ఆశ వదలదనుచున్నాడు -

(1) యో.సూ., 1-12. (2) గీత. 6-35. (3) భల్లట., 107.

## నాట

తనకేడ చదువులు - తనకేడ శాస్త్రాలు
మనసు చంచల బుద్ధి మానీనా ? ॥ పల్లవి ॥

1. జడ్డు మానవుఁడు - చదువఁ జదువ నాస
వడ్డి వారుఁ గాక - వద లీనా ?
గుడ్డి కుక్క సంత - కుఁబోయి తిరిగిన
దుడ్డు పెట్టేకాక - దొరకీనా ? ॥ తన ॥

2. దేవదూషకుఁడై - తిరిగేటి వానికి
దేవతాంతరము - తెలిసీనా ?
శ్రీవేంకటేశ్వరు - సేవా పరుఁడు గాక
పావనమతియై - పరగీనా ? ॥ తన ॥

1. జడ్డు మానవుఁడు = జడమతియైన మనుజుడు; వడ్డివారుఁ = వృద్ధినొందును.
2. దేవతాంతరము = దేవతలలోని భేదము (తారతమ్యము).

**భావము :–** మనోనిగ్రహము లేనివానికి చదువు లెందుకు ? శాస్త్రము లెందుకు ? ఎంత చదివినను వాని మనస్సు చాంచల్యమును విడువదు గదా !

జడుడైన మనుజుడు చదువగా చదువగా ఆశ పెంపొందునే గాని వదలి పోవునా ? గ్రుడ్డికుక్క ఏదైన దొరికినచో తినవలెనని సంతకు వెళ్ళి తిరిగినను దానికి ధుడ్డు దెబ్బలే కాని తిండి దొరకదు గదా !

ఈ దేవత ఆ దేవత అను భేదములేకుండ దేవతలనెల్ల దూషించుటే స్వభావముగా గలవాడు వివిధ దేవతలలోని తారతమ్యము గుర్తింపలేడు. దేవతలలో నెల్ల మేటియైన శ్రీవేంకటేశ్వరుని సేవయందాసక్తుడు కానివాడు పవిత్రబుద్ధి కాజాలడు.

**విశేషాంశములు :–** శాస్త్రాదివిద్యల ముఖ్యప్రయోజనము మనోనిగ్రహము గలిగి ఆశాపాశము నుండి విడివడుటే. బంధమోక్షములకు హేతువు మనస్సే అని శ్రుతి చెప్పుచున్నది -

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః[1]"

కాన మనస్సును నిగ్రహింపగల వివేకికి మాత్రమే చదువు ప్రయోజనకరమగును గాని జడబుద్ధికి విద్యచే ప్రయోజనము సున్న. సంతలో ఎన్నో పదార్థములున్నవి. గ్రుడ్డికుక్కకవి లభ్యము గాకపోవుటేగాక పైపెచ్చు దుడ్డుదెబ్బలు తప్పవు. అట్లే శాస్త్రములలో ఆత్మోన్నతికరములైన విషయము లెన్నో కలవు. వివేకహీనుడు వాటిని గ్రహింపలేక పోవుటే కాక దినదినము పెరుగుచున్న ఆశకు వశమై సంసారబాధలకు లోనగుచుండును. కాన మనోనిగ్రహము లేనివారికి, దురాశాపరులకు చదువులచే ఇసుమంతయు ప్రయోజనము లేదని తాత్పర్యము.

"ఆశాపాశము తా గడున్ నిడుపు లేదంతంబు"[2]

అని చెప్పినట్లు ఆశ మేర లేనిది. ఆశకు దాసులైనవారు లోకమునకంతటికి దాసులగుదురనియు, ఆశనే దాసిగా గొన్నవారికి లోకము దాస్యము చేయుననియు మహనీయులు వచించిరి -

ఆశాయా దాసా యే తే దాసాస్సర్వలోకస్య ।
ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః ॥[3]

## 15

అవతారిక :- సంసారముయొక్క నిస్సారతను నిరూపించుచు భగవద్భక్తులకు సంసారక్లేశము లేదనుచున్నాడు-

### భైరవి

సడిఁబెట్టె గటకటా - సంసారము - చూడ
జడధిలోపలి యీఁత - సంసారము. ॥ పల్లవి ॥

1. జమునోరిలో బ్రదుకు - సంసారము - చూడ
చమురు దీసిన దివ్వె - సంసారము,
సమయించుఁ బెనుదెవులు - సంసారము - చూడ
సమరంబులో నునికి - సంసారము. ॥ సడి ॥

(1) అమృత., 2. (2) భాగ., 8-575. (3) కవితా., 27

2. సంది గట్టిన తాడు - సంసారము - చూడ
సంది కంతల త్రోవ - సంసారము,
చందురుని జీవనము - సంసారము - చూడ
చందమేవలె నుండు - సంసారము. ॥ సడి ॥

3. చలువలోపలి వేఁడి - సంసారము - చూడ
జలపూఁతబంగారు - సంసారము,
ఇలలోనఁ దిరువేంక - టేశ నీదాసులకు
చలువలకుఁ గడుఁజలువ - సంసారము ॥ సడి ॥

ప ॥ :- సడి = కష్టము; జడధి = సముద్రము.

1. సమయించు = చంపు; పెనుదెవులు = పెద్దరోగము; సమరంబు = యుద్ధము.

2. సంది గట్టిన = రెక్కలక్రింద గట్టిన; సందికంతలత్రోవ = ఇరుకైన అడ్డత్రోవలతో, గొందులతో నిండిన దారి; చందమేవలెన్ = మంచిదే అన్నట్లుగా.

3. జలపూఁత బంగారు = గిల్టు బంగారు.

భావము :- అయ్యయ్యో ! సంసారము కష్టము దెచ్చి పెట్టినది. ఆలోచించగా ఇది సముద్రములోని యీతవంటిది. ఈతచే సముద్రము దాటుట అసాధ్యమైనట్లే సంసారములో నుండి ముక్తినొందుట సాధ్యముగాని పని. సాగరములోని యీత ప్రమాదకరము. అట్లే సంసారములోని జీవయాత్ర సంకటకరము.

సంసారము యముని నోటిలో బ్రదుకు వంటిది. తననోట జీవించువానిని యముడు ఏ క్షణమునందైన కబళింపవచ్చును. అట్లే సంసారమున నున్నవాడు ఎప్పుడైన ప్రమాదమునకు గురికావచ్చును. సంసారము చమురుదీసిన దీపము వంటిది. ఆ దీపము చక్కగా వెలుగక ఆరిపోవుటకు సిద్ధముగానున్నట్లే సంసారి సుఖస్థితి నొందక మృత్యుముఖమున బడుటకు సిద్ధముగా నుండును. సంసారము చంపుటకు సిద్ధమైన పెద్దరోగము వంటిది క్షయాదిరోగములు దినదినమునకు రోగిని క్షీణింపజేసి చివరకు ప్రాణము దీయును. సంసారము గూడ జీవుని శమదమాది గుణములను హరించి స్వాతంత్ర్యహీనుని జేసి చివరకు మృత్యుముఖమున బడద్రోయును. సంసారము యుద్ధభూమిలో నునికి వంటిది. రణరంగమున మున్నవాడు నలువైపులా శత్రువులచే ముట్టడింపబడి దెబ్బలు తినును. అట్లే సంసారియు కామక్రోధాద్యరిషడ్వర్గముచే ఆక్రమింపబడి క్షతినొందును.

మరియు సంసారము రెక్కలక్రింద గట్టిన త్రాటివంటిది. వక్షఃస్థలమున త్రాటిచే బంధింపబడినవాడు కట్టినవాని కధీనుడై ముందుకు పోజాలడు. అట్లే సంసారగతుడు ముక్తిమార్గమున స్వేచ్ఛగా పయనింపలేడు. సంసారము సందికంతల త్రోవ వంటిది. ఇరుకైన గొందులతో గూడియున్నచో పయనము మిక్కిలి ప్రయాసకరము. అట్లే సంసారమార్గమున నడచుట క్లేశావహము. సంసారము చంద్రుని జీవనము వంటిది. చంద్రుని బ్రదుకు వృద్ధిక్షయములతో గూడి నిలకడ లేకుండును. అట్లే సంసారులు గూడ నానావిధములైన ఆయవ్యయ - సుఖదుఃఖాది - వృద్ధిక్షయములకు లోనై కుదురుపాటు లేక కష్టపడుచుందురు, కాని పైకి చూచుటకు మాత్రము సంసారము మిక్కిలి చక్కగా నున్నట్లుండును.

సంసారము పచ్చకర్పూరమువలె చలువలోపల వేడితో గూడినది. పైకది చల్లగా సుఖాస్పదముగా కన్పించినను నిజముగా దుఃఖాకరమైనదని భావము. మరియు నది పైపూత బంగారువంటిది. పైకి మెరుగుగా గన్పించినను లోపల విలువలేనిదని గ్రహింపదగినది.

ఇట్లైనను శ్రీవేంకటేశ్వరుని దాసులకు మాత్రము సంసారము చలువలకు చలువయై సుఖాస్పద మగుచున్నది. అనగా భగవంతుని భజించి తదనుగ్రహమునకు పాత్రులైనవారు సంసారములో నున్నను క్లేశము నొందరని తాత్పర్యము.

**విశేషాంశములు :-** సంసారముయొక్క క్లేశ కరమగు స్వరూప మిచట నిరూపింపబడినది. సంసారము దుఃఖమునకు పరమావధియనియు, దానిలో తగుల్కొన్న జీవులకు సుఖము లేదనియు ఆధ్యాత్మిక గ్రంథము లన్నియు ఏకగ్రీవముగ ప్రతిపాదించుచున్నవి.

**సంసార ఏవ దుఃఖానాం సీమాన్త ఇతి కథ్యతే ।**
**తన్మధ్యపతితే దేహే సుఖ మాసాద్యతే కథమ్ ॥**[1]

అని యోగవాసిష్ఠము.

సన్న్యాసులు మాత్రము క్లేశముల నొందరా ? మృత్యువుపాలు గారా ? అని యడుగవచ్చును. కాని వారు భగవదర్పిత చిత్తులు, దేహాభిమానరహితులు, ఆత్మజ్ఞాన సంపన్నులు అగుచున్నారు గాన మృత్యురహితులే. సంసారులై యుండియు

(1) వ.గీ., P. 707.

భగవంతుని భజించి పరతత్త్వజ్ఞానసంపన్నులైనచో సంసారక్లేశ మేమియు చేయజాలదు. జనకాదులు సంసారులే. అయినను నిష్కామకర్మయోగాదులను శీలించి వారు తామరాకుపై నీటివలె సుఖదుఃఖముల నంటకుండిరి. కావ భగవద్దాస్యమను పడవనెక్కి సంసారసాగరమును తరింపవచ్చును. భగవద్భక్తియను కవచము దాల్చి సంసార సమరములో నుండవచ్చును.

చక్కగా నడుపబడిన ఓడ సముద్రపారమును జేర్చును. అట్లే వివేక వైరాగ్యాదులతో గూడి సన్మార్గమున ప్రవేశపెట్టబడిన బుద్ధి జీవుని సంసారము దరిజేర్చును. కామక్రోధాదికుమార్గమున ప్రవేశపెట్టబడినచో ఆపదపాలు కాక తప్పదని వసిష్ఠుడు వచించెను -

ధీస్సమ్యగ్యోజితా పారం అసమ్యగ్యోజితాఽఽపదమ్ ।
నరం నయతి సంసారే భ్రమన్తీ నౌరివార్ణవే ॥[1]

## 16

**అవతారిక :-** కర్మఫలము భగవంతునికి గూడ అనుభవింపక తీరదని ఆయనతోనే పరియాచక మాడుచున్నాడు -

### ధన్యాసి

సామాన్యమా పూర్వ - సంగ్రహంబగు ఫలము
నేమమునఁ బెనగొనియె - నేఁడు నీవనక. ॥ పల్లవి ॥

1. జగతిఁ బ్రాణులకెల్ల - సంసార బంధంబు
తగుల బంధించు దురి - తంపుఁ గర్మమున,
మగుడ మారుకు మారు - మగువ నీయురముపై
తెగి కట్టి రెవ్వరో - దేవుండ వనక. ॥ సామా ॥

2. పనిలేక జీవులను - భవసాగరంబులో
మునుఁగ లేవఁగఁజేయు - మోహదోషమున,
పనిపూని జలధిలోఁ - బండఁబెట్టిరి నిన్ను
వెనకెవ్వరో మొదలి - వేలుపనక. ॥ సామా ॥

---

వ.గీ. P. 718.

3. ఉండనీయక జీవ - నోపాయమున మమ్ము
కొండలను గొబల తతి - గొని త్రిప్పుఫలము,
కొండలను నెలకొన్న - కోనేటి పతి వనఁగ
నుండవలసెను నీకు - నోపలేననక. ॥ సామా ॥

ప ॥ :- పూర్వసంగ్రహంబు = మున్ను చేసిన కర్మచే సమకూర్చుకొన్నది; నేమమునఁ = నియమముతో.

1. మగుడ = మఱల; మగువఁ = స్త్రీని, అలమేలుమంగను; తెగి = సాహసించి.

2. గొబలఁ = గుహలందు; తతిగొని = అదను చూచి.

**భావము:**–దేవా ! తొల్లి తాను చేసిన కర్మమునకు కలుగు ఫలము సామాన్యమైనది కాదు సుమా ! దానిని తప్పించుకొనుట కెవ్వరికిని శక్యము గాదు. అది నియమము తప్పక దేవాధిదేవుడవైన నిన్నుగూడ లెక్కగొనక పట్టి పీడించుచున్నది.

నీవు లోకములోని ప్రాణులకందరికి సంసారము అను బంధమును తగుల గట్టితివి. ఆ పాపకర్మము నిన్ను వదలలేదు. దానికి ఫలముగా నీవు దేవుడవన్న భావముతోనైన నిన్ను వదలిపెట్టక ఎవ్వరో సాహసించి నీ యెదపై సంసారకారణమైన ఒక కాంతను ( అలమేలుమంగను) తగుల గట్టిరి.

నీవు మరొక ప్రయోజనవంతమైన పని యేమియు లేక భవసముద్రములో ఊరక జీవులను ముంచుట, తేల్చుటయే పనిగా పెట్టుకొన్నావు. ఆమోహదోషము నిన్ను వీడిపోలేదు. దానికి ఫలముగా పూర్వ మెవరో అందుకని పూని ఆదిదేవుడని యైన తలంపక నిన్ను సముద్రములో పండబెట్టినారు.

మరియు నీవు మమ్మొకచోట కుదురుగా ఉండనీయక జీవనోపాయమునకై కొండలలో, గుహలలో ఆదేపనిగా తిరుగులాడునట్లు చేసితివి. దాని ఫలము నిన్ను వెన్నంటినది. అందువలననే నాచేతగాదని తప్పించుకొని పారిపోవుటకు వీలులేనట్లుగా కోనేటిపతి వన్న పేరుతో కొండలలోనే ( తిరుమలలోనే) నీవు నెలకొని యుండక తప్పలేదు.

**విశేషాంశములు:-** 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్' అన్నట్లు చేసిన కర్మకు ఫలమును జీవులందరు అనుభవించి తీరవలసినదే. దేవునికి గూడ ఈ కర్మ ఫల మనుభవింపక తీరుటలేదని అన్నమయ్య పరిహాసధోరణిలో ఈ పాట పాడినాడు.

భక్తుడు తన్ను భగవంతునికి దాసునిగా సమర్పించుకొన్నట్లే భక్తి తీవ్రతచేత ఆ పరమాత్మని సామాన్యునిగా నెంచి ఎకసక్కె మాడుటయు గలదు. ఇందు మొదటిది ప్రత్యక్షదైన్యమునకు నిదర్శనము కాగా, రెండవది పరోక్షదైన్యమునకు నిదర్శనమగుచున్నది. తన పరిహాసమునకు పాత్రుడైన ఒక మిత్రునిగా భగవంతుని భావింపగలుగుటచే అన్నమయ్య పరమాత్మునితో ఎంతగా ఆత్మీయతను పెంచుకొన్నాడో దీనివలన స్పష్టమగుచున్నది.

ఈ ధోరణిలో రచింపబడిన పాట లింకను కొన్ని కానవచ్చుచున్నవి -

## సామంతం

ఎన్నఁగలుగు భూతకోటి నెల్లఁ జేసినట్టి చేఁత
నిన్నుఁ జేసుకొనుట గాక నీకుఁ దొలఁగ వచ్చునా ? ॥ పల్లవి ॥

గుట్టుచెఱిచి లోకమెల్ల ఘోర సంసార మందు
కట్టివేసినట్టి పాపకర్మ మేల తీరును ?
పట్టి తెచ్చి నిన్ను రోలఁ గట్టివేసి లోకమెఱుఁగ
రట్టు సేసుఁగాక నిన్ను రాజనన్న విడుచునా ? ॥ ఎన్న ॥

మిట్టు పల్లములకుఁ దెచ్చి మెఱసి భూతజాలములకుఁ
దొట్టి పెసలు గొలచినట్టి దోస మేల పాయును ?
అట్టుసాఁచి గోపసతుల నలమి వెంటవెంట దిరుగ
వెట్టిఁ జేయుఁగాక నీవు విభుడనన్న విడుచునా ? ॥ ఎన్న ॥

పరులయింటికేఁగి పతుల పరుల వేఁడఁ జేసినట్టి
యెఱుకమాలినట్టి చేఁత లేల నిన్ను విడుచును ?
వెరవు మిగిలి వేంకటాద్రి విభుఁడ ననుచు జనులచేత
నరులు గొనఁగఁ జేయుఁగాక ఆస నిన్ను విడుచునా ? [1] ॥ ఎన్న ॥

## సాళంగనాట

ఎట్టి వారికి నెల్ల నిట్టికర్మములు మా
యిట్టి వారికి నింక నేది త్రోవయ్య ! ॥ పల్లవి ॥

పాముఁ జంపిన యట్టి పాతకమునఁ బెద్ద
పాము మీఁద నీకు బవళించ వలసె

(1) అ. సం., 5-113.

కోమలిఁ జంపిన కొఱతవల్ల నొక్క-
కోమలి నెదఁ బెట్టుకొని యుండవలసె. ॥ ఎట్టి ॥

బండి విఱిచినట్టి పాతకమునఁ బెద్ద
బండి బోయిఁడవై పనిసేయ వలసె
కొండ వెఱికినట్టి గుణమునఁ దిరుమల
కొండమీఁద నీకు గూచుండవలసె.[1] ॥ ఎట్టి ॥

## 17

అవతారిక :- ఆశ వీడి పరతత్త్వముపై దృష్టి లగ్నము చేయువరకు ఈ సంసారపు లంపటమే సుఖముగా దోచు ననుచున్నాడు -

### ఆహిరి

ఆసమీఁద విసు - వౌ దాఁక[2] - యీ
గాసిఁ బరచు తన - కపటమే సుఖము. ॥ పల్లవి ॥

1. తిరమగు కర్మము - తెగుదాఁక, తన
గరిమ సుఖము పొడ - గను దాఁక,[3]
పరమార్గం బగ - పడుదాఁక, తన
పరితాపపు లం - పటమే సుఖము ॥ ఆస ॥

2. కాయము గడపల - గనుదాఁక, యీ
మాయ తన్నుఁ బెడ - మరుదాఁక,
రాయడి మదము క - రఁగుదాఁక యీ
రోయఁదగిన తన - రూపమే సుఖము. ॥ ఆస ॥

3. లంకెలఁ బొరలి న - లఁగుదాఁక, యీ
యంకెల భవము లెర - వౌదాఁక,
వేంకటపతిఁదడ - వినదాఁక యీ
కింకురువాణపు - గెలుపే సుఖము. ॥ ఆస ॥

---

(1) అ. సం., 5-180. (2) 'విడుపొదాఁక' అని వి.రే. 56. పాఠము.
(3) 'పొగడునందాఁక' అని సా.రే. 34. పాఠము.

ప॥:- విసువు వొదాఁక = విసుగు గలుగునంతవరకు ('విడు పొదాఁక' అను పాఠమునకు త్యాగబుద్ధి గలుగునంతవరకు అని అర్థము.)

1. తనగరిమసుఖము = తనగొప్పతనపు సుఖము; పరమార్గంబు = పరతత్త్వపు త్రోవ; పరితాపపు లంపటము = నలువైపుల తాపకరమగు తగులము.

2. కడపల = ముగింపు, పెడమరు = వీడిపోవు; రాయడి = స్పర్థ.

3. లంకెలఁ = తగులములలో; అంకెల = చెంతనున్న; భవములు = జన్మములు; సంసారములు; ఎరవౌదాఁక = తనవి కాకపోవు వరకు; కింకురు వాణపు గెలుపు = కింకరుల విజయము; (కింకుర్వాణ = కింకురువాణ).

**భావము :-** ఆశపై వేసట గలుగువరకు తన కష్టమునకు కారణమైన తన్ను తాను మోసగించుకొను ప్రవృత్తియే సుఖముగా దోచును. ఆశ ఉన్నంతవరకు ఈ భ్రాంతి వదలదు.

కర్మబంధము తెగునంతవరకును, తానీ సంసారక్లేశములకు అతీతుడనను తత్త్వము గోచరించుటచే కలుగు ఆనంద మనుభవములోనికి వచ్చునంతవరకును, పరతత్త్వప్రాప్తి కనువైన త్రోవ కంటబడువరకును, అన్ని విధముల సంతాపకరమగు ఈ సంసారపు లంపటమే సుఖముగా కన్పట్టును.

కాయంవు నేలపై వ్రాలునంతవరకును, మాయ తన్ను వదలిపోవునంతవరకును, స్పర్థతో గూడిన మదము తొలగునంతవరకును, ఏవగించుకొనవలసిన తనరూపే సుఖముగా స్ఫురించును.

లంపటములలోబడి నలగునంతవరకును, సంసారక్లేశములు (జన్మబంధములు) తనవికాక పోవునంతవరకును, వేంకటేశ్వరుని అన్వేషించునంతవరకును ఈ పరాధీనపు బ్రదుకున ఏమో సాధించితిమను భ్రాంతిచే గలుగు విజయోత్సాహమే సుఖముగా గోచరించును.

**విశేషాంశములు :-** కాబట్టి ఆశను వీడవలెను. కర్మబంధమును త్రెంచుకొనవలెను జననమరణ ప్రవాహరూపమైన సంసారమునకు తానతీతుడనని గుర్తించవలెను. పరతత్త్వపు త్రోవ ద్రొక్కవలెను. మాయకు దూరము గావలెను. మదము నుజ్జగించవలెను. లంపటములనుండి విడివడవలెను. శ్రీవేంకటేశ్వరుని శరణు జొచ్చి శాశ్వత సుఖము నొందవలెను. అశాశ్వతమైన సంసారసుఖమును సుఖమని తలంపరాదని తాత్పర్యము.

## 18

అవతారిక :- భూతదయ, నిష్కామకర్మాచరణము మున్నగు ముఖ్యధర్మములను శ్రేయము లనుచున్నాడు -

## సామంతం

సకల భూతదయ - చాలఁగఁ గలుగుట
ప్రకటించి దేహసం - భవమైన ఫలము ॥ పల్లవి ॥

1. తలకొన్న ఫలవాంఛ - దగులకుండఁగఁ జిత్త
మలవరించుట కర్మి - యైన ఫలము,
పలు కర్మములలోన - బ్రహ్మార్పణపు బుద్ధి
గలుగుట హరికృప - గలిగిన ఫలము. ॥ సకల ॥

2. ఎప్పుడుఁ దిరువేంక - టేశు సేవకుఁ డౌట
తప్పక జీవుఁడు - దానైన ఫలము,
కప్పిన సౌఖ్య దుః - ఖమ్ములు సమముగా
నొప్పుట విజ్ఞాన - మొదవిన ఫలము ॥ సకల ॥

ప ॥ :- దేహసంభవమైన = శరీరము కలుగుట వలన కలిగిన.

1. కర్మి = కర్మచేయువాడు.

**భావము :-** శరీరము దాల్చినందుకు ముఖ్యప్రయోజనము పమస్త ప్రాణుల యందు మిక్కిలి దయగలిగి ప్రవర్తించుటయే.

కర్మయోగము నాశ్రయించి పలుకర్మ లొనర్చుటకు ముఖ్యప్రయోజనము ఆ కర్మఫలములపై ఆశపడకుండ మనస్సును స్వాధీనపఱచుకొనుటయే. కర్మయోగిపై శ్రీహరికృప ప్రసరించినందులకు ఫలము ఆ కర్మఫలములను పరబ్రహ్మార్పణ మొనర్చు బుద్ధి యతనికి గలుగుటయే.

తాను జీవుడైనందుకు ఫలము ఎల్లప్పుడు తప్పకుండ శ్రీవేంకటేశ్వరునకు సేవకు డగుటయే. తనకు విజ్ఞానము గలిగినందుకు ఫలము సుఖదుఃఖముల యెడ సమభావ మలవడుటయే.

**విశేషాంశములు :–** ఎల్లప్రాణులయెడ దయగల్గియుండుట; ఫలాసక్తి వీడి కర్మ లొనర్చుట; సదా భగవంతుని సేవించుట; సుఖదుఃఖాది ద్వంద్వములపట్ల

సమభావము గల్గియుండుట జిజ్ఞాసువులైన వారికి అవశ్య మాచరింపదగ్గ ధర్మములని ఈ పాట ప్రకటించుచున్నది.

గుణములలో నెల్ల భూతదయ అగ్రగణ్యమైనది. దయతో సాటియైన పుణ్యము, హింసతో సమమైన పాపము లేదని పెద్దల సూక్తి -

'దయాసమం నాస్తిపుణ్యం పాపం హింసాసమం నహి' ।

కావుననే 'అహింసా పరమోధర్మః' అని దయాప్రయుక్తమైన అహింస పరమ ధర్మముగా పేర్కొనబడినది.

కర్మములు సహజముగా ప్రాణిని బంధించునవి. కాని ఫలాసక్తి వీడి కర్మ లొనర్చువాని నవి బంధింపవు. ఫలాసక్తివీడి నిత్య తృప్తుడైనవాడు కర్మలు చేసియు చేయనివాడే యగునని గీత బోధించుచున్నది -

త్యక్త్వా కర్మ ఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥[1]

ఫలమును బ్రహ్మార్పణము గావించి కర్మ లొనర్పవలెను. తత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట కర్మము తనకు తానుగా శమించునని కృష్ణుడు ప్రబోధించెను -

**ఫలముల యెడ బ్రహ్మార్పణ**
**కలన పరుండగుచు కార్యకర్మము నడపన్**
**వలయున్ దత్త్వజ్ఞానము**
**తలకొనినన్ కర్మశమము దానై కలుగున్.** [2]

శ్రీహరికృపకు పాత్రుడైనవానికే ఫలముల నట్లు బ్రహ్మార్పణ మొనర్చు బుద్ధి కలుగునని అన్నమయ్య ఇట స్పష్టము గావించినాడు.

కర్మఫలమును వీడి తద్ద్వారా కర్మ సన్న్యాస మొనర్చి ద్వంద్వాతీతుడగువాడే మాయను తరించునని నారదుడు పేర్కొనెను -

**'యః కర్మఫలం త్యజతి కర్మాణి సన్న్యస్యతి తతో నిర్ద్వంద్వో భవతి ।**[3]

ఇక భక్తిమార్గము ననుసరించిన జీవునికి భగవత్సేవ సదా కర్తవ్యమే.

(1) గీత., 4-20. (2) భార., భీష్మ - 1-202. (3) నా.భ.సూ., 48.

'సర్వదా సర్వభావేన నిశ్చింతితై ర్భగవానేవ భజనీయః'[1]
అని నారదభక్తి సూత్రము.

శీతోష్ణములు, సుఖదుఃఖములు మున్నగునవి ద్వంద్వము లనబడును. అజ్ఞాని వీటి యెడల రాగద్వేషములు వహించును. విజ్ఞాని దృష్టికవి సమముగనే కన్పట్టును. స్థితప్రజ్ఞుడు దుఃఖములో ఉద్వేగమును, సుఖములో స్పృహను పొందడనియు రాగభయక్రోధములు త్యజించుననియు గీత ప్రకటించుచున్నది -

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగ భయక్రోధః స్థితధీర్మని రుచ్యతే ॥[2]

# 19

అవతారిక :- భోగానుభవముచే తృప్తినొందిన పిమ్మట పరతత్త్వప్రాప్తికై ప్రయత్నింప వచ్చుననుట అవివేకమనుచున్నాడు -

## శుద్ధ వసంతం

కడలుడిపి నీరాడఁ - గాఁ దలఁచు వారలకు
కడలేని మనసునకుఁ గడమ యెక్కడిది ? ॥ పల్లవి ॥

1. దాహ మణఁగిన వెనక - తత్త్వ మెరిఁగెద నన్న
దాహమేలణఁగు తా - తత్త్వమే మెరుఁగు ?,
దేహంబు గలయన్ని - దినములకునుఁ బదార్థ
మోహమే లుడుగు దా - ముదమేల కలుగు ? ॥ కడ ॥

2. ముందరెరిగిన వెనక - మొదలు మరచెద నన్న
ముందరే మెరుఁగుఁ దా - మొదలేల మరచు ?,
అందముగఁ దిరువేంక - టాద్రీశు మన్ననల
కందు వెరిఁగిన మేలు - కలనైన లేదు. ॥ కడ ॥

ప ॥ :- కడలు = అలలు, కడమ = ఇతరము.

1. దాహము = తృష్ణ; తత్త్వము = ఆత్మతత్త్వము, బ్రహ్మస్వరూపము; పదార్థమోహము= భౌతికవస్తువుల యందలి తగులము.
2. ముందర = రానున్నది; మొదలు = కడచినది; కందువ = జాడ, స్వరూపము.

(1) నా.భ.సూ., 79. (2) గీత., 2-56.

భావము :- సముద్రములో అలలు నిలిపి పిమ్మట స్నానము చేయదలంచు వారికిని, తుదలేని కోరికలకు నెలవైన మనస్సునకును వేఱు సుగతి లేనేలేదు.

లౌకిక భోగములపై కోరికలు నశించిన పిమ్మట పరతత్త్వస్వరూపమును తెలిసికొందుమన్నచో కోరిక లెట్లు నశించును? కోరికలు నశింపక పరతత్త్వమును జీవుడెట్లెరుంగగలడు? శరీర మున్నంతకాలము (శరీరముపై అభిమాన మున్నంత కాలము) జీవులకు భౌతికవస్తువులపై ఆశ నశింపదు. ఆశ నశింపక ఆత్మానందము సిద్ధింపదు.

ఇక ముందు భగవత్స్వరూపము నెరింగి ఆ పిమ్మటనే ఇంతదనుక అనుభవములో నున్న సంసారసుఖమును విస్మరింతు నన్నచో, తాను భగవంతుని ఇక మీదట ఎట్లెరుంగగలడు? అలవాటుపడిన సంసారమూలమైన ప్రకృతిని ఆ తరువాత నెట్లు మరువగలడు? కరుణానిధియగు శ్రీవేంకటేశ్వరుని క్షమాగుణ స్వరూపమును గ్రహింపగల శ్రేయోదాయకమైన భక్తి కలలో గూడ జీవునకు లేదు. ఇక మాయామోహము నుండి విడివడి భగవత్స్వరూపము నెరుంగు యోగ్యత వాని కెక్కడిది? అని భావము.

**విశేషాంశములు:-** సంసార భోగముల నన్నిటిని అనుభవించిన తరువాత వేదాంతపు త్రోవ త్రొక్కవచ్చుననియు, మొదటనే ఐహికమునువీడి పరమార్థమునకై ప్రాకులాడుట తగదనియు, అట్లు ప్రాకులాడినను అది సిద్ధింపదనియు అనేకులు భావింతురు. 'కామి గాక మోక్షకామి గాడు' ఇత్యాది వాక్యములను వారు తమ అభిప్రాయమునకు ప్రోద్బలకముగా జూపుచుందురు. ఇట్టి యభిప్రాయమును అన్నమయ్య ఈ సంకీర్తనములో ఖండించి పరతత్త్వోపలబ్ధికై సదా ప్రయత్నశీలురై యుండవలెనని ప్రబోధించుచున్నాడు.

> సముద్రే శాన్తకల్లోలే స్నాతు మిచ్ఛతి మూఢధీః ।
> తథైవ శాన్తే సంసారే జ్ఞాన మిచ్ఛతి దుర్మతిః ॥ [1]

అనగా మూఢుడు అల లుడిగిన పిమ్మట సాగరమున స్నానమాడ గోరును. అట్లే అజ్ఞుడైన దుర్మతి సంసారము శాంతించిన పిమ్మట జ్ఞానము నార్జింప గోరునని భావము.

సముద్రపుటలలు ఎన్నటికిని నిలువవు. కాన వాటి నిలుపుదలకై

(1) సూ. ప్ర., P. 162

ప్రయత్నించు వాడెన్నటికిని స్నానము చేయలేడు. అట్లే భోగము లెల్ల అనుభవించి కోరికలు శాంతించిన పిదప భగవత్ప్రాప్తికై ప్రయత్నింతు మనుకొనుట తెలివి లేని తనమే యగును.

కామముల నెంతగా అనుభవించినను పైపైన వాటిపై కోరికలు వృద్ధి నొందునే గాని నశింపవు. కాన భోగపరు డెన్నటికిని పరతత్త్వము నొందజాలడు. ఆజ్యముచే అగ్నికి తృప్తి లేనట్లే ఉపభోగముచే కామములకు తృప్తి లేదనియు, అవి పైపైన వృద్ధి జెందుచునే యుండుననియు వ్యాసుడు నుడివెను -

న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥ [1]

మరియు భోగపరుని శరీరము త్వరలో పాటవము గోల్పోవును. శరీరములో పటుత్వమున్నప్పుడే, వార్ధక్యము పైబడనప్పుడే, ఇంద్రియములు చక్కగా పని చేయునప్పుడే, ఆయుస్సు క్షీణదశ నొందుటకు ముందే బుద్ధిమంతుడు శ్రేయస్సిద్ధికై ప్రయత్నింపవలెను. ఇల్లు తగులబడుచుండగా బావి త్రవ్వుటకు యత్నించుట వలె శక్తులన్నియు ఉడిగిపోయిన పిమ్మట తత్త్వోపలబ్ధికై ప్రయత్నించుట అవివేకమని పెద్దలనిరి.

యావత్స్వస్థమిదం శరీర మరుజం యావజ్జరా దూరతః
యావచ్చేంద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః ।
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్
సందీప్తే భవనేతు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః? ॥ [2]

ఈ విషయమునే ధూర్జటి యిట్లు వచించెను -

దంతంబుల్ పడనప్పుడే తనువునం దారూఢి యున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు గానప్పుడే
వింతల్ మేన జనింపనప్పుడె కురుల్ వెల్లెల్ల గానప్పుడే
చింతింపన్ వలె నీ పదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా ! [3]

ప్రకృత సంకీర్తనములోని భావమునే అన్నమయ్య మరొక సంకీర్తనములో ప్రకారాంతరమున నిట్లు చెప్పెను-

---

(1) భార., 1-75-50. (2) భర్తృ., 3-75. (3) కా.శ.,

### లలిత

దొరకిన యప్పుడె తుదగాక
మరుగకు మెన్నడు మరి మనసా ! ॥ పల్లవి ॥

తను భోగంబులఁ దనిసిన పిమ్మట
వెనుగొని హరిఁ దడివే నంటే,
దినమునుఁ దను నింద్రియముల చలమిది
తనియుట యెన్నఁడు దగు మనసా ! ॥ దొర ॥

తిరమగు నాసలు దీరిన పిమ్మట
తెరలి విరతిఁ బొందే నంటే,
మరలని యాశామయ మీ చిత్తము
విరతి యెన్నఁడిక వెడమనసా ! ॥ దొర ॥

ముదిసిన పిమ్మట మొగి శ్రీ వేంకట
సదయుఁ గొలుతు నిచ్చట నంటే
హృదయము శ్రీవేంకటేశుని వెలవిది
యిది గమటెన్నఁడు యీ మహి మనసా![1] ॥ దొర ॥

## 20

కతారిక :- భగవంతుని లీలవర్ణముమ పెక్కుతెరగుల నుత్ప్రేక్షించి సమర్థించు చున్నాడు-

### ముఖారి

సిరి దొలంకెడి పగలు - చీఁకటా యితఁడేమి
యిరవు దెలిసియుఁ దెలియ - నియ్యఁ డటుగాన. ॥ పల్లవి ॥

1. తలపోయ హరిలీల - దర్పణంబో యితఁడు
వెలుఁగు చున్నాఁడు బహు - విభవముల తోడ,
కలగుణం బటు వలెనె - కాఁబోలు లోకంబు
గలదెల్ల వెలిలోనఁ - కనిపించుఁ గాన. ॥ సిరి ॥

---

1) అ. సం., 11-1-26.

2. మేరమీఱిన నీల - మేఘమో యితఁడేమి
భూరి సంపదలతోఁ - బొలయుచున్నాఁడు,
కారుణ్యనిధి యట్లు - కాఁబోలు ప్రాణులకు
కోరికలు దలఁపులోఁ - గురియు నటు గాన. ॥ సిరి ॥

3. తనివోని ఆకాశ - తత్త్వమో యితఁడేమి
అనఘుఁడీ తిరువేంక - టాద్రి వల్లభుఁడు,
ఘనమూర్తి అటు వలెనె - కాఁబోలు సకలంబు
తనయందె యణఁగి యు - ద్భవమందుఁ గాన. ॥ సిరి ॥

ప ॥ :- ఇరవు = స్థానము (స్వస్వరూపము)
1. హరినీల దర్పణంబో = ఇంద్ర నీలపు టద్దమో.
2. పొలయుచున్నాఁడు = వ్యాపించుచున్నాడు, ప్రకాశించుచున్నాడు.
3. తనివోని = తృప్తిచేకూర్చని.

భావము :- సిరులు దొనకుచున్న ఇతడు పగటిపూటనే ఉండు చీకటియా యేమి? ఎందుకనగా తానున్న స్థానము, లేదా తన స్వరూపము స్పష్టముగా నున్నను చూచువారికి తెలియనీయక మఱుగుపరచుచున్నాడు. పగటి చీకటి వెలుగులో గూడ కన్నులు కానరాకుండ జేయును. అట్లే ఈ దేవుడు సర్వత్ర బాహాటవముగా వ్యాపించియుండియు చూచువారికి కనిపించకయే యున్నాడు.

ఇత డింద్ర నీలమణితో చేసిన అద్దమా ? ఆలోచించు కొలది అనేక వైభవములతో వెలిగిపోవుచున్నాడే ! ఇతనిలో నున్న గుణ మట్టిదే కాబోలు ! ప్రపంచము అద్దమునందును వెలుపలను కనిపించునట్లు, ఇతనిలోపలను వెలుపలను గోచరించుచున్నది గదా !

ఇతడు హద్దుమీరి అంతట క్రమ్ముకొన్న నీలమేఘమా యేమి ? అనేక సంపదలతో జగమంతట వ్యాపించి విలసిల్లుచున్నాడే ! దయావిధియైన ఈతడు నీల మేఘమే కాబోలు! ఎందుకనగా ప్రాణులు తలపున కోరిన కోరికలనెల్ల కురియు చున్నాడు గదా !

పాపరహితుడైన ఈ శ్రీవేంకటగిరినాథుడు ఎంతగా చూచినను తృప్తి చేకూర్చని ఆకాశతత్త్వమా యేమి ? ఈ మహామూర్తి అట్టివాడే కాబోలు ! ఏలన చరాచరాత్మకమైన ఈ విశ్వమంతయు ఆకసమునందే లయించి మరల అందే

జనించునట్లు ఈ పరబ్రహ్మమునందే లీనమై తిరిగి ఇతనియందే అయించి పుట్టుచున్నది గదా !

విశేషాంశములు :- భగవంతుడు నీలవర్ణుడుగాన ఇట చీకటిగా, ఇంద్రనీలపు టద్దముగా, నీలమేఘముగా, ఆకాశస్వరూపుడుగా కవిచే ఉత్ప్రేక్షింపబడినాడు. ఒక్కరూప సామ్యమే కాక ఈ ఉత్ప్రేక్షకు సమర్థకములైన ఇతరాంశములు గూడ ఈ కీర్తనలో నిర్దేశింపబడినవి.

పగటి చీకటిలో వస్తుస్వరూపము తెలిసియు తెలియకుండుట సహజము. అట్లే విశ్వవ్యాప్తుడైన పరమాత్మను 'పశ్యన్నపి చ న పశ్యతి మూఢః' అనునట్లు అజ్ఞులు చూచియు చూడలేకున్నారు. ఆ పరతత్త్వము కంటికి కనిపించదని శ్రుతి చెప్పుచున్నది -

'న చక్షుషా గృహ్యతే '[1]

మరియు సర్వభూతములలోను గూఢమైయున్న పరమాత్మ సూక్ష్మదర్శనులైన యోగులయొక్క సూక్ష్మాతిసూక్ష్మమైన బుద్ధికి దప్ప తదితరులకు కనిపించదని శ్రుతి ఘోషించుచున్నది -

ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥[2]

ప్రజ్ఞానఘనమైన పరబ్రహ్మము నామరూప క్రియాత్మకమైన సమస్త జగత్తు యొక్క లోపల, వెలుపల కలదని శ్రుతి చాటుచున్నది -

**తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ।**[3]

ఈ శ్రుత్యర్థమువే జగమంతయు భగవంతుని లోపలను, వెలుపలను అద్దమునందు వలె ప్రకాశించుచున్నదని అన్నమయ్య మరొకరీతిగా చెప్పినాడు.

భగవంతునికి గల జ్ఞాన బలైశ్వర్యాది వివిధ గుణములలో దయాగుణమే మిక్కిలి గొప్పది. అందుచేతనే ఆయన కారుణ్యవిధియై భక్తులకోరికలను కురియుచున్నాడని చెప్పబడినది. విశ్వమంతయు గగనమునందువలె పరమాత్మునియందే జనించి తుదకందే లీన మగుచున్నది -

'ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై యెవ్వని యందు డిందు'[4]

---

(1) ముండక., 3-1-8. (2) కఠ., 3-12.
(3) ఈశ., 5. (4) భాగ., 8-73.

అన్న భాగవతోక్తి ఇట స్మరణీయము.

## 21

అవతారిక :- భవరోగమును పరిహరించుటకు భగవంతుడే తగిన ఔషధమనుచున్నాడు -

### శంకరాభరణం

కొనరో కొనరో మీరు - కూరిమి మందు
ఉనికి మనికికెల్ల - నొక్కటే మందు. ॥ పల్లవి ॥

1. ధ్రువుడు గొనినమందు - తొల్లియుఁ బ్రహ్లాదుఁడు
చవిగాఁ గొనిన మందు - చల్లని మందు,
భవరోగములు వీడి - పారఁగఁ బెద్దలు మున్ను
జవకట్టికొనిన ని - చ్చలమైన మందు. ॥ కొన ॥

2. నిలిచి నారదుఁడు గొ - నిన మందు జనకుఁడు
గెలుపుతోఁ గొని బ్రతి - కిన యామందు,
మొలచి నాలుగుయుగ - ముల రాజులు ఘనులు
కలకాలము గొని - కడగన్న మందు. ॥ కొన ॥

3. అజునకుఁ బర - మాయువై యెసగిన [1] మందు
నిజమై లోకము లెల్ల - నిండిన మందు,
త్రిజగములు నెఱుఁగ - తిరువేంకటాద్రిపై
ధ్వజమెత్తె [2]ఁ గోనేటి - దరి నున్న మందు. ॥ కొన ॥

ప ॥ :- ఉనికి మనికికి = ఉండుటకు బ్రదుకుటకును.

1. జవకట్టికొనిన = పాదిగికొనిన, స్వాధీనముగావించుకొన్న; నిచ్చలము = నిశ్చలము.

భావము :- జనులారా ! ప్రేమస్వరూపుడైన భగవంతుడు అను ఔషధమును మీరు చేకొనుడు. సుఖముగా లోకమున జీవించుట కిది యొక్కటే తగిన మందు.

పూర్వము ధ్రువుడీ మందు సేవించెను. ప్రహ్లాదుడీ మందును మిక్కిలి

(1) 'యొసగిన' అని ముద్రితపాఠము.

ప్రీతితో స్వీకరించెను. ఇది యెట్టి ఉద్వేగమును గలిగింపని చల్లని మందు. సంసార రోగమును పోగొట్టుకొనుటకై తొల్లి మహనీయులైనవారు పలువురు శాశ్వతమైన యీ మందును తమ స్వాధీనము గావించుకొనిరి.

ఈ మందునే నారదుడు శ్రద్ధతో సేవించెను. విదేహాధిపతియైన జనకుడు విజయోత్సాహముతో ఈ మందునే స్వీకరించి బ్రహ్మానందముతో జీవించెను. వారు వీరననేల ? నాలుగు యుగములకు జెందిన నరపతులు, మహాత్ములు జీవించినంతకాలము ఈ మందునే సేవించి ముక్తులైరి.

ఈ మందే బ్రహ్మదేవునకు పరమాయువై విలసిల్లినది. ఇదే సత్యస్వరూపమై భువనములెల్ల నిండియున్నది. కోనేటిగట్టుననున్న ఈ మందే ముల్లోకము లెఱుంగునట్లు 'నావలె భవరోగమును పరిమార్ప గల మందింకొకటి లేదు' అని శ్రీవేంకటాద్రిపై టెక్కెమెత్తి చాటినది. ('ధ్వజమెత్తి' అను పాఠమైనచో ధ్వజమెత్తి చాటుచు కోనేటి గట్టుననున్న మందు అని భావము).

**విశేషాంశములు :-** మనుజులు వివిధములైన శరీరరోగములకు పలురకములైన మందులు వాడుదురు. శరీరము శాశ్వతము గాదు. అది ఎప్పుడైన పతనము నొందకపోదు. అజ్ఞానమునకు మారు రూపమైన సంసారమను రోగమున్నంతవరకు జీవుడు మఱల శరీరములు దాల్చుచు విడుచుచు నుండవలసినదే. కాన జన్మ జరామరణములతో గూడిన భవరోగమును దూరమొనర్చుకొనుటకై వివేకవంతుడు ప్రయత్నించవలెను. అందుకు తగిన మందు పరమాత్ముడొక్కడే. ఆయన అనుగ్రహమునకై పాటుపడుటే ముక్తికి సరియైన త్రోవ.

ధ్రువుడు, ప్రహ్లాదుడు, నారదుడు, జనకుడు మున్నగు మహనీయులు భగవంతుని ఆశ్రయించుట వలననే ముక్తులైరి.

**ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్ ।**
**రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్పుణ్యా నిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥**

అన్నట్లు ప్రహ్లాదాది భాగవతోత్తములను స్మరించి వారు చూపిన త్రోవనే పయనింపవలెను.

యోగజ్ఞులైన యాజ్ఞవల్క్యాదులు మునులు చెప్పినట్లు కృష్ణుడు అను అమృతమొక్కటే జననమరణవ్యాధిని పోకార్చి నిర్వాణమును గూర్చు పరమౌషధమని భక్తశేఖరుడగు కులశేఖరుడు వచించెను -

హే లోకాః ! శృణుత ప్రసూతిమరణవ్యాధేశ్చికిత్సామిమాం
యోగజ్ఞాస్సముదాహరన్తి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః ।
అంతర్జ్యోతిరమేయమేకమమృతం కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యన్తికమ్ ॥[1]

మరియు వ్యామోహమును శమింపజేయునది, ముని మనోవృత్తులను ప్రవర్తింపజేయునది, రాక్షసేంద్రుల కార్తి గల్గించునది, ముల్లోకవములకు సంజీవనమైనది, భక్తులకు హితము గూర్చునది, భవభయమును తొలగించునది, శ్రేయస్సు నొడగూర్చునది అగు శ్రీకృష్ణుడు అను దివ్యౌషధమును పానము జేయుమని ముకుందమాలాకారుడు తన చిత్తమును హెచ్చరించెను-

వ్యామోహ ప్రశమౌషధం మునిమనో వృత్తి ప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనీ సంజీవనైకౌషధమ్ ।
భక్తాత్యంత హితౌషధం భవభయ ప్రధ్వంసనైకౌషధం
శ్రేయః ప్రాప్తికరౌషధం పిబ మనః ! శ్రీకృష్ణ దివ్యౌషధమ్ ॥[2]

భగవంతుని, భగవన్నామమును దివ్యౌషధముగా వర్ణించుచు అన్నమయ్య పాడినపాట లింకను కొన్ని గలవు -

'వేదవేద్యులు వెదకేటి ఆది నంత్యము లేని ఆ మందు' (5-2)

అనునది

'వేదమంత్ర మింకనేల వేరు వెల్లంకులు నేల
పుడమిధరుడు మాకు భువనౌషధము' (5-286)

అనునది, మరియు

'అన్నిటికి నిది పరమౌషధము
వెన్నుని నామమె విమలౌషధము' (11-43 P.)

ఇత్యాది సంకీర్తనము లీకోవకు జెందినవే.

## 22

అవతారిక :- భగవంతుని స్వరూపము నెఱుంగుటకు అర్హులెవరో తెలియజేయుచు తదితరులకు భగవత్తత్త్వము అగోచర మనుచున్నాడు -

---

(1) ము. మా., 17. (2) ము. మా., 24.

## శ్రీరాగం

ఇతరులకు నిను - నెఱుఁగఁ దరమా
సతత సత్యవ్రతులు - సంపూర్ణ మోహ విర
హితు లెఱుంగుదురు నిను - నిందిరారమణా ! ॥ పల్లవి ॥

1. నారీకటాక్ష పటు - నారాచభయరహిత
శూరు లెఱుఁగుదురు నినుఁ - జూచేటి చూపు,
ఘోరసంసార సం - కుల పరిచ్ఛేదులగు
ధీరు లెఱుఁగుదురు నీ - దివ్యవిగ్రహము. ॥ ఇత ॥

2. రాగ భోగ విదూర - రంజితాత్ములు మహా
భాగు లెఱుఁగుదురు నినుఁ - బ్రణుతించు విధము,
ఆగమోక్త ప్రకా - రాభిగమ్యులు మహా
యోగు లెఱుఁగుదురు నీ - వుండేటి వునికి. ॥ ఇత ॥

3. పరమ భాగవత పద - పద్మసేవానిజా
భరణు లెఱుఁగుదురు నీ - పలికేటి పలుకు,
పరమ నిత్యానంద - పరిపూర్ణ మానస
స్థిరు లెఱుంగుదురు నినుఁ - దిరువేంకటేశ ! ॥ ఇత ॥

వ॥:- సతత సత్యవ్రతులు = ఎల్లప్పుడు సత్యమే వ్రతముగా గలవారు; సంపూర్ణమోహ విరహితులు = పూర్తిగా మోహముచే విడువబడినవారు.

1. నారీ కటాక్ష పటునారాచ భయరహితశూరులు = స్త్రీల కడగంటి చూపులనెడు వాడియైన బాణములవలన భయములేని వీరులు; ఘోరసంసార సంకుల పరిచ్ఛేదులు= భయంకరమగు సంసారపు చిక్కును తెంచుకొన్నవారు; దివ్యవిగ్రహము= దివ్యమైన శరీరము.

2. రాగభోగ విదూరరంజితాత్ములు = రాగమునకు భోగమునకు దూరమై (పరమాత్మయందే) రంజింపజేయబడిన చిత్తముగలవారు; మహాభాగులు = గొప్ప భాగ్యవంతులు; ఆగమోక్త ప్రకారాభిగమ్యులు = శాస్త్రములందు చెప్పబడిన విధానమే ఆశ్రయింపవలసినదిగా గలవారు.

3. పరమభాగవత పదపద్మ సేవానిజాభరణులు = శ్రేష్ఠులైన భగవద్భక్తుల చరణ

కమలములయొక్క సేవయే తమకు ఆభరణము గాగలవారు; నిత్యానంద పరిపూర్ణ మానసస్థిరులు = శాశ్వతమైన ఆనందముతో నిండిన చిత్తముచే చలనరహితులైనవారు.

భావము :- ఓ రమారమణా ! సర్వదా సత్యము పాటించువారు, సంపూర్ణముగా మోహమునుండి విడివడినవారు నిన్ను తెలిసికొనగలరు గాని ఇతరులకు నిన్ను తెలిసికొన వీలగునా ?

స్త్రీల కడగంటి చూపులనెడు పదునైన బాణములవలన గలుగు భయములేని శూరులు, అనగా జితేంద్రియులు మాత్రమే నిన్నెట్టి చూపుతో చూడవలెనో ఎఱుంగుదురు. భయంకరమైన సంసారపు చిక్కును దెంచుకొన్న ధీరులు మాత్రమే నీ దివ్య మంగళమూర్తిని గుర్తింపగలరు.

లౌకిక వస్తువులకు సంబంధించిన అనురాగమునకును, భోగమునకును దూరమై రంజిల్లిన అనగా వైరాగ్యసంపన్నమయిన హృదయముగల పుణ్యాత్ములు మాత్రమే నిన్ను స్తుతించుప్రకారము నెఱుంగుదురు. శాస్త్రోక్త విధి ననుసరించి పయనించు పెద్ద యోగులు మాత్రమే నీవున్నచోటు తెలిసికొందురు.

శ్రీవేంకటేశ్వరా ! శ్రేష్ఠులైన భాగవతులయొక్క చరణసరోజముల సేవయే ఆభరణముగా గల భక్తులు మాత్రమే నీ మాటలలోని అర్థమును గ్రహింపగలరు. శాశ్వతానందముచే నిండిన చిత్తముచే కదలిక లేని స్థితప్రజ్ఞులు మాత్రమే నీ స్వరూపము నాకళించుకొనగలరు.

**విశేషాంశములు :-** భగవత్ప్రాప్తి కవసరమైన ముఖ్యధర్మము లీ సంకీర్తనములో పేర్కొనబడినవి. భగవత్స్వరూపమును అన్ని విధముల సమగ్రముగా గుర్తింపవలెనన్నచో సదా సత్యము పాటింపవలెను. మోహమును పూర్తిగా విడనాడవలెను. కామినుల కడగంటి చూపులకు జడియరాదు. భవబంధమును ఛేదింపవలెను. ఇహాముత్ర ఫలభోగ విరాగసంపన్నులు కావలెను. శాస్త్రవిహితమైన యోగమార్గము ననుసరింపవలెను. మఱియు ఉత్తమభాగవతులను సేవింపవలెను. చీకు చింతలు లేక నిత్యము ఆత్మానందపరిపూర్ణులై నెగడవలెను. ఇవి అన్నియు ఆత్మ గుణములుగా ధర్మశాస్త్రములయందు కొనియాడబడినవి.

ఇవి గలవారు మాత్రమే భగవంతుని చూడగలరు. తదీయ దివ్యమంగళమూర్తిని గుర్తింపగలరు. ఆ పరమాత్ముని స్తుతింపగలరు. ఆయన నివాస స్థానమును కనిపెట్టగలరు. భగవద్గీతాదులలోని భగవద్వచనముల రహస్యము నెఱుంగగలరు. మఱియు భగవత్స్వరూపమును సమగ్రముగా అర్థము చేసికొనుటకు

సమర్థులగుదురు. తదితరుల కది సాధ్యముగాదని తాత్పర్యము.

భగవంతుడు విశ్వమంతట వ్యాపించియున్నాడు. కాని సత్యము, తపస్సు మున్నగు సదనుష్ఠానము లేనివారు ఆ పరమాత్మ నెఱుంగజాలరు. నువ్వుల యందు నూనె. పెరుగునందు నేయి, స్రోతస్సులలో జలము, అరణులలో అగ్ని ఉన్నట్లు తనలో నున్న పరమాత్మను సత్యతపోనుష్ఠానములచే సాధకుడు కాంచ గల్గునని శ్రుతి వచించుచున్నది -

తిలేషు తైలం దధినీవ సర్పిరాపః స్రోతస్స్వరణీషు చాగ్నిః ।
ఏవ మాత్మాఽఽత్మని గృహ్యతేఽసౌ సత్యేనైనం తపసా యోఽనుపశ్యతి॥

మఱియు సంసార కారణములైన కాంతలపైనను, బంధహేతువులైన సంపదలపైనను విరక్తి కలిగినప్పుడే సాధకులు భగవదభిముఖులు కాగలుగుదురు. అందుచేతనే భ్రమహేతువులైన కాంతాకనకములపై ఆసక్తి లేనివాడు నరాకారమున నున్న శివుడేయని పెద్దలనిరి -

వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।
తాసు తేష్వప్యనాసక్తః సాక్షాద్భర్గో నరాకృతిః ॥[2]

కాంతాదులగు వివిధ వికారహేతువులున్నను వికారము నొందనివాడే ధీరుడనబడునని కాళిదాసు నుడివెను -

వికార హేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః ॥[3]

అన్నమయ్య ఈ సంకీర్తనములో పేర్కొనినట్లే భగవత్తత్త్వోపలబ్ధి కనుగుణమైన పరమాచారమును పాటించు భాగవతులను భాగవత మిట్లు ప్రశంసించు చున్నది -

శ్రుత్యంత విశ్రాంత మత్యనుక్రమణీయ - భగవత్ప్రసంగతుల్ భాగవతులు
సనకాది మునియోగి జనసదానందైక - పరమభాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణపదధ్యాన కేవలామృత పాన - పరిణామయుతులు శ్రీభాగవతులు
బహుపాతకానీక పరిభవ ప్రక్రియా - పరుషోగ్రమూర్తులు భాగవతులు

భావ తత్త్వార్థవేదులు భాగవతులు
బ్రహ్మ వాదానువాదులు భాగవతులు

సిరులు దనరంగ నెన్నడుఁ జేటులేని
పదవి నొప్పారు వారువో భాగవతులు [1]

## 23

అవతారిక :- పరమాత్మని యథార్థస్వరూపమెట్టిదో యెఱుఁగక ఆయన పట్ల తాను గావించు భావనలు, చేష్టలు తప్పిదములే యనుచున్నాడు -

### మాళవి

అది నాయపరాధ - మిది నాయపరాధ
మదియు నిదియు నా - యపరాధము. ॥ పల్లవి ॥

1. నెరయ రూపములెల్ల - నీరూపమే కా
నరయని యది నా - యపరాధము,
పరిపూర్ణుఁడగు నిన్నుఁ - బరిచ్ఛిన్నునిగా
నరయుట యది నా - యపరాధము. ॥ అది ॥

2. జీవాత్మునిఁ గాఁ - జింతింపఁ దలఁచుట
యా వంక నది నా - యపరాధము,
సేవించి నిను నాత్మఁ - జింతింపకుండుట
ఆవల నిది నా - యపరాధము. ॥ అది ॥

3. ఈడెఱుఁగక వెంక - టేశుఁడ నినుఁగొని
యాడుట యది నా - యపరాధము,
ఏడఁజూచిన నా - యెదుర నుండఁగ నిన్ను
నాడ నీడ వెదకు - టపరాధము. ॥ అది ॥

1. నెరయఁ = పూర్తిగా, పరిచ్ఛిన్నునిగా = దేశకాలాదులకు లోబడినవానినిగా.
3. ఈడెఱుఁగక = నా సామర్థ్యమును విచారింపక.

భావము :- దేవా ! అది నా తప్పు. ఇది నా తప్పు. అది, ఇది రెండును నా తప్పులే.

విశ్వమున దోచు సమస్త రూపములు నీ రూపమే అని గుర్తింపకపోవుట నేను చేసిన తప్పు. ఎల్లయెడల నిండి పరిపూర్ణస్వరూపుడవై కొలదిమీరి

(1) భాగ., 6-187.

(అపరిచ్ఛిన్నుడవై) యున్న నిన్ను దేశకాల నామరూపాదులకు లోబడినవానిగా (పరిచ్ఛిన్నునిగా) భావించుటయు నా తప్పిదమే.

పరమాత్ముడవై యున్న నిన్నొక జీవాత్మునిగా చింతించుట నా తప్పు. దివ్య మంగళమూర్తివైన నిన్ను సేవించి చిత్తములో సదా భావింపకుండుటయు నేనొర్చిన తప్పిదమే.

నా శక్తియుక్తులను లెక్కగొనక వాక్కుల కందని మహిమాతిశయము గల నిన్ను నేను స్తుతింపబూనుట నా అపరాధము, సర్వత్ర వ్యాప్తుడవై ఎక్కడ చూచినను ఎదుటనే ఉన్న నిన్ను ఎందో ఉన్నావని అక్కడ, ఇక్కడ అన్వేషింపబూనుటయు నేను చేసిన యపరాధమే.

**విశేషాంశములు :-** వివిధ రూపములతో గనిపించు విశ్వమంతయు భగవంతుని స్వరూపమే కాని అన్యముగాదు. స్త్రీ పున్న పుంసక రూపములలో పరమాత్ముడు ఏదియు తాను గాదనియు, కాని ఏయే శరీరమును తాను దాల్చుచున్నాడో ఆ యా రూపముతో తాను యోగము నొందుచున్నాడనియు శ్రుతి వచించుచున్నది -

నైవ స్త్రీ న పుమానేష న చైవాయం నపుంసకః ।
యద్యచ్ఛరీరమాదత్తే తేన తేన స యుజ్యతే ॥[1]

కాన అన్ని మూర్తులు ఆయన మూర్తులే అనుట స్పష్టము. "నర్తకుని భంగి పెక్కగు మూర్తులతో నెవ్వఁడాడు[2]", "అఖిల రూపముల్ తన రూపమైన వాఁడు[3]" ఇత్యాది భాగవత వచనములు గూడ పై సత్యమునే ప్రకటించుచున్నవి ! కాన ఏదో ఒక రూపముతోనే భగవంతుడున్నాడని భావించుట అవివేకము.

మరియు పరమాత్ముడు పరిపూర్ణస్వరూపుడు. దిక్కాలాదులచే పరిచ్ఛిన్నుడు గాడు. కావుననే "దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్త చిన్మాత్రమూర్తయే[4]" అని పెద్దలాదేవుని కీర్తించిరి.

ధర్మసంస్థాపనముకై దేవుడు రామకృష్ణాద్యవతారములు దాల్చుట గలదు. మానుష శరీరముతో నున్నంత మాత్రమున ఆయన నొక జీవాత్మునిగా భావించుట మౌఢ్యమే యగును.

మూఢులు సర్వజ్ఞత్వాది లక్షణ లక్షితమైన తనయొక్క పరభావము

(1) శ్వేతాశ్వ., 5-10. (2) భాగ., 8-76.
(3) భాగ., 8-87. (4) భర్తృ., 1-1.

నెఱుంగక మనుష్యశరీరముతో నున్న తన్ను తిరస్కరించియున్నారని శ్రీకృష్ణుడు వచించెను -

అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్ ।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥[1]

మఱియు -

'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ[2]'

అని శ్రుతి చెప్పినట్లు పరమాత్ముడు అవాఙ్మనస గోచరుడు. అట్టి వానిని స్తుతింపబూనుటయు అపరాధమే.

మరియు 'సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా[3]', 'ఈశావాస్య మిదం సర్వం[4]' ఇత్యాది శ్రుతులు భగవంతుని సర్వ గతత్వమును చాటుచున్నవి.

ఇందు గలఁడందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి! వింటే ![5]

అని ప్రహ్లాదుడు చెప్పెను గదా ! అట్టి వానిని ఎక్కడో ఒకచో నున్నాడని అన్వేషింపబూనుటయు దోషమే.

సర్వగతుడైన భగవంతు డెందో ఉన్నాడని తలచి అచటికి యాత్ర చేయుట, వాక్కుల కందని ఆయనను స్తుతించుట, చిత్తమున కందని ఆయనను ధ్యానించుట అనునవి భక్తులు గావించు త్రివిధాపరాధములని పెద్దలు పేర్కొనిరి -

త్వద్యాత్రయా వ్యాపకతా హతా తే స్తుత్యుక్తిభి ర్వాక్పరతా హతా తే ।
ధ్యానేన చేతః పరతా హతా తే ప్రభో ! క్షమస్వ త్రివిధాపరాధాన్ ॥[6]

## 24

అవతారిక :- పరమేశ్వరుని విశ్వలీలావిలాసము నొకనేతబేరముగా రూపించుచున్నాడు -

### వరాళి

వాడల వాడల వెంట - వాఁడెవో వాఁడెవో
నీడ నుండి చీరలమ్మే - నేఁత బేహారి. ॥పల్లవి॥

---

(1) గీత., 9-11. (2) తైత్తి., 2-4. (3) శ్వేతాశ్వ., 6-11.
(4) ఈశ., 1. (5) భాగ., 7-275. (6) అవ. గీ.

1. పంచభూతము లనెడి - పలువన్నె నూలు
చంచలపు గంజితోడ - చరిసేసి,
కొంచెపు కండెలనూలి - గుణముల నేసి
మంచిమంచి చీరలమ్మె - మారుబేహారి. ॥ వాడ ॥

2. మటుమాయములఁ దన - మగువ పసిఁడినీరు
చిటిపొటియలుకలఁ - జిలికించఁగా,
కుటిలంపుఁ జేఁతలు - కుచ్చులుగాఁగట్టి
పటువాళి చీరలమ్మె - బలుబేహారి. ॥ వాడ ॥

3. మచ్చిక జీవు లనేటి - మైలసంతలలోన
వెచ్చపు కర్మ ధనము - విలువ చేసి,
పచ్చడాలుగాఁ గుట్టి - బలు వేంకటపతి
ఇచ్చకొలఁదుల నమ్మె - ఇంటిబేహారి. ॥ వాడ ॥

ప ॥:- బేహారి = వ్యాపారి.

1. చరిసేసి = గంజితో గట్టిపడునట్లు చేసి.

2. పటువాళిచీరలు = నిలువుగనో లేదా అడ్డముగనో పట్టెలు గల చీరలు

3. వెచ్చపు కర్మధనము = వెచ్చింపక తప్పని కర్మమనెడు ధనము; పచ్చడాలు = వస్త్రములు.

భావము :- అడుగో! అల్లడుగో! వీథివీథుల, సందుగొందుల దిరుగుచు నీడపట్టున నుండి చీరలమ్ము నేతవ్యాపారి అల్లడుగో!

ఆ నేతగానికి పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచభూతములే రంగురంగుల నూలు. ఆ నూలునతడు చాంచల్యము అను గంజితో గట్టిపరచుచున్నాడు. పిదప సత్త్వరజస్తమోగుణము లనెడు కండెలతో మంచి మంచి చీరలుగా నేసి మారు బేరమున కమ్ముచున్నాడు.

మాయలమారియైన అతని భార్య మధ్య మధ్య చిన్న చిన్న జగడములు చేయుచు బంగారు నీరు చిలికించి చీరలకు వన్నెలు వేయుచున్నది. ఆ నేతగాడు వక్రములైన చేష్టలనే కుచ్చులుగా గట్టి నిలువుగను, అడ్డముగను పట్టెలుగల చీరలమ్ముచున్నాడు.

అతని బేరమున కలవాటుపడిన జీవులందరు మైలసంతలలో[1] జేరుదురు.

(1) "నేతపనిలో పూర్వకాలమున మాలవారు నిష్ణాతులు. వారు చీరల వ్యాపారము చేయు సంత మైలసంత" అని శ్రీరాళ్లపల్లివారు. (చూ - తా.పా. II P. 187.)

ఇచట వారివారి కర్మమను ద్రవ్యమును క్రమముగా నేర్పఱచి వస్త్రవిశేషములను తయారు చేసి వేంకటేశ్వరుడు అను ఇంటి పేరుగాడు తన యిష్టము వచ్చిన ప్రకార మమ్ముచున్నాడు.

**విశేషాంశములు :-** నేత వ్యాపారి పలురంగులు గల నూలును గంజితో గట్టి పఱచి పడుగుపేకలుగా అమర్చి వస్త్రములు నేయును. అతని భార్య వాటికి అద్దకము వేయును. కుచ్చులు గట్టి ఆ వస్త్రముల నతడు సంతలలో వీథివీథులు దిరిగి అమ్ముచుండును. ఈ లోకవృత్తముతో పరమాత్ముని జగల్లీల నిట కవి పోల్చుచున్నాడు.

'సర్వవ్యాపీ' అని శ్రుతి పేర్కొన్నట్లు భగవంతుడు అంతటను ఉన్నాడు గాన 'వాడల వాడల వెంట' ఉన్నాడని చెప్పబడినది. వ్యాపారి నీడలోనుండి చీరలమ్మినట్లే ఆ పరమాత్ముడు మరుగున నుండి జగన్నాటకమును నడిపించుచున్నాడు.

పంచభూతాత్మకములైన వివిధ వస్తువులే భగవంతుని నేతయందలి పోగులు. అవి సదా పరిణామశీలములై చంచలములుగా నున్నవిగాన వాటి చంచలత్వమే ఇట 'గంజి'గా రూపింపబడినది.

మహామాయయనియు, అవిద్యయనియు చెప్పబడుచున్న భగవంతుని లీలావిభూతి అష్టప్రకృతులు, షోడశవికారములు అనబడు ఇరువదినాల్గు తత్త్వములతో గూడియున్నది[1]. ఈ తత్త్వముల కాదిభూతమైన ప్రకృతినుండియే సత్త్వరజస్తమోగుణము లేర్పడుచున్నవి. జగద్వ్యవహారమునకు మూలములై జీవులను దేహముల యందు బంధించునవి ఈ త్రిగుణములే[2]. కావుననే ఇట నూలు కండెలుగా నవి రూపింపబడినవి. పడుగుపేకలు రెండును కలిసినప్పుడే వస్త్రములు తయారగునట్లు పంచభూతములతో త్రిగుణములు జోడై నడచినప్పుడే జగల్లీల సాగుచున్నది.

మాయారూపిణియైన ప్రకృతియే లక్ష్మి. ఈమె తోడ్పాటుతోనే దేవుడు

(1) తత్ర ప్రకృతయ స్త్వష్టౌ. వికారాః షోడశ. 'అష్టౌ ప్రకృతయః షోడశ కాశ్చ వికారా' ఇతి శ్రుతేః, తత్రాష్టౌ ప్రకృతయః ప్రకృతి మహదహఙ్కారాః, పంచభూతాని చ . . . వికారాశ్చ శబ్దాదివిషయపంచకం చ ఏకాదశేన్ద్రియాణీ చ. - రా. సి. పా. P. 62.

(2) సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।
నిబధ్నన్తి మహాబాహో ! దేహే దేహిన మవ్యయమ్ ॥ గీత. 14-5.

సృష్టి కార్యము నడుపుచున్నాడు. భగవంతుని పత్నియగు ఈమె అప్పుడప్పుడు ప్రణయకోపము ప్రదర్శించుచు వస్త్రముల కాకర్షణ గలుగుటకై బంగారుసీరు చిలికించుచున్నది. అనగా మాయాకాంత తెచ్చిపెట్టిన కనకము సృష్టిలో మోహకద్రవ్యమై లోభపెట్టుచున్నదని తాత్పర్యము. లోకములో నెన్నెన్నో కుటిలపు నడతలు గలుగుటకు కారణము మనుజులకు కనకముపైగల వ్యామోహ మమకారములే గదా !

సృష్టి స్థితి సంహారాత్మకమైన ఈ విశ్వలీలకు అనాది కాలమునుండి మచ్చికపడినవారు జీవులు. వారి వారి కర్మధనమును వెచ్చించి పాంచభౌతికములైన పదార్థముల మూలముగా వచ్చు సుఖదుఃఖాత్మకములైన ఫలములను వారనుభవించుచున్నారు. 'యః ఫలకర్మ కర్తా' అను శ్రుతిననుసరించి జీవులచే కర్మఫలముల ననుభవింపజేయువాడు పరమాత్ముడే. మరియు 'ఇచ్చుకొలదుల నమ్మే బేహారి' అనుటచే కర్మల కధీనమైన ఫలముల నిచ్చుచున్నను భగవంతుడు సర్వస్వతంత్రతతో వ్యవహరించుచున్నాడని సూచింపబడినది.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః [1]॥

అను గీతోక్తిననుసరించి జీవులు నియతాత్ములై భక్తితో సమర్పించు పత్రపుష్పాదులలో ఏ వస్తువునైన స్వీకరించి భగవంతుడు వారివారికి తగిన ఫలముల నిచ్చుచున్నాడని గ్రహింపవలెను. 'మారు బేహారి' అనుటలోని పరమార్థమిదే.

'బలుబేహారి' అనుటచే తన వ్యాపారమునకే మాత్రము నష్టము కలుగకుండ, అనగా తన సంకల్పమున కేకొఱతయు వాటిల్లకుండ సమర్థతతో సమస్తలోకవృత్తమును పరమేశ్వరుడు నడుపుచున్నాడని తెలియవలెను.

'ఇంటిబేహారి' యనుటంబట్టి 'సర్వభూతాశయస్థితః [2]' అన్నట్లు సమస్త జీవుల హృదయములనెడు గృహములలో పరమాత్ముడున్నాడని గుర్తింపవలెను.

## 25

**అవతారిక :-** కర్మ ప్రభావమును వివరించుచు తమ్ము విడిచిపుచ్చుమని ఆ కర్మమునే వేడుకొనుచున్నాడు-

---

(1) గీత., 9-26. (2) గీత., 10-20.

## శ్రీరాగం

ఎన్నిబాధలఁ బెట్టి - యేఁచెదవు నీవింక -
నెంతకాలముదాఁకఁ గర్మమా !
మన్నించు మనుచు నీ - మఱుఁగు చొచ్చితిమి మా -
మాటాలకించవో కర్మమా ! ॥ పల్లవి ॥

1. ప్రతిలేని దురితముల - పాలుసేయక నన్నుఁ -
బాలించవైతివో కర్మమా !
తతితోడ నాత్మ పరి - తాపంబు తోడుతను -
తగులేల సేసితో కర్మమా !
జితకాములకు గాని - చేతికిని లోనయి -
చిక్క వేకాలంబు కర్మమా !
మతిహీనులైనట్టి - మాకు నొక పరిపాటి -
మార్గంబు చూపవో కర్మమా ! ॥ ఎన్ని ॥

2. ఆసలనియెడి తాళ్ళ - నంటఁగట్టుక విధికి -
నప్పగించితివి గదె కర్మమా !
వాసి విడిచితిమి నీ - వారమైతిమి మమ్ము -
వన్నె చెడనీకువో కర్మమా !
కానుకనుఁ గొఱగాని - గతిలేని పనికిఁగా -
కాలూఁదనీవేల కర్మమా !
ఓసరించొక మారు - వొయ్యనే ఒకరీతి -
నొల్లనవి తలఁగుమీ కర్మమా ! ॥ ఎన్ని ॥

3. తిరువేంకటాచలా - ధిపుని మాయలచేత -
దెసలఁదిరిగిన యట్టి కర్మమా !
హరిదాసులగు వారి - నాదరింతువుగాక -
అంత నొప్పింతువా కర్మమా !
వరుస నేనుగ మీఁద - వాని సున్నంబడుగ -

వచ్చునా నీకిట్లఁ గర్మమా !
పరమపురుషోత్తముని - భ్రమతఁబడి నీవిట్ల -
బట్టబయలైతిగా కర్మమా ! ॥ఎన్ని॥

ప ॥ :- ఏఁచెదవు = నొప్పించెదవు.

1. ప్రతిలేని = సాటిలేని; తతితోడన్ = అదునుతో; తగులు = సంబంధము; జితకాములకుఁ = కామమును జయించినవారికి; పరిపాటి మార్గంబు = క్రమమైన త్రోవ.

2. వాసి = పెద్దరికము; ఒసరించి = ప్రక్కకొదిగి.

భావము :- ఓ కర్మమా ! ఎంతో కాలము నుండి మమ్ము నీవు పీడించుచున్నావు. ఇట్లే ఇంకను ఎంతకాలము ఎన్ని బాధలపాలుగావించి నొప్పించెదవు ? నీవు పెట్టు బాధలే మాత్రము భరించలేక మమ్ము రక్షింపుమనుచు నేటికి మేము నీ చాటు చేరితిమి. మామాట విని మమ్ము మన్నింపరాదా!

ఓ కర్మమా ! నీవలన మే మనేక పాపముల పాలైతిమి. సాటిలేని ఈ పాపముల పాలొనర్చక మమ్ము రక్షింపవైతివిగదా ! నీవలన మేమెప్పటి కప్పుడు దురంతమైన మనోవేదనకు గురి యగుచున్నాము. ఇంత పరితాపకరమగు బంధమును మాకేల కల్గించితివి ? నీవు కోర్కెలను తుదముట్టించిన విరక్తులకే లొంగుదువు. తదితరుల చేతికెప్పుడును చిక్కవు. మేము మతిలేని వారము. మా మీద దయ దలచి ఒక క్రమము తప్పని దారి చూపరాదా !

ఓ కర్మమా ! ఆశాపాశములతో, మమ్ము బంధించి కర్మ ఫల ప్రదాయకమైన విధి కప్పగించితివి కదా ! మేము మా పెద్దరికములను, పేరు పెంపులను వదలుకొంటిమి, పూర్తిగా నీ కధీనుల మైతిమి. మాపై అనుగ్రహముంచి మా పెంపు చెడనీక కాపాడుము. కాసుకు గూడ పనికిరాని నిష్ప్రయోజనమైన పనికై ఇంచుకంత పేపైన కాలు నిలువనీయక మమ్మేల త్రిప్పెదవు ? ఒకమారు ప్రక్కకొదిగి 'మేను మిమ్మొల్లను, అని తొలగవలసిన రీతిని తిన్నగా తొలగిపొమ్ము !

ఓ కర్మమా ! నీవు శ్రీవేంకటేశ్వరుని మాయాప్రభావముచే అడ్డమాకలేక సకల దిక్కులలో సంచరింతువు. హరికి దాసులైనవారిని మాత్రము ఆదరింతువు గాని తదితరులను నొప్పించినట్లు నొప్పించ జాలవుగదా! ఏనుగు పైనున్నవానిని కుక్క కరచుటకు వీలగునా ? అట్లే భగవద్భక్తులను బాధించుటకు నీకు వీలుగాదు,

మేము పరమపురుషునిపై భక్తి గలిగియున్నాము. కాన నీ గుట్టు మాకు బట్టబయలైనది. సేవించక మమ్మేమియు జేయలేవు.

విశేషాంశములు :- జీవులనుభవించు బాధలన్నియు వారివారి కర్మఫలములే. కర్మకధీనులైనవారు పలుపాపములాచరించి పరితపించుచున్నారు. సామాన్యుల కీకర్మబంధము తొలగద్రోయరానిదిగా నున్నది.

భర్తృహరి కర్మ పద్ధతిని వివరించుచు - ''దేవతలు విధికి వశమైయున్నారు. విధి కర్మలకు నియతములైన ఫలముల నిచ్చుచున్నది. ఫలము కర్మ కధీనము. కాన దేవతలకు, విధికి గాక విధిని సైతము అదుపులో బెట్టుచున్న కర్మలకే నమస్కరింపదగును'' అని చెప్పెను -

> నమస్యామో దేవా న్నను హతవిధేస్తేఽపి వశగాః
> విధిర్వన్ద్యః సోఽపి ప్రతినియత కర్మైక ఫలదః ।
> ఫలం కర్మాయత్తం కిమమరగణైః ? కించ విధినా ?
> నమస్తత్కర్మభ్యో విధిరపి న యేభ్యః ప్రభవతి [1]॥

మఱియు -

> ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ ! మనోగతాన్
> ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే [2]॥

అని గీత చెప్పినట్లు మనసునందలి కామములనెల్ల తుదముట్టించి తమలో తాము రమించుల స్థితప్రజ్ఞులను మాత్రము కర్మ ఏమియు చేయజాలదు.

ప్రజ్ఞాస్థైర్యము లేని సాధారణజనులు సత్కర్మల నాచరించి వానిఫలములను భగవంతునికి సమర్పించి క్రమముగా కర్మ విముక్తులు కావలసియున్నారు. పాటలోని 'పరిపాటిమార్గంబు' అన్న పదముచే ఈ యర్థమే సూచింపబడినది.

> 'కర్మ కర్తారుడని కడలేని పుణ్యముల
> కర్మ ఫలములు తనకు గైకొలుపగా,
> కర్మ గతిఁ దెచ్చి వెంకట విభుడు మావుభయ
> కర్మములఁ జెరిచె నెక్కడి దైవ మితఁడు' [3]

అనుచోట అన్నమయ్య ఈ భావమునే వివరించెను.

---

(1) భర్తృ., 1-91. (2) గీత., 2-55. (3) అ.సం., 5-196.

ఆశాపాశవములకు లోనగుంటచేతనే జీవు లాయయా కర్మఫలవుల ననుభవించుచున్నారు. కర్మ కధీనులగువారు వాటి బారినుండి తొలగనిచో ఎన్నటికిని సద్గతి నొందజాలరు.

కర్మ శ్రీవేంకటేశ్వరుని మాయ కధీనము. అందుచే అది సర్వత్ర తిరుగులేక సంచరించుచు సర్వజీవులను లోగొనుచున్నది. కాని హరిభక్తిపరులను కర్మక్లేశము లంటవు. ఏనుగుపై బోవువానిని క్రిందనున్నవాడు సున్న మడుగుట నిష్ఫలము. వాడందియ్యలేడు. వీడందుకొనలేడు. ఆ రీతిగనే ఫలాపేక్షలేక కర్మ లొనర్చు భగవద్భక్తులను కర్మఫలము లంటవు.

కాన పరమపురుషుని మీది భక్తియొక్కటే కర్మప్రభావమునుండి తప్పించుకొనుటకు సులభమైనమార్గము.

## 26

అవతారిక :- భగవచ్చింతయే పాపము లడంచి భవముల నశింపజేయు సాధనమని గ్రహించియు చిత్తమందు కనుగుణముగ ప్రవర్తింపదనుచున్నాడు -

### దేవగాంధారి

ఇన్ని చేఁతలకు - నిది యొకటే
కన్నా మసపిది - కానదు గాని. ॥ పల్లవి ॥

1. పాతక కోటులు - భవములు భస్మీ
భూతము సేయఁగఁ - బొడ వొకటే,
శ్రీ తరుణీపతి - చింత నిజముగా
ఏతరి చిత్తం - బెఱుఁగదు గాని. ॥ ఇన్ని ॥

2. మరణ భయంబులు - మదములు మలినీ
కరణము సేయఁగఁ - గలదొకటే,
హరినామామృత - మందు మీఁదిరతి
నిరతము నాకిది - నిలువదు గాని. ॥ ఇన్ని ॥

3. కుతిలములును దు - ర్గుణములుమ తృణీ
కృతములు సేయఁగ - గుఱుతొకటే,[1]

(1) 'ఇరవొకటే' అను వి.రే. పాఠమున యతిభంగము లేదు.

పతియగు వేంకట - పతి సేవారతి
గతియని మతి గని - కానదు గాని. ॥ ఇన్ని ॥

ప్ర.:- కన్నా మనసిది కానదు = మనస్సు గుర్తించియు గుర్తించినట్లు ప్రవర్తింపదు.

1. భవములు = జన్మములు, సంసారములు; పొడవు = వస్తువు; ఏతరి చిత్తము = దుష్టమైన మనస్సు.

2. మలిసీ కరణము సేయగన్ = రూపుమాపగా; రతి = ఆసక్తి; నిరతము = ఎల్లప్పుడు.

3. కుతిలములు = బాధలు; తృణీకృతములు = తిరస్కృతములు, 'ఇరవొకటే' అను పాఠములో ఇరవు = ఆశ్రయము.

భావము :- ఈ చెప్పబోవు పనులన్నిటిని నెరవేర్చుటకు ఇది ఒకటే సరియైన మార్గము, ఈ సంగతి గుర్తించియు చిత్తము గుర్తించినట్లు ప్రవర్తించదు.

కోట్లకొలది పాపములను, జననమరణాది సంసారక్లేశములను కాల్చివేయుటకు తగిన సాధన మొకటే కలదు. అది లక్ష్మీపతిధ్యానము. కాని ఈ దుష్టమైన చిత్తము ఈ విషయమును గుర్తింపకున్నది.

చావు మూడునేమో అన్న భయమును, వయస్సు, ధనము, కులము మున్నగు వానిచే గలుగు మదములను రూపుమాపుటకు దగిన సాధనమొకటే కలదు. అది విష్ణునామమను అమృతము. కాని నాకు ఎల్లవేళల ఆ యమృతము నాస్వాదించవలెనను ఆసక్తి నిలుచుటలేదు.

పలుబాధలను, దుర్గుణములను తృణీకరించుటకు చేపట్టవలసిన ఉపాయ మొకటే కలదు. అది త్రిలోకాధిపతియైన శ్రీవేంకటేశ్వరుని సేవయందలి అభిరుచి. కాని అదే గతియని నా మనస్సు తెలిసియు తెలియకున్నది.

విశేషాంశములు :- భగవచ్చింతనచే పాపములు, భవములు భస్మములగును. హరి నామామృత పానముచే మరణభీతి, మదములు తొలగును. శ్రీవేంకటేశ్వర సేవచే బాధలు, దుర్గుణములు పరిహరింపబడును.

ఈ విషయమును మానవులు గురూపదేశాదులచే గ్రహించియున్నారు. కాని మాయకు లోనై ఆయా సాధనల ననుష్ఠింపలేక బాధల నొందుచున్నారు. అనుష్ఠించినచో తప్పక ధన్యులగుదురని తాత్పర్యము.

# 27

అవతారిక :- ఎంత ప్రయత్నించినను, సహజవక్రములైన శరీరము, చిత్తము చెప్పినట్లు వినవనుచున్నాడు -

## దేవగాంధారి

భారమైన వేఁపమాను - పాలువోసి పెంచినాను
తీరని చేఁదే కాక - తియ్యనుండీనా. ॥ పల్లవి ॥

1. పాయఁదీసి కుక్కతోక - బద్దలువెట్టి బిగిసి
చాయకెంత గట్టినాను - చక్కనుండీనా ?
కాయపు వికార[1] మిది - కలకాలముఁ జెప్పినా
పోయిన పోకలే కాక - బుద్ధి వినీనా ? ॥ భార ॥

2. ముంచి ముంచి నీటిలోన - మూల నానఁబెట్టుకొన్నా
మించిన గొడ్డలి నేఁడు - మెత్తనయ్యీనా ?
పంచమహాపాతకాల - బారిఁబడ్డ చిత్త మిది
దంచి దంచి చెప్పినాను - తాఁకి వంగీనా ? ॥ భార ॥

3. కూరిమితోఁ దేలుఁదెచ్చి - కోకలోన బెట్టుకొన్నా
సారెసారెఁ గుట్టు గాక - చక్కనుండీనా ?
వేరులేని మహిమల - వేంకట విభుని కృప
ఘోరమైన ఆసమేలు - కొరసోకీనా ? ॥ భార ॥

వ॥ :- భారమైన = పెద్దదైన; పెంచినాను = పెంచినను.

1. పాయఁదీసి = వంకరలేకుండ ఈడ్చిపట్టి; బిగిసి = బిగించి; చాయకు = సరియైన దిశకు; కట్టినాను = కట్టినను; కాయపువికారము = శరీరమునకు సంబంధించిన పెడత్రోవ; 'కాయకపువికారము' అను ని.రే. పాఠమునకు 'జీవనపు వికారము' అని అర్థము.

2. పంచమహాపాతకాలు = (బ్రహ్మహత్య, సురాపానము, స్వర్ణస్తేయము, గురుతల్పగమనము, ఈ పాపము లాచరించినవారితో స్నేహము అను ఐదు గొప్ప పాతకములు.

(1) 'కాయకపు వికారము' అని ని. రే. పాఠము.

3. కొరసోకీనా = కొరత సోకగలదా ?

భావము :- పెద్ద వేపచెట్టుకు కమ్మని పాలుపోసి పెంచినను అందు తరగని చేదే పొడసూపునుగాని అది తియ్యగా నుండదు గదా !

కుక్కతోక వంకరగా నుండుట సహజము. దానిని వంకర తొలగునట్లు ఈడ్చిపట్టి వెదురు మున్నగు దబ్బలతో బిగించి క్రిందికి నేరుగా నుండునట్లు ఎంతగా కట్టినను అది చక్కగా నుండదు గదా ! అట్లే ఈ శరీరమునకు పెడత్రోవ నడచుట స్వభావమై యున్నది. దీని కెంతకాలము బోధించినను అది పోయినదారినే పోవుచుండునుగాని మనము చెప్పిన బుద్ధి వినదు.

గొడ్డలికి కాఠిన్యము సహజము. నీటిలో ఎవ్వరికిని అందుబాటులో లేని లోతైనచోట ముంచి ముంచి నానబెట్టినను అది మెత్తబడదు గదా ! అట్లే ఈ మనస్సు పంచమహాపాతకముల కలవడియున్నది. ఎంతగా నొక్కి నొక్కి చెప్పినను మన మాటలు దానికి సోకి అది మంచి త్రోవకు వచ్చుట లేదు.

తేలును ప్రేమతో దెచ్చుకొని ఒడిలో పెట్టుకొన్నను మాటిమాటికి కుట్టునే గాని ఊరకుండదు. కాన ఇతర వస్తువులపై ఆశ వదలి చెడుసోకని దొడ్డ మహిమలు గల శ్రీవేంకటేశ్వరుని దయకై పెద్దగా ఆశపడుట మేలు. అట్టివారి కే విషయమునను ఎట్టి కొఱతయు నుండదు. భగవత్కృపపై ఆశపెట్టుకొనుట వలన గలుగు మేలు ఎప్పుడును కొఱతపడదని భావము.

**విశేషాంశములు :-** శరీరము వికృతపు త్రోవలో నడచుట, చిత్తము పాపకృత్యముల వైపు పరుగులిడుట జీవులకు స్వభావమైయున్నది. ఈ దుఃస్థితి తొలగుటకు భగవద్దయ తప్ప వేరుమార్గము లేదు. కాన దానికొఱకై మనుజుడు ప్రయత్నింపవలెనని తాత్పర్యము.

ఈ పాటలోని భావమే ప్రకారాంతరమున మరొక సంకీర్తనమున నిట్లు నిబంధింప బడినది.

## సామంతం

ఎన్నఁడు మంచివాఁడ నయ్యేను నేను
నన్ను నీవే మన్నించి నడపవే దైవమా ! ॥ పల్లవి ॥

వేపమానికిని చేదు విడువకయుండేది
యేపొద్దు సహజమే యెంతైనాను,
పాపపుణ్యాలంపటాన బరగివుండేటి నేను
చాపల దుర్గుణి నౌట సహజమే. ॥ ఎన్న ॥

పాముకు విషమెప్పుడు పండ్లఁబెట్టు కుండేది
భూమిలో సహజమే పొరినెంతైనా,
కామక్రోధుఁడ నాకుఁ గరుణ యించుక లేక
సామజపు దుర్మదము సహజమే. ॥ ఎన్న ॥

అటుగాన శ్రీవేంకటాధిప ! నాకిఁక వేరే
తటుకున నేఁడు శాంతము వచ్చీనా ?
ఘటన నీకృపయందు గలిగిన మేలు నాపై
తటుకన ముంచి నన్ను దరిచేర్చవే.[1] ॥ ఎన్న ॥

## 28

అవతారిక :- పరమాత్ముని సేవ మోక్షప్రదమను విషయమును వ్యాజస్తుతిచే నిరూపించుచున్నాడు-

### ముఖారి

సేవింతురా యితనిఁ - జెలఁగి పరులిట్లనే
కావించె మమ్మునె - క్కడి దైవ మితఁడు. ॥ పల్లవి ॥

1. పాలచవి యితఁడెఱుఁగు - పాలఁబవళించె గో
పాలుఁడని నేమితని - భజియించఁగా,
పాలుపడి తల్లిచను - బాలు సహితంబు నే
కాలమునుఁ బాపె నె - క్కడి దైవ మితఁడు ॥ సేవిం ॥

2. పుట్టింపఁ దానె మఱి - పురుషోత్తముఁడు మంచి
పుట్టు వొసగీననుచుఁ - బూజించఁగా,
పట్టుకొని మముఁదెచ్చి - బలిమిఁబుట్టువు లెల్లఁ
గట్టి పెట్టించె నె - క్కడి దైవమితఁడు. ॥ సేవిం ॥

(1) అ. సం., 8-71.

3. కర్మ కర్తారుఁడని - కడలేని పుణ్యముల
కర్మఫలములు దనకుఁ - గైకొలుపఁగా,
కర్మగతిఁ దెచ్చి వేం - కటవిభుఁడు మా ఉభయ
కర్మములఁ జెరిచె నె - క్కడిదైవ మితఁడు ॥ సేవిం ॥

3. కర్మకర్తారుఁడు = కర్మములకు కర్త. ('కర్త' అను అర్థములో 'కర్తార' అను ప్రయోగము కన్నడమున గలదు.) ఉభయకర్మములఁ = పాపపుణ్యములను.

భావము :- మేము సేవించగా ఈ దేవుడు మమ్మిట్లు చేసినాడు. ఇక ఇతరు లితనిని మనసొప్పి సేవింతురా ? ఇత డెక్కడి దైవము ?

ఇతడు పాలరుచి తెలిసినవాడు. కృష్ణావతారమున పాలు దొంగిలించి త్రాగినవాడు గదా! మరియు పాలలోనే (క్షీరసాగరముననే) శయనించిన గోపాలుడు గదా ! కాన ఇతనిని సేవించినచో పాలకు లోటే ఉండదని సేవించితిమి. కాని ఇతడు మాకు తల్లి చనుబాలు సైతము ఇకనెప్పటికిని లేకుండ చేసినాడు. ఇతడేమి దైవము?

జీవుల జననములకు కారణభూతుడు ఈ పురుషోత్తముడే. ఇతనిని పూజించినచో మనకు సకలైశ్వర్య సంపన్నమై, ఎట్టి లోటులేని మంచి జన్మమును ఇతడనుగ్రహించునని పూజించితిమి. కాని ఈ దేవుడు అందుకని పూని బలాత్కారముగా మాకిక ఎట్టి పుట్టుకయు లేకుండ చేసినాడు. ఇట్టి వాడెట్లు దైవమగును ?

ఇతడు కర్మలకన్నిటికిని కర్త కావున సత్కర్మలతో ఇతని నారాధింతుమేని ఇంకను సత్కర్మల నాచరించు భాగ్యమబ్బునని నమ్మి ఎన్నో పుణ్యకర్మము లొనర్చితిమి. ఆ కర్మఫలములనెల్ల ఈ దేవునకే సమర్పించితిమి. కాని కర్మగతిని ప్రవర్తింప జేసిన శ్రీవేంకటేశ్వరుడు మా పాపపుణ్యాత్మకములైన ఉభయకర్మలను సమూలముగా నశింపజేసినాడు. ఇతడేమి దైవము?

**విశేషాంశములు :-** భగవత్సేవ వలన మఱల జన్మించి తల్లి చనుబాలు గ్రోలవలసిన దుర్గతి అనగా పునర్జన్మము తొలగిపోవుననియు , పుణ్యకర్మముల ఫలములను భగవంతునికి సమర్పించిన పాపపుణ్యాత్మకములగు ఉభయకర్మలు నశించి మోక్షము కరస్థమగుననియు తాత్పర్యము.

జనన మరణాత్మకమై తరింపరాని సంసారసాగరమును దాటుటకు గోవింద

భజనమే శరణ్యమని భజగోవిందస్తవమున శంకరాచార్యులు సెలవిచ్చియున్నారు -

పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్ ।
ఇహ సంసారే బహు దుస్తారే కృపయాఽపారే పాహి మురారే ॥[1]

వివిధ ప్రాణుల జననములకు భగవంతుడే హేతువగుచున్నాడు. యోని స్థానమైన ప్రకృతి ( మహత్బ్రహ్మ) యందు సృష్టిబీజము నుంచువాడు తానే అనియు, సమస్తప్రాణులు అందుండియే జనించుచున్న వనియు, కాన జీవులకెల్ల బీజప్రదుడైన తండ్రి తానే అనియు గీతలో పరమాత్ముడు వచించెను -

మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్ ।
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత ! ॥[2]
సర్వయోనిషు కౌన్తేయ ! మూర్తయః సంభవన్తి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా ॥[3]

మరియు శుభాశుభరూపములైన కర్మబంధనములనుండి విడివడి పరమాత్ముని జేరుటకు సమస్త కర్మఫలములను భగవంతునకు సమర్పించుటయే ఉపాయమని గీత బోధించుచున్నది -

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ ! తత్కురుష్వ మదర్పణమ్ ॥[4]
శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాము పైష్యసి ॥[5]

పుణ్య పాప రూపములైన ఉభయకర్మములు విలయమొందినప్పుడే ముక్తి సిద్ధమగును. 'పుణ్యాపాపే విధూయ' అని ముండకోపనిషత్తు.

భగవత్ప్రాప్తి కలుగలేదను చింతతో పాపము, భగవచ్చింతనచే కలిగిన ఆహ్లాదముతో పుణ్యము నశింపగా పరబ్రహ్మస్వరూపియగు పరమాత్ముని చింతించుచు ముక్తినొందిన ఒకగోప కన్యక విష్ణుపురాణములో ఇట్లు వర్ణింపబడినది-

తదప్రాప్తి మహాదుఃఖ విలీనాశేషపాతకా ।
తచ్చిన్తా విపులాహ్లాద క్షీణపుణ్యచయా తథా ॥[6]

---

(1) భజగో., 21. (2) గీత., 14-3. (3) గీత., 14-4.
(4) గీత., 9-27. (5) గీత., 9-28. (6) విష్ణు., 5-13-21.

చిన్తయన్తీ జగత్సూతిం పరబ్రహ్మస్వరూపిణమ్ ।
నిరుచ్ఛ్వాసతయా ముక్తిం గతాఽన్యా గోపకన్యకా ॥[1]

ఈ సంకీర్తనము పైకి భగవంతుని నిందించినట్లున్నను, నిజముగా నది స్తుతిలోనే పర్యవసించు చున్నది గాన వ్యాజస్తుతి. వాచ్యమైన నిందచే స్తుతిగాని, స్తుతిచే నిందగాని వ్యక్తమైనచో వ్యాజ స్తుత్యలంకారమగును -

నిన్దయా వాచ్యయా యత్ర స్తుతిరేవావగమ్యతే ।
స్తుత్యా వా గమ్యతే నిన్దా వ్యాజస్తుతి రసౌ మతా ॥[2]

## 29

అవతారిక :- తిండికై పడరాని పాట్లు పడుట, పరులపట్ల దుష్ప్రవర్తన తగదని హెచ్చరించుచు ఆశకు వశము గాక సదా భగవత్సేవలో కాలము గడపవలెనని ప్రబోధించుచున్నాడు -

### గుండక్రియ

కడుపెంత తాఁగుడుచు - కుడు పెంత దీనికై
పడని పాటు[3]ల నెల్లఁ - బడి పొరలనేలా ? ॥ పల్లవి ॥

1. పరుల మనసునకు నా - పదలు గలుగఁగ జేయు
పరితాపకరమైన - బ్రదుకేలా ?,
సొరిది నితరుల మేలు - చూచి సైపఁగ లేక
తిరుగు చుండెడి[4] కష్ట - దేహమిది యేలా ? ॥ కడు ॥

2. ఎదిరి కెప్పుడుఁ జేయు - హితమెల్లఁ దనదనుచు
చదివి చెప్పని యట్టి - చదువేలా ?
పొదిగొన్న యాసలోఁ - బుంగుడై సతతంబు
సదమదంబై పడయు - చవులు దనకేలా. ॥ కడు ॥

3. శ్రీవేంకటేశ్వరుని సేవారతికిఁ గాక
జీవన భ్రాంతిఁబడు - సిరులేలా ?

(1) విష్ణు., 5 13-22. (2) ప్ర.రు., 6-203.

(3) 'పాట్లు' అని రేకలోని రూపము. పాట సౌకర్యమునకై శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు 'పాటులు' అని సవరించిరి. (చూడు - తా. పా. II P 39.)

(4) 'తిరుగుచుండేటి' అను రూపము మాత్రాధికము.

దేవోత్తముని నాత్మఁ - దెలియ నొల్లక పెక్కు
త్రోవలేగిన దేహి - దొరతనం బేలా. ॥ కడు ॥

ప ॥ :- కుడుపు = తిండి; పాటులు = అవస్థలు.

1. పరితాపకరము = (ఇతరులకు) బాధ కలిగించునది, లేదా (ఇతరులదృష్టిలో) అయ్యో పాపమనిపించుకొన్నది, సారిదీఁ = క్రమముగా.

2. చదివి చెప్పని యట్టి చదువు = శ్రుతిస్మృత్యాదుల నుదాహరించి చెప్పని విద్య, పొదిగొన్న = గుంపులుగా పైబడిన, బుంగుడై = బుంగుడువడి, మునిగి, సదమదంబై నలుగుడువడి, చవులు = రుచులు.

**భావము** :- మనుజానిది జేనెడు పొట్ట. దానికి పట్టెడన్నము పడవేసిన చాలును. ఈ కొద్దిపాటి తిండికై పడరాని దురవస్థలు పడి నవయుటెందుకు ?

ఇతరుల మనస్సును కష్టపెట్టు బ్రదుకెందుకు ? అట్లు కష్టపెట్టి పాపము మూట గట్టుకొని ఇతరులచే అయ్యో పాపమనిపించుకొను దయనీయమైన జీవనముచే ప్రయోజనమేమి? పరుల మేలు చూచి సైరింప జాలక అసూయతో గూడి ఇటునటు తిరుగులాడు ఈ తుచ్ఛమైన తనువును మోసినందువల్ల లాభమేమి?

ఇతరులకు చేయు మేలంతయు తనకు తాను చేసికొన్న మేలే అను భావమును శ్రుతి స్మృతి పురాణాదుల వాక్యములతో సమన్వయించి చెప్పజాలని చదువు చదివి మాత్రము ఉపయోగమేమి ? ఆశలు పెంచుకొని అందులో మునిగి ఎల్లప్పుడు వలిమాకలై అనుభవించు తుచ్ఛభోగము లెందుకు ?

శ్రీవేంకటేశ్వరుని సేవలకై వినియోగపడక చంచలమైన జీవనమందే భ్రాంతి పెంపొందింపజేయు సంపదలెందుకు ? ఆ దేవాధిదేవుని హృదయములో గుర్తింపక భౌతికవాంఛలకు లోనై నానామార్గములలో పయనించిన జీవుని దొరతనము నిరుపయోగము గదా !

**విశేషాంశములు** :- జేనెడు పొట్ట నింపుటకై అడ్డమైన వారినెల్ల సేవించి నానాదురవస్థలు పొందదగదు. ఇతరులను నొప్పింపరాదు. పరులమేలు చూచి అసూయ పడరాదు. ఇతరుల కొనర్చు ఉపకారము తనకుతాను చేసికొను ఉపకారముగనే భావింపవలెను. అట్లొనర్పక పలుపోకల బోయినచో ప్రయోజనము శూన్యమని భావము.

ఒరులను నొప్పించు టెంతమాత్రము తగదని సర్వశాస్త్రములు సాక్షీకరించుచున్నవి. ఒరుల కపకారమొనర్పకుండుటే అత్యుత్తమ ధర్మముగా భారతము పేర్కొనుచున్నది -

ఒరు లేయవి యొనరించిన
నరవర ! యప్రియము తన మనంబున కగు; తా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్[1].

ఇతరుల మేలు చూచి సైపజాలనివాడు తీవ్రవేదనకు గురియగునని విదురుని సూక్తి-

పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవులులేని వేదనంబడు నధిపా ![2]

ఇతరులను హింసింపకుండుటకును, ఇతరుల మేలు చూచి ఓర్చుకొనుటకును, ఇతరులకు జేయు హితము తనదే అని భావించుకొనుటకును సర్వసమదర్శనమే కారణ మగుచున్నది. 'ఆత్మవత్ సర్వభూతాని యః పశ్యతి స పశ్యతి' అన్నదే సమస్త శాస్త్రముల సారము. 'సమస్తప్రాణులు తనవంటివే. తనలో నున్న పరమేశ్వరుడే సర్వభూతములలో నున్నాడు' అను సమదర్శనము గలవాడే జ్ఞాని. అట్టి జ్ఞాని సర్వోత్కృష్టగతి నొందునని భగవద్గీత చెప్పుచున్నది-

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥[3]
సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాంగతిమ్ ॥[4]

జీవితమునకు ముఖ్యప్రయోజనము భగవత్సాక్షాత్కారము. దానికి ముఖ్యసాధనము భక్తి. భగవంతుని భజింప నొల్లక ఇతర మార్గములలో జీవులు పడు ప్రయాసలెల్ల వ్యర్థములే. అందుచేతనే భగవద్భక్తి హీనుని జాతి, శాస్త్రము,

(1) భార. శాంతి., 5-220. (2) భార. ఉద్యో., 2-58.
(3) గీత., 13-28. (4) గీత., 13-29.

జపము, తపము మొదలగునవి శవాలంకరణ ప్రాయములని పెద్దలసిరి -

భగవద్భక్తి హీనస్య జాతి శ్శాస్త్రం జపస్తపః ।
అప్రాణ స్యేవ దేహస్య మండనం లోకరంజనమ్ ॥[1]

ఈ సంకీర్తనము నందలి పల్లవిలోని భావమే -

''జుట్టెడు కడుపుకై చొరనిచోట్లు చొచ్చి
పట్టెడు కూటికై బతిమాలి''

అని మరొక చోటగూడ చెప్పబడినది. ఇట్టి భావసంవాదము సువిస్తృతమైన అన్నమయ్య వాఙ్మయములో విరివిగా కానవచ్చును.

## 30

అవతారిక :- సుఖమువలె పైకి దోచు సంసారము భగవద్భక్తి గలుగునంతవరకు దుఃఖమునే కలిగించుననుచున్నాడు -

### శ్రీరాగం

ఇదివో సంసార - మెంత సుఖమో కాని
తుదలేని దుఃఖమను - తొడవు గడియించె. ॥ పల్లవి ॥

1. పంచేంద్రియంబులను - పాతకులు దనుఁదెచ్చి
కొంచెపు సుఖంబునకుఁ - గూర్పఁగాను,
మించి కామంబనెడి - మేటి తనయుండు జని
యించి దురిత ధన - మెల్ల గడియించె. ॥ ఇది ॥

2. పాయ మనియెడి మహా - పాతకుఁడు తనుఁదెచ్చి
మాయంపు సుఖమునకు - మరుపఁగాను,
సోయగపు మోహమను - సుతుఁడేచి గుణమెల్లఁ
బోయి యీ నరకమను - పురము గడియించె. ॥ ఇది ॥

3. అతిశయుండగు వేంక - టాద్రీశుఁడను మహా
హితుఁడు చిత్తములోన - నెనయఁగాను,

(1) మా. ప్ర. P. 203.

మతిలోపల విరక్తి - మగువ జనియించి యి
ప్రతి యయి మోక్షసం - పదలు గడియించె ॥ ఇది ॥

ప॥:- తొడవు = భూషణము.

1. దురితధనము = పాపమనెడు సొమ్ము.
2. ప్రాయము = ప్రాయము, యౌవనము; ఏచి = విజృంభించి.
3. అప్రతి = సాటిలేనిది.

**భావము** :- ఇదిగో సంసారమును మేము సుఖమని చేపట్టితిమి. దీనిచే గలుగు సుఖమెంతదో కాని చివరికిది అంతులేని దుఃఖమను భూషణమునే సంపాదించినది.

శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము అను ఐదింద్రియము లనెడు పాపాత్ములు తన్ను పట్టుకొనివచ్చి స్వల్పాతి స్వల్పమైన సంసారసుఖమున కంట గట్టిరి. అంతట 'కామము' అను గడుసరికొడుకు తనలో పుట్టి పెరిగి పాప మనెడు ధనమును కొల్లలుగా ఆర్జించినాడు.

ఎలజవ్వన మనెడు మహాపాపాత్ముడు తన్ను గొనితెచ్చి మాయలమారి సంసారసుఖమునకు మరపినాడు. వెంటనే ముచ్చటైన 'మోహము' అనెడు కొడుకు పుట్టి పెద్దవాడై విజృంభించి తనలోనున్న గుణములనెల్ల హరించి తుదకు నరకమను పట్టణమును గడించినాడు.

మహామహిమోపేతుడగు శ్రీవేంకటేశ్వరుడను గొప్ప హితము గూర్చువాడు హృదయములో పొదలినాడు. అంతట మదిలో 'విరక్తి' అను కూతురు జనించినది. ఆమె సాటిలేనిదై అతిశయించి మోక్షసంపద లార్జించి పెట్టినది.

**విశేషాంశములు** :- ఈ పాటలో 'కామమోహములు' పుత్రులుగాను, 'విరక్తి' పుత్రికగాను పేర్కొనబడినవి. దుష్టుడైన కొడుకు కంటె గుణవతియైన కూతురే మేలన్న విషయము దీనిచే గ్రాహ్యము.

**మిసమిస మెరువంగ మెల్లన చేరిరి; ముసిడిమావి ఫలములు చూచి.**
**రసమని సంసారపు బాలకులిదె; విసిగి చేదుగని విరుగగ లేరు.**[1]

అని మరొకచో అన్నమయ్య పాడినాడు. జీవులు సంసారమును సుఖప్రదమని

(1) అ. సం., 11-2-4.

భ్రమించి సేవించుచున్నారు. కాని 'సంసార ఏవ దుఃఖానాం సీమాన్త ఇతి కథ్యతే' అన్నట్లు సంసారము దుఃఖములకెల్ల పరాకాష్ఠ యని గుర్తింపనగునని పదకవితా పితామహుడిట స్పష్ట మొనర్చినాడు.

ఇంద్రియ సుఖముల నాశించి జీవులు కామక్రోధాదులకు గురియగుచున్నారు. రజోగుణముచే గలుగు కామక్రోధములు మహాశనము, మహాపాప స్వరూపమునైన శత్రువులని గీత బోధించుచున్నది.

కామ ఏష క్రోధ ఏష రజో గుణ సముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ [1]॥

అట్లే యౌవనమునందు మోహము పెరిగి జీవులు దుశ్చేష్టలొనర్చి తుదకు నరక మనుభవింతురు. ఈ దుఃస్థితినుండి తొలగుటకు చిత్తములో భగవంతుని భక్తితో భావింపవలెను. అప్పుడైహికభోగములపై విరక్తి గలుగును.

గతః కామకథోన్మాదః గలితో యౌవనజ్వరః ।
గతో మోహశ్చ్యుతా తృష్ణా కృతం పుణ్యాశ్రమే మనః [2]॥

అని దండి చెప్పిన చొప్పున వైరాగ్య మొదవినంతనే కామము, యౌవన మదము, మోహము, ఆశ మున్నగునవి తొలగి పుణ్యాశ్రమవాసమున నభిలాష మేర్పడును. భక్తి పండిన కొలది ముక్తి కరతలామలక మగును.

## 31

అవతారిక :- నిత్య కృత్యములను భగవత్పరము లొనర్చి సుఖించవలెనని ప్రబోధించుచున్నాడు -

### శ్రీరాగం

కాకున్న సంసారగతు లేల ?
లోక కంటకములగు - లోభంబులేల ? ॥పల్లవి॥

1. వినికి గన వలసినను - విష్ణుకీర్తన చెవికి
వివికి చేసిన నదియె - వేదాంతబోధ,
మనికి గనవలసినను - మధువైరిపై భక్తి
యునికి ప్రాణులకు బ్ర - హ్మోపదేశంబు ॥కాకున్న॥

(1) గీత., 3·37. (2) కావ్యా., 2-248

2. చదువు గనవలసినను - శౌరినామము దిరుగఁ
జదువుటే సకల శా - స్త్రముల సమ్మతము,
నిదుర గనవలసినను - నీరజాక్షునికిఁ దన
హృదయ మర్పణసేయు - టిది యోగ నిదుర ॥ కాకున్న ॥

3. ఆసవలసిన వేంక - టాధీశ్వరుని కృపకు
నాస సేయుటె పర - మానంద సుఖము,
వాసి గనవలసినను - వైష్ణవాగారంబు
వాసిసేయుట దనకు - వైభవస్ఫురణ. ॥ కాకున్న ॥

1. మధువైరి = మధువను రక్కసునకు శత్రువైన మాధవుడు.

3. వాసి = ప్రసిద్ధి, ప్రతిష్ఠ; వైష్ణవాగారంబు = విష్ణుని గుడి.

భావము :- ఈ చెప్పబోవు కార్యములు చేయకపోయినప్పుడు సంసారములో ప్రవర్తించు టెందుకు? లోకమున కుపద్రవకరములైన లోభములచే ప్రయోజనమేమి?

ఏదేని వినవలెనని కోరిక గలిగినచో విష్ణుసంకీర్తనమును వీనులవిందుగా వినవలెను. అదియే వేదాంతబోధ శ్రవణమై శ్రేయ మొడగూర్చును. అట్లు కాక లౌకికగాథ లెన్ని విన్నను ప్రయోజనము సున్న. ప్రయోజనకరమైన బ్రదుకు బ్రదుకవలెనని తలంపు గల్గినచో మాధవునిపై భక్తి గలిగి యుండవలెను. ఆ భక్తియే జీవులకు బ్రహ్మోపదేశమై ముక్తి గలిగించును. భగవదితరములైన పదార్థములపై భ్రాంతిపడి జీవించువాని జీవితము నిజమైన జీవితము గాదు.

చదువవలెనని వాంఛయున్నచో శ్రీహరినామమును మాటిమాటికి నోరార చదువ (జపించ)వలెను. అట్లొనర్చుటే సకలశాస్త్రసమ్మతమైన చదువై విద్యాఫలమైన అమృతత్వమును సిద్ధింపజేయును. 'విద్యయాऽమృత మశ్నుతే[1]' అని మనువు. నిద్రింపవలెనని భావనగల్గినచో హృదయమును ఇతర వస్తువులనుండి తొలగించి పద్మనేత్రునకు సమర్పింపవలెను. అట్లు చేయుట యోగనిద్ర యనబడును. అట్లు కానిది తమోగుణము పైకొనుటచే గల్గు మోహనిద్రయే యగును.

ఆశపడవలసినచో కృపానిధియైన శ్రీవేంకటేశ్వరుని దయ కాసపడుటే యుక్తము. దానిచే పరమానందసుఖము గలుగును. తదితరములపై పెంచుకొన్న

(1) మను., 12-104.

ఆశ జీవుని బద్ధుని జేయును.

లోకములో ప్రతిష్ఠ నొందవలెనని తలంపు గల్గినచో విష్ణ్వాలయమును ప్రతిష్ఠించి ప్రతిష్ఠ నొందవలెను. అది తన వైభవమును స్ఫురింపజేసి మేలు చేకూర్చును. ఇతర నిర్మాణములచే గలుగు పేరు ప్రతిష్ఠలు శాశ్వతసుఖము నొసంగజాలవు.

విశేషాంశములు :- లౌకికగాథలవినికి, హరిభక్తిలేని బ్రతుకు, భగవత్ప్రబోధములేని చదుంవులు, తామసికమైన నిద్ర, లౌకిక వస్తువులపై ఆశ, భగవత్పరముగాని కార్యములచే గలుగు ప్రసిద్ధి జీవుని పరమాత్మునికి దూరమొనర్చును గాన నిష్ఫలములగు చున్నవి. వాటిపై లోభము వదలి జీవితమును పరమాత్మ పరమొనర్చి సుఖించవలెనని తాత్పర్యము.

'నామస్మరణా దన్యోపాయం న హి పశ్యామో భవతరణే ।'

అని పెద్దలు చెప్పినట్లు సంసారతరణమునకు భగవన్నామ కీర్తనమునకన్న సులభోపాయము లేదు. మరియు తన సర్వస్వమును భగవత్పరము చేయుటే భక్తికి పరమావధి. కావుననే ప్రహ్లాదు డిట్లన్నాడు-

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁదవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి
దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి ! [1]

(1) భాగ., 7-169.

## 32

అవతారిక :- భగవంతుని చంద్రునిగా, కల్పవృక్షముగా, చింతామణిగా రూపించుచు నీలవర్ణమునకు కారణము నుత్ప్రేక్షించుచున్నాడు -

### శ్రీరాగం

సకల సందేహమై - జరుగుచున్నది యొకటి
ప్రకటింప జీవమో - బ్రహ్మమో కాని. ॥ పల్లవి ॥

1. వసుదేవు జఠరమను - వననిధికిఁ జంద్రుఁడై
అసమానగతిఁ బొడమి - నాఁడీతఁడు,
వసుధఁ జంద్రుఁడు నీల - వర్ణుఁడేటికి నాయ
కసరెత్తి నునుఁగందు - గలయఁగొనఁబోలు. ॥ సకల ॥

2. ఇన వంశమున లోక - హితకల్పభూజమై
అనఘుఁడై జనియించి - నాఁడీతఁడు,
ననుపైన సురతరువు - నల్లనేఁటికి నాయ
పెనుఁగొమ్మలో చేఁగ - పెరిగి రాఁబోలు. ॥ సకల ॥

3. తిరువేంకటాద్రిపైఁ - దెలియఁ జింతామణై
అరిదివలెఁ బొడచూపి - నాఁ డీతఁడు,
గరిమెనది యిపుడు చీఁ - కటి వర్ణమేలాయ
హరి నీల మణుల ప్రభ - లలమి కొనఁబోలు. ॥ సకల ॥

1. జఠరము = గర్భము; వననిధికిఁ = సముద్రమునకు; అసమానగతిఁ = సాటిలేనిరీతిగా; కసరు = కోపము.

2. లోకహితకల్పభూజమై = లోకమునకు మేలు గూర్చు కల్పవృక్షమై; అనఘుఁడై = పాపరహితుడై; ననుపైన = ఇంపైన; సురతరువు = కల్పవృక్షము.

3. అరిది = దుర్లభము; హరినీలమణుల ప్రభలు = ఇంద్ర నీలమణుల కాంతులు.

భావము :- సమస్త లోకమునకు సందేహము గలిగించుచు ఒకటి ప్రవర్తించుచున్నది. దాని స్వరూపము ఇదమిత్థమని నిశ్చయించి ప్రకటించుటకు అది జీవకోట్లలో ఒకటైన జీవమో, లేక సాక్షాత్పరబ్రహ్మమో తెలియుటలేదు.

ఈ దేవుడు వసుదేవుని గర్భమనెడు సముద్రమునకు చంద్రుడై పాటిల్లే రీతిగా పుడమి యందుదయించినాడు. చంద్రుడైనచో తెల్లగా నుండవలెను గదా ! నల్లని వాడెట్లైనాడు ? ఈ చందమామలోని మచ్చ కోపగించి దేహమంతట వ్యాపించియుండ బోలును !

కోపమునకు కారణ మేమన దివినున్న చంద్రునిలో మచ్చ నియతస్థలము నుండి వ్యాపింపజాలకున్నది. భువినున్న చంద్రునైన ఆక్రమించుకొందమన్న పట్టుదలతో అది యట్లు చేసియుండవచ్చును. లేదా మా చంద్రునకొక మారుచంద్రుడా అన్న కోపముతోనైన అది యీ చంద్రుని ఆవరించియుండవచ్చును.

సూర్యవంశమునందు లోకమునకెల్ల మేలు గూర్చు కల్పవృక్షమై పాపరహితుడై ఈ దేవుడు (శ్రీరాముడుగా) జనించినాడు. కల్పవృక్షమైనచో తెల్లగా ఇంపై యుండవలెను గదా ! ఇది యెందుకు నల్లబడినది ? ఇందలి పెద్దకొమ్మలోని చేవ పెరిగి చెట్టంతయు క్రమ్ముకొన్నది కాబోలు!

చేవబారిన చెట్టు నల్లనగుట సహజము. దివినున్న కల్పతరువు చేవ తక్కువై వెల వెల బారినది. దానికంటె దీనిలో చేవ ఎక్కువ యని చెప్పుటచే లోకహితము గూర్చుటయందు ఈ చెట్టుకే ( భగవంతునికే) ఆధిక్యము సూచింపబడినది.

శ్రీవేంకటాచలముపై ప్రకటముగా అత్యంతదుర్లభమైన చింతామణియై ఈ దేవుడు (వేంకటేశ్వరుడు) పొడచూపినాడు. చింతామణియైనచో చీకటిరంగేల గలిగినది ? ఇంద్రనీలమణుల కాంతులు విగ్రహమంతట వ్యాపించుటవలన గాబోలు!

దీనిచే శ్రీవేంకటేశ్వర విగ్రహమును అలంకరించు ఆభరణముల వైభవము కీర్తింపబడినది. కల్పవృక్షము, కామధేనువు, చింతామణి కోరిక లిచ్చుటలో ప్రశస్తి గాంచినవి. అవి తెల్లగా నుండుననుట కవిసమయసిద్ధము.

## 33

**అవతారిక :-** భగవంతుని హస్తమును వర్ణించుచు దశావతార చర్యలను కీర్తించుచున్నాడు -

### సామంతం

ఇందరికి నభయంబు - లిచ్చు చేయి
కందువగు మంచి బం - గారు చేయి. ॥ పల్లవి ॥

1 వెలలేని వేదములు - వెదకి తెచ్చిన చేయి
చిలుకు గుబ్బలి కిందఁ - చేర్చు చేయి,
కలికి యగు భూకాంతఁ - గాఁగిలించిన చేయి
వలనైన కొనగోళ్ల - వాఁడి చేయి ॥ ఇంద ॥

2. తనివోక బలిచేత - దాన మడిగిన చేయి
ఒనరంగ భూదాన - మొసఁగు చేయి,
మొనసి జలనిధి యమ్ము - మొనకుఁ దెచ్చిన చేయి
యెనయ నాగేలు ధరి - యించు చేయి. ॥ ఇంద ॥

3. పురసతుల మానములు - పొల్లసేసిన చేయి
తురగంబుఁ బరపెడి - దొడ్డ చేయి,
తిరువేంకటాచలా - ధీశుఁడై మోక్షంబు
తెరువు ప్రాణులకెల్లఁ - దెలిపెడి చేయి. ॥ ఇంద ॥

ప ॥ :- కందువగు = సమర్థమగు.
1. చిలుకుగుబ్బలి = మందర పర్వతము.
2. తనివోక = తృప్తినొందక; మొనసి = పూని.
3. పొల్లసేసిన = వ్యర్థము గావించిన.

భావము :- పరమాత్ముని దివ్యహస్తము ప్రపన్నులైనవారికి అభయంబు లొసంగునది. అది ఈ క్రింద చెప్పబోవు రీతిగా సకలవిధ నైపుణ్యములు గల మంచి మేలైన చేయి.

శ్రుతులను దొంగిలించి సముద్రములో దాగిన సోమకుని సంహరించి ఆ చేయి అమూల్యమైన వేదములను వెదకి తెచ్చినది. అమృతమునకై సురాసురులు క్షీరసాగరమును మథించునపుడు ఆ చేయి మందరాద్రిని నిలబెట్టుటకై దానిక్రింద జేర్చబడినది. హిరణ్యాక్షుడు భూమిని చాపచుట్టగా జుట్టి పాతాళమునకు ద్రోసినప్పుడు ఆ రక్కసుని సంహరించి భూదేవిని ప్రేమతో ఆలింగనము జేసికొన్న హస్తమది. భక్తోత్తముడైన ప్రహ్లాదుని మాట దక్కించుటకై స్తంభమున నావిర్భవించి హిరణ్యకశిపుని చీల్చి చెండాడిన వాడియైన కొనగోళ్ళు గల హస్తమిదే.

. దేవతలనుద్ధరించుటకై తాను సర్వేశ్వరుని హస్తముగా నుండియు తనకున్న దానితో తనివి నొందక బలిని దానమడిగిన హస్తమిది. ఇరువదొక్కమారులు

రణరంగమున క్షత్రియులను నురుమాడి స్వాధీనము గావించుకొన్న భూమినంతయు కశ్యపునకు దానమిచ్చిన హస్తమది. రావణుని బరిమార్చుటకై కపిసేనతో కదలిపోయినపుడు మార్గమధ్యమున అడ్డు దగిలిన సముద్రమును బాణాగ్రమునకు వశము గావించిన హస్తమది. నాగేలును ఆయుధముగా దాల్చిన హస్త మదియే.

ఆ చేయి త్రిపురాసురవనితల పాతివ్రత్యాభిమానములను చెఱచినది. అది దుష్టులను సంహరించుటకై గుఱ్ఱమును నలుదెసల బరపిన చేయి. మరియు శ్రీవేంకటగిరినాథుడై జీవులకందరికి ముక్తిమార్గము చూపుచున్న చేయిగూడ అదియే.

**విశేషాంశములు :-** ఇచట హస్తవర్ణన వ్యాజముతో దశావతారములయందు దేవుడు గావించిన ఘనకార్యములు పేర్కొనబడినవి.

> మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః ।
> రామో రామశ్చ కృష్ణశ్చ బుద్ధః కలికి రేవ చ ॥

అను మత్స్యాద్యవతారము లిందు క్రమము తప్పక కీర్తింపబడినవి.

భగవంతుని నామగుణకర్మములను కీర్తించుటయే లక్ష్యముగాగల ఈ విశాల సంకీర్తన వాఙ్మయమునందు ఎడనెడ పది యవతారములు పలువిధములైన ప్రక్రియలతో విరివిగా వర్ణింపబడినవి. అందొక ప్రక్రియకీ సంకీర్తనము చక్కని యుదాహరణము. 'బ్రహ్మ గడిగిన పాదము' అను పాట గూడ ఈ ప్రక్రియలోనిదే.

'అభయంబు లిచ్చుచేయి' అని యిట భగవంతుని చేయి అభయహస్తముగా వర్ణింపబడినది. 'అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ' [1] అని ప్రసన్నులైన వారికెల్ల తన అభయదాన దీక్షను దేవుడు ప్రకటించెను గదా !

'మోక్షంబు తెరువు ప్రాణులకెల్ల తెలిపెడు చేయి' అనుటచే నా పాదములే మీకు శరణ్యము లన్నటు పాదములవైపు చూపు వేంకటేశ్వరుని వైకుంఠహస్తము గుర్తింపదగియున్నది. 'మోక్షయిష్యామి మా శుచః' [2] అని శరణాగతులకెల్ల తవ మోక్షదానదీక్షను పరమాత్ముడు తెలిపియున్నాడు.

మున్ను పార్థునకు శరణములుగా ఏ తన చరణములను చూపినాడో, ఆ చరణములవే శ్రీవేంకటేశ్వరుడు మనకిప్పుడు ఆశ్రయణీయములుగా

(1) రామా., 6-18-33. (2) గీత., 18-66

మాపుచున్నాడని శ్రీవేంకటేశ్వర ప్రపత్తిలో వర్ణింపబడినది.

పార్థాయ తత్స దృశ సారథినా త్వయైవ
యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి ।
భూయోఽపి మహ్యమిహ తౌ కరదర్శితౌ తే
శ్రీవేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే [1] ॥

'తిరువేంకటాచలాధీశుడై మోక్షంబు తెరువు దెలిపెడి చేయి' అనుటచే ఇట భగవంతునకు, ఆయన చేతికి అభేదము వివక్షితమని గ్రహింపనగును.

## 34

అవతారిక :- సకల విధములైన చిక్కులనుండి జీవులను కాపాడువాడు ఆ భగవంతుడు దప్ప మరొకడు లేడనుచున్నాడు -

### సామంతం

అతఁడే సకలవ్యాపకుఁ - డతఁడే యాతురబంధువుఁ
డతఁడు దలంపుల ముంగిట - నబ్బుట యెన్నఁడొకో ॥పల్లవి॥

1. సారెకు సంసారంబను - జలనిధు లీదుచు నలసిన
వారికి నిఁక దరిదాపగు - వాఁడిఁక నెవ్వఁడొకో !
పేరిన యజ్ఞానంబను - పెనుఁజీఁకటి తముఁగప్పిన
చేరువ వెలుగై తోఁపెడి - దేవుఁడ దెవ్వఁడొకో ! ॥అతఁడే॥

2. దురితపు కాననములలో - త్రోవటు దప్పినవారికి
తెరువిదె కొమ్మని చూపెడి - దేవుఁ డదెవ్వఁడొకో !
పెరిగిన యాశాపాశము - పెడకేలుగఁ దనుఁగట్టిన
వెరవకుమని విడిపించెడి - విభుఁడిఁక నెవ్వఁడొకో ! ॥అతఁడే॥

3. తగిలిన యాపదలనియెడి - దావానలములు చుట్టిన
బెగడకుమని వడినార్పెడి - బిరుదిక నెవ్వఁడొకో !
తెగువయు దెంపును గలిగిన - తిరువేంకట విభుఁడొక్కఁడె
సొగసి తలంచినవారికి - సురతరువగువాఁడు. ॥అతఁడే॥

(1) వేం. ప్ర., 11.

ప॥:- ఆతురబంధువుడు = రోగార్తులకు చుట్టమైనవాడు.

3. దావానలములు = కార్చిచ్చులు; బొగడకుము = భయపడకుము; బిరుదు = శూరుడు: సమర్థుడు; తెగువ = దాతృత్వము; తెంపు = సాహసము; సొగసి = చొక్కి; సురతరువు: కల్పవృక్షము.

భావము :- ఆ శ్రీవేంకటేశ్వరుడే అంతటను వ్యాపించియున్నవాడు. రోగములచే క్రుంగి కృశించిన లేదా ఇతరవిధముల ఆపదలపాలైన ఆర్తులపాలిటి చుట్ట మతడే. ఆ పరమాత్ముడు నా తలపుల ముందు ప్రత్యక్షమై నాకు లభించు టెన్నడో గదా !

మాటి మాటికి సంసారమను సాగరము నీదుచు అలసి పోయిన జీవులకు రక్షకుడైనవాడు ఆ దేవుడు తప్ప ఇంకెవడు ? దట్టమైన అజ్ఞానమను పెనుచీకటి జీవుని ఆవరించిన వేళ దగ్గఱి ప్రకాశమై తోచి దారిజూపు మిత్రు డింకొకడేడి ?

పాపపు టడవులలో దారిదప్పి చరించువారికి ''ఇదిగో సరియైన దారి. ఇట్లు పొమ్ము!'' అని చూప గలదేవు డతడు గాక మరొకడు గలడా ? దినదినమునకు పెరిగెడు ఆశయను పాశము పెడకేల తన్ను బంధించినప్పుడు భయపడకుమని విడిపింపగల ప్రభువింకొక డెవడున్నాడు ?

పై కొన్న ఆపదలనెడు కార్చిచ్చులు తన్ను చుట్టు ముట్టినప్పుడు భీతి జెందకుమని వేగిరమునవచ్చి ఆ మంటల నార్పెడు శూరుడు ఆయన దప్ప మరొకడేడి? దాతృత్వము సాహసము సంపూర్ణముగా గలిగిన శ్రీవేంకటేశ్వరుడొక్కడే భక్తితో తన్ను మైమఱచి భావించినవారికి కల్పవృక్షమై తోచి కోరిక లీడేర్పగలవాడు.

**విశేషాంశములు :-** సంసారము, అజ్ఞానము, పాపము, ఆశ, ఆపదలు అనునవి జీవుని పైకొని నానావిధముల బాధించుచున్నవి. అజ్ఞానము సంసార హేతువు. పాపకర్మలు, ఆశ ఆపదలకు కారణములు. సంసారము మిగుల భయంకరమైనది గనుక సాగరముతో పోల్చబడినది. అట్లే అజ్ఞానము చీకటిగా, పాపము అడవిగా, ఆశ పాశముగా రూపించబడుటచే వాటివలన జీవులకు గల్గు చిక్కులు సూచింపబడినవి. వాటినుండి విడిపించుటకు శ్రీమన్నారాయణుడే సమర్థుడు. ఆయన సర్వత్ర వ్యాపించియున్నాడు. మరియు దీనుల పాలిటి దిక్కైనవాడు. కావ సంసార క్లేశమునకు గురియైనవారు, ఆ దేవునే శరణు వేడవలెను. దిక్కులేనివారికి దేవుడే గదా దిక్కు ! మున్ను విపన్నుడైన గజేంద్రుడు ఆ పరమేశ్వరు నెట్లు వేడుకొనెనో చూడుడు -

కలుగఁడే నా పాలికలమి సందేహింపఁ
గలిమిలేములు లేక కలుగు వాఁడు
నాకష్టపడరాఁడె నలి ననాథులచేఁ
బడిన సాధుల కడ్డపడెడువాఁడు
చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడక
చూచువారల కృపఁ జూచువాడు
లీలతో నామొఱా లింపడే మొఱఁగుల
మొఱలెఱుంగుచుఁ దన్ను మొఱఁగు వాఁడు

అఖిలరూపములు దనరూపమైనవాడు
ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు
భక్తజనముల దీనుల పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపడె వేగరాఁడె.[1]

ప్రహ్లాదుడు, ద్రౌపది, విభీషణుడు మొదలైన వారుగూడ ఇట్లే ఆ దేవుని శరణుపొచ్చి దుఃఖములకు దూరమైరి.

## 35

**అవతారిక :-** హరి సర్వోత్కృష్టుడని తెలిసియు పూర్వజన్మ పాపప్రభావమున జనులాదేవుని సేవించుట లేదనుచున్నాడు -

### గుండక్రియ

ప్రాణుల నేరమి గాదిది - బహుజన్మ పరంపరచే
ప్రాణులు సేసిన తమ తమ - పాపఫలము గాని. ॥ పల్లవి ॥

1. హరి సకలవ్యాపకుఁడని - అందరుఁ జెప్పఁగ నెరిఁగియు
పరదైవంబుల గొలువక - పాయరు మానవులు,
నరపతి భూమేలఁగ భూ - వరు భజియింపఁగ నొల్లక
పరిసరవర్తుల వెంబడిఁ - బనిసేసిన యట్లు. ॥ ప్రాణు ॥

2. పొందుగఁ దమతమ చేసిన - పూజలు మ్రొక్కులు గైకొన
అందముగాఁ బురుషోత్తముఁ - డాతఁడె కలఁడనియు,

(1) భాగ., 8-87.

అందరు నెరిఁగియు నితరులఁ - జెందుదు రున్నతశైలము
నందక చేరువ తరువుల - నందుకొనిన యట్లు. ॥ప్రాణు॥

3. శ్రీవేంకటపతి యొక్కఁడె - చెప్పఁగ జగముల కెల్లను
దైవము నాతుమలోపలి - ధనమనఁగా వినియు,
సేవింపరు పామరు లీ - దేవుని మధురం బొల్లక
వావిరిఁ బులుసులు చేఁదులు - వలెనని కొనునట్లు. ॥ప్రాణు॥

ప॥:- నేరమి = అజ్ఞానము, దోషము.
3. ఆతుమ = ఆత్మ; వావిరిఁ = మిక్కిలిగా.

భావము :- శ్రీమన్నారాయణుని ప్రాణులు సేవింపకుండుట వారి అజ్ఞానకృతమైన తప్పిదము గాదు. అనేక జన్మములలో వారొనర్చిన పాపకర్మముల ఫలమే వారివట్లు విష్ణుసేవావిముఖుల నొనర్చుచున్నది.

శ్రుతి స్మృతులతో పాటు పరతత్త్వము నెఱింగిన పెద్దలందరును శ్రీహరి అంతట వ్యాపించి సర్వోత్కృష్టుడై యున్నాడని చెప్పియున్నారు. అది తెలిసియు మనుజులు ఇతర దైవముల కొలువు వదలిపెట్టకున్నారు. హరిసేవలో ప్రవృత్తి వారికి కలుగుట లేదు. ఇది యెట్లున్నదన - ఒకరాజు రాజ్యమును పాలించు చుండగా అతనిని సేవింపబోక అతని చెంతనున్న చిన్నచిన్న ఉద్యోగుల వెంటబడి సేవించినట్లున్నది.

తాము చేసిన పూజలు, నమస్కారములు ప్రీతితో స్వీకరించి అనుగ్రహించుటకు పురుషోత్తముడైన శ్రీమహావిష్ణువు సిద్ధముగా నున్నాడని అందరు నెరుంగుదురు. ఐనను ఆయనను పూజింపక ఇతరులను భజించుచున్నారు. ఇది యెట్లున్నదన ఎత్తైనకొండ అందుబాటులో నున్నను దాని నధిష్ఠింపక చెంతనున్న చిన్న చెట్ల నందుకొన్నట్లున్నది.

శ్రీవెంకటేశ్వరుడొక్కడే లోకమునంతటిని పాలించుదైవము, జీవుల ఆత్మలలో నిగూఢమైయున్న ధనముగూడ ఆ పరమాత్ముడేయని వేదాంతులు అనేక విధముల జెప్పగా వినియు పామరు లాదేవుని సేవించుట లేదు. ఇది యెట్లున్నదన తీపు వద్దని తొలగద్రోసి పులుపు, చేదు కావలెనని మెండుగా మెసవినట్లున్నది.

**విశేషాంశములు** :- ఇచ్చట శ్రీహరినికాక ఇతరదేవతల నారాధించువారిని అన్నమయ్య ఈసడించినాడు. పురుషోత్తముడు, త్రిలోకాధిపుడు, పరమపద

పరతత్త్వమగు నారాయణుని సేవింపక, కొన్ని గ్రామములకధిపతియై కొద్దిపాటి ధనమునొసగు పురుషాధముని సేవించుటకు వెదకువారిని కులశేఖరుడుగూడ ఇట్లు ఖండించినాడు -

నాథే నః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి ।
యం కంచి త్పురుషాధమం కతిపయ గ్రామేశమల్పార్థదం
సేవాయై మృగయామహే నరమహో మూకా వరాకా వయమ్ [1]॥

## 36

అవతారిక :- ఇతరులను సేవించుట, యాచించుట, స్తుతించుట మున్నగు దుర్గుణములు తొలగించున్నాడు -

### శంకరాభరణం

ఛీఛీ నరుల దేఁటి - జీవనము
కాచుక శ్రీహరి నీవే - కరుణింతు గాక ! ॥పల్లవి॥

1. అడవిలో మృగజాతి - యైనాఁ గావచ్చుఁగాక
వడి నితరులఁ గొలు - వఁగ వచ్చునా ?
ఉడివోని పక్షియై - వుండనైన వచ్చుఁగాక
విడువ కెవ్వరినైనా - వేఁడ వచ్చునా ? ॥ఛీఛీ॥

2. పసురమై వెదలేని - పాటు పడవచ్చుఁగాక
కొసివో నొరులఁ బొగడఁ - గా వచ్చునా ?
ఉసురుమానై పుట్టి - వుండనైన వచ్చుఁ గాక
విసువక వీరి వారి - వేసరించ వచ్చునా ? ॥ఛీఛీ॥

3. ఎమ్మెలఁ బుణ్యాలు సేసి - యిల యేల వచ్చుఁగాక
కమ్మి హరిదాసుఁడు - గావచ్చునా ?
నెమ్మది శ్రీవేంకటేశ - నీ చిత్తమే కాక
దొమ్ముల కర్మము లివి - తోయవచ్చునా ? ॥ఛీఛీ॥

(1) ము, మా., 28.

1. ఉడివోని = శాశ్వతమైన.
2. పసురము = పశువు; కసివోఁ = తీటతీరునట్లుగా, మిక్కిలిగా; ఉసురుమాను = వృక్షవిశేషము. 'బ్రతికినమ్రాను' అని అర్థము చెప్పవచ్చునుగాని విశేషము కానరాదని శ్రీరాళ్లపల్లివారు; వేసరించవచ్చునా ? = విసిగించవచ్చునా ?
3. ఎమ్మెలఁ = పెద్దరికములచేత; కమ్మి = క్రమ్మి, వ్యాపించి; దొమ్ములు = దొమ్మిదొమ్మిగా కూడి పైబడునట్టి.

**భావము** :- ఛీఛీ ! మానవుల దెంత హీనమైన బ్రతుకు ! శ్రీహరీ ! నీవే మమ్ము కాచుకొని దయజూతువు గాక !

అడవిలో మృగమై పుట్టి జీవించినను జీవించవచ్చును గాని క్షుద్రమైన బ్రతుకుకొఱకు ఇతర మానవులను సేవించుట తగదు. సర్వదా కాకివంటి పక్షిగానైన బ్రదుకవచ్చును గాని ఇతరులను యాచించుట తగదు.

పశువై సుఖములేని పాట్లైన పడవచ్చును గాని లేని పోని మాటలతో పరుల నెక్కువగా పొగడుట తగదు. ఒక చెట్టుగానైన పుట్టి జీవించవచ్చును గాని తాను విసుగు జెందక అడ్డమైన వారినెల్ల విసిగించుట ఉచితము గాదు.

పెద్ద పెద్ద పుణ్యకార్యములు చేసి రాజైపుట్టి భూమిని పరిపాలించుటైన సులభమే కాని హరికి దాసుడై తదనుగుణమైన ప్రవృత్తి గలిగియుండుట సాధ్యము కాదు. శ్రీవేంకటేశ్వరా ! నీ చిత్తము చొప్పున నీవే మమ్ము కాపాడవలెను గాని గుంపులు గుంపులుగా పైబడుచున్న కర్మములను మాకు మేమై త్రోసివేసికొన జాలము.

**విశేషాంశములు** :- దీనమైన జీవితము తగదని ఈ సంకీర్తనము ప్రబోధించుచున్నది. మృగముగా, పిట్టగా, పశువుగా, చెట్టుగానైన జీవించవచ్చును గాని పరులను గొలిచి, యాచించి, పొగడి, విసిగించి, జీవించుట తగని పనియని అన్నమయ్య ఇట హెచ్చరించినాడు. ఇందుచే నరుల కలవాట్లైన పరసేవాదు లెంత నికృష్టములైనవో ఊహించుకొనవచ్చును.

## 37

**అవతారిక** :- వైష్ణవతత్త్వమును నిరూపించుచున్నాడు -

### మలహరి

వలె నను వారిదె - వైష్ణవము - ఇది
వలపుఁ దేనెపో - వైష్ణవము. ॥ పల్లవి ॥

1. కోరిక లుడుగుచు - గుఱి నిన్నిటిపై
వైరాగ్యమె పో - వైష్ణవము,
సారెకుఁ గోపముఁ - జలముఁదనలో
వారించుట పో - వైష్ణవము. ॥ వలె ॥

2. సుడిగొను దేహపు - సుఖదుఃఖములో
వడిఁ జొరనిదె పో - వైష్ణవము,
ముడివడి యింద్రియ - ముల కింకరుఁడై
వడఁబడనిదె పో - వైష్ణవము. ॥ వలె ॥

3. ఉదుటునఁ దనసక - లోపాయంబులు
వదలుట పో నిజ - వైష్ణవము,
ఎదుటను శ్రీవేంక - టేశ్వరు నామము
వదనము చేర్చుట - వైష్ణవము. ॥ వలె ॥

వ॥ :- వైష్ణవము = వైష్ణవ మతతత్త్వము.

1. గుఱిఁ = (భగవత్పరమైన) లక్ష్యముతో.
2. ముడివడి = విడిచి రాలేక తగులువడి; వడఁబడనిదె = తపింపక నిల్చినదే.
3. ఉదుటునఁ = సాహసముతో, పూనికతో.

**భావము :-** వైష్ణవ మత సిద్ధాంతము ఎవరు కావలెనని కోరుకొందురో వారి కందరికిని సంబంధించినదే. జాతి దేశాదిభేదములు దానికి లేవు. మఱియు వైష్ణవము పరిమళించు తేనెవలె మధురాతి మధురమైనది.

కోరికలు వదలి భగవత్పరమైన లక్ష్యము గలిగి భోగ్యవస్తువులపై పూర్తిగా వైరాగ్యము గల్గియుండుటే వైష్ణవము. మాటిమాటికి తనలో తలయెత్తు కోపము, మచ్చరము మున్నగు దుర్గుణములను నివారించుటే వైష్ణవమతతత్త్వము.

శరీరమునకు సంబంధించినవై సుడివలె చుట్టజుట్టుకొను సుఖదుఃఖాది ద్వంద్వములలో తగులువడక తాను దేహమునకు, సుఖదుఃఖములకు అతీతుడ నను భావముతో నుండుటే వైష్ణవమత రహస్యము. మరియు శ్రోత్రత్వక్చక్షురాదులగు ఇంద్రియములతో బంధింపబడి వాటికి దాసుడై తపింపక నిల్చుటయే వైష్ణవమతసారము.

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'[1] అని భగవంతుఁడానతిచ్చినట్లు పూనికతో సాత్త్వికత్యాగియై తన సకలోపాయములను వదలి భగవంతుని శరణు జొచ్చుటయే నిజమైన వైష్ణవము. శ్రీవేంకటేశ్వరుని పవిత్రనామమును వదనమున జేర్చుటయే, అనగా భక్తితో కీర్తించుటయే వైష్ణవ మతమునందలి పరమతత్త్వము.

విశేషాంశములు :- రామానుజులు మున్నగు ఆచార్యులు వైష్ణవమత సిద్ధాంతములను ప్రతిపాదించి జాత్యాదిభేదములను పాటింపక ప్రజలలో వ్యాపింపజేసిరి. విశిష్టాద్వైత మతమునకు సంబంధించిన సిద్ధాంతము లా యా మతగ్రంథములలో కూలంకషముగా చర్చించి నిరూపింపబడియున్నవి. మూల మతసిద్ధాంతము లెట్లున్నను సమస్త సన్మతములయొక్క సారాంశము జనులు సత్ప్రవర్తన గలిగి భగవంతుని భజించి ముక్తి నొందవలె ననుటయే. కావున అన్నమయ్య ఈ సంకీర్తనమునందు సద్వర్తనము గల్గియుండుటే నిజమైన వైష్ణవమత మగునని ప్రబోధించినాడు.

కోరికలు వదలుట, విరక్తి గల్గియుండుట, కోపమాత్సర్యాదులను త్యజించుట, సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుడైయుండుట, ఇంద్రియముల నిగ్రహించుట, సకలోపాయములు వదలి భగవంతుని శరణు జొచ్చుట, భగవద్దివ్యనామమును జపించుట పరమవైష్ణవ ధర్మములుగా ఇట పేర్కొనబడినవి.

ఒక్క వైష్ణవమతమే కాదు. ఆస్తికమతములన్నియు ఆత్మోన్నతి గోరువారికి పై ధర్మము లవశ్యము ఆచరింపదగినవనియే చెప్పుచున్నవి.

వైష్ణవుని లక్షణములను మరొక సంకీర్తనమున అన్నమయ్య ఇట్లు పొందుపరచెను.

ఆహిరి

మదమత్సరము లేక మనసు పేదై పో
పదరిన యాసలవాఁడు వో వైష్ణవుఁడు. ॥ పల్లవి ॥

1. ఇట్టు వట్టుఁ దిరిగాడి యేమైనాఁ జెడనాడి
పెట్టరంటాఁ బోయరంటాఁ బెక్కులాడి
ఎట్టివారి నైనా దూరి యెవ్వరినైనాఁ జేరి
వట్టి యాసలఁ బడనివాఁడు వో వైష్ణవుఁడు. ॥ మద ॥

---

(1) గీత., 18-66.

2. గడనకొలకుఁ జిక్కి కాముకవిద్యలఁ జొక్కి
సిడివి నేమైనాఁ గని నిక్కి నిక్కి
ఒడలి గుణముతోడ నుదుటు విద్యలఁ జాల
వడదాఁకి బడలనివాఁడు వో వైష్ణవుఁడు, ॥ మద ॥

3. ఆవల వొరులఁ జెడనాడఁగ వినివిని
చేవ మీరి యెవ్వరినిఁ జెడనాడక
కోవిదు శ్రీవేంకటేశుఁ గొలిచి పెద్దల కృప
వావి వర్తన గలవాఁడు వో వైష్ణవుఁడు.[1] ॥ మద ॥

## 38

అవతారిక :- భక్తి సులభమైన పరమాత్ముని స్వరూపమును వర్ణించుచున్నాడు -

### రామక్రియ

భక్తికొలఁదివాఁడే - పరమాత్ముడు
భుక్తి ముక్తిఁ దానె యిచ్చు - భువి పరమాత్ముఁడు ॥పల్లవి ॥

1. పట్టినవారి చేబిడ్డ - పరమాత్ముడు
బట్ట బయటి ధనము - పరమాత్ముఁడు,
పట్ట పగటి వెలుఁగు - పరమాత్ముఁడు
ఎట్ట యెదుటనేవున్నాఁ - డిదే పరమాత్ముఁడు. ॥ భక్తి ॥

2. పచ్చిపాలలోని వెన్న - పరమాత్ముఁడు
బచ్చెన వాసిన రూపు - పరమాత్ముఁడు.
బచ్చుచేతి వొరగల్లు - పరమాత్ముఁడు
ఇచ్చకొలఁది వాఁడు పో - యీ పరమాత్ముఁడు. ॥ భక్తి ॥

3. పలుకులలోని తేఁట - పరమాత్ముడు
ఫలియించు నిందరికి - పరమాత్ముఁడు,
బలిమి శ్రీవేంకటాద్రి - పరమాత్ముఁడు
ఎలిమి జీవుల ప్రాణ - మీ పరమాత్ముఁడు. ॥ భక్తి ॥

---

(1) అ. సం., 5-59.

2. బచ్చెన = పూత; బచ్చు = వైశ్యుడు; ఒరగల్లు = ఒరిపిడిరాయి.
3. బలిమి = శక్తి; ఎలిమి = ప్రేమ.

భావము:- పరమాత్ముడు భక్తి కొలది వాడు. అనగా పిండికొలది రొట్టె యున్నట్లు తనపట్ల జీవులెంతగా భక్తి చూపుదురో అంతగా వారిపట్ల ప్రసన్నత జూపువాడని భావము. సకల జీవులకు ఇటు భుక్తిని, అటు ముక్తిని ప్రసాదించువాడు ఆ పరమాత్ముడే.

పరమాత్ముడు తన్ను పట్టినవారికెల్ల చేతి బిడ్డవంటివాడు. కొందరు చిన్న బిడ్డలు పిలిచినవారందరి దగ్గఱకు పోయి వారిచే లాలింపబడుదురు. అట్లే భగవంతుడు గూడ తన్ను శ్రద్ధతో తలచిన భక్తులకెల్ల స్వాధీన మగుచున్నాడని భావము.

పరమాత్ముడు బట్టబయటి ధనము. భూమిలోపలి నిధియైనచో దానిని వెలికి దీయుటకు పలుప్రయత్నములు చేయవలయును. బట్టబయటనున్న ధనమైనచో అందరికి సులభముగా గ్రహింపనగును గదా ! అట్లే భగవంతుడు మరుగు లేక భక్తి గలవారికెల్లరికి సులభ సాధ్యుడగుచున్నాడు.

పరమాత్ముడు పట్టపగటి వెలుగువంటివాడు. రాత్రి వెలుగు ఎంత పెద్దదైనను పగటి వెలుగువలె కించిత్తైన మసక లేనిదిగా నుండదు. పగటి వెలుగు ఎట్టి సంశయముల కవకాశమియ్యక ప్రకాశించును. ఆ రీతిగనే భగవంతుడుగూడ సంశయముల కెడమియ్యక దివ్యతేజము గలిగి ప్రకాశించుచున్నాడు.

ఇదిగో పరమాత్ము డెదుటనే ఉన్నాడు. భగవంతుడు తన్ను భావించలేనివారికి ఎంతో దూరముగా నుండును. కాని భక్తితో భజించువారికి అత్యంత సన్నిహితుడుగనే ఉండును ఈ అభిప్రాయముతోనే శ్రుతి 'తద్దూరే తద్వన్తికే'[1] అని పరమాత్ముని దూరస్థునిగాను, సమీపస్థునిగాను వర్ణించినది.

పరమాత్ముడు పచ్చిపాలలో వెన్నవంటివాడు. అనగా వెన్న పచ్చిపాలలో అంతటను వ్యాపించియున్నట్లే భగవంతుడు సర్వత్ర వ్యాపించియున్నాడనుట మరియు పాలలోని వెన్న కాచి తోడుపెట్టనిదే చేతికందదు. పరమాత్ముడనెడు వెన్న అట్టి కష్టము లెవ్వియు లేక భక్తిమాత్రముచే స్వాధీనమగునని భావము.

పరమాత్ముడు పైపూతలేని రూపు. మన ముపయోగించు వస్తువులలో అనేకములు పైపూతవలన తళతళలాడుచు సుందరముగా దోచును. భగవంతుడట్టి వాడు కాడు. ఆయన సహజముగా సుందరమైనవాడు.

(1) ఈశ., 5.

పరమాత్ముఁడు స్వర్ణ వ్యాపారి చేతి ఒరపిడి రాయివంటివాడు. ఆ వ్యాపారి బంగారు విలువను ఒరగల్లుపై గీచి చూచును. అట్లే భక్తుడు భగవంతుని ఆధారముగా గ్రహించి సృష్టి విలువలను అర్థము చేసికొనును. మరియు భగవంతు డిచ్చకొలది మనపై అనుగ్రహము జూపువాడు అనగా ఎవడెంత పట్టుదలతో తన్ను ఆరాధించునో వాని నంతగా దయజూచువాడని గాని, లేదా తన యిష్టము వచ్చినట్లు నిగ్రహానుగ్రహములు ప్రదర్శించువాడని గాని తాత్పర్యము.

పరమాత్ముఁడు పలుకులలో తేట, వేదవేదాంతాది సమస్తవచనములలోను సారభూతమైనవాడు వాడే.

వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః
వేదాన్త కృద్వేదవిదేవ చాహమ్ ।[1]

అని గీతలో శ్రీకృష్ణుని వచనము. మరియు అందరికి సమానముగా ఫలియించువాడు పరమాత్ముఁడు, అనగా తన్ను సేవించువారిలో ఒకరికి సాక్షాత్కరించి మరొకరికి సాక్షాత్కరింపకుండ ఉండువాడు కాడనుట.

శ్రీవేంకటాద్రిపై నున్న పరమాత్ముఁడు శక్తిరూపుడు. మరియు ప్రేమ స్వరూపుడునై జీవులకు ప్రాణభూతమై యున్నాడు. దుష్టులపై నిగ్రహము. శిష్టులపై అనుగ్రహము రెండును భగవంతునిచే గలుగుచున్నవి గాన బలిమి, ఎలమి రెండును భగవత్స్వరూపములే.

**విశేషాంశములు :-** దుష్టులపై నిగ్రహము చూపినను వారిని గూడ తుద కారూపమున ననుగ్రహించుటవే తన లక్ష్యము గాన సర్వులకు రక్షకుడు పరమాత్ముఁడే. ఆయన దండనముగూడ సుగతి హేతువే యని పెద్దలనిరిగదా !

'దిశత్యేవం దేవో జనితసుగతిం దండనవిధిమ్।[2]

ఈ సంకీర్తనమున పరమేశ్వరుని భక్తిసౌలభ్యము చక్కగా వర్ణింపబడినది. 'నారాయణ' యని తన మంగళనామమును భక్తిపూర్ణహృదయముతో ఉచ్చరించిన వానిని దూడను గోవు వెంబడించినట్లు నారాయణుడు వెంబడించునని మహనీయులు వాకొనిరి -

నారాయణేతి యస్యాస్తే వదనే నామమఙ్గళమ్ ।
నారాయణస్త మన్వేతి వత్సం గౌరివ వత్సలా ॥[3]

(1) గీత., 15-15. (2) ద.శ., 64.(3)

## 39

అవతారిక :- లక్ష్మీ విలాసమును వర్ణించుచున్నాడు -

### గుండక్రియ

రూకలై మాడలై - రువ్వలై తిరిగీని
దాకొని ఉన్నచోటఁ - దానుండ దదివో. ॥పల్లవి॥

1. ఒకరి రాజుఁ జేసు - నొకరి బంటుగఁ జేసు
ఒకరి కన్నె కలవే - రొకరికి నమ్మించు,
ఒకచోట నున్న ధాన్య - మొకచోట వేయించు
ప్రకటించు కనకమే - భ్రమయించీ జగము. ॥రూక॥

2. కొందరి జాళెలు నిండు - కొందరికి సొమ్ములవు
కొందరి పుణ్యులఁ జేసుఁ - గొందరి పాపులఁజేసు,
కొందరి కొందరిలోన - కొట్లాట పెట్టించు
పందె మాడినటు వలెఁ - బచరించు పసిఁడి. ॥రూక॥

3. నిగనిగ మనుచుండు - నిక్షేపమై యుండు
తగిలి శ్రీవేంకటేశు - తరుణియై తానుండు,
తెగని మాయై యుండు - దిక్కు దెసయైయుండు
నగుతా మా పాలనుండి - నటియించుఁ బసిఁడి. ॥రూక॥

ప॥:- రూక= రూపాయలో నాల్గవభాగము. చిన్న మెత్తు వెండిబంగారముల నాణెము; మాడ= అరవరహా విలువగల బంగారు నాణెము; రువ్వ = దమ్మిడీ; దాకొని = మరుగుపడి.

1. ప్రకటించి = స్పష్టముగా.

2. జాళెలు = నాణెములు పోయు సంచులు; పచరించుట = తిరుగును.

3. నిక్షేపము = నిధి, పూడ్చిపెట్టిన లిబ్బి; నగుతా = నవ్వుచు.

**భావము** :- కనకము (లక్ష్మి) ఉన్నచోట మరుగుపడియుండదు. అదిగో చూడుడు అది రూకలుగా, మాడలుగా, రువ్వలుగా మారి లోకమంతట సంచరించుచుండును.

కనకమే ఒకరిని రాజుగా జేయును. మరొకరిని బంటుగా జేయును. ఒకరి కన్యకలను మరొకరి కమ్మించును. ఒకచో నున్న ధాన్యమును మరొకచోటికి మార్చును. ఈ విధమున లోకమును స్పష్టముగా కనకమే భ్రమింప జేయుచున్నది.

మరియు కనకము కొందరి సంచులను నింపును. కొందరికి ఆభరణములుగా నగును. కొందరిని పుణ్యాత్ములుగా నొనర్చును. మరికొందరిని పాపాత్ములుగా జేయును. ఇంక కొందరి మధ్య కలహములు రేపును. ఇట్లు చేయుటలో అది పందెము వేసికొన్నది వలె ఇటునటు పరుగులు దీయుచు ప్రవర్తించుచున్నది.

ఒక్కొక్కచో కనకము నిగనిగమని బట్టబయలున మెఱయుచుండును. ఒక్కొక్కచో పూడ్చిపుట్టిన లిబ్బియై భూమిలో నణగియుండును. శ్రీవేంకటేశ్వరునిపై ప్రేమగలిగి ఆయన తరుణియై యుండును. ఎంత తొలగ ద్రోసికొందమన్నను తొలగని మాయయై యుండును. ఐహికముగా తన్ను నమ్మినవారికి రక్షకమైన ఉపాయముగా నుండును. ఈ విధముగా కనకము నవ్వుచు మా చెంతనుండి పలు విధముల నటించుచున్నది.

**విశేషాంశములు :-** ఈ సంకీర్తనము లక్ష్మీవిలాసమును చక్కగా వర్ణించుచున్నది. లక్ష్మి ఒకచో నుండునది గాదు. అందువలననే 'చపల' అని వ్యవహరింపబడుచున్నది. క్షుద్రయు, చలచిత్తయు అగు లక్ష్మి ఒకచో నివసింపదనియు, తఱచు మూర్ఖుల చెంత తానుండుననియు పద్మపురాణము వచించుచున్నది -

> నైకత్ర వాసో లక్ష్మ్యాస్తు భవిష్యతి కదాచన ।
> క్షుద్రా సా చలచిత్తా చ మూర్ఖేషు చ వసిష్యతి ॥[1]

ఒకడు ప్రభువుగా, మరొకడు భృత్యుడుగా నుండుటకు హేతువు ధనమే. 'కాసులు గల వాడె రాజు' [2] అని సుమతిశతకకారుని మాట. ధనవంతునికి లేని గుణములను కట్టబెట్టి లోక మతనిని పూజించుచున్నది. కులీనత, పాండిత్యము, శాస్త్రజ్ఞత, గుణజ్ఞత, వాగ్మిత్వము, సౌందర్యము మున్నగు గుణములు కాంచనము నాశ్రయించి యుండునని భర్తృహరి నుడివెను -

> యస్యాస్తి విత్తం స నరః కులీనః స పండితః స శ్రుతవాన్ గుణజ్ఞః ।
> స ఏవ వక్తా స చ దర్శనీయః సర్వే గుణాః కాంచన మాశ్రయన్తే ॥ [3]

సంకీర్తనము నందలి 'కన్యకలను అమ్మించు' అనుమాట ఆ కాలమున నుండిన కన్యాశుల్కమును సాంఘికాచారమును సూచించుచున్నది.

---

(1) పద్మ., 1-17-176. (2) సు. శ., 106. (3) భర్తృ., 1-32.

ధనము నాశించియే చౌర్యాదికృత్యము లాచరించి కొందరు పాపులగుచున్నారు. సత్కార్యములకు ఆధనమునే వినియోగించి మరికొందరు పుణ్యము నార్జించుచున్నారు. లోకములో వివిధములైన కలహములకు దారుణములైన పోరాటములకు ధనమే కారణమనుట స్పష్టము.

పసిడి తెగని మాయగా ఇట వర్ణింపబడినది. అందుచే ప్రయత్నముతో ధనకాంక్ష నతిక్రమింపనివాడు ముక్తుడు కాజాలడని సూచింపబడినది. అఘటిత ఘటనా సామర్థ్యము గల మాయ వేదవేదాంతములలో నిష్ణాతులైన మహాపండితులను గూడ ధనధాన్యాదులను జూపి పశుతుల్యుల గావించుచున్నదని శంకరులు నుడివిరి-

**శ్రుతి శత నిగమాంతశోధకా నప్యహహ ! ధనాదిక దర్శనేన సద్యః ।**
**కలుషయతి చతుష్పదాద్యభిన్నా నఘటిత ఘటనాపటీయసీ మాయా ॥** [1]

చంచలమైన ఇట్టి సిరినార్జించుటకై మూఢు డెన్నో శ్రమలకు గురియగును. ముముక్షువైనవాడు వానిలో నూరింట ఒకవంతు శ్రమపడినను మోక్షము జూరగొనునని పెద్దల సూక్తి -

**అర్థార్థీ యాని కష్టాని మూఢోఽయం కురుతే జనః ।**
**శతాంశేనాపి మోక్షార్థీ తాని చేన్మోక్ష మాప్ను యాత్ ॥** [2]

## 40

**అవతారిక :-** అన్నిటికీ మూలమైన హరిని శరణొందక ఇతరోపాయము అనుష్ఠించుట నిష్ప్రయోజన మనుచున్నాడు -

### భైరవి

మొదలుండఁ గొనలకు - మోచినీళ్ళు వోయనేల ?
యెదలో నీవుండఁగా - నితరము లేలా ? ॥ పల్లవి ॥

1. నిగమమార్గమున - నే నడచేనంటే
నిగమము లెల్లను - నీ మహిమే,
జగము లోకులఁ జూచి - జరగెదనంటే
జగములు నీ మాయ - జనకములు. ॥ మొద ॥

(1) మా. పం., 2. (2) పంచ., 1-9.

2. మనసెల్ల నడ్డపెట్టి - మట్టున నుండేనంటే
మనసు కోరికలు - నీ మతకాలు,
తనువు నింద్రియములు - తగ గెలిచేనంటే
తనువు నింద్రియములు - దైవమ నీ మహిమా ॥మొద॥

3. ఇంతలోని పనికిఁగ - ఇందునందు జొరనేల ?
చెంత నిండు చెరువుండ - చెలమలేలా ?
పంతాన శ్రీవేంకటేశ - పట్టి నీకే శరణంటి
సంతకూటాల ధర్మపు - సంగతి నా కేలా ? ॥మొద॥

1. నిగమమార్గమున = వేదోక్తమైన త్రోవలో; మాయజనకములు = మాయను కలిగించునవి ('జనితములు' అని పాఠము కాదగునని శ్రీరాళ్లపల్లి వారి సూచన. అప్పుడు మాయచే పుట్టినవని యర్థము,)
2. మట్టునఁ = మితియందు, మతకాలు = మాయలు.
3. సంతకూటాల ధర్మపు సంగతి = సంతలోని గుంపుల నడతలవంటి ధర్మాల తోడి సాంగత్యము.

భావము :- చెట్టును పెంచి ఫలము ననుభవింపఁగోరువాడు దాని మొదలుండగా కొసకొమ్మలకు మోసికొనిపోయి నీళ్ళుపోయుట వ్యర్థము. అట్లే ఓ దేవా ! హృదయములో నీవుండగా నిన్ను వదలి ఇతరోపాయములతో ముక్తికై ప్రయత్నించుట నిష్ఫలము.

'సత్యం వద, ధర్మంచర'[1] ఇత్యాదిగా వేదములు విధించిన త్రోవలో నేను నడతు నన్నచో వేదము లెల్లను నీ మహిమయే. లోకమునందలి జనుల ప్రవర్తన చూచి తదను గుణముగా ప్రవర్తింతునన్నను ఈ లోక వ్యవహారములన్నియు నీ మాయామయములే.

చంచలమైన మనస్సును నిరోధించి నియతికి లోబడి ఉండెదనన్నచో మనస్సున పొడము కోరికలుగూడ నీ మాయలే. దేవా ! శరీరమును, ఇంద్రియములను గెలిచి యోగమార్గమున నుందునన్నను శరీరేంద్రియములు నీ మహిమ లోనివే.

ఇట్లు అంతయు నీ మాయకు, మహిమకు లోబడియుండగా ఇటు నటు

(1) తైత్తి., 1-11-1.

పరుగులిడి వ్యర్థ ప్రయాసములొందనేల ? నీరు వలయువాడు చేరువనే నిండు చెరువుండగా చెలమల చెంతకు పోవుటెందుకు ? శ్రీవేంకటేశ్వరా ! పరమఫలప్రదాతవగు నిన్నే పనిబూని శరణుజొచ్చుచున్నాను. ఇక సంతలోని జనకూటముల వలె ప్రవర్తించు వివిధ ధర్మముల గొడవ నాకెందుకు ?

విశేషాంశములు :- సర్వమునకు మూలము శ్రీమన్నారాయణమూర్తియే. 'అహమాత్మాగుడాకేశ! సర్వభూతాశయస్థితః' [1] అనుగీతోక్తి ననుసరించి ఆ దేవుడు ఎల్లరకు హృదయములోనే ఉన్నాడు. ఆయన మాయామహిమలవలననే వేదములు, లోకములు, మనఃప్రవృత్తులు, పాంచభౌతిక శరీరములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ప్రవర్తిల్లుచున్నవి, 'తేన వినా తృణమపి న చలతి' అను శ్రుతివచనము ననుసరించి పరమాత్ముని ప్రేరణ లేనిచో గడ్డిపోచయు చలింపదు. జగద్వ్యవహారము లన్నియు భగవదధీనములుగనే నడచుచున్నవి.

కాన మనోనిరోధము, ఇంద్రియజయము మున్నగు చర్యలచే పరమపదమును సాధింపజూచుటకంటె సర్వమయుడగు సర్వేశ్వరుని నేరుగా శరణు జొచ్చుటయే మేలు.

మరియు ధర్మము లోకతీరున లేవు-<br>
శ్రుతిశ్చ భిన్నా స్మృతయశ్చ భిన్నా<br>
నైకో మునిర్యస్య వచః ప్రమాణమ్ । [2]

అన్నట్లు శ్రుతులు, స్మృతులు, మునివచనములు వివిధములుగా నున్నవి. సంతలోని జనులు ఒకరివలె ఒకరుండరు. కొందఱు అన్యోన్యవిరుద్ధముగా ప్రవర్తింతురు. కొందఱు కపటప్రవర్తనులుగ ఉందురు. పైజెప్పిన ధర్మమార్గములు గూడ అట్లే యున్నవి. కాన వాటి జోలికిపోక 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ' [3] అను గీతోపదేశము ననుసరించి సర్వేశ్వరుని శరణొందుట మేలు.

## 41

**అవతారిక :-** జీవునికి మోక్షమిచ్చు శక్తి గజేంద్రరక్షకుడైన శ్రీహరికి దక్క ఇతరదేవతలకు లేదనుచున్నాడు -

(1) గీత., 10-20. (2) ము.ర.భా. P. 173. (3) గీత., 18-66.

## ఆహిరి

ఇందులో మొదలికర్త - యెవ్వఁడు లేఁడు గాఁబోలు
ముందు కరివరదుఁడే - ముఖ్యుఁడు గాఁబోలు. ॥ పల్లవి ॥

1. ఆడితిఁబో బహురూపా - లన్ని యోనులఁబుట్టి
తోడనె బ్రహ్మాదులనే - దొరలెదుటా,
జాడలు మెచ్చాలేరు - చాలునన్నవారు లేరు
వేడుక నడవిఁ గాసే - వెన్నెలాయ బ్రదుకు. ॥ ఇందు ॥

2. అన్ని కర్మములుఁ జేసి - ఆటలో బ్రాహ్మణుడనైతి
నన్ని వేదములనేటి - యంగడి వీథి,
నన్నుఁ జూచేవారు లేరు - నవ్వేటివారు లేరు
వన్నెల సముద్రములో - వానలాయ బ్రదుకు. ॥ ఇందు ॥

3. సంసారపు నాటక - సాలలో ప్రతిమనైతి
కంసారి శ్రీవేం - కటపతి మాయలోన,
ఇంస లిన్నియునుఁ దేరె - నిందరుఁ జుట్టములైరి
హంస చేతిపాలు నీరు - నట్లాయ బ్రదుకు. ॥ ఇందు ॥

1. ఇంసలు = హింసలు.

**భావము :-** చిత్రవిచిత్రమైన ఈ జగత్తను నాటకరంగమునకు మొట్టమొదటి ప్రవర్తకుడైన సూత్రధారుడు మరొకడెవ్వడు లేడు గాబోలు ! గజరాజునకు వరమిచ్చి కాచిన శ్రీహరి ఒక్కడే దీనికంతటికి ముఖ్యకర్త గాబోలు !

నేనీ ప్రపంచనాటకరంగములో ఎంతోకాలమునుండి నానాయోనులలో బుట్టి వివిధవేషాలు ధరించి బ్రహ్మాదులనెడు ప్రభువుల సమక్షమున ఎన్నో ఆటలాడితిని. ఈ దొరలందరు నన్ను కిమ్మనకుండ చూచుచున్నారే కాని నా ఆటలను మెచ్చిన వారునూగారు. 'ఇక చాలు నీ ఆటలు నిలుపు' అన్నవారును లేరు. నా ఆట వారికి మెప్పు కల్గించినచో నాకు వారు మోక్షమును బహుమతిగా నిచ్చియుండవలసినది. మెప్పు కలుగకున్నను 'ఇక నీ ఆట నిలుపు' మని నన్నాదేశించుటద్వారా నాకు ముక్తి గూర్చి యుండవలసినది. ఈ రెండు పనులు చేయుటకు వారికి చేతగాలేదు. కాన నా బ్రదుకంతయు అడవిగాచిన వెన్నెలవలె వ్యర్థమైనది.

సమస్త వేదములనెడి అంగడివీథులలో వేదోక్తములైన వింత వింత పనులెల్ల చేసి నాటకములో విదూషక పాత్రధరించిన బ్రాహ్మణునివలె నైతిని. ఇంతచేసినను నన్ను చూచువారుగాని, నవ్వువారుగాని లేనేలేరు. కాన నా బ్రదుకు సుప్రసిద్ధమైన సముద్రములో కురిసినవానవలె నిరుపయోగమై పోయినది.

కంసాంతకుడైన శ్రీవేంకటేశ్వరుని మాయకు లోబడి జననమరణాత్మకమైన ఈ సంసారపు నాటకశాలలో నేనొక బొమ్మనైతిని. తుదకు ఆ పరమాత్ముని శరణు చొచ్చితిని. ఆయన నన్ను అనుగ్రహించినాడు. నా బాధలన్నియు తీరినవి. ఇంత వరకు నన్ను బాధించినవారే (జన్మకర్మాదులు) ఇప్పుడు భగవత్ప్రాప్తికి ఉపాయ భూతులగుటద్వారా నాకు చుట్టములైరి. చివరికి నా బ్రదుకు హంసచేతిపాలు నీరువలె అనగా హంస పాలు, నీరు వేరుజేసినట్లు మంచి చెడ్డలను, జ్ఞానాజ్ఞానములను విమర్శించి తెలిసికొను వివేకము గలుగుటచే ధన్యమైనది.

**విశేషాంశములు :-** జీవుల సంసార ప్రవృత్తికెల్ల మూలభూతుడు శ్రీహరి ఒక్కడే. ఆయన ఇచ్ఛామాత్రముననే సృష్టి ప్రవర్తిల్లుచున్నది. బ్రహ్మాదిదేవతలు ఆయన నియమించినట్లు ఆయాపనులు చేయుచుందురే కాని దేనికిని వారు ముఖ్యకర్తలు కాజాలరను తత్త్వార్థమును ఈ పాట నిరూపించుచున్నది.

భగవద్వాచకముగా పల్లవిలో ప్రయోగింపబడిన 'కరివరదుడు' అను శబ్దము ఇచట సాభిప్రాయము. వివిధములైన లింగభేదాభిమానములతో గూడిన బ్రహ్మాదులు విశ్వమయులు కారుగాన ముఖ్యకర్తలు కాజాలరు. నిఖిలాత్మకుడైన విష్ణు డొక్కడే అంతటికి మొదటికర్త యగుచున్నాడు.

కావుననే మొసలిచే పట్టువడిన గజేంద్రుడు విశ్వాత్మకుడైన పరమాత్మకొఱకై మొఱపెట్టుకొన్నప్పుడు అతనిని కాపాడు శక్తి బ్రహ్మాదులకు లేక పోయినది. అఖిలదేవతామయుడైన విష్ణుని కొక్కనికే ఆ సామర్థ్యముండుటచే అతడే గజేంద్రుని రక్షింప నుద్యుక్తు డయ్యెనని భాగవతము చెప్పుచున్నది -

**ఏవం గజేంద్ర ముపవర్ణిత నిర్విశేషం బ్రహ్మాదయో వివిధలింగ భిదాభిమానాః।**
**నైతే యదో పససృపుర్నిఖిలాత్మకత్వాత్ తత్రాఖిలామరమయో హరి రావిరాసీత్॥[1]**

ఈ సందర్భమున పోతన పద్యమిది -

---

(1) భాగ., 8-3-30.

విశ్వమయుతలేమి వినియు నూరకయుండిరంబుజాసనాదు లడ్డపడక
విశ్వమయుడు గాన విష్ణుండు జిష్ణుండు భక్తియుతున కడ్డపడదలంచె ! [1]

ప్రేక్షకులైన రసికులు నేర్పరులైన నటులను మెచ్చుకొందురు. వారికి బహుమతులిత్తురు. వారిని ఆటనుండి విరమింప జేయగలరు. జీవులు నాటకము లందలి పాత్రలవలె నానావేషములు (జన్మలు) దాల్చుచున్నారు. వివిధకర్మలు చేయుచున్నారు. బ్రహ్మాదిదేవతలు సాక్షిమాత్రముగా జీవులపాటులను చూచుచున్నారేకాని వారి నభినందించుటకో, లేదా 'ఈ జన్మబంధము మీకింకవద్దు' అని విడిపించుటకో శక్తి కలవారు కారు. కాన రంగస్థలమునందలి నటులకంటె ప్రపంచము లోని జీవుల స్థితి దుర్భరముగా నున్నది.

జీవుని పాపములను హరించి ముక్తి గూర్పగల సామర్థ్యము బ్రహ్మాదులకు లేదనుచు మరొక సంకీర్తనమునగూడ అన్నమయ్య ఇట్లు చెప్పినాడు -

ఎందరో బ్రహ్మలో నన్ను ఇటు పుట్టించినవారు
ఎందరు యములో హరియించినవారు,
ఇందుకు నందుకే కాని యిలనేఁ జేసిన పాప
మంది వహించుక కాచినట్టివారు లేరు. [2]

వేదోక్తములైన పలుకర్మలు చేసి చేసి ఆటలో వింత పనులొనర్చు విదూషక పాత్రధారులవలె జీవులు పలుపోకల బోవుచున్నారు. విదూషకుని చేష్టలకు మెచ్చి ప్రేక్షకులు నవ్వుదురు. దానిచే అతనిపాత్ర సఫలమగును. జీవుడెన్ని పనులు చేసినను మెచ్చుకొని నవ్వువా రెవ్వరును లేరు, కాన విదూషకునికంటె జీవుని స్థితి శోచనీయముగా నున్నది.

ఈ దుఃస్థితినుండి తొలగుటకు శ్రీవేంకటేశ్వరుని యనుగ్రహమొక్కటే శరణ్యము. కాన గజేంద్రునివలె 'జీవులెల్లరు ఆ పరమాత్మనే శరణువేడవలెను '. అప్పుడు పై బంధము లన్నియు తొలగును. వివేక ముదయించును. ఆనందము చేకూరును.

## 42

**అవతారిక :-** జీవితము క్షణభంగురమని తెలియనేరక భోగములకై యెగబడి పాపము లొనర్చువారి మౌఢ్యమును వర్ణించుచున్నాడు -

---

(1) భాగ., 8-94. (2) అ. సం. 9-34.

## ముఖారి

వెనకేదో ముందరేదో - వెఱ్ఱి నేను నా
మనసు మరులుదేర - మందేదొకో ! ॥పల్లవి॥

1. చేరి మీఁదటి జన్మము - సిరులకు నోమేఁగాని
యేరూపై పుట్టుదునో - యెఱఁగ నేను,
కోరి నిద్రించఁ బరచు - కొన నుద్యోగింతుఁగాని
సారె లేతునో లేవనో - జాడ దెలియ నేను. ॥వెన॥

2. తెల్లవారి నప్పు డెల్లా - తెలిసితి ననేఁగాని
కల్ల యేదో నిజమేదో - కాన నేను,
వల్లచూచి కామినుల - వలపించేఁగాని
మొల్లమై నామేను - ముదిసిన దెరఁగా. ॥వెన్న॥

3. పాపాలు సేసి మఱచి - బ్రదుకుచున్నాఁడఁగాని
వైపుగఁ జిత్రగుప్తుఁడు - వ్రాయు టెఱఁగ,
ఏపున శ్రీవేంకటేశు - నెక్కడో వెతకేఁగాని
నాపాలి దైవమని - నన్ను గాచు టెఱఁగా. ॥వెన॥

ప॥:- మరులుదేరఁ = వ్యామోహమునుండి విడివడుటకు.

2. వల్ల = అనుకూలము; మొల్లమై = మిక్కిలిగా.

3. వైపుగఁ = గుఱిగా; చిత్రగుప్తుడు = యమునియొద్ద లెక్కలు వ్రాయువాడు; ఏపునఁ = అతిశయముగా.

**భావము** :- వెనుక ఏమి జరిగినదో ! ముందర ఏమి జరగనున్నదో ! నేను భూత భవిష్యత్తుల వెఱుంగజాలని వెఱ్ఱివాడను. నా మనస్సు వివిధ పదార్థములపై మరులు గొని పరిభ్రమించుచున్నది. విడువరాని తగులములనుండి నా చిత్తము విడుదల నొందుటకు తగినమందు ఏదో కదా !

రాబోవు జన్మలో నాకు సకలసంపదలు లభించుగాక ! అని ఆశించి అందుకై యిప్పుడెన్నో నోములు నోచుచున్నాను. కాని నా వెఱ్ఱితన మేమనవచ్చును ? మరుజన్మములో ఏ రూపు దాల్చనున్నానో ఎఱుగనుగదా ! బాగుగా నిద్రించవలెనని తలంచి మెత్తని పక్కబరచుకొనుటకై ప్రయత్నించుచున్నాము. కాని ఈ నిద్రనుండి అసలు లేతునో లేవనో నాకు తెలియదు గదా !

ప్రతిదినము తెల్లవారినప్పుడెల్ల నిద్రనుండి లేచి ప్రపంచము నంతటిని చూచుకొని పూర్వానుభవములను స్మరించుకొని నాకంతయు దెలియు ననుకొను చుందును. కాని గాఢనిద్రలో ఈ లోకమేమైపోయినదో ? సుషుప్తిలో లోకము శూన్యమైపోయిన స్థితియే నిజమో ! లేక మేల్కాంచినపుడు శాశ్వతమై కానవచ్చు స్థితియే నిక్కమో ! ఇందలి సత్యాసత్యముల నెఱుంగజాలని పిచ్చివాడను గదా నేను! అవకాశము, అనుకూల్యము చూచుకొని కాముకురాండ్రు నాపై వలపుగొనునట్లు చేయుచున్నాను. కాని నా శరీరము మిక్కిలిగా ముదిసియుండుట గుర్తింప జాలకుంటిని గదా !

నిత్యము అనేక పాపకృత్యములుచేసి వాటిని విస్మరించి బ్రదుకుచున్నాను. కాని నేను చేసిన దుష్కృతముల నన్నింటిని యమునిచెంత లెక్కవ్రాయు చిత్రగుప్తుడు ఒక్కటి తప్పకుండ వ్రాయుచున్నాడని తెలియజాలనుగదా ! శ్రీవేంకటేశ్వరుడు ఎక్కడో ఉన్నాడని మూఢుడనై ఎందెందో మహాప్రయత్నముతో వెదకుచున్నాను. ఆయన నా పాలిదైవమని, నన్నంటిపెట్టుకొని సదా కాపాడుచున్నాడని ఎఱుగనైతినిగదా!

**విశేషాంశములు :-** జీవుడు భూత భవిష్యత్తుల నెఱుగడు. ఎన్నో ఆశలు పెట్టుకొని జీవించుచున్నాడు. సంసార వ్యామోహమునకు వశుడై నానాబాధ లనుభవించుచున్నాడు. అట్టి జీవుని వెఱ్ఱితనమీ పాటలో చక్కగా నిరూపింపబడినది.

జీవితము క్షణభంగురము. కర్మానుగుణముగా రానున్న జన్మ ఎట్టిదో ఎవనికి దెలియును? పశుపక్ష్యాదుల జన్మములుగూడ కలుగవచ్చుగదా ! అట్లుండగా ఆవలి జన్మములో భోగము లపేక్షించి ఈ జన్మములో నోములు నోచుట హాస్యాస్పదము కాక మఱేమి ?

ఈ జన్మములోగూడ భోగముల నపేక్షించి అందుకై ప్రయత్నించుట అవివేకమే. ఏలన, 'న హి ప్రమాణం జన్తూనాముత్తరక్షణజీవనే' అన్నట్లు ఏ క్షణములో ఈ శరీరము పతనమగునో ఎవరికెఱుక !

> గడియల్ రెంటికొ ? మూటికో ? గడియకో ? కాదేని నేడెల్లియో
> కడనేడాదికో ? యెన్నడో యెఱుగమీకాయంబు లీభూమిపై
> బడగానున్నవి ధర్మమార్గమొకటిం బాటింపరీమానవుల్
> చెడుగుల్ మోక్షపదంబు గానరకటా ! శ్రీకాళహస్తీశ్వరా ! [1]

అని ధూర్జటి పేర్కొన్నట్లు మృత్యువు నిత్యము సన్నిహితమైయున్నది.

---

(1) కా.శ., 104.

'నళినీ దళగత జలమతితరళం తద్వజ్జీవిత మతిశయ చపలమ్ ।[1]

అని శంకర భగవత్పాదులుగూడ జీవితము తామరాకుపై నీటివలె చంచలమైనదని చెప్పిరి. ఈ శరీరమంత అశాశ్వతమైయుండ నిద్రించుటకు ప్రక్క పరచు కొనగోరుటగూడ అవివేకమే యని అన్నమయ్య చెప్పినాడు. అందువలననే తత్త్వజ్ఞులు -

కమనీయ భూమిభాగములు లేకున్ననే పడియుండుటకు దూది పఱుపులేల?[2]

అని శారీరక సౌఖ్యములకై యత్నించుట తగదన్నారు.

గాఢనిద్రావస్థలో జీవునకు ప్రపంచము శూన్యము. మేల్కొన్నంతనే అది పొడకట్టుచున్నది. అద్వైత వేదాంతులు జగత్తును మిథ్యగా, బ్రహ్మమును సత్యముగా నిరూపించిరి-'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా.'[3] అనేకులు జగత్తును సత్యమనియే విశ్వసించుచున్నారు. సామాన్యున కిందలి సత్యాసత్యములు తేటపడుటలేదు. 'కల్ల యేదో నిజమేదో' అన్న అన్నమయ్య పలుకు లీవిషయమునే నిరూపించుచున్నవి.

**వయసి గతే కః కామవికారః శుష్కే నీరే కః కాసారః ।[4]**

అన్నట్లు వయసు మళ్ళినతర్వాత కామవాంఛతో త్రుళ్లిపడుట అనుచితము. మరియు చేసిన పాపములకు ఫలమనుభవింపక తప్పదు కాన పాపముల జోలికి పోకుండటే ముముక్షువునకు ముఖ్యకర్తవ్యమనుట పదకవితా పితామహుని ప్రబోధసారాంశము.

## 43

**అవతారిక :-** సుఖదుఃఖములు, పాపపుణ్యములు మొదలగునవి తత్త్వజ్ఞునకు లేవని చెప్పుచు బంధమోక్షములకు జ్ఞానాజ్ఞానములే హేతువులనుచున్నాడు -

### పాడి

తెలిసితే మోక్షము - తెలియకున్న బంధము
కలవంటిది బదుకు - ఘనునికిని. ॥ పల్లవి ॥

1. అనయము సుఖమేడ - దవల దుఃఖమేడది
తనువుపై నాసలేని - తత్త్వమతికి,

(1) భజగో., 4. (2) భాగ., 2-21.
(3) వే. డిం., 67. (4) భజగో., 10.

పొనిఁగితేఁ బాపమేది - పుణ్యమేది కర్మమందు
ఒనర ఫలమొల్లని - యోగికిని. ॥ తెలి ॥

2. తగిన యమృతమేది - తలఁపఁగ విషమేది
తెగి నిరాహారియైన - ధీరునికిని,
పగవారనగ వేరీ - బంధులనగ వేరీ
వెగటు ప్రపంచ మెల్ల - విడిచే వివేకికి. ॥ తెలి ॥

3. వేవేలు విధులందు - వెఱపేది మఱపేది
దైవము నమ్మినయట్టి - ధన్యునికిని,
శ్రీవేంకటేశ్వరుఁడు - చిత్తములో నున్నవాఁడు
ఈవలేది యావలేది - యితని దాసునికి. ॥ తెలి ॥

1. అనయము = ఎల్లప్పుడు; పొనిఁగితే = పూనికవహించినచో.
2. వెగటు ప్రపంచము = విరసమైన లోకము.

**భావము :-** జీవులకు తత్త్వము తెలిసినచో మోక్షము సిద్ధము. అది తెలియకున్నంతవరకు బంధము తప్పదు. ఆత్మజ్ఞుడైనవానికి జీవితము స్వప్నము వంటిది.

అశాశ్వతమైన శరీరముపై ఆశలేని తత్త్వజ్ఞునకు సుఖదుఃఖములు లేవు. ఫలాసక్తి లేక కర్మ లొనర్చు యోగికి పాపపుణ్యములు లేవు.

దీక్షతో నిరాహారవ్రతమును బూనిన ధీరునికి ఒక పదార్థము అమృతముగా, మరొక పదార్థము విషముగా నుండుట అనునది లేదు. విరసమైన ప్రపంచమును వీడి సర్వత్ర సమదర్శనము గల్గియున్న వివేకవంతునకు వారు కావివారు. వీరు ఐనవారు అనునది లేదు.

సదా దైవముపై నమ్మికగలిగి చరించు ధన్యాత్మునికి వేలకొలది కార్యములు పైకొన్నను వెఱపుమఱపులు లేవు. శ్రీవేంకటేశ్వరుని చిత్తములో నిల్పిన భాగవద్దాసునికి జననమరణాత్మకములైన వెనుక ముందరలు లేవు. లేదా, అట్టి భగవద్దాసుడు సదా ముక్తుడే కాన అతనికి ఐహికాముష్మిక (స్వర్గ) లోకములతో సంబంధము లేదు.

**విశేషాంశములు :-** బంధమోక్షముల స్వరూపమును వసిష్ఠు డిట్లు నిరూపించెను-

క్రుశోఽతి దుఃఖీ బద్ధోఽహం హస్తపాదాదిమానహమ్ ।
ఇతి భావానురూపేణ వ్యవహారేణ బధ్యతే ॥
నాహం దుఃఖీ నమే దేహో బంధః కస్యాత్మనః స్థితః ।
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే ॥[1]

అనగా ''నేను కృశించినవాడను, మిక్కిలి దుఃఖముగలవాడను, చేతులు, కాళ్ళు మున్నగు అవయవములు గలవాడను'' అను భావమున కనురూపమైన వ్యవహారముచే జీవుడు బంధింపబడుచున్నాడు. ''నేను దుఃఖినిగాను. నాకు దేహము లేదు. ఆత్మకు బంధమెక్కడిది?'' అను భావన కనురూపమైన వ్యవహారముచే ముక్తు డగుచున్నాడు.

కావున బంధము, మోక్షము అనునవి జీవుల భావనలకు సంబంధించినవి. భావనలు ఆయా విషయములకు సంబంధించిన జ్ఞానముపైనను, అజ్ఞానముపైనను ఆధారపడియున్నవి. కావుననే తెలిసితే మోక్షము, తెలియకున్న బంధము అని చెప్పబడినది.

'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।[2]

అను ఉపనిషద్వచనముగూడ మనోవాసనలే బంధమోక్షములకు హేతువులని నిరూపించుచున్నది.

విజ్ఞుడైనవానికి బ్రతుకు కలవంటిదే. కలలో దోచు పదార్థములు గాఢనిద్రలో, లేదా మేల్కొన్నప్పుడు కనిపించవు. స్వప్నము సుషుప్తిలో నశించునట్లు స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచమంతయు కల్పాంతమున నశించునని వసిష్ఠుని వచనము -

యదిదం దృశ్యతే సర్వం జగత్ స్థావర జంగమమ్ ।
తత్సుషుప్తావివ స్వప్నః కల్పాన్తే ప్రవినశ్యతి ॥[3]

కావున అశాశ్వతమైన ఈ జగద్వ్యవహారమును తత్త్వవేత్త స్వప్నసదృశముగా భావించును.

సుఖదుఃఖ శీతోష్ణాదిద్వంద్వములు దేహమే తానని భావించు జడునిమాత్రమే లోగొనుచున్నవి. 'నేను నిత్యాత్మస్వరూపుడను' అని భావించి దేహముపై అభిమానము వీడినవానికి సుఖదుఃఖాదుల తాకిడి లేదు.

(1) వ.గీ., P. 468. (2) అమృత., 2. (3) వ.గీ., 252

కర్మలు చేయవలసినదే కాని ఫలాసక్తి తగదు. ఫలాపేక్ష వదలి కర్మలొనర్చు యోగికి పుణ్యపాపములు లేవను సిద్ధాంతము భగవద్గీతలో విస్తారముగా ప్రతిపాదింపబడినది.

**కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన ।**[1]

అను భగవద్వచనము ఫలములయందు కాక కర్మలయందే అధికారము నుపదేశించుచున్నది. కర్మఫలాసంగమువదలి సర్వదా తృప్తుడై దేనిని ఆశ్రయింపని యోగి కర్మలలో ప్రవర్తించినను ఏమియు చేయనివాడే అని గీతా సిద్ధాంతము -

**త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।**
**కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥**[2]

నిరాహారియగు ధీరునకు ఏది విషము, ఏది అమృతము అను చర్చ చేయనవసరములేదు. అనగా ఒకవస్తువు ననుభవించవలెనని కోరువానికి ఆ వస్తువు తీపా ? చేదా ? అను విచార ముండును. బాహ్యవస్తువుల అనుభవమును పూర్తిగా విసర్జించి ఆత్మారాముడై ఆనందించు ధీరుడు ఆ వస్తువుల నన్నిటిని సమదృష్టితో చూచును గాని వాటి స్వరూపభేదమును, ఫలభేదమును పరామర్శింపడని భావము.

ప్రపంచభావన వదలి సర్వత్ర బ్రహ్మమును చూచెడు సమదృష్టి నలవరచుకొన్నవాడు. 'వీడు శత్రువు, వాడు మిత్రుడు' అను భేదభావమును వహింపడు. అందుచేతనే గుణాతీతుడైన బ్రహ్మనిష్ఠుడు 'మిత్రారి పక్షములలో సమానుడై యుండును'. ''తుల్యో మిత్రారి పక్షయోః''[3] అని గీత బోధించినది.

## 44

**అవతారిక :-** ప్రపన్నునకు కర్మమార్గము, ముముక్షువునకు దుస్సాంగత్యము, ఒక మతమున్నవానికి మతాంతర సమాశ్రయణము తగవనుచున్నాడు -

### గుజ్జరి

కలదిదివో సుఖము గలిగినను -
గర్భము నిలువక మానునా ?
మలసి కామ్య కర్మములకుఁ జొచ్చిన -
మగుడఁ బుట్టువులు మానునా ? ॥ పల్లవి ॥

---

(1) గీత., 2-47. (2) గీత., 4-20. (3) గీత., 14-25.

1. పరగ నింద్రజిత్తుఁడు హనుమంతుని -
బ్రహ్మాస్త్రంబునఁ గట్టి
అరయనందుపై మోకులు గట్టిన -
నల బ్రహ్మాస్త్రము వదలె,
పరిపరి విధముల నిటువలెనే హరిఁ -
బ్రపత్తి నమ్మిన నరుఁడు
తిరుగఁ గర్మమార్గమునకుఁ జొచ్చిన -
దేవుడు దన వాత్సల్యము వదలు. ॥ కల ॥

2. అలరిన సంసారభ్రమ విడిచి -
యడవిలోన జడభరతుఁడు
తలపుచు నొక యిఱ్ఱిఁ బెంచినంతనే -
తనకును నారూపు దగిలె,
ములుగుచు లంపటములు దెగవిడిచి -
మోక్షము వెదకెడి నరుఁడు
వలవని దుస్సంగతులు పెంచినను -
వాసన లంటక మానునా ? ॥ కల ॥

3. ఆటు గన తాఁబట్టిన వ్రతముండఁగ -
నన్యమతము చేపట్టినను
నటనల నెందునుఁ బొందక జీవుఁడు -
నడుమనె మోరుఁడైనట్లు,
తటుకన శ్రీవేంకటపతి నొక్కవి -
దాస్యము భజియించిన నరుఁడు
ఘటనల నాతని కైంకర్యములకు -
కడుఁ బాత్రుఁడు గాక మానునా ? ॥ కల ॥

వ॥:- మలపి = ఉద్యమించి.

2. ఇఱ్ఱి = జింక; వాసనలు = మనోవృత్తులు, ప్రతిప్రాణికిని పూర్వజన్మల నుండి సంక్రమించి మనసు నంటియుండెడి వృత్తివిశేషములు.

3. మోరుఁడు = మూర్ఖుడు, మూర్ఖశబ్దభవమైన మోరకుడు అను పదమున కిది వ్యావహారికరూపముగా దోచుచున్నది. కైంకర్యములకు = సేవలకు.

భావము :- ఉన్న సత్యమిదియే. సుఖాపేక్షతో రతినొందిన స్త్రీ తరువాత గర్భధారణ క్లేశము నొందక తప్పదు. అట్లే పనిబూని ఫలాపేక్షతో కర్మల నొనర్చువారు తిరిగి జన్మదుఃఖముల నొందక పోరు.

ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రముతో బంధించి అంతటితో తృప్తినొందక అందుపై మోకులతో బిగించెను.[1] వెంటనే ఆ బ్రహ్మాస్త్రము హనుమంతుని వదలినది. అట్లే తొలుత శ్రీహరిని ప్రపత్తి మార్గమున ఆశ్రయించినవాడు మరల విశ్వాసహీనుడై వివిధ కర్మమార్గములలో ప్రవేశించినచో భగవంతుడు అతనిమీది వాత్సల్యము వదలిపెట్టును.

జడభరతుడు సంసారముమీది వ్యామోహము వదలి అరణ్యమున నివసించుచుండియు మమకారముతో ఒక జింకను పెంచుటచే మరు జన్మలో జింకగా జన్మించెను. అట్లే ఏవగింపుతో చీదరించుకొని తగులము లన్నియు విడిచి మోక్షము నన్వేషించువాడు మరల దుస్సాంగత్యము పెంచుకొన్నచో జన్మ హేతువులైన మలిన వాసన అంటకపోవు.

తానాశ్రయించిన మతమొకటి యుండగా అందు పూర్ణవిశ్వాసము లేక ఇతర మతమును చేపట్టిన వాడు పరిభ్రమణములకు లోనై ఏ మతమునందును పరమార్థము నొందక రెంటికి చెడిన రేవడగును. ఒక్క శ్రీవేంకటేశ్వరునే పరమప్రాప్యముగా విశ్వసించి తదీయ దాస్యము నొందిన మానవుడు త్వరలో భగవత్కైంకర్యమునకు పాత్రుడు గాక పోడు.

**విశేషాంశములు :-** హనుమంతుడు జానకి నన్వేషించుటకై లంకకు బోయి సీతను చూచిన పిమ్మట ప్రమదావనమును విధ్వంసము గావించెను. కయ్యమునకు గడంగిన రక్కసుల పలువుర రూపుమాపెను. రావణుని పంపున వచ్చిన ఇంద్రజిత్తు అంజనాతనయు డవధ్యుడని గ్రహించి బ్రహ్మాస్త్రముతో అతనిని బంధించెను. పిదప కదలక మెదలకపడి యున్న ఆంజనేయుని రాక్షసులు మోకులతో కట్టివేసిరి. ఇతర బంధనములను అనువర్తింపని బ్రహ్మాస్త్రబంధము వెంటనే హనుమంతుని వదలిపోయినది. ఈ విషయము రామాయణమున నిట్లు చెప్పబడినది -

(1) ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముతో బంధింపగా ఇతర రాక్షసులు హనుమంతుని మోకులతో బిగించినట్లు రామాయణమున గలదు.

స బద్ధస్తేన వల్కేన విముక్తోఽస్త్రేణ వీర్యవాన్ ।
అస్త్రబంధః స చాన్యం హి న బంధమను వర్తతే ॥[1]

ఇతరాస్త్రములకంటె శ్రేష్ఠమైన బ్రహ్మాస్త్రముతో ప్రపత్తిని పోల్చుటచే వైష్ణవ మతము ననుసరించి ప్రపత్తిమార్గముయొక్క ప్రాముఖ్యము వ్యక్తము చేయబడినది. ప్రపత్తియే 'భరన్యాసము, శరణాగతి, భరసమర్పణము' అని పెక్కువిధముల పేర్కొనబడుచున్నది.

''దేవా ! అకించనుడను, అనన్యగతికుడను అగు నాకు ఫలప్రాప్తి కనుగుణమగు క్లుప్తోపాయము ననుష్ఠించు సామర్థ్యములేదు. కాన నాపై దయయుంచి నీవే ఆ ఉపాయమునకు మారుగానుండి తత్ఫలమును నాకు ప్రసాదింపుము'' అని దేవుని ప్రార్థించుట ప్రపత్తి యనబడును.

'నేను ధర్మనిష్ఠుడను కాను, ఆత్మ వేత్తను కాను. నీ పాదపద్మములపై భక్తిగలవాడను కాను. అకించనుడను. వేఱుగతి లేనివాడను. రక్షకుడవైన ఓ దేవా ! నీ పాదమూలమునే శరణు పొందుచున్నాను' అని యామునాచార్యులవారు భగవంతుని చరణములకడ ప్రపన్నులైనట్లు స్తోత్రరత్నము చెప్పుచున్నది -

న ధర్మనిష్ఠోఽస్మి నచాత్మవేదీ నభక్తిమాం స్త్వచ్చరణారవిన్దే ।
అకించనోఽనన్యగతి శ్శరణ్య ! త్వత్పాదమూలం శరణం ప్రపద్యే ॥[2]

పూర్వము విభీషణాదులీ ప్రపత్తిమార్గము నాశ్రయించి కృతకృత్యులైరి. అన్నమయ్య తన పదవాఙ్మయములో ప్రపత్తి ప్రాధాన్యము ననేకరీతుల ప్రశంసించియున్నాడు.

ముముక్షువునకు దుస్సాంగత్యము పనికిరాదనుటకు జడభరతుని కథ ఉదాహరణముగా నొసంగబడినది. తొల్లి భరతుడను రాజర్షి భగవద్భక్తి తత్పరుడై బహుకాలము రాజ్యము పాలించి తుదకు వైరాగ్యసంపన్నుడై పుత్రులపై రాజ్యభారము మోపి అరణ్యమునకు జని ఆశ్రమమున నివసించుచు యోగమార్గమున పరమాత్ముని భజించుచుండెను. ఒకనా డతడు నదిలో స్నానమొనర్చి ప్రణవము నుచ్చరించుచుండ పూర్ణగర్భిణియైన జింక యొకటి చేరువ నీరు ద్రావుచు అనతి దూరమున నొక సింహము గర్జించుట విని యదరిపడి దుముకబోయెను. అప్పుడు దాని గర్భస్థ శిశువు

(1) రామా - సుంద., 48-48. (2) ఆ . స్తో., 22.

జలములలో బడెను. హరిణియు భయాతిరేకమున ఆ నదీతీరమునబడి మృతి నొందెను.

భరతు డది చూచి దయగలిగి ఆ జింకపిల్లను ఆశ్రమమునకు గొనిపోయి పోషించుచు దానిపై మమకారము పెంచుకొని సదా దానితో కాలము గడపుచు క్రమముగా తన యోగమునుండి చ్యుతినొందెను. అంత్యకాలమునగూడ ఆ జింకనే స్మరించుచు శరీరము విడచుటచే మరుజన్మమున నతడు హరిణమై జన్మించెను -

భరతుండల్లన యంత్యకాలము వెసంబ్రాపింపగా నప్పుడా
హరిణంబుంగడు భక్తిపుత్రుగతి నత్యాసక్తి వీక్షింప నా
హరిణంబుం దన యాత్మలో నిలిపి దేహంబంతటం బాసి తా
హరిణీ గర్భమునం జనించి హరిణంబై యొప్పెఁ బూర్వస్మృతిన్ ।[1]

అట్లే సంసారము రోసి మోక్షమార్గమున పయనించువాడు మరల దుస్సాంగత్యమునకు వశపడినచో మలినములైన పూర్వ వాసనలు అంటకపోవు. కరుణాది సద్గుణములు గూడ యోగికి మమకారరహితములై యుండుట మేలు. లేనిచో భరతునిగాథ పునరావృత్తమగును.

'వాసనా మనసో నాన్యా'[2]

అని చెప్పిన చొప్పున మనోవృత్తులే వాసన లనబడుచున్నవి. ఇవి శుభాశుభములని రెండు రకములు. దుస్సాంగత్యముచే అశుభవాసన లేర్పడి నీచజన్మములకు దారిదీయును. కాన ప్రయత్నపూర్వకముగా ముముక్షువైనవాడు తన వాసనా ప్రవాహమును శుభమార్గముననే ప్రవేశపెట్టవలయునని వసిష్ఠుడు వచించెను -

**శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనాసరిత్ ।**
**పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి ॥**[3]

మరియు ఒక మతమున నున్నవాడు అందలి సాధనలనే విశ్వాసముతో అనుష్ఠించినచో ధన్యుడు కాగలడు. అటుకాక ఆ మతమున అవిశ్వాసమేర్పడినప్పుడు దానిని వదలి మతాంతరము స్వీకరింపవచ్చును. కాని ఆ మతమును వదలకయే ఇతర మతమును చేపట్టినవాడు ఎందును కృతకృత్యుడు కాక రెంటికి చెడిన రేవడగును. అన్ని మతములను అంగాంగి భావముతో సమన్వయించుకొనగల స్థితప్రజ్ఞున కిట్టి చిల్లర చిక్కులెవ్వియు లేవు.

(1) భాగ., 5-115. (2) యో. వా. I P. 214. (3) యో. వా. I P. 216.

## 45

అవతారిక :- పరమార్థమునకై పాటుపడని జీవితము వ్యర్థమనుచున్నాడు -

### కాంబోది

సంతలే చొచ్చితిఁ గాని - సరకుఁ గాననైతి
యింతట శ్రీహరి నీవే - యిటుదయఁజూడవే. ॥ పల్లవి ॥

1. కాంత చనుగొండలు - కడకు నెక్కితిఁగాని
యెంతైనా మోక్షపు మెట్లు - యెక్కలేనైతి,
అంతట జవ్వనమనే - అడవి చొచ్చితిఁగాని
సంతత హరి భక్తనే - సంజీవి గాననైతి. ॥ సంత ॥

2. తెగి సంసార జలధిఁ - దిరుగులాడితి గాని
అగడై వైరాగ్యరత్న - మది దేనైతి,
పొగరు జన్మాల రణ - భూములు చొచ్చితిగాని
పగటుఁ గామాదుల - పగ సాధించనైతి. ॥ సంత ॥

3. తనువనియెడి కల్ప - తరువు యెక్కితిఁగాని
కొన విజ్ఞానఫలము - గోయలేనైతి,
ఘనుఁడ శ్రీవేంకటేశ - కమ్మర నీ కృపచేతఁ
దనిసి యే విధులనుఁ - దట్టువడనైతి. ॥ సంత ॥

2. అగడై = నిందవడి; పగటు = ప్రకటమైన.

3. కమ్మర = క్రమ్మర, మఱల; తనిసి = తృప్తినొంది; తట్టువడు = బాధపడు.

భావము :- నేను సంతలలో ప్రవేశించి ఎల్లకడల దిరిగితిని గాని అవసరమైన సరకు మాత్రము సంపాదింప జాలనైతిని, అనగా విలువైన మానవజన్మము దాల్చి ప్రపంచములోనికి వచ్చితినిగాని అందుకు దగిన పరతత్త్వమును మాత్రము చూరగొననైతినని భావము. శ్రీహరీ ! ఈ విధముగా వ్యర్థజీవినైన నన్ను నీవే దయజూచి రక్షించవయ్యా !

వనితల చన్నులనెడు కొండలను తుదముట్ట ఎక్కితినిగాని మోక్షమునకు గొనిపోవు మెట్లు మాత్రము సుంతైనను ఎక్కజాలనైతిని. యౌవనమనెడు అడవిలో దూరి అంతట తిరిగితినిగాని ఎడతెగని విష్ణుభక్తియనెడి సంజీవిని జూడనైతిని.

తెగువతో సంసారమనెడు సముద్రములో దూకి తిట్టువడి ఎల్లయెడల తిరిగితిని గాని వైరాగ్యమనెడు రత్నమును మాత్రము తేనైతిని. గర్వభూయిష్ఠములైన నానాజన్మములనెడు రణరంగములలో ప్రవేశించితిని గాని ప్రకటమైన కామక్రోధాదులనెడు అరిషడ్వర్గములతోడి పగ సాధింపలేకపోయితిని.

శరీర మనెడు కల్పవృక్షము నధిరోహించితిని గాని దాని చివరనున్న (అంతిమఫలమైన) విజ్ఞానమనెడు పండును కోయలేనైతిని. ఘనుడవైన శ్రీవేంకటేశ్వరా ! ఇన్నిబాధలు పడినను మరల ఎట్లో నీ పై భక్తి కలిగి నీ కృపకు పాత్రమై తనివి నొందితిని. ఏ కర్మవలనను బాధనొందక ధన్యుడనైతిని.

**విశేషాంశములు :–** 'జన్మానాం నరజన్మ దుర్లభం'[1] అన్నట్లు మానవజన్మ కడు దుర్లభమైనది ఈ జన్మకు ముఖ్యప్రయోజనము మోక్షమే. దానికై పాటుపడని జీవితము నిష్ప్రయోజనమన్న సత్యము నీ సంకీర్తనము తేటపరచుచున్నది.

ముఖ్యముగా కాంతావ్యామోహము మోక్ష ప్రతిబంధక మగుచున్నది. కావుననే చనుగొండలచే దుర్గమమైన వనితల తనువనెడు అడవిలో మన్మథుడను దొంగ పొంచియున్నాడు గాన ముముక్షువు తన మనస్సును బాటసారి నచ్చటికి పోనీయరాదని భర్తృహరి హెచ్చరించెను -

**కామినీ కాయకాన్తారే స్తన పర్వత దుర్గమే ।**
**మా సంచర మనఃపాన్థ ! తత్రాస్తే స్మరతస్కరః ॥**[2]

ఎప్పుడో వార్ధక్యము ముంచుకొని వచ్చిన పిమ్మట భగవంతుని భజింపవచ్చుననుట యుక్తముగాదు. యౌవనములోనుండగనే హరి భక్తిని సాధింపవలెను.

సంసారములోని పెక్కు చిక్కులు జీవునిలో వైరాగ్యము గల్గించుటకే ఉద్దేశింపబడియున్నవి. సంసారబాధలకు గురియయ్యు విరక్తి గలుగనిచో జీవితము వ్యర్థమే. అందుకే సంసారసముద్రములోని రత్నముగా వైరాగ్యము పేర్కొనబడినది.

కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనునవి అరిషడ్వర్గము లనబడును. వాటిని జయించినపుడే జన్మము సార్థకమగును.

(1) వి. చూ., 1. (2) భర్తృ., 2-53.

'శరీరమాద్యం ఖలు ధర్మసాధనం' [1] - శరీరము ప్రథమ ధర్మసాధనమని కాళిదాసు వచించెను. అందుచేతనే అన్నమయ్య శరీరమును కల్పవృక్షముగా రూపించినాడు. ఈ వృక్షము నెక్కినవాడు తప్పక విజ్ఞానఫలము ననుభవింపవలెను. లేనిచో జీవితము వ్యర్థమే.

శంకరులు దుర్లభమగు మానుష శరీరము నొందియు పరతత్త్వప్రాప్తి కై ప్రయత్నింపని వానికంటె మూఢుడు మరొకడు లేడని వచించిరి.

> ఇతః కోన్వస్తి మూఢాత్మా ? యస్తు స్వార్థే ప్రమాద్యతి ।
> దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషం ॥ [2]

మరియు తొల్లి సృష్టికర్త చెట్లు, పాములు, పశువులు, పక్షులు, దోమలు, చేపలు మున్నగు అనేక స్థావరజంగమములను ఆత్మశక్తిచే సృష్టించియు అంతటితో సంతసింపక తుదకు బ్రహ్మావలోకన బుద్ధిగల మానవుని సృజించి సంతసించెనని వ్యాసుడు వచించెను -

> సృష్ట్వా పురాణి వివిధాన్యజ ఆత్మ శక్త్యా
> వృక్షా న్సరీసృప పశూన్ ఖగదంశ మత్స్యాన్ ।
> తైస్తైరతుష్ట హృదయం పురుషం విధాయ
> బ్రహ్మావలోకధిషణం ముదమాప దేవః ॥ [3]

కావున మనుజ జన్మ సార్థకమగుటకు భగవత్ప్రాప్తి కై తప్పక ప్రయత్నింపవలెను.

## 46

అవతారిక :- చరాచరములైన సకల ప్రాణులయొక్క జీవన ప్రయత్నాది ప్రవృత్తులకు మూలకారణము సర్వాంతర్యామియైన ఈశ్వరుడే యని నిరూపించుచున్నాడు -

### దేసాళం

> నేననగా నెంతవాఁడ - నెయ్యపు జీవులలోన
> ఈనెపాన రక్షించీ - నీశ్వరుఁడే కాక. ॥ పల్లవి ॥

---

(1) కు. సం., 5-33. (2) వి. చూ., 5. (3) భాగ., 11-9-28.

1. ఎవ్వరు బుద్ధి చెప్పిరి - యిలపైఁ జీమలకెల్లా
నెవ్వగఁ బుట్టలఁ గొల్చు - నించు కొమ్మని,
అవ్వల సంసార భ్రాంతి - అనాదినుండియు లోలోఁ
దవ్వించి తలకెత్తే యం - తర్యామే కాక! ॥నేన॥

2. చెట్టుల కెవ్వరు బుద్ధి - చెప్పేరు తతికాలానఁ
బుట్టి కాచి పూచి నిండాఁ - బొదలుమని,
గుట్టుతో జైతన్యమై - గుణము లన్నిటికిని
తిట్ట పెట్టి రచించిన - దేవుఁ డింతే కాక! ॥నేన॥

3. బుద్ధు లెవ్వరు చెప్పిరి - పుట్టినట్టి మెకాలకు
తిద్ది చన్నుదాగి పూరి - దినుమని,
పొద్దు పొద్దు లోననుండి - భోగములు మఱపిన
నిద్దపు శ్రీవెంకటాద్రి - నిలయుఁడే కాక! ॥నేన॥

1. నెవ్వగ = నిండుతలంపుతో, మిక్కిలి ప్రయత్నముతో; కొల్చు = ధాన్యము; అంతర్యామి= అందరిలో వ్యాపించియున్న పరమాత్ముడు.
2. తతికాలాన = అదనులో; తిట్టపెట్టి = రాశిచేసి
3. మెకాలకు = మృగములకు; నిద్దపు = స్నిగ్ధహృదయుడైన, దయామయుడైన.

**భావము :-** సృష్టిలో అన్యోన్యస్నేహము గల జీవు లనేకము లున్నవి. వానిలో నేనుగూడ ఒకడనే గాని నా గొప్పతనమే మున్నది ? సృష్టికర్తయగు పరమేశ్వరుడే అందరిని కాపాడినట్లు నన్నీనెపమున కాపాడుచున్నాడు.

ఇలపై చీమలు ప్రయత్నముతో తమ పుట్టలను ధాన్యముతో నింపుకొనుచున్నవి. అట్లు చేయవలెనని వాటి కెవ్వరు నేర్పిరి ? అనాదిగా జీవులకు అంతరంగములో సంసారభ్రాంతి గల్గించి పెంపొందించుచున్న సర్వాంతర్యామియైన పరమేశ్వరుడే వాటి కాబుద్ధి నేర్పి బ్రదుకు తెరువు చూపినాడు.

అదను దప్పక మొలకెత్తి, పూచి కాచి సంపూర్ణముగా వృద్ధి నొందుడని చెట్ల కెవ్వరు నేర్పినారు ? చరాచరము లన్నింటిలో నిగూఢముగా నున్న చైతన్యమై వాటి వాటి కాయాగుణములను నియమించి ప్రోదిచేసిన దేవుడే చెట్టు చేమలకట్టి స్థితిని గల్పించినాడు.

పుట్టిన మృగముల కన్నిటికి వెంటనే చనుబాలు గ్రోలి, కసవు మేసి బ్రదుకుమని నేర్పిన వారెవరు ? ప్రతినిత్యము అంతరంగములో నుండి ప్రేరకుడై ఆ యా ప్రాణుల కా యా భోగములు మరపిన దయామయుడైన శ్రీవేంకటేశ్వరుడే ఆ పని చేసినాడు.

**విశేషాంశములు :-** 'నారు వోసిన దేవుడే నీరువోయు' అన్నట్లు జీవులను సృష్టించిన భగవంతుడే వారి సర్వవిధములైన పోషణాది ప్రవృత్తులకు హేతువగుచున్నాడు. చీమలు ధాన్యము చేర్చుట. చెట్లు కాలానుగుణముగా పుష్పించి ఫలించుట, జంతువులు పుట్టిన వెంటనే స్తన్యపానమునకు గడంగుట, పూరి మేయుట అనునవి మరొకరు నేర్పగా వచ్చునవికావు. ఆ యా ప్రాణుల కవి సహజప్రవృత్తులై యున్నవి. కాని సర్వాంతర్యామియైన పరమేశ్వరుని ప్రేరణవలననే వాటి కట్టి ప్రవృత్తి కలుగుచున్నది. ప్రాణులు తమ్ము తాము రక్షించుకొనుచున్నట్లు గన్పట్టినను ఆ రక్షణ ప్రవృత్తికి మూలకారణము భగవదిచ్ఛయే. 'తేన వినా తృణమపి న చలతి' అన్నట్లు ఆయన సంకల్పము లేక గడ్డిపోచకూడ కదలదుగదా !

'ఈ నెపానరక్షించీ నీశ్వరుఁడె' యనుటచే ఏదో ఒక నెపముతో దేవుడే అందరిని రక్షించుచున్నాడని చెప్పబడినది. అన్నమయ్య తాను సంకీర్తనాచార్యుడై, అనుదినము దేవుని మహిమను కీర్తించుచు జీవించుటకు కారణము ఆ నెపమున తన్ను రక్షింపబూనిన పరమేశ్వరుడే యని ఇచ్చట వ్యక్త మొనర్చెను.

## 47

**అవతారిక :-** భగవత్ప్రాప్తికి భక్తియొకటే తగిన యుపాయ మనుచున్నాడు -

### దేసాక్షి

ఏవీ మపాయాలు గావు - యెక్కువ భక్తేకాని
దావతిఁ బడక యిది - దక్కితే సులభము. ॥ పల్లవి ॥

1. ముంటిపై సుఖమందుట - ముక్కున నూరుపు వట్టి
దంట వాయువు గెలువఁ - దలఁచే దెల్లా,
వెంటిక వట్టుక పోయి - వెసఁగొండ వాఁకుట
వెంటఁ గర్మమార్గమున - విష్ణుని సాధించుట. ॥ ఏవీ ॥

2. ఏనుగుతోఁ బెనఁగుట - యిల నిరాహారియై
కానని పంచేంద్రియాలఁ - గట్టఁబోవుట,
నానిం చినుప గుగ్గిళ్ళు - నమలుట బలిమిని
ధ్యానించి మనసుఁబట్టి - దైవము సాధించుట. ॥ ఏపీ ॥

3. దప్పికి నెండమావులు - దాగ దగ్గరఁ బోవుట
తప్పు చదువులలోఁ - దత్త్వము నెంచుట,
పిప్పి చవి యడుగుట - పెక్కుదైవాలఁ గొలిచి
కప్పిన శ్రీవేంకటేశు - కరుణ సాధించుట. ॥ ఏపీ ॥

ప ॥:- దావతిఁబడక = లేనిపోని ప్రయాసలకు గుఱిగాక.

1. ముంటిపై = ముల్లుమీద; ఊరుపు = శ్వాస; దంటవాయువు = ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములనెడు జంటవాయువు, లేదా బలమైన ప్రాణవాయువు.

భావము :- భగవంతుని జేరుటకు భక్తియొక్కటే శ్రేష్ఠమైన ఉపాయము గాని మరియేవియు గావు, లేనిపోని ప్రయాసలకు లోనుగాక జీవునికి భక్తి ఒక్కటి పూర్తిగా వశమైనచో భగవత్ప్రాప్తి సులభమగును.

ప్రాణాయామమార్గమున ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములను బిగించి బలమైన ప్రాణవాయువును గెలువ దలంచుట ముళ్లపై విశ్రమించి సుఖమందుట వంటిది. కర్మ మార్గమున యజ్ఞాదులాచరించి విష్ణుని సాధింపబూనుట వెంద్రుక నూతగాగొని వడిగా కొండ కెగబ్రాకుటవంటిది.

ఆహారము మాని శ్రోత్ర త్వక్చక్షు ర్జిహ్వా ఘ్రాణము లనెడు పంచజ్ఞానేంద్రియములను నిగ్రహింపబూనుట ఏనుగుతో పెనగులాట వంటిది. బలాత్కారముగా చిత్తమును నిగ్రహించి ధ్యానమార్గమున దైవమును స్వాధీనము జేసికొనగోరుట ఇనుప గుగ్గిళ్లు నానబోసి నమలుట వంటిది.

వ్యర్థములైన చదువులద్వారా తత్త్వము నెఱుంగబూనుట దప్పిగొని జలము ద్రావుటకై ఎండమావుల చెంతకు పరుగులిడుట వంటిది. పెక్కు పెరదైవముల సేవించి తద్ద్వారా శ్రీవేంకటేశ్వరుని దయను సాధింపజూచుట చవికై పిప్పి నాశ్రయించుట వంటిది.

**విశేషాంశములు :-** ముళ్ళపై విశ్రమించుట, వెంద్రుకను బట్టికొని కొండ కెగబ్రాకుట మున్నగు పనులు అలవి కానివి, అట్లే ప్రాణాయమ పద్ధతి, కర్మమార్గము,

ఉపవాసాదులద్వారా ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహపూర్వకమైన ధ్యానయోగము మున్నగు త్రోవలలో నడచి విష్ణుసాన్నిధ్యము జేరబూనుట సాధ్యముకాని పని. భక్తి యొక్కటే అందుకు మిగుల సులభమగు ఉపాయము అను తత్త్వము ఈ పాట తేటపరచుచున్నది.

యోగసాధన కుపకరించు ప్రాణాయామాదులు క్లేశముతో గూడినవి. కర్మ మార్గము జీవులను పైపైన బంధించునదే గాని ముక్తి గూర్చునదిగాదు. ఉపవాసాదులచే ఇంద్రియముల నెంతగా నిగ్రహింపబూనినను పరతత్త్వదర్శనము గల్గునంత వరకు విషయానురాగము నశింపదని గీత నుడువుచున్నది -

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥[1]

ధ్యానయోగము సైతము సుకరమైన పనిగాదు. ఇక ప్రవచనముచే, మేధాశక్తిచే, బహుశ్రుతముచే ఆత్మ లభ్యముగాదని శ్రుతి వచించుచున్నది -

నాయమాత్మా ప్రవచనేన లభ్యః న మేధయా న బహునా శ్రుతేన ।[2]

విద్వాంసుల వైదుష్యము భుక్తికే కాని ముక్తికి గాదని శంకరులు చెప్పిరి -

వైదుష్యం విదుషాం తద్వ ద్భుక్తయే న తు ముక్తయే ।[3]

పరదైవతమైన శ్రీవేంకటేశ్వరుని కృపలేక ఎట్లును ముక్తి లభింపదు గాన దానికై ఆ దేవునే సేవింపవలెను గాని ఇతర దేవతల నాశ్రయించుట నిష్ప్రయోజనము.

శ్రీకృష్ణు డర్జునునకు విశ్వరూపము జూపి - "అర్జునా ! నేను వేదముల చేతను, తపస్సుచేతను, దానముచేతను యాగముచేతను, నన్ను నీవిప్పుడెట్లు చూచితివో అట్లు చూచుటకు సాధ్యపడువాడను గాను, ఇట్టి నన్ను తత్త్వతః తెలిసి కొనుటకును, చూచుటకును, నాలో ప్రవేశించుటకును అనన్యభక్తి యొక్క దానిచేతనే శక్యమగును" అని చెప్పెను -

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥
భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప ॥[4]

---

(1) గీత., 2-57. (2) కఠ., 1-2-23.
(3) వి. చూ., 60. (4) గీత., 11-53,54.

శుక సనక నారదాదులు మున్ను భక్తిచేతనే విష్ణుని సాన్నిధ్యము నొందిరనుట కీ క్రింది శ్లోకము ప్రమాణము -

శుకాద్యా స్సనకాద్యాశ్చ పురా ముక్తా హి భక్తితః ।
భక్త్యైవ మా మనుప్రాప్తా నారదాద్యా శ్చిరాయుషః ॥[1]

అనేక జన్మకృత పుణ్యపరిపాకముచేతనే జనులకు భక్తిపై ప్రీతి గల్గుననియు, కలియుగమున భక్తియొక్కటే తరణోపాయమనియు భక్తిచేతనే కృష్ణుడు సాక్షాత్కరించుననియు పెద్దలు పలికిరి -

నృణాం జన్మ సహస్రేణ భక్తౌ ప్రీతిర్హి జాయతే ।
కలౌ భక్తిః కలౌ భక్తిః భక్త్యా కృష్ణః పురః స్థితః ॥[2]

## 48

అవతారిక :- తనకును, భగవంతునకును గల భేదమును వివరించి తన కా భగవంతుడే రక్షకుడనుచున్నాడు -

### శుద్ధ వసంతం

పురుషోత్తముఁడ వీవు - పురుషాధముఁడ నేను
ధరలో నాయందు మంచి - తన మేది ? ॥ పల్లవి ॥

1. అనంతాపరాధములు - అటు నేము సేసేవి
అనంతమయిన దయ - అది నీది,
నిను నెఱఁగ కుండేటి - నీ చుగుణము నాది
నను నెడయకుండే గు - ణము నీది. ॥ పురు ॥

2. సకల యాచకమే - సరుస నాకుఁ బని
సకల రక్షకత్వము - సరి నీపని,
ప్రకటించి నిన్ను దూరే - పలుకే నాకెప్పుడును
వెకలివై ననుఁ గాచే - విధము నీది. ॥ పురు ॥

3. నేర మింతయును నాది - నేరు పింతయును నీది
సారెకు నజ్ఞాని నేను - జ్ఞానివి నీవు,

(1) సూ. ప్ర., P. 43. (2) సూ. ప్ర., P. 44.

ఈ రీతి శ్రీవేంకటేశ! - యిట్టే నన్ను నేలితివి
ధారుణిలో నిండెను ప్ర - తాపము నీది. ॥ పురు ॥

1. అనంతాపరాధములు = అంతములేని తప్పులు; ఎడయక = తొలగక.
2. సకల యాచకమే = అందరిని (అన్నిటిని) యాచించుటే; సరుస = సమీపము; వెకలివై = ఆసక్తుడవై.
3. నేరమి = తెలియని తనము.

భావము :- దేవా ! నీవు పురుషులలో నెల్ల శ్రేష్ఠుడవైన పరమాత్ముడవు. నేను పురుషులలో నెల్ల నీచుడనైన జీవాత్ముడను. ఇట్టి నాలో మంచితన మెక్కడిది ?

నేను చేయు తప్పు లనంతములు. అట్లే నీ దయగూడ అంతము లేనిది. నీ స్వరూపము నెఱుంగలేని (నీకు మ్రొక్కని) నీచ స్వభావము నాది. ఐనను నన్నెన్నడు ఎడబాయని ఉత్తమస్వభావము నీది.

అందరియొద్ద (అన్నిటి కొఱకు) చేయిచాపుటయే నాపని. అందరిని కాపాడుటే నీపని. ఎల్లవేళల బహిరంగముగా నిన్ను తిట్టు పలుకే నాది. నన్ను విడువక తత్పర తతో రక్షించు విధానము నీది.

ఏమియు తెలియనితనము నాది. అన్నిటిని ఎఱింగిన సామర్థ్యము నీది. నేను అజ్ఞానిని. నీవు జ్ఞానివి. శ్రీవేంకటేశ్వరా ! ఇట్టి నన్ను నీవు లోగొని దయతో రక్షించితివి. ఇలలో నీ ప్రతాప మెల్లయెడల వ్యాపించినది.

**విశేషాంశములు :-** ఇక్కడ సర్వోత్కృష్టత్వము, దయామయత్వము, సర్వలోకరక్షకత్వము, సర్వజ్ఞత్వము మున్నగు సర్వేశ్వరుని గుణములు కీర్తింపబడినవి. అట్లే సర్వాధమత్వము, అనంతాపరాధకారిత్వము, సకల యాచకత్వము, అజ్ఞత్వము అను బద్ధజీవునియొక్క స్వభావములు పేర్కొనబడినవి. జీవులెట్లున్నను దయామయుడైన భగవంతుడు వారిని సంరక్షించుచున్నాడను పరమార్థము ప్రతిపాదింపబడినది.

ఇందు ప్రథమచరణములో కీర్తింపబడిన భగవంతుని దయాగుణము తక్కిన గుణములలో నెల్ల శ్రేష్ఠమైనది. దయాప్రభావము వలననే భగవంతుడు సకలలోక రక్షకత్వాది కార్యములు చేపట్టుచున్నాడు.

దయ యొక్కటి లేనిచో బోధ బలైశ్వర్యాదులగు ఇతర భగవద్గుణములు దోషములుగా గూడ పరిణమించునని వేదాంతదేశికులు దయాశతకమున చెప్పియున్నారు.

వృషగిరి గృహమేధిగుణా బోధబలైశ్వర్య వీర్యశక్తిముఖాః ।
దోషా భవేయు రేతే యదినామ దయే ! త్వయా వినాభూతాః ॥ [1]

మరియు జీవుడు అపరాధచక్రవర్తియనియు, భగవద్దయ తదితరగుణములకు సార్వభౌమి యనియు, కాన దయచేతనే జీవుడు దేవుని కధీనముగా చేయబడవలసియున్నాడనియు దయాశతకము వచించుచున్నది -

అహమస్మ్యపరాధ చక్రవర్తీ కరుణే ! త్వం చ గుణేషు సార్వభౌమీ ।
విదుషీ స్థితి మీదృశీం స్వయం మాం వృషశైలేశ్వర పాదసాత్కురు త్వమ్॥ [2]

జీవుడు భగవంతుని యెదుట తన అధమత్వాది నీచగుణములను ప్రకటించుట నైచ్యానుసంధాన ప్రక్రియ.

'పాపోఽహం పాప కర్మాఽహం పాపాత్మా పాప సంభవః,
'న నిందితం కర్మ తదస్తి లోకే సహస్రశో యన్న మయా వ్యధాయి'॥ [3]
'అపరాధ సహస్ర భాజనం' [4]

ఇత్యాది కథనములన్నియు ఈ కోవకు చెందినవే. వైష్ణవమతమున భగవత్ప్రాప్తి కీ ప్రక్రియ ముఖ్యమైన ఉపకరణముగా భావింపబడుచున్నది.

## 49

అవతారిక :- ఇంద్రియములు, అరిషడ్వర్గములు మున్నగు జీవుని బలగమును వివరించి చూపుచున్నాడు -

### శ్రీరాగం

అన్నిటికి నొడయండవైన - శ్రీపతివి నీవు,
ఎన్నరాదు మాబలఁగ - మెంచుకో మాపాఁజా. ॥ పల్లవి ॥

1. జ్ఞానేంద్రియములైదు - శరీరిలోపల
ఆనక కర్మేంద్రి - యములైదు,

(1) ద. శ., 15. (2) ద. శ., 30.
(3) అ. స్తో., 23. (4) అ. స్తో., 48.

తానకపు కామక్రో - ధాల వర్గము లారు
ఈ నెలవు పంచభూతా - లెంచు మాపౌఁజు. ॥ అన్ని ॥

2. తప్పని గుణాలు మూఁడు - తను వికారము లారు
అప్పటి మనో బుద్ధ్య - హంకారాలు,
ఉప్పతిల్లు విషయము - లుడివోని వొక అయిదు
ఇప్పటి మించే కోపము - యెంచుకో మాపౌఁజు. ॥ అన్ని ॥

3. ఆఁకలి దప్పియును మా - నావమానములును
సోఁకిన శీతోష్ణాలు - సుఖదుఃఖాలు,
మూఁక గమికాఁడ నేను - మొక్కేద శ్రీవేంకటేశ !
యేఁకటారఁ గడపేవా - నెంచుకో మాపౌఁజు. ॥ అన్ని ॥

ప॥:- ఒడయఁడు = ప్రభువు; పౌఁజు = సేన.

1. శరీరి = శరీరము గలవాడు, ఆత్మ; తానకము = జెట్లు నిలుచుండుటయందలి భేదము.

2. తను వికారములు = శరీర వికారములు, షడ్భావ వికారములు; ఉప్పతిల్లు = ఉత్పత్తియగు; ఉడివోనివి = తొలగిపోనివి.

3. మూఁకగమికాఁడు = సేనాధిపతి; ఏఁకట = అపేక్ష

భావము :- దేవా ! నీవు సమస్తమునకు అధిపతివైన లక్ష్మీపతివి, మా బలగమేమి తక్కువగా లేదు సుమా ! ఇది లెక్కకు మిక్కిలిగా నున్నది. ఈ మా దండు నెంచు కొమ్ము.

శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము అను జ్ఞానేంద్రియము లైదు జీవునిలో నున్నవి. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము అను అయిదు కర్మేంద్రియములు శరీరమునకు సంబంధించియున్నవి. అట్లే మోహరించి నిలిచిన కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను అరిషడ్వర్గములు నున్నవి. పృథివ్యప్తేజో వాయ్వాకాశములను పంచభూతములును కలవు. మా సేన ఎట్లున్నదో పరీక్షించుకొనుము.

అట్లే సత్త్వము, రజస్సు, తమస్సు అను గుణములు మూడు; ఉండుట, పుట్టుట, పెరుగుట, పరిణమించుట, క్షీణించుట, నశించుట అను శారీరకమైన వికారము లారు; మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి మూడు; తొలగద్రోయరాక ఎప్పటికప్పు డుత్పత్తియగు శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అను

విషయములైదు మా దండులో నున్నవి. అన్నిటిని మించిన కోపము కలదు. ఇంత విశాలమైన మా దండును అలక్ష్యము సేయక పరిగణనకు తీసికొమ్ము.

ఇంతే కాదు- ఆకలిదప్పులు, మానావమానములు, శరీరమునంటిన శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలైన ద్వంద్వములు కూడ గలవు. కాన నేను సామాన్య వీరుడను గాను. ఒక గొప్ప సేన కధిపతిని. నా వెనుక ఇంత పెద్ద మూక నిలిచి యున్నది. శ్రీవేంకటేశ్వరా ! ఇదిగో నేను నీకు మ్రొక్కుచున్నాను. అపేక్షతో ఈ దండును నడిపించు వాడనగు నన్నును, నా దండును పరిశీలించుకొనుము.

విశేషాంశములు :- ఈ సంకీర్తనము మాయచే ఆవరింపబడిన జీవుని చెన్నంటియున్న బలగమును వర్ణించుచున్నది. జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియము లైదు, అరివర్గము లారు, భూతము లైదు, గుణములు మూడు, భావవికారము లారు, మనో బుద్ధ్యహంకారములు మూడు, విషయము లైదు మొత్తము ముప్పది యెన్మిదింటిని పేర్కొన్న తర్వాత అరిషడ్వర్గములో చేరిన కోపము, దానియొక్క తీవ్రతను తెలియజేయుటకే మరల ప్రస్తావింపబడినది. చివరి చరణములో క్షుత్పిపాసలు, మానావమానములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు అను ద్వంద్వములు నిరూపింపబడినవి.

ఇందు నిర్దేశింపబడిన పది యింద్రియములు మనస్సు, విషయము లైదు షోడశవికారములని చెప్పబడుచున్నవి -

> **శ్రోత్రాక్షిరసనాఘ్రాణత్వచ స్సంకల్ప ఏవ చ ।**
> **శబ్దరూపరసస్పర్శ గంధవాక్పాణి పాయవః ।**
> **ఉపస్థం పాద ఇత్యేతే వికారాష్షోడశ స్మృతాః ॥**[1]

ఇందు 'సంకల్ప' శబ్దము 'మన' శ్శబ్దమునకు పర్యాయముగా వాడబడినది. 'ఇంద్రియాణి దశైకం చ''[2] ఇత్యాది ప్రదేశములలో మనస్సును పదునొకండవ యింద్రియముగా వ్యవహరించుట కలదు.

సాంఖ్యశాస్త్రములో తత్త్వముల నిరువదినాలుగుగాను, ముప్పదియారు గాను, తొంబదియారుగాను విభజించి చూపుదురు.

> **చతుర్వింశతి తత్త్వాని కేచి దిచ్ఛన్తి వాదినః ।**
> **కేచిత్షట్త్రింశతత్త్వాని కేచిత్ షణ్ణవతీని చ ॥** [3]

(1) రా. సి. సా., P. 62. (2) గీత., 13-6. (3) వరాహ., 1-1.

వరాహోపనిషత్తునందు చతుర్వింశతి తత్త్వములు ఇట్లు ప్రతిపాదింపబడినవి -

తేషాం క్రమం ప్రవక్ష్యామి సావధాన మనాః శృణు ।
జ్ఞానేంద్రియాణి పంచైవ శ్రోత్రత్వ గ్లోచనాదయః ॥
కర్మేంద్రియాణి పంచైవ వాక్పాణ్యంఘ్ర్యాదయః క్రమాత్ ।
ప్రాణాదయస్తు పంచైవ పంచ శబ్దాదయ స్తథా ॥
మనో బుద్ధి రహంకార శ్చిత్తం చేతి చతుష్టయమ్ ।
చతుర్వింశతి తత్త్వాని తాని బ్రహ్మవిదో విదుః ॥[1]

పది యింద్రియములు, ఐదు ప్రాణ వాయువులు, ఐదు విషయములు, అంతః కరణ చతుష్టయము కలిగి ఇరువదినాలుగు తత్త్వములిందు పేర్కొనబడినవి. ప్రాణవాయువులకు బదులుగా పంచభూతముల నీతత్త్వములలో కొందరు పరిగణింతురు. అంతఃకరణ చతుష్టయములో చిత్తము సంకీర్తనమున పేర్కొనబడలేదు.

సత్త్వరజస్తమోగుణములు ప్రకృతినుండి కలుగుచున్నవి. ఇవి దేహిని బంధించుచున్నవని గీత -

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।
విబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్ ॥[2]

వీటిని గూర్చిన వివరణ గీతలో గుణత్రయవిభాగయోగమున విశదముగా గాననగును.

షడ్భావవికృతులను అరిషడ్వర్గమును వరాహోపనిషత్తు ఇట్లు గ్గడించినది.

షడ్భావ వికృతి శ్చాస్తి జాయతే వర్ధతేఽపి చ ।
పరిణామం క్షయం నాశం షడ్భావవికృతిం విదుః ॥[3]
కామక్రోధౌ లోభమోహౌ మదో మాత్సర్య మేవ చ ।
ఏతేఽరిషడ్వా . . . . . . . . . . . . . . . . . . . . . . . . ॥[4]
ఆకలిదప్పులు షడూర్ములలో పరిగణింపబడినవి –
అశనా చ పిపాసా చ శోకమోహౌ జరామృతిః ।
ఏతే షడూర్మయః ప్రోక్తాః . . . . . . . . . . . . . . . . . . ॥[5]

---

(1) వరాహ., 1-2,3,4.(2) గీత., 14-5.(3) వరాహ., 1-8.
(4) వరాహ., 1-10. (5) వరాహ., 1-9.

చతుర్వింశతి తత్త్వములతో త్రిగుణములను, అరిషడ్వర్గమును, షడ్భావ వికారములను, శీతోష్ణాది ద్వంద్వములను చేర్చి మొత్తము జీవుని దండుగా అన్నమయ్య నిరూపించినాడు.

ఒక చక్రవర్తి ఆధిపత్యమునకు లోబడి సామంతరాజులు రాజ్యపాలనము గావింతురు. సామంతులు తమ సైన్యము మిక్కిలి బలమైనదని చెప్పుచు దానిని చక్రవర్తి కధీనము గావించి ఆయనకు బాసటగా నిల్చుట లోకపరిపాటి. శ్రీమన్నారాయణుడు సర్వమునకు అధిపతి. 'న తస్య కశ్చిత్పతిరస్తి లోకే'[1] అని శ్రుతి ఆయనను మించిన ప్రభువు లేడన్నది. జీవులెల్లరు ఆయనకు లోబడినవారే. కాన తనకు జెందిన ఇంద్రియాది పరివారము నంతటిని భగవదధీనము గావించి జీవుడు సర్వేశ్వరుని శరణు పొందవలె ననుట ఇందలి పరమార్థము.

## 50

అవతారిక :- మోక్షసుఖము తగిన ప్రయత్నము లేక చేజిక్క దనుచున్నాడు -

గౌళ

ఊరకే దొరకునా - ఉన్నతోన్నత సుఖము,
సారంబు దెలిసి కా - జయము చేకొనుట. ॥ పల్లవి ॥

1. తలఁపు లోపలిచింత - దాఁటినప్పుడు గదా !
అలరి దైవంబు ప్ర - త్యక్షమౌట,
కలుషంపు దుర్మదము - గడచినప్పుడు గదా !
తలకొన్న మోక్షంబు - తనకుఁ జే పడుట. ॥ ఊర ॥

2. కర్మంబు కసటువోఁ - గడగినప్పుడు గదా !
నిర్మలజ్ఞానంబు - నెరవేరుట,
మర్మంబు శ్రీహరి నీ - మఱఁగు చొచ్చినఁ గదా !
కూర్మిఁ దన జన్మ మె - క్కుడు కెక్కుడౌట. ॥ ఊర ॥

3. తనశాంత మాత్మలోఁ - దగిలినప్పుడు గదా !
పనిగొన్న తన చదువు - ఫలియించుట,
ఎనలేని శ్రీవేంక - టేశ్వరుని దాస్యంబు
తనకు నబ్బినఁ గదా - దరిచేరి మనుట. ॥ ఊర ॥

(1) శ్వేతాశ్వ., 6-9.

ప ॥:- ఉన్నతోన్నతసుఖము = మిక్కిలి పెద్దసుఖము, ఆత్మానందము.

1. తలకొన్న = ప్రయత్నించిన.

2. కసటు = మాలిన్యము; మర్మంబు = జీవస్థానము, హృదయము.

భావము :- శ్రేష్ఠాతిశ్రేష్ఠమైన మోక్షసుఖము తగిన ప్రయత్నమ్ము లేక ఊరక చేజిక్కుదిగాదు. ఒక పనిలో గెలుపొందవలెనన్నచో అందలి సారము తెలిసి దాని కనుగుణమైన సాధనసంపత్తి గలిగియుండవలెను గదా !

తలపులో నున్న చింతల నన్నిటిని దాటి చిత్తమును సంపూర్ణముగా భగవదాయత్తము గావించిననే దైవము ప్రత్యక్షమగును. పాపభూయిష్ఠమైన దుర్మదమును తొలగించు కొన్నప్పుడే తాను కోరిన ముక్తి తనకు వశమగును.

జన్మజన్మలనుండి తన్ను వెన్నంటి వచ్చుచున్న కర్మపు మాలిన్యమును పూర్తిగా కడిగివేసినపుడే నిర్మలమైన జ్ఞానము గలుగును. హృదయము శ్రీహరి మఱుగు చొచ్చినపుడే ప్రియమైన తన పుట్టుక అత్యుత్తమ మగును.

ఆత్మలో శాంతి నెలకొన్నప్పుడే ప్రయత్నపూర్వకముగా తానభ్యసించిన చదువు ఫలప్రదమగును. సాటిలేని శ్రీవేంకటేశ్వరుని దాస్యము తనకు లభించినప్పుడే తాను సంసార మనెడు సాగరముయొక్క గట్టుచేరి సుఖించును.

విశేషాంశములు :- ప్రయత్నింపక లోకమున నేదియు లభింపదు. ఎంత పెద్దలాభమును కోరుదుమో అంత గొప్ప ప్రయత్నము గూడ మనము చేయవలసి యున్నది. ప్రతిప్రాణియు సుఖమునే కోరుచున్నది. సుఖము నిత్యమని, అనిత్యమని రెండు విధములు. ప్రాపంచిక సుఖము లన్నియు అనిత్యములు. మోక్షసుఖ మొక్కటే నిత్యము. అందు వలననే అది 'ఉన్నతోన్నత సుఖము' అని చెప్పబడినది. విషయములవలన గలుగు సుఖము స్వల్పమైనదనియు, అందు క్లేశమెక్కువయనియు, బ్రహ్మనిష్ఠుల సుఖము అనంతమైనదనియు శంకరాచార్యులు చెప్పిరి -

> సుఖమల్పం బహుక్లేశో విషయ గ్రాహిణాం నృణామ్ ।
> అనన్తం బ్రహ్మనిష్ఠానా మితి వేదాంతడిండిమః ॥[1]

అత్యున్నత సుఖమును గోరువాడు అందుకు తగు మహోన్నత యత్నముగూడ చేయక తప్పదని ఈ పాట బోధించుచున్నది.

---

(1) వే. డిం, 77.

సంసార సంబంధమైన చింతలు, దుర్మదము, కర్మబంధము మున్నగునవి మానవుని ఉన్నతోన్నత సుఖమునకు దూరమొనర్చుచున్నవి. చిత (చితి) కంటె చింతయే బలవత్తరమైనది. చిత జీవములేని దేహమును గాల్చుచుండగా చింత జీవించిన వానినే కాల్చివేయుచున్నదని పెద్దలసూక్తి.

**చితా చింతా తయోర్మధ్యే చింతాసైవ గరీయసీ ।**
**చితా దహతి నిర్జీవం చింతా దహతి జీవినమ్ ॥**[1]

అరిషడ్వర్గములలో మదమొకటి. ఇది అష్టవిధములు (1) అన్నమదము, (2)అర్థమదము ,(3) స్త్రీమదము, (4) విద్యామదము, (5) కులమదము, (6) రూపమదము, (7) ఉద్యోగమదము (8) యౌవనమదము. ఈ మదము లన్నియు దుఃఖహేతువులు.

కర్మలచే గల్గు మాల్గిన్యము అనేక జన్మలనుండి వాసనారూపమున జీవుల నంటుకొనియుండును. పుణ్యపాపరూపములైన ఉభయకర్మలను తొలగించుకొన్నప్పుడే నిర్మలమైన జ్ఞానము లభించును.

**గరిమ కర్మబంధాలు గట్టిన తాళ్ళూడిం చ ।**
**నిరతి గలదుగా నీ భక్తి నాకు,**[2]

అని భగవద్భక్తిచేతనే కర్మబంధమును వదలించుకొనవలెనని అన్నమయ్య మరొకచో నిర్దేశించెను.

వేదాదివిద్యలుచదివియుశాంతి లేనివానికి సుఖములేదు.

**'అశాంతస్య కుతః సుఖమ్!'**[3]

అని గీత. కాన ఉన్నతోన్నత సుఖము గోరువాడు చింతల చెంతజేరనీయరాదు. మదమును వదలవలెను. కర్మమును కడిగివేయవలెను. గోవిందుని శరణొందవలెను. శాంతిని పెంపొందించుకొనవలెను. హరికి దాసుడు గావలెను.

## 51

**అవతారిక** :- జ్ఞానులకు, అజ్ఞానులకు భేదమును నిరూపించుచున్నాడు -

### భూపాళం

అప్పుడు చూచేదివో - అధికుల నధముల
తప్పక యెచ్చరి యిదే - తలఁచవో మనసా ! ॥ పల్లవి ॥

---

(1) ప్రసంగ., 17. (2) అ. సం., 7-196. (3) గీత., 2-66.

1. కొండలవంటి పనులు - కోరి ముంచుకొంటే నూర
కుండికైకొననివాఁడే - యోగీంద్రుఁడు,
నిండిన కోపములకు - నెపములు గలిగితే
దండితోఁ గలఁగని యా - తఁడే ధీరుఁడు. ॥ అప్పు ॥

2. సూదులవంటి మాటలు - సొరిదిఁ జెవి సోఁకితే
వాదులు వెట్టుకొనని - వాఁడే దేవుఁడు,
పాదుకొన్న సంసార - బంధము నోరూరించితే
అదిగొని మత్తుఁడు గా - నట్టివాఁడే పుణ్యుఁడు. ॥ అప్పు ॥

3. గాలాల వంటి యాసలు - కడుఁదగిలి తీసితే
తాలిమితోఁ గదల నా - తఁడే ఘనుఁడు,
మేలిమి శ్రీవేంకటేశు - మీద భారము వేసుక
వీలక తనలో విఱ్ఱ - వీఁగువాఁడే నిత్యుఁడు. ॥ అప్పు ॥

ప॥:- ఎచ్చరి = హెచ్చరిక.
1. ముంచుకొంటే = పైకొంటే.
2. సొరిదిఁ = క్రమముగా; అదిగొని = ఆసక్తిచెంది
3. వీలక = వ్రీలక, జంకుగొనక.

**భావము** :- ఓ మనసా ! లోకములో అధికులెవరో, అధములెవరో ఆ సందర్భము వచ్చినపుడే గ్రహింపదగును సుమా ! ఇదే నీకు హెచ్చరిక ! దీనిని చక్కగా భావించుకొనుము.

కొండలవలె మితిమీరిన పనులు తమకు తాముగా వచ్చి పై బడినను నిశ్చలుడై యే మాత్రము లెక్కపెట్టనివాడే యోగీంద్రుడు. మిక్కిలిగా కోపగించుటకు అనువైన పరిస్థితు లేర్పడినను నిండైన హృదయముతో ఏమాత్రము కలతనొందని వాడే ధీరుడు.

సూదుల వంటి సూటిపోటు మాటలు (నిందావాక్యములు) తన చెవిని బడినను తన్ను దూషించువారితో వాదమునకు దిగనివాడే దేవుడు, అనగా దేవునితో సమానుడు. తనలో దృఢముగా నెలకొన్న సంసారబంధము నోరూరించి తన్ను అపమార్గము లోనికి లాగుచున్నను దానికి ఆసక్తుడై వశపడక నిలిచి మదోన్మత్తుడు గాకుండువాడే పుణ్యాత్ముడు.

గాలములవంటి ఆశలు మిక్కిలిగా చుట్టుముట్టి లాగినను ఓర్పువహించి కదలక నిలువగలవాడే ఘనుడు. శ్రేయోదాయకుడైన శ్రీవేంకటేశ్వరునిపై భారము వేసి ఎట్టి పరిస్థితులందైనను ధైర్యము గోల్పోక తనలో తా నానందించువాడే నిత్యుడు.

**విశేషాంశములు :-** కాకి, కోకిల ఒకే తీరుననుండును. కాని వసంతకాలము రాగా వాటి భేదము స్పష్టమగును.[1] అట్లే పైకి చూచుటకు మనుజు లెల్లరు ఒకే తీరున కన్పట్టుదురు. సరియైన సందర్భము లేర్పడినప్పుడే వారిలో విజ్ఞులెవరో, అజ్ఞులెవరో నిర్ణయించుటకు వీలగును. అట్టి సందర్భములను కొన్నింటిని పేర్కొనుచు అధికులకు అధములకు ఉన్న భేదమును ఈ సంకీర్తనములో అన్నమయ్య స్పష్టము గావించినాడు.

మనోనిగ్రహములేని అధముడు చిన్న పని చేయవలసివచ్చినను అదేదో తన తలకు మించిన బరువుగా తలచి కలతజెందును. కాని చిత్తనిగ్రహమున కలవాటు పడిన యోగీంద్రుడు జనకాదులవలె సంగరహితుడై యుండును. గాన ఎన్నిపనులు పైబడినను లెక్కగొనక నిశ్చలుడై యుండును.

అరిషడ్వర్గములలో కోపమొకటి. ఇది పెక్కు అనర్థములకు హేతువు గాన 'తనకోపమె తన శత్రువు'[2] అని పెద్దలనిరి. అధము డించుకంత నెపము కల్గినను ఇతరులయెడ కోపోద్దీపితుడై ఎగసిపడును. ధీరు లెంత పెద్దకోపకారణము గల్గినను కోపింపరు.

**వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః ।**[3]

అని కాళిదాసు చెప్పినట్లు వికారము నొందుటకు తగిన కారణమున్నను వికృతి నొందనివారే గదా ధీరులు !

ఇతరులు తన్ను దూషించిరని చీటికి మాటికి వారితో వాదులాటకు దిగుట నీచుని స్వభావము. భగవంతుని ప్రీతికి పాత్రులైన వారి లక్షణములలో 'తుల్య నిందాస్తుతిర్మౌనీ'[4] అని గీత చెప్పినట్లు నిందాస్తుతుల యెడ సమత్వము పూని పరులు తన్ను తూలనాడుచున్నను వారితో వాదింపక తూష్ణీంభావము వహించి యుండువాడే నిజమైన భక్తుడు.

సంసారబంధము అనేక జన్మములనుండి తన్నంటుకొనియున్నది. తేనె

---

(1) కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పిక కాకయోః ।
వసన్తకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః ॥

(2) సు. శ., 50.

(3) కు. సం., 1-59.

(4) గీత., 12-19.

పూసిన కత్తివలె పైకి చవిగా దోచు ఆ సంసారమును భావించినంతనే సామాన్య జీవులకు నోరూరుచుండును. తత్త్వజ్ఞుడు మాత్రము సంసారములోని దోషమును పరికించినవాడు గాన దానికి వశుడు గాకుండును. బాణములు మహాశిలను భేదింపజాలనట్లు ప్రాజ్ఞుడైన వాడెదుట నున్నను సంసారభయము లతనిని భేదింపలేవని వసిష్ఠుడు వచించెను -

హృదయం నావలుమ్పన్తి భీమాః సంసృతిభీతయః ।
పురః స్థితమపి ప్రాజ్ఞం మహోపల మివేషవః ॥[1]

ఆశలు జీవుని తమవైపు లాగుటకు ప్రయత్నించుచుండును. ప్రాణములు దీయు గాలములతో వాటిని పోల్చుటచే వాటివలన కలుగు ఉపద్రవము సూచింపబడినది. జ్ఞాని ఆశలకు లోబడడు సరికదా! తానే వాటిని లోబరచుకొనును.

స్థితప్రజ్ఞుని లక్షణమును వివరించుచు శ్రీకృష్ణుడు నిశ్చలమైన సముద్రములో జలము ప్రవేశించునట్లు ఎవనిలో కామములు ప్రవేశించి ఎట్టి వికారమును కలిగింపవో. అట్టివాడే శాంతి నొందును గాని కామాభిలాషి శాంతి నొందలేడని చెప్పెను.

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తి మాప్నోతి న కామకామీ ॥[2]

గీతలో చెప్పబడినట్లు బ్రాహ్మీస్థితి నొందిన స్థితప్రజ్ఞుడే ఇక్కడ 'అధికుడు' అను పదముచే గుర్తింపబడినవాడని గ్రహింపనగును.

## 52

అవతారిక :- భగవత్ప్రాప్తికి శరణాగతియే ముఖ్యోపాయ మనుచున్నాడు -

### ముఖారి

ఏదుపాయము - యే నిన్నుఁ జేరుటకు
ఆది నంత్యము లేని - అచ్యుత మూరితివి. ॥పల్లవి॥

1. వెలయ నీ గుణములు - వినుతించే నంటే
తెలియ నీవు గుణా - తీతుఁడవు,

---

(1) వ.గీ. 239. (2) గీ.త. 2-70.

చెలరేఁగి నిను మతిఁ - జింతించే నంటే
మలసి నీ వచింత్య - మహిముఁడవు. ॥ ఏదు ॥

2. పొదిగి చేతుల నిన్నుఁ - బూజించేనంటే
కదిసి నీవు విశ్వ - కాయుఁడవు,
అదన నేమైన స - మర్పించే నంటే
సదరమై అవాప్త - సకల కాముఁడవు. ॥ ఏదు ॥

3. కన్నులచేత నిన్ను - గనుఁగొనే నంటే
సన్నిధి దొరక నగో - చరుఁడవు,
ఇన్నిటాను శ్రీవేంక - టేశ నీవు గలవని
వన్నెల శరణనే - వాక్యమే చాలు. ॥ ఏదు ॥

ప॥:- అచ్యుత మూరితివి = చ్యుతి ( జారుపాటు) లేని మూర్తి కలవాడవు.

1. గుణాతీతుఁడవు = గుణములను దాటినవాడవు; మలసి = వ్యాపించి; అచింత్య మహిముఁడవు = చింతింపరాని మహిమ కలవాడవు.

2. విశ్వకాయుఁడవు = విశ్వమే శరీరముగా గలవాడవు; అవాప్త సకలకాముఁడవు = పొందబడిన సమస్తములైన కోరికలు గలవాడవు.

3. వన్నెల = ప్రసిద్ధమైన.

**భావము :-** దేవా ! నేను నిన్ను జేరుటకు నాకు తగిన ఉపాయమేది ? నీవు మొదలు తుదిలేని అచ్యుతమూర్తివి.

నీ గుణములను ప్రకటముగా నోరార స్తుతించి నిన్ను జేరెదనని తలంచితినా? అది కానిపని. ఏలన, పరికింపగా నీవు గుణముల నతిక్రమించినవాడవై యున్నావు. ఉత్సాహముతో ఏకాగ్రత గలిగి నిన్ను నా చిత్తమునందే నిలిపి చింతింతునన్నచో నీవు విశ్వవ్యాప్తుడవై చింతింప శక్యముగాని మహిమలతో గూడియున్నావు.

నిన్ను నా వశవము చేసికొని చేతులార పూజించెద నన్నచో నీవు చరాచరాత్మకమైన నిఖిలవిశ్వమునే శరీరముగా గలిగియున్నావు. అవకాశము జూచుకొని నీకేదైన సమర్పించుకొందు నన్నచో నీవు కోరికలెల్ల తీరినవాడవు.

కన్నులార నిన్ను కనుగొందు నన్నచో నీవు చూపుల కందుబాటులో లేని అగోచరమూర్తివి. కాన పై యుపాయములతో నిన్ను జేరుట సాధ్యము గాదు. శ్రీవేంకటేశ్వరా ! నీవు ఎల్లయెడల నున్నావని నమ్మి సుప్రసిద్ధమైన ప్రపత్తి మార్గము

ననుసరించి నిన్ను శరణుం జొచ్చుటయే నిన్ను జేరుటకు నాకు తగిన యుపాయమైయున్నది.

**విశేషాంశములు :-** భగవంతుడు గుణాతీతుడు గాన ఆయన గుణములను వినుతించుట పొసగదు, చింతింప వీలుగాని మహిమలు కలవాడు గాన ఆయనను చింతించుటయు చెల్లదు. విశ్వశరీరుడు కాన ఆయనను పూజించుటయు అశక్యమే. ప్రాప్త సమస్త కాముడు గాన ఆయనకు సమర్పింపదగిన దెద్దియు లేదు. కన్నులకు కనిపించువాడు కాడు గాన ఆయనను ప్రత్యక్షముగా చూచుట కుదరదు. అందుచే పై యుపాయములను విడిచి శరణాగతి నొందుటే భగవత్ప్రాప్తి కనువైన త్రోవయని ఈ పాట ప్రతిపాదించుచున్నది.

'అనాద్యనన్తం'[1] అని శ్రుతియు, 'యో మా మజ మనాదిం చ'[2] 'నాస్త్యన్తో విస్తరస్య మే'[3]

అని స్మృతియు భగవాను డాద్యంతరహితు డని చాటుచున్నవి.

మఱియు బ్రహ్మేంద్రాదులకు స్థానభ్రంశము కలదు గాని నారాయణునకు మాత్ర మది లేదు గాన అతడు 'అచ్యుతుడు' అని చెప్పబడినాడు -

చ్యవనోత్పత్తియుక్తేషు బ్రహ్మేంద్ర వరుణాదిషు ।
యస్మాన్న చ్యవసే స్థానాత్తస్మాత్ సంకీర్త్యసేఽచ్యుతః ॥[4]

ఆ పరమాత్ముడు లెక్కకు మిక్కిలియగు గుణములు గలవాడు గాన గుణాతీతు డనబడుచున్నాడు. 'అచిన్త్య మవ్యక్తం'[5] ఇత్యాది శ్రుతిచే ఆయన మహిమ చింతింప నలవికానిదని తెలియుచున్నది.

మరియు భూమియే పాదములుగా ఆకసమే బొడ్డుగా, వాయువే ప్రాణముగా, చంద్రసూర్యులే నేత్రములుగా, దిక్కులే చెవులుగా, ద్యులోకమే శిరస్సుగా, అగ్నియే ముఖముగా, సముద్రమే మూత్రకోశముగా గల్గిన ఆ పరమాత్మలో సురనరాదులతో గూడిన సమస్తవిశ్వము లీనమైయున్నది. కాన ఆయన విశ్వకాయుడగు చున్నాడు -

భూః పాదౌ యస్య నాభి ర్వియ దసు రనిల శ్చంద్రసూర్యౌ చ నేత్రే
కర్ణావాశా శ్శిరో ద్యౌర్ముఖ- మపి దహనో యస్య వాస్తేయ మబ్ధిః ।

---

(1) శ్వేతాశ్వ., 5-13. (2) గీత., 10-3. (3) గీత., 10-19.
(4) వి. స. నా. భా., P. 109. (5) కైవల్య., 1-6.

అంతస్థం యస్య విశ్వం సురనర ఖగగో భోగి గంధర్వదైత్యైః
చిత్రం రంరమ్యతే తం త్రిభువన వపుషం విష్ణు మీశం నమామి ॥[1]

'నానవాప్త మవాప్తవ్యం'[2] అని భగవంతుడే చెప్పియున్నాడు గాన ఆయన పొందని కోరిక లెవ్వియు లేవు. 'న చక్షుషా పశ్యతి కశ్చనైనం'[3] ఇత్యాది శ్రుతులు ఆయన రూపము చర్మ చక్షువులకు గోచరము గాదని నిరూపించుచున్నవి.

'అస్తీత్యే నోపలబ్ధవ్యః'[4] అని శ్రుతి చెప్పినట్లు సర్వత్ర భగవంతుడున్నాడని విశ్వసించుటయు, 'ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే'[5] అను శ్రుతి ననుసరించి ఆ దేవుని శరణొందుటయు భగవత్ప్రాప్తికి మేలైన ఉపాయమని గ్రహింపవలెను.

## 53

అవతారిక :- బంధమోక్షములకు గొనిపోవు ఇరుత్రోవలను జూపి అందు ఉచితమైన దారిని బట్టి పొమ్మని జీవాత్మను హెచ్చరించుచున్నాడు -

### బౌళి

ఏది వలసె నీవదిసేయు - యిందులోన నో జీవాత్మ
పొదుగు మనలో నంతరాత్మయై - పరగిన శ్రీహరి పనుపునను ॥పల్లవి॥

1. మనవంటి జీవులే - మహిలోన నొకకొన్ని
శునకములై కుక్కుటములై - సూకరములు నైనవి,
దినదినముఁ గర్మపాశములఁ - దిరిగెడి దుర్దశలటు చూడు
సనకాదులై కొందరు జీవులు - శౌరిదాసులై రటు చూడు. ॥ ఏది ॥

2. కన్నులుఁ గాళ్ళు మనవలెఁ దనువులు - గైకొని కొందరు నరులు
పన్నిన తొత్తులు బంట్లునై మన - పనులు సేయుచు నున్నారు
ఎన్నఁగ శ్రీహరి నెఱఁగక - యిడుమలఁ బొరలెడి దది చూడు
మున్నె హరిదాసులై నారద - ముఖ్యులు గెలిచిన దది చూడు ॥ఏది॥

3. ఇంతగాలమును యీ పుట్టుగులనె - యిటువలెఁ బొరలితి మిన్నాళ్ళు
ఇంతట శ్రీవేంకటేశుఁడు దలంచి - యీ జన్మంబున మము నేలె,

---

(1) స్తో. ర., P. 8. (2) గీత., 3-22. (3) కఠ., 6-9.
(4) కఠ., 6-13. (5) శ్వేతాశ్వ., 6-18.

వింతల బొరలిన నరకకూపముల - వెనకటి దైన్యము లటు చూడు
సంతసమున ముందరిమోక్షము - సర్వానందం బది చూడు. ॥ఏది॥

1. కుక్కుటములు = కోళ్ళు; సూకరములు = పందులు.

2. ఇడుమలఁ = కష్టములలో.

భావము :- ఓ జీవాత్మా ! అనాదియైన ఈ సంసారబంధమునకే కట్టువడి పలుజన్మలు దాల్చుచు పరిభ్రమించు త్రోవ యొకటి. ఈ భవబంధమును త్రెంచుకొని మోక్షమున కేగు తెరువు మరొక్కటి కలవు. మనలో అంతరాత్మయై శ్రీమన్నారాయణుడున్నాడు. అయన ఆదేశము ననుసరించి ఈ యిరు త్రోవలలో నీకేది కావలయునో చక్కగా పరిశీలించుకొనుము. ఉచితమైన పద్ధతినిబట్టి పొమ్ము.

మనవంటి జీవులే ఇలలో కొన్ని కుక్కలుగా, పందులుగా వానివాని పాపకర్మల ననుసరించి పుట్టినవి. ప్రతిదినము ఆ యా కర్మపాశములలో తగులువడి అందు కనుగుణమైన దుఃస్థితి ననుభవించుచు పరిభ్రమించుచున్నవి. వాని వైపు అటు చూడుము. మరికొందరు మనవంటి జీవులే పుణ్యాపరులై శ్రీహరిని భక్తితో భజించి సనకసనందనాది మునీంద్రులుగా రూపొంది హరిదాసులై ముక్తిని పొందినారు. అటు వారి వైపును జూడుము.

మనవలె మనుజులై పుట్టిన మరికొందరు కన్నులు, కాళ్ళు మున్నగు అవయవములు గల శరీరములు గల్గియుండియు బానిసలై, సేవకులై మనకు పనులు సేయుచున్నారు. వారు భగవంతు నెఱుంగక ఇక్కట్టు లనుభవించుచున్నారు. అదిగో వారిని చూడుము. మరికొందరు మనవంటి మానవులే జాగరూకులై ముందే నామసంకీర్తనాదులతో మాధవుని భజించి నారదాది మునిముఖ్యులై సంసారసమరములో గెలుపు గొని ముక్తులైనారు. వారిని గూడ చూడుము.

అనాదికాలము నుండి ఈ విధముగా ఎన్నో జన్మములు దాల్చుచు సుఖదుఃఖా లనుభవించుచు ఇన్నాళ్ళవరకు పొరలితిమి. ఈ జన్మములో ఎట్లో శ్రీవేంకటేశ్వరుడు దయదలంచి తన్ను భజించి ముక్తులు కండని ప్రబోధించుచు మమ్ము కాపాడినాడు. ఓ జీవాత్మా ! తొలిజన్మములందు వివిధ నరకకూపములలో బడి ఎన్నో వింతవింతలైన బాధలకు లోనై దైన్య మొందితిమి గదా ! అది యంతయు ఒక్కసారి పర్యాలోచించుకొనుము. ఇప్పుడు అన్ని విధముల ఆనందదాయకమైన మోక్షము ముంగిటనే ఉన్నది. సంతసముతో దానిని చూడుము.

విశేషాంశములు :- ఒకడు ముక్తుడై సుఖించుటకును, మరొకడు బద్ధుడై దుఃఖించుటకును వాడు వాడు చేసికొన్న సుకృతదుష్కృతములే హేతువు లగుచున్నవి. కుక్క, పంది మున్నగు నీచ జన్మలు దాల్చిన జీవులు పూర్వజన్మలలో అందుకు కారణము లైన నీచ కర్మలను చేసినారని తెలియవలెను. అట్లే సనకసనందన నారదాది మునీంద్రులు ముక్తాత్ములై సుఖించుటకు వారు మున్నార్జించిన తపస్సు, ధ్యానము, హరిభజన మున్నగు సుకృతములే మూలములని గ్రహింపవలెను. నరులై పుట్టియు కొందరు సేవావృత్తితో హీనముగా జీవించుటకు వారి పూర్వకర్మమే కారణము.

అందువలననే భగవంతుడు కామక్రోధాది దుర్గుణములతో గూడి తన్ను ద్వేషించువారిని అసురయోనులలో జన్మింపజేతు ననియు, అట్టి మూఢులు తన్ను పొందనేరక ప్రతిజన్మమునందును అధమగతినే పొందుదురనియు చెప్పెను -

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు ॥
ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని ।
మా మ ప్రాప్యైవ కౌన్తేయ! తతో యాన్త్యధమాం గతిమ్ ॥[1]

ఇందుకు వ్యతిరిక్తముగా సుగుణములతో నిండిన దైవసంపదగలవారిని భగవంతుడు ఉత్తమజన్మలు గలవారినిగా జేయునని తెలియనగును. భగవద్దయ లేనిదే ఉత్తమస్థితి జీవులకు లభింపదు. కాబట్టి 'అంతరాత్మయై పరగిన శ్రీహరి క్షేమపున' శుభమార్గమును చేపట్టవలెననియు, 'శ్రీవేంకటేశుడు దలంచి యీ జన్మంబున మము నేలె' అనియు అన్నమయ్య చెప్పినాడు.

తాను చేయు కార్యము మంచిదో, చెడ్డదో చక్కగా ముందే పర్యాలోచించి చేయవలెననియు, త్వరపడి చేసిన పనులకు దుష్ఫలము ననుభవింపక తీరదనియు భర్తృహరి హెచ్చరించెను -

గుణవ దగుణవద్వా కుర్వతా కార్యమాదౌ
పరిణతి రవధార్యా యత్నతః పండితేన ।
అతిరభసకృతానాం కర్మణా మావిపత్తేః
భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః ॥[2]

(1) గీత., 16-19,20. (2) భర్తృ., 1-95.

'సహసా విదధీత న క్రియా మవివేకః పరమాపదాం పదమ్'[1] అన్న భారవి సూక్తియు ఈ నీతినే బోధించుచున్నది. కాన చక్కగా ఆలోచించి, సత్కార్మములే చేసి, సన్మార్గముననే జీవించి దేవుని దయకు పాత్రులు కావలె ననుట తత్త్వార్థము.

## 54

అవతారిక :- సర్వసముడైన దేవదేవుని తన గుణదోషము లెంచక రక్షింపు మని వేడుచున్నాడు -

### శంకరాభరణం

నీవు సర్వసముఁడవు - నీవు దేవదేవుఁడవు
ఈవల నా గుణదోషా - లెంచనీఁక నేలా ? ॥ పల్లవి ॥

1. పూవులపైఁ గాసీఁ - బొరి ముండ్లపైఁ గాసీని
అవల వెన్నెల కేమి - హాని వచ్చీనా ?
పావనుల నటుగాచి - పాపపుంజమైన నన్ను
గావఁగా నీకృపకును - గడ మయ్యీనా ? ॥ నీవు ॥

2. గోవుమీఁద విసరీఁ - గుక్కమీఁద విసరీని
పావనపు గాలికిని - పాప మంటీనా ?
దేవతల రక్షించి - దీనుఁడనైన నాకు
దోవ చూపి రక్షించితే - దోస మయ్యీనా ? ॥ నీవు ॥

3. కులజుని యింట నుండీ - కులహీనుని యింటనుండీ
యిలలో నెండకు నేమి - హీన మయ్యీనా ?
వలసి శ్రీవేంకటాద్రి - వరములు యిచ్చి నాలో
నిలిచి వరములిచ్చి - నేఁడు గావవే. ॥ నీవు ॥

1. పొరి = క్రమముగా; కడమ = లోపము.

భావము :- దేవా ! నీవు సర్వత్ర సమభావము కలవాడవు. దేవాధిదేవుడవు. ఎక్కువతక్కువతనములు, తప్పొప్పులు పరికించు స్వభావము నీకు లేదు గదా ! అట్లైనప్పుడు నాలోని గుణదోషములను పరికించవలసిన అవసరము నీకే మున్నది?

వెన్నెల పూలపై కాయుచున్నది. అట్లే ముండ్లపై కూడ కాయుచున్నది.

(1) కిరా. 2-30.

ముండ్లపై ప్రసరించి నందువలన వెన్నెలకేమైన లోటు వచ్చినదా ? పరమాత్మా ! నీ దయ పుణ్యాత్ముల నెందరినో కాపాడినది. నేను పాపరాశిని. నన్ను కాపాడినంత మాత్రమున నీదయకు గలుగు లోటేమున్నది.

పవిత్రమైన వాయువు గోవుపై విసరుచున్నది. అట్లే కుక్కమీద గూడ వీచుచున్నది. కుక్క నీచజంతువు కావచ్చును. కాని దానిపై ప్రసరించుటవలన గాలి కేమైన పాపమంటినదా ? ప్రభూ ! నీవు దేవతల రక్షించినావు. నేను దీనుడను. నాకు గూడ తగిన త్రోవ జూపి రక్షించినచో నీకు దోష మంటునా ?

ఉత్తమ కులస్థుని యింట ఎండకాయుచున్నది. అదే యెండ హీనకులజుని గృహమున గూడ ప్రసరించుచున్నది. అందువలన ఎండకేమైన హీనత్వము వాటిల్లినదా! శ్రీవేంకటేశ్వరా ! శ్రీవేంకటాద్రిపై నెలకొని నీ వెందరికో భక్తులకు వరములిచ్చినావు. నాపై గూడ నీ అనుగ్రహము చూపి వరము లిచ్చి రక్షించవయ్యా!

**విశేషాంశములు :-** భగవంతుని సర్వసమభావము ఈ పాటలో ఉగ్గడింపబడినది. ఆ దేవ దేవునకు ఒకరిపై ప్రీతి మరొకరిపై ద్వేషము ఉండవు. జీవునికి వలె దేవునికి గూడ రాగద్వేషము లున్నచో ఇక ఆయన గొప్పతన మేమున్నది ?

తాను సర్వ భూతములలో సముడననియు, తనకు ద్వేషింపదగినవాడు గాని, ప్రేమింప దగినవాడు గాని లేడనియు, ఎవరు తన్ను భక్తితో భజింతురో వారు తనయందును, తాను వారియందును నెలకొనియుందు మనియు భగవంతుడు స్వయముగా ఆనతిచ్చియున్నాడు -

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।**
**యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥**[1]

మరియు ఎంత దురాచారుడైనను అనన్యచిత్తుడై తన్ను భజించువాడు చక్కని నిశ్చయము గలవాడు గాన సాధువే యగు నని కృష్ణుడు పలికెను -

**అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥**[2]

పైగా దేవుడు పుణ్యాత్ములను రక్షించుటలో పెద్దవిశేషము లేదు. పాపులను కాపాడుటలోనే ఆయన ఘనత గలదు. ప్రహ్లాదాది పుణ్యాత్ములను రక్షించినట్లే 'అజామిళుడు' మున్నగు దురాత్ములను గూడ ఆయన అనుగ్రహించినాడు గదా !

---

(1) గీత., 9-29. (2) గీత., 9-30.

భగవంతుని యెడ భక్తి గలిగియుండుటే మన ముఖ్య కర్తవ్యము. భక్తి ప్రభావముచే ఎంత దుష్టుడైనను సాధువుగా మారి పరమేశ్వరుని అనుగ్రహమునకు పాత్రుడగుననుట ఇట గ్రహింపదగిన పరమార్థము.

అన్నమయ్య తన్ను పాపపుంజముగా, దీనునిగా వర్ణించుకొనుట దేవునియెదుట జీవు డనుసరింప దగిన నైచ్యానుసంధాన ప్రక్రియకు జెందిన అంశముగా గుర్తింపవలెను.

## 55

అవతారిక:- లాభనష్టములు, చావు పుట్టుకలు ఎవని మాయలో అట్టి పరమేశ్వరుని చింతించుటే కర్తవ్య మనుచున్నాడు -

### మాళవి

ఇందులకుఁ జింతించనేల - యీశ్వరుని మాయ లివి
యెందుకు మూలము హరి - యీతనిఁ జింతించరే. ॥ పల్లవి ॥

1. ఇలనారికడపుగా - య(యె)కు నీరు వచ్చినయట్టు
తలఁచి రాఁగలమేలు - తన్నుఁదానే వచ్చురే,
లలి నేనుగు దిన్న వె - లఁగ పంటిబేసము
వలెనే పోఁగలవెల్ల - వడిఁ దానే పోవురే. ॥ ఇందు ॥

2. నిండిన యర్ధములోన - పీడ వొడచూపినట్టు
దండియైన పుట్టుగులు - తన్నుఁదానే వచ్చురే,
పండిన పండ్లు తొడమఁ - బాసి వూడినయట్టు
అండనే మరణములు - అందరికి సరిరే. ॥ ఇందు ॥

3. పెనురాతిపైఁ గడవ - పెట్టఁగాఁ గుదురైనట్టు
తనుఁదానే చింతింపఁ - దలఁపు నిలుచురే,
ఘనుఁడు శ్రీవేంకటేశుఁ - గని శరణన్న జాలు
వెనక పాపాలు మంచు - విచ్చినట్టు విచ్చురే. ॥ ఇందు ॥

1. నారికడపుగాయ = టెంకాయ; బేసము = పండులోని గుజ్జు.
3. విచ్చినట్లు = విరిసినట్లు.

**భావము :-** మేలు కీళ్లకు, చావుపుట్టుకలకు చింతింపనేల ? ఇవి పరమాత్ముని మాయలు. అనగా ఆ మాయాప్రభావముచే జరుగునట్టివి. లోకములో ఎవరెవరి కేమేమి సంభవించినను దాని కంతటికి కారణము శ్రీహరియే. కాన జనులారా ! ఆ పరమాత్మనే చింతింపుడు.

భువిలో టెంకాయకు నీరు ఒకరు పోయకుండగనే అద్దైనంత తనకు తానుగా వచ్చినట్లు మనకు జరుగనున్న శుభము తనంత తానుగా జరిగి తీరును. ఏనుగు మ్రింగిన వెలగపండులోని గుజ్జువలె మనల విడిచిపో నున్నదెల్ల తనకు తానే వడిగా విడిచిపోవును.

నిండైన అద్దములో నీడ స్పష్టముగా కనుపించునట్లు జీవులకు అనేకములైన పుట్టుకలు తమకు తామే వచ్చుచున్నవి. బాగుగా పండిన పండ్లు తొడిమవీడి క్రింద పడునట్లు కాలమైనంతనే అందరికిని సమానముగా చావులు సంభవించుచున్నవి.

పెద్దరాతిపై కడవ పెట్టగా పెట్టగా కుదురేర్పడునట్లు తన్ను తానే చింతింపగా చింతింపగా అభ్యాస వశమున తన తలంపులు కదలిక వీడి కుదురుపాటు నొందును. ఘనుడైన శ్రీవేంకటేశ్వరుని జూచి శరణన్న చాలును. తొల్లి మనము చేసిన పాపము లన్నియు సూర్యోదయ సమయమున మంచువలె విరిసిపోవును.

**విశేషాంశములు :-** సామాన్య జనులు తమకు కీడు తొలగవలె ననియు, మేలు కలుగ వలెననియు సదా చింతించుచుందురు. అందుకై ప్రయత్నించుచుందురు. అట్లే 'జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ'[1] అని గీత చెప్పినట్లు చావు పుట్టుకలతో సతమత మగుచు సంసారచక్రములో పరిభ్రమించుచు విచారగ్రస్తులై యుందురు. ఈ విచారము లన్నియు నిష్ఫలములు. ఏలన పై సంఘటన లన్నియు ఈశ్వరుని మాయావిలాసములే. 'తేన వినా తృణమపి న చలతి'[2] అన్నట్లు భగవదిచ్ఛ లేక గడ్డిపోచకూడ చలింపదు. కాన సర్వమునకు మూలమైన పరమేశ్వరుని చింతించి పాపములనుండి విడివడవలెను. కాని చీటికి మాటికి చింతించుట వ్యర్థమని తాత్పర్యము.

మూడవ చరణములో హృదయాంతర్గతుడైన భగవంతునిపై చింత స్థిరముగా నిలుపుటకు అభ్యాసము ఆవశ్యకమని చెప్పబడినది. మనోనిగ్రహమునకు

(1) గీత., 2-27. (2) శ్రుతి

అభ్యాసవైరాగ్యములే తగిన సాధనములని గీత[1]. పాతంజల యోగ దర్శనము[2] మున్నగు ఉద్గ్రంథములు ప్రతిపాదించుచున్నవి.

ఈ పాటలోని ప్రథమచరణము నందలి భావమే సుమతిశతకములో ఇట్లు చెప్పబడినది-

సిరి తా వచ్చిన వచ్చును
సరసంబుగ నారికేళ - సలిలము భంగిన్
సిరి తాఁ బోయిన పోవును
గరి మ్రింగిన వెలగపండు - కరణిని సుమతీ [3]

వేతాలభట్టు నీతి ప్రదీపములో ఇదే భావముతో ఒక శ్లోకము గలదు -

సమాయాతి యదా లక్ష్మీః నారికేళ ఫలాంబువత్ ।
వినిర్యాతి యదా లక్ష్మీః గజభుక్త కపిత్థవత్ ॥[4]

## 56

అవతారిక :- జ్ఞానయజ్ఞ మెట్లు మోక్షసాధన మగుచున్నదో ఆ పద్ధతిని వర్ణించు చున్నాడు -

### ధన్యాసి

జ్ఞానయజ్ఞ మీ - గతి మోక్షసాధనము
నానార్థములు నిన్నే - నడపె మా గురుఁడు. ॥ పల్లవి ॥

1. అలరి దేహ మనేటి - యాగశాలలోన
బలువై యజ్ఞానపు - పశువు బంధించి,
కలసి వైరాగ్యపు - కత్తులఁ గోసికోసి
వెలయ జ్ఞానాగ్నిలో - వేలిచె మా గురుఁడు. ॥ జ్ఞాన ॥

2. మొక్కుచు వైష్ణవులనే - ముని సభ గూడపెట్టి[5]
చొక్కుచు శ్రీపాదతీర్థ - సోమపానము నించి,

(1) అభ్యాసేన చ కౌంతేయ ! వైరాగ్యేణ చ గృహ్యతే - గీత., 6-35.
(2) అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః- యోగ., 1-12.
(3) సు. శ., 109.
(4) నీతిప్ర., 16.
(5) 'మొక్కుచు వైష్ణవుల నేము నీ సభ గూడపెట్టి' అను ముద్రిత పాఠము అనన్వితము - (చూడు - అ. సం. P. 99.)

చక్కఁగా సంకీర్తన - సామగానము చేసి
యిక్కువతో యజ్ఞము సే - యించెఁబో మా గురుడు. ॥ జ్ఞాన ॥

3. తదీయ గురుప్రసా - దపురోడాశ మిచ్చి
కొఁదదీర ద్వయ మను - కుండలంబులు వెట్టి,
యెదలో శ్రీవేంకటేశు - నిటు ప్రత్యక్షము చేసె
ఇదివో స్వరూపదీక్ష యిచ్చెను మా గురుఁడు. ॥ జ్ఞాన ॥

ప ॥ :- నానార్థములు = యజ్ఞమునకు సంబంధించిన వివిధక్రియా కలాపములు.

2. ఇక్కువతో = జాడతో, వేదవిహితమైన పద్ధతితో.

3. తదీయ గురుప్రసాద పురోడాశము = ఆయనకు సంబంధించిన గురుప్రసాదమను హుతశేషము (హోమములో వేల్చగా మిగిలిన భాగము.)

ద్వయము = రెండు. ''శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః'' అను వాక్యద్వయము; స్వరూపదీక్ష = ఆత్మ స్వరూపజ్ఞానపరమైన దీక్ష

భావము :- జ్ఞానయజ్ఞము ఈ చెప్పబోవు రీతిగా మోక్షమున కుపాయమగుచున్నది. ఈ యజ్ఞమునకు సంబంధించిన వివిధ కార్యములు మా ఆచార్యుడు నిన్ననే నిర్వహించినాడు.

శరీర మనెడు యజ్ఞశాలలో బలమైన (పెద్ద) అజ్ఞానమను పశువును బంధించి, వైరాగ్యమనెడు కత్తులతో కోసి, జ్ఞానమనెడు అగ్నిలో మా గురుడు వేల్చినాడు.

నమస్కారోపచారములు గావించుచు పరమభాగవతులైన వైష్ణవులనెడి ముమల సభను జేర్చి, ఆనందించుచు మాకెల్లరకు శ్రీపాదతీర్థము అను సోమపానము నందించి, రమణీయముగా సంకీర్తన మనెడు సామగానము నొనర్చి వేదవిహితమైన పద్ధతితో మా ఆచార్యుడు జ్ఞానయజ్ఞము చేయించినాడు.

మరియు మా గురుడు తనకు సంబంధించిన గురుప్రసాదమను హుతశేషము నొసంగి కొఱత దీరునట్లుగా 'ద్వయము' అను కుండలములు పెట్టినాడు. హృదయములో శ్రీవేంకటేశ్వరుని ప్రత్యక్షము గావించినాడు. ఇదిగో మాకు స్వరూప దీక్ష నిచ్చినాడు.

**విశేషాంశములు :-** వేదములలో నానావిధములైన యజ్ఞములు ప్రతిపాదింపబడినవి.

''జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత'' ఇత్యాది శ్రుతివాక్యములు స్వర్గాదిఫలములు గోరువారు జ్యోతిష్టోమాది యజ్ఞముల నొనర్పవలెనని నిర్దేశించుచున్నవి. జ్యోతిష్టోమాదులు ద్రవ్యసాధ్యములు, వాటిచే కలుగు స్వర్గాదిఫలములు నిత్యములు గావు. మోక్షఫల మొక్కటే నిత్యము. దానిని పొందుటకు ద్రవ్యమయయములైన యజ్ఞము లుపయోగపడవు. జ్ఞానయజ్ఞ మొక్కటే మోక్షప్రాప్తికి తగిన సాధనము. దీనిని నిర్వహించుటకు గురుడొక్కడే సమర్థుడు. అతడు నిర్వహించు జ్ఞానయజ్ఞములో భాగస్వాములైన వారి కెల్లరకు భగవంతుడు ప్రత్యక్షము కాగలడు. ఈ విషయమునే ప్రకృత సంకీర్తనము విశదముగా నిరూపించుచున్నది.

నిన్ననే మా గురుడీ జ్ఞానయజ్ఞమును నిర్వహించినాడని అన్నమయ్య తెలుపుటచే తనకు ఆచార్యుడు జ్ఞానోపదేశ మొనరించిన మరునా డీసంకీర్తనము నాతడు రచించినట్లు తోచుచున్నది.

యాగశాలలో పశువును బంధించి కత్తులతో గోసి అగ్నిలో వేల్చుట, మునులు సభ గూడుట, సోమ పాన సామగానము లొనర్చుట, హుతశేషమును భుజించుట మున్నగునవి యజ్ఞములలో జరుగు సాధారణ ప్రక్రియలు. జ్ఞానయజ్ఞములోని విశేషములు ఇట పై ప్రక్రియలతో బోల్చబడినవి.

జ్ఞానయజ్ఞమునకు దేహమును యాగశాలగా రూపించుటచే ముముక్షువు శరీరమును జ్ఞానార్జన కుపయోగించి తద్ద్వారా ముక్తిసాధనముగా జేసికొనవలెనని తెలియుచున్నది. అజ్ఞానమును బలి పశువుగాను, వైరాగ్యమును ఖడ్గముగాను పేర్కొనుటచే దృఢమైన వైరాగ్యముచే అజ్ఞానమును పరిహరింపవలెనని బోధపడుచున్నది.

లెస్సగా వ్రేళ్లుబారిన సంసారమనెడు అశ్వత్థవృక్షమును వైరాగ్యమను శస్త్రముచే ఛేదించి పునరావృత్తి రహితమైన బ్రహ్మపదము నన్వేషింపవలెనని శ్రీకృష్ణుడు సెలవిచ్చెను -

**అశ్వత్థమేనం సువిరూఢ మూల మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా ॥[1]**
**తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతా న నివర్తన్తి భూయః ॥[2]**

ద్వయమును కుండలములుగా పేర్కొనుటచే ఎల్లప్పుడు ద్వయానుసంధానము చేయవలెనని సూచింపబడినది.

---

(1) గీత., 15-3. (2) గీత., 15-4.

శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే ॥
శ్రీమతే నారాయణాయ నమః ॥

అను రెండు వాక్యములు ద్వయ మనబడును.

ఇందు మొదటి వాక్యము ఉపాయమైన ప్రపత్తిని, రెండవవాక్యము ఉపేయమైన భగవత్కైంకర్యమును నిర్దేశించుచున్నవి. లక్ష్మీవిశిష్టుడైన నారాయణుని చరణ ద్వయమును ఉపాయముగా నిశ్చయించుచున్నానని మొదటి వాక్యము యొక్క భావము. లక్ష్మీ విశిష్టుడైన నారాయణుని ప్రీతికొఱకై కైంకర్య మొనర్పవలెనని రెండవవాక్యముయొక్క తాత్పర్యము.

"ద్వయ మర్థానుసంధానేన సహ సదైవం వక్తా యావచ్ఛరీరపాతం అత్రైవ శ్రీరంగే సుఖమాస్స్వ"[1]

'అర్థాను సంధానముతో గూడ సదా ద్వయము నుచ్చరించుచు శరీరపతన పర్యంతము ఈ శ్రీరంగమందే సుఖముగా నుండుము" అని శ్రీరంగనాథుడు శ్రీరామానుజుల కుపదేశించినట్లు శరణాగతి గద్యములో గలదు. కాన ముముక్షువు లెల్లరు దీని ననుసంధింపవలెనని భగవంతుని యాజ్ఞగా గ్రహింపనగును.

ద్రవ్యయజ్ఞము లాచరించువారికి అపూర్వప్రయుక్తమైన ఫలము కాలాంతరమున నెప్పుడో కలుగును. ఈ జ్ఞానయజ్ఞములో వేంకటేశ్వరు డెదలో ప్రత్యక్ష మగుట అను ఫలము వెంటనే కలుగుచున్నట్లు చెప్పుటచే ఈ యజ్ఞమే దాని కన్న శ్రేష్ఠమైనదని తెలియుచున్నది.

గీతలో జ్ఞానయోగమున జ్ఞానముయొక్క ప్రాధాన్యమును వివరించుచు శ్రీకృష్ణు డిట్లు చెప్పెను -

"పార్థా ! ద్రవ్యమయమైన యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠము. సమస్త కర్మములు నిశ్శేషముగా జ్ఞానమునందే ముగియుచున్నవి. నీవు పాపాత్ములందరి కంటె మిక్కిలి పాపాత్ముడవైనను జ్ఞానమనెడు పడవచేతనే అ పాప సాగరమును దాటగలవు. మండెడు నిప్పు కట్టెల గుట్టను కాల్చునట్లు జ్ఞానాగ్ని సర్వకర్మములను భస్మ మొనర్చుచున్నది. జ్ఞానముతో సమమగు పవిత్రవస్తువు మరొక్కటి లేదు."

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।
సర్వం కర్మాఖిలం పార్థ ! జ్ఞానే పరిసమాప్యతే ॥[2]

---

(1) శ. గ.,  (2) గీత., 4-33.

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥[1]
యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥[2]
న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ॥[3]

'జ్ఞానాదేవ హి కైవల్యం' ఇత్యాది వచనములు గూడ జ్ఞానముచేతనే మోక్షము గల్గునని ప్రకటించుచున్నవి. జ్ఞానయజ్ఞమును నిర్వహించుటకు తగినవాడు గురు డొక్కడే. అజ్ఞానాత్మకమైన అంధకారమును భేదించువాడే 'గురుడు' అని గురుగీత చెప్పుచున్నది -

గుశబ్ద స్త్వంధకారస్స్యా ద్రుశబ్దస్త న్నిరోధకః ।
అంధకార నిరోధిత్వా ద్గురు రిత్యభిధీయతే ॥[4]

తమకు నమస్కరించి సేవలొనర్చి అడిగి తెలిసికొన్నవారికి తత్త్వద్రష్టలైన గురువులు జ్ఞానము నుపదేశించగలరని గీత బోధించుచున్నది.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥[5]

కావున గురుముఖతః శిష్యులు జ్ఞానమార్జించి ముక్తిని చూరగొనవలెనుట పరమార్థము.

## 57

**అవతారిక :- భగవంతుని మాయచే ప్రవర్తిల్లు పాపపుణ్యాది ద్వంద్వములను ఆయన దయతోనే దాటవలెననుచున్నాడు -**

### ధన్యాసి

దైవమా నీవే మమ్ము - దయ దలఁచుట గాక
చేవల నీ సేఁత లెల్ల - చెల్లును లోకానను. ॥ పల్లవి ॥

1. తీపు నంజేవేళ నట్టే - తేటఁబులు సింపౌను
పైపైఁ బుణ్యమయితేఁ - బాప మింపౌను,

(1) గీత., 4-36. (2) గీత., 4-37. (3) గీత., 4-38.
(4) గు.గీ, 1-45. (5) గీత., 4-34.

ఓపి జంతువుల కివి - ఒక టొకటి లంకె
చేపట్టి పాపము లెట్టు - సేయకుండవచ్చును ? ॥దైవ॥

2. కడుఁజలువై తేను - గక్కున వేఁడింపౌను
చెడని విరతివేళ - సిరు లింపౌను
ఒడలు మోచిన వారి - కొకటొకటికి లంకె
తొడరు భోగాలు మాని - తోయ నెట్టు వచ్చును ? ॥దైవ॥

3. ఇవియు నీ మాయే - యిన్నియు నీ యాజ్ఞలే
జవళిఁ బ్రాణులకెల్ల - సమ్మతైనవి,
ఇవల శ్రీవెంకటేశ ! - యిఁటునీకే శరణంటి
తవిలి నీవే గతి - దాఁగ నెట్టు వచ్చును ? ॥దైవ॥

ప॥:- చేవల నీ సేఁతలు = శక్తిమంతములైన నీ పనులు.

2. గక్కున = గ్రక్కున, వడిగా; విరతి = వైరాగ్యము.

3. జవళిఁ = జంటలుగా.

భావము :- దేవా ! నీవే మమ్ము దయజూచి కాపాడవలెనుగాని మాకై మేము ఏమియు సాధింపజాలము. అన్ని విధముల సమర్థుడవైన నీవు తలపెట్టిన పనులన్నియు తిరుగులేనివి. అవి లోకమంతట అప్రతిహతములై సాగుచున్నవి.

తీపు ఎక్కువగా తిన్నప్పుడు పులుసు చవిగా దోచి దానిపై కోరికగల్గుచున్నది. అట్లే పుణ్యము లెక్కువగా చేసినవానికి పాపములపై ఆసక్తి పొడముచున్నది. ఈ పాపపుణ్యములు పరస్పరము లంకెయై లోకములోని ప్రాణులనెల్ల బంధించియున్నవి. ఇట్టి స్థితిలో ఎవరికైనను పాపములు చేయకుండుట కెట్లు వీలగును ?

శైత్య మెక్కువైన కొలది వేడి ఇంపుగా దోచుచున్నది. అట్లే పట్టుగా విరక్తిమార్గములో నున్నవానికి గూడ సంపదలపై భ్రాంతి గలుగుచున్నది. పై శీతోష్ణములు, భోగవిరాగములు అన్యోన్యము ముడివడి శరీరధారు లందరికిని తగులుకొని యున్నవి. ఇక పై బడు భోగములను కడకు నెట్టివేయుట కెట్లు వశమగును?

పై పుణ్యపాపములు, భోగవిరాగములు మున్నగు ద్వంద్వము లన్నియు నీ మాయచే కలిగినవే. అవి నీ యానతి ననుసరించియే జంటలుగా ఏర్పడి జీవుల

కెల్లరికి సమ్మతములై యున్నవి. శ్రీవేంకటేశ్వరా ! ఇన్నిటికి మూలమైన నీకే నేను శరణనుచున్నాను. నీవే గతిగాని నాకు గత్యంతరము లేనే లేదు. ఈ స్థితిలో నన్ను కాపాడకుండ నీవెట్లు తప్పుకొనగలవు ?

**విశేషాంశములు :–** 'పిండ ఖర్జూరై రుద్వేజితస్య తింత్రిణ్యా మభిలాషః'[1] అని కాళిదాసు వచించెను. అనగా పిండఖర్జూరములు తినితిని వెగటొందిన వానికి చింతపండుపై కోరిక గలుగునని యర్థము. అట్లే పుణ్యపరునకు పాపముమీదను, విరక్తునకు భోగములపై నను ఆశ గల్గుట లోకసహజమై యున్నది. శీతోష్ణాది ద్వంద్వముల పట్ల గూడ ప్రాణుల స్వభావ మిట్లే యున్నది. ఈ ద్వంద్వములు విడదీయరానివై ప్రాణులతో సంబంధపడియున్నవి.

కావుననే పుణ్యమునే చేసి పాపమునకు దూరముగా నుందమను కొన్నను, త్యాగమునే ఆశ్రయించి భోగములను పరిహరింతమని తలచినను శరీరధారులకు సాధ్యమగుటలేదు. అస లీద్వంద్వ ప్రవృత్తులను పూర్తిగా విసర్జింపనిదే ముక్తిలేదు.

పుణ్య పాపాదులలో బడి అట్లు ప్రాణులు నలగిపోవుటకు హేతువు భగవంతుని మాయయే. కాన ఆయనను శరణుసొచ్చి ఆయన దయకు పాత్రుడైన వాడే వాటిని దాటగలడుగాని తదితరులు దాటలేరని తాత్పర్యము.

## 58

**అవతారిక :-** అధర్మము పైకొన్నప్పుడు దుష్టుల వినాశమునకై భగవంతుడవతరించునను గీతోక్తిని ప్రతిపాదించుచున్నాడు -

### సామంతం

ఊరకైతే నిన్నుగాన - మొక కారణానగాని
పూరి జీవులము నీవు - పురుషోత్తముఁడవు. ॥ పల్లవి ॥

1. అసురలు భువిఁ బుట్టు - టది వుపకారమే
అసురలు బాధింతు - రమరులను,
పొసఁగ వారికి గాను - పూనుక వచ్చి నీవు
వసుధ జనించితేను - వడి నిన్నుఁ గందుము. ॥ ఊర ॥

---

(1) శాకుం., ద్వితీయాంకము.

2. అడరి ధర్మము చెడి - యధర్మమైనా మేలు
వెడఁగు మునులు విన్న - వింతురు నీకు,
తడవి ధర్మము నిల్ప - ధరణిఁ బుట్టుదు నీవు
బడి నిన్ను సేవించి - బ్రదుకుదు మపుడే. ॥ ఊర ॥

3. నీ కంటే మాకుఁజూడ - నీ దాసులే మేలు
పైకొని వారున్నచోటఁ - బాయకుందువు,
చేకొని శ్రీవేంకటేశ! - చెప్పఁగానే వారి చేత
నీ కథలు విని విని - నే మీడేరితిమి. ॥ ఊర ॥

ప ॥:- పూరి = గడ్డి.

1. అసురులు = రక్కసులు.

2. వెడఁగు మునులు = వెఱ్ఱిమునులు, అధర్మమునకు వెగటొందిన మునులు.

**భావము** :- దేవా ! ఏదో ఒక కారణము లేక ఊరక నిన్ను మేము దర్శింపజాలము. మేము తృణప్రాయులమైన జీవాత్ములము. నీవో, పురుషోత్తముడవైన పరమాత్ముడవు.

రక్కసులు భూలోకములో పుట్టుట గూడ ఉపకారమే. ఏలన వారు దేవతలను నానా విధముల బాధింతురు. ఆ దేవతల రక్షణకై ప్రయత్నముతో వచ్చి నీవు భూలోకములో అవతరింతువు. అపుడు నిన్ను మేము కన్నుల కరవు దీర దర్శింతుము.

ధర్మము నశించి అధర్మము వృద్ధినొందుట గూడ మేలే. అట్టి స్థితిలో అధర్మ విజృంభణమును సైరింపజాలక వెఱ్ఱులైపోయిన మునులు నీకు తమ పాటులను విన్నవించుకొందురు. అధర్మము నణచి ధర్మమును స్థాపించుటకై నీవు ధరణిలో జన్మింతువు. అపుడు నిన్ననుసరించి నీకు సేవలొనర్చి మేము ధన్యులమై జీవింతుము.

మాకు జూడ నీకంటె నీ దాసులైన భాగవతులే మేలుగా నున్నారు. ఏలన, వారున్నచోటనే వారిని వదలక నీవుందువు. శ్రీవేంకటేశ్వరా ! వారు నీ మహిమలను ప్రతిపాదించు కథలు కోకొల్లలు చెప్పగా విని మేము కృతార్థులమైనాము.

**విశేషాంశములు** :- ధర్మమునకు హాని సంభవించినపుడు, అధర్మము పైకొన్నప్పుడు

తన్ను తాను సృజించుకొందుననియు; శిష్టులను రక్షించుటకు, దుష్టులను శిక్షించుటకు, ధర్మమును స్థాపించుటకు తాను ప్రతియుగమున సంభవించుచుందుననియు గీతలో భగవంతుడు వచించెను.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥[1]

రామకృష్ణాద్యవతారముల మూలమున దేవుడు తన ప్రతిన నెరవేర్చియుండుట స్పష్టమే.

మున్ను బ్రహ్మాదిదేవతలు రావణుడు పెట్టుబాధలు పడలేక విష్ణువి దశరథపుత్రుడుగా జన్మించి, దేవతలకు వధింప వీలుగాని వానిని సమరమున సంహరింపుమని ప్రార్థించిరి -

త్వం తత్ర మానుషో భూత్వా ప్రవృద్ధం లోకకంటకమ్ ।
అవధ్యం దైవతైర్విష్ణో ! సమరే జహి రావణమ్ ॥[2]

అప్పుడు విష్ణువు వారిని చూచి - ''భయపడకుడు. నేను మీకు హితము గూర్చుటకై రావణుని సపరివారముగా యుద్ధమున సంహరింపగలను. మరియు పది వేల యేండ్లకు పైగా పృథివిని పాలించుచు అందు నివసింపగలను'' అని చెప్పినట్లు రామాయణమున గలదు -

భయం త్యజత భద్రం వో హితార్థం యుధి రావణమ్ ।
స పుత్ర పౌత్రం సామాత్యం సమంత్రి జ్ఞాతి బాంధవమ్ ॥
హత్వా క్రూరం దురాధర్షం దేవర్షీణాం భయావహమ్ ।
దశవర్ష సహస్రాణి దశ వర్ష శతాని చ ॥
వత్స్యామి మానుషే లోకే పాలయన్ పృథివీ మిమామ్ ॥[3]

దీనిని బట్టి దుష్టులను సంహరించుటే కాక తాను బహుకాలము మానవలోకము నందుండి దర్శన స్పర్శన పరిపాలనాదులచే భక్తలోకమును భగవంతుడనుగ్రహించినట్లు తేట తెల్లమగు చున్నది.

---

(1) గీత., 4-7-8. (2) రామా - బాల; 15-21,22.(3)రామా - బాల; 15-28,29,30.

మరియు భగవద్దాసులను వెన్నంటియే భగవంతు డుండు ననుటకు భాగవతము లోని ఈ క్రింది భగవద్వచనములే ప్రమాణములు -

చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీల దొం
గిల కొని పోవుచుండుదు రకిల్బిష భక్తిలతాచయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికై వడిన్
వలలకు జిక్కి భక్తజన వత్సలతన్ జనుచుందుఁ దాపసా !

నాకు మేలుగోరు నా భక్తుడగు వాడు
భక్తజనుల కేన పరమ గతియు
భక్తుఁ డెందు జనిన పరతెంతు వెనువెంట
గోవు వెంటఁ దగులు కోడె భంగి.[1]

ప్రకృత సంకీర్తనమునందలి భావమున కుదాహరణ ప్రాయముగా మరొక సంకీర్తనము దీని ప్రక్కనే గలదు -

## దేసాళం

వారిదే పో జన్మము - వడి నిన్నుఁ దెచ్చిరి
భారత రామాయణాలై - పరగె నీ కథలు. ॥ పల్లవి ॥

భువిమీద రావణుఁడు - పుట్టగాగా రాముఁడవై
తవిలి యిందరికిఁ బ్ర - త్యక్షమైతివి,
వివరింప నంతవాఁడు - వెలసి తేగా నీవు
అవతార మందితే ని - న్నందరునుఁజూతురు. ॥ వారి ॥

రమణఁ గంసాది యసు - రలు లూటి సేయగాగా
తమి గృష్ణావతార మిం - దరి కైతివి,
గములై యంతటి వారు - గలిగితేగా నీవు నేడు
అమర జనించి మాట - లాడుదు విందరితో. ॥ వారి ॥

ఎంత వుపకారియో - హిరణ్య కశిపుఁడు
చెంత నరసింహుఁడని - సేవ యిచ్చెను.

(1) భాగ., 9-117, 118.

ఇంతట శ్రీవేంకటేశ - యిన్ని రూపులును నీవే
పంతాన నీ శరణని - బ్రదికితి మిదివో.[1] ॥ వారి ॥

## 59

అవతారిక :- తన మేలు కీళ్ళకు దైవమో లేక తన ప్రవర్తనమో కారణమగును గాని అన్యులు గారనుచున్నాడు -

### వరాళి

ఇతరుల దూరనేల - యెవ్వరూ నేమి సేతురు
మతి వారూఁ దమవంటి - మనుజులే కాక ! ॥ పల్లవి ॥

1. చేరి మేలు సేయఁగీడు - సేయ నెవ్వరు గర్తలు
ధారుణిలో నరులకు - దైవషే కాక,
సారెఁ దనవెంటవెంటఁ - జనుదెంచే వారెవ్వరు
బోరునఁ జేసిన పాప - పుణ్యాలే కాక ! ॥ ఇత ॥

2. తొడఁగి పొగడించను - దూషించ ముఖ్యు లెవ్వరు
గుడిగొన్న తనలోని - గుణాలే కాక,
కడుఁగీర్తి నపకీర్తి - గట్టెడి వారెవ్వరు
నడచేటి తన వర్త - నములే కాక ! ॥ ఇత ॥

3. ఘన బంధ మోక్షాలకుఁ - గారణ మిఁక నెవ్వరు
ననిచిన జ్ఞానాజ్ఞా - నములే కాక,
తనకు శ్రీవేంకటేశుఁ - దలపించే వారెవ్వరు
కొన మొదలెఱిఁగిన - గురుఁడే కాక ! ॥ ఇత ॥

1. బోరున = వడిగా.
2. గుడిగొన్న = క్రమ్ముకొన్న, చుట్టుకొన్న.
3. ననిచిన = వృద్ధినొందిన, అతిశయించిన.

భావము :- తమకు చిక్కు లెదురైనందుకు ఊరక ఇతరులను నిందించుటవలన ప్రయోజన మేమి ? తమ విషయములో మరొక రెవ్వరైన నేమి చేయగలరు ? వారు గూడ మతి దలపోసినచో తమవంటి సాధారణ మనుజులే కదా !

(1) అ. సం. 6-160.

ఇలలో మనుజులకు మేలు సేయుటకైనను, కీడు సల్పుటకైనను దైవమే కర్తగాని ఇతరు లెవ్వరును గారు. తన్ను వదలక వెంటబడి వచ్చునవి తాను వడిగా జేసిన పాపపుణ్యములే గాని మరి పరు లెవ్వరును రారు.

తన్ను చుట్టుముట్టిన గుణదోషములే తన భూషణదూషణములకు ముఖ్యహేతువు లగుచున్నవి గాని వేఱెవ్వరును గారు. తనకు కీర్తి కల్గుటకైనను, అపకీర్తి కల్గుటకైనను తాను నడచు నడతలే కారణములు గాని అన్యులు గారు.

తనకు బంధమైనను, మోక్షమైనను గల్గుటకు తనలో పెంపొందిన జ్ఞానాజ్ఞానములే హేతువు లగుచున్నవి గాని తదితరములు గావు. తనచే శ్రీవేంకటేశ్వరుని స్మరింపజేసి తద్ద్వారా సుగతి గల్గించువాడు సర్వము తెలిసిన తన ఆచార్యుడే గాని మఱొక్కడు లేడు.

**విశేషాంశములు :-** ఏమైన ఆపదలు కల్గినప్పుడు ఇతరులపై నిందలు మోపి వారిని దూషించుట మానవ స్వభావము. ఇది తగదనుచు ముందు తన ప్రవర్తనను తాను చక్కదిద్దుకొనవలెనని పదకవితా పితామహు డిట ప్రబోధించుచున్నాడు.

మేలు కీళ్ల నునవి దైవవశమున గల్గునవే గాని ఇతరులచే కల్గునవి కావు. కావుననే భారత మిట్లు చెప్పుచున్నది -

విధివశమున వచ్చిన కీ
డధములు గొనియాడి వ్రేగులై విపులభవాం
బుధి మునుగుదురు మునుంగరు
సధర్ములగు నుత్తములు ప్రశాంతి జాలుకనై.[1]

తానొనర్చిన పాపపుణ్యములే తన్ను వెంబడించును గాని సంపదలు, బంధువులు మున్నగువారు అనుసరింపరని పెద్దలు నుడివిరి -

అర్థా గృహే నివర్తన్తే శ్మశానే మిత్రబాంధవాః ।
సుకృతం దుష్కృతం చైవ గచ్ఛన్త మనుగచ్ఛతి ॥

మరియు వేల కొలది గోవులలో దూడ తన తల్లినే చేరునట్లు పూర్వ కృతకర్మ కర్తనే పొందునని వ్యాసుడు వచించెను -

**యథా ధేనుసహస్రేషు వత్సో విందతి మాతరమ్ ।**
**తథా పూర్వకృతం కర్మ కర్తార మను గచ్ఛతి ॥**[2]

(1) భార - అను., 1-9. (2) భార - అను., 7-22.

దానాది గుణములచే ప్రశస్తి నొందిన శిబి మున్నగు మహనీయులు నేటికిని కీర్తికాయులై పొగడబడుచున్నారు. అట్లే దుష్కృతము లాచరించిన రావణాదు లీనాడును తెగడబడుచున్నారు. కాన దూషణ భూషణములకు, కీర్త్యపకీర్తులకు తమ తమ సుగుణదుర్గుణములే మూలము లని భావించి సత్ప్రవర్తన నలవరచుకొన వలెను.

జ్ఞానాజ్ఞానములే మోక్షమునకును, బంధమునకును కారణములని శ్రుతి నుడువుచున్నది -

**అజ్ఞానా దేవ సంసారో జ్ఞానాదేవ విముచ్యతే ।[1]**

'తెలిసితే మోక్షము, తెలియకున్న బంధము'[2] అనుచోట గూడ ఈ విషయమునే అన్నమయ్య ప్రబోధించినాడు.

మూడవ చరణములో గురుడే భగవంతుని దలపింప జేయువాడుగా చెప్పబడినాడు. సంసారారణ్యములోబడి భ్రాంతినొందిన వానికి జ్ఞానాజ్ఞానముల స్వరూపము నెఱుంగజేసి భగవత్తత్త్వము బోధించి తద్ద్వారా తరించు త్రోవజూపువాడు సద్గురుడే. కావుననే గురుగీతలో గురుడిట్లు ప్రస్తుతింపబడినాడు.

**భవారణ్య ప్రవిష్టస్య దిఙ్మోహభ్రాన్త చేతసః ।**
**యేన సందర్శితః పంథాః తస్మై శ్రీగురవే నమః ।[3]**

## 60

**అవతారిక** :- వేదములందు సారార్థమే గ్రహింపదగినదను గీతోపదేశమును వివరించుచు శరణాగతియొక్కటే పరమార్థమని నిరూపించుచున్నాడు -

## దేవగాంధారి

ఒక్కడే మోక్షకర్త - వొక్కటే శరణాగతి
దిక్కని హరిఁ గొల్చి బ - దికిరి తొంటివారు. ॥ పల్లవి ॥

1. నానా దేవతలున్నారు - నానాలోకము లున్నవి
నానా వ్రతాలున్నవి - నడచేటివి,
జ్ఞానికిఁ గామ్యకర్మాలు - జరిపి పొందేదేమి
అనుకొన్న వేదోక్తా - లైనా నాయఁగాక ! ॥ ఒక్క ॥

---

(1) యోగతత్త్వ. 16. (2) అ. సం., 6-19. (3) గు.గీ, 1-82.

2. ఒక్కఁడు దప్పికిఁ ద్రావు - నొక్కఁడు కడవనించు
నొక్కఁ డీఁదులాడు మడు - గొక్కటియందే,
చక్క జ్ఞానియైనవాఁడు - సారార్థము వేదమందు
తక్కక చేకొనుఁ గాక - తలకెత్తుకొనునా ? ॥ ఒక్క ॥

3. ఇది భగవద్గీతార్థ - మిది యర్జునుని తోను
ఎదుటనే వుపదేశ - మిచ్చెఁ గృష్ణుఁడు,
వెదకి వినరో శ్రీ - వేంకటేశు దాసులాల
బ్రదుకుఁద్రోవ మనకు - పాటించి చేకొనరో ! ॥ ఒక్క ॥

**భావము** :- మోక్షమునకు కర్తయైన వాడొక్క శ్రీహరియే, ప్రపన్నుడై భగవంతుని శరణు జొచ్చు టొక్కటియే ఆ మోక్షప్రాప్తికి తగిన ఉపాయము. ప్రాచీనులైన ప్రహ్లాదాది భక్తులు ఈ రహస్యము నెఱింగి హరి ఒక్కడే దిక్కని నమ్మి సేవించి ధన్యులైరి.

ఎందరో వేల్పు లున్నారు. ఎన్నో లోకములున్నవి. ఆ యా దేవతలను తృప్తి నొందించుటకును. ఆయా లోకములను పొందుటకును సాధనములైన ఎన్నో వ్రతములు గూడ కలవు. స్వర్గాది ఫలముల నపేక్షించి చేయు జ్యోతిష్టోమాదులగు కామ్యకర్మలు వేదములో చెప్పబడినవే. ఐనను, జ్ఞానియగువాడు ఈ కామ్యకర్మ లాచరించి పొందవలసిన దేదియు లేదు. అనిత్యములగు స్వర్గాది సుఖములపై అతని కాశ యుండదు.

మడుగులో ఒక్కడు దప్పి దీర్చుకొనుటకు నీరు ద్రావును. మరొకడు కడవ నింపుకొని పోవును. ఇంకొకడు ఈతగొట్టి విహరించును. ఇట్లు వివిధ జనులు వారివారి కోరికల కనువుగా ప్రవర్తింతురు. అట్లే విశాలమైన వేదములో ఎన్నో విషయములు చెప్పబడియున్నవి. అందు ఏది సారార్థమో అది మాత్రమే జ్ఞానవంతుడు చేపట్టును. తక్కిన విషయముల నతడు తలకెత్తుకొనడు. అనగా వాటి జోలికి పోడనుట.

ఇదే భగవద్గీతలోని భావము. దీనినే అర్జునునకు శ్రీకృష్ణుడు సమక్షమున నుపదేశించెను. శ్రీవేంకటేశ్వరుని దాసులారా ! ఈ విషయమును సావధానముగ వినుడు. ప్రయోజనవంతమైన జీవన మార్గము మనకిదియే. దీనిని పాటించి చేకొని ధన్యులు గండు !

విశేషాంశములు :- గీతలో సాంఖ్యయోగమున శ్రీకృష్ణు డర్జునున కిట్లుపదేశించెను-

''పార్థా ! వేదవాదములయం దాసక్తులగు అవివేకులు, కామాత్ములు, స్వర్గపరాయణులునై స్వర్గాది సుఖములకంటె ఆపేక్షింపపదగిన దేదియు లేదనుచు జన్మ కర్మముల నిచ్చునవియు, భోగైశ్వర్యప్రాప్తికొఱకై నవియు నగు వేదప్రతిపాదితము లైన వివిధ కర్మ కలాపములను గూర్చి తియ్యని మాటలు చెప్పుచుందురు. వారి మాటలచే ఆకర్షింపబడి భోగైశ్వర్యములందు దగులువడిన వారికి దైవమునందు నిశ్చయాత్మకమగు బుద్ధి నిలువదు.

అర్జునా ! వేదములు సత్త్వరజస్తమోగుణ విషయములుగా నున్నవి. నీవు త్రిగుణాతీతుడవు, సుఖదుఃఖాది ద్వంద్వరహితుడవు, నిత్యసత్త్వవిశిష్టుడవు, యోగక్షేమ చింతారహితుడవు. ఆత్మజ్ఞుడవు కమ్ము ! అంతట జలపూర్ణమైన మడుగున దప్పిగొన్న వానికెంత ప్రయోజనమపేక్షితమో బ్రహ్మజ్ఞునకు సమస్తవేదములలో అంతే ప్రయోజన మపేక్షిత మగుచున్నది'' -

యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ ! నాన్యదస్తీతి వాదినః ॥
కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥
భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥
త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥
యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥[1]

గీతలో చివర శ్రీకృష్ణు డర్జునునితో - ''సర్వ ధర్మములను వదలి నన్నొకనినే శరణొందుము. నేను నిన్ను సర్వపాపములనుండి విముక్తుని చేయుదును. దుఃఖింపకుము'' అని బోధించెను-

సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥[2]

(1) గీత., 2-42 నుండి 46 (2) గీత., 18-66.

'ఒక్కఁడే మోక్షకర్త - ఒక్కటే శరణాగతి' అని అన్నమయ్య చెప్పుట లోని పరమార్థము పై చరమ శ్లోకార్థమైన శరణాగతి తత్త్వమే.

## 61

అవతారిక:- ఆత్మస్వరూపము అంతర్ముఖులకేగాని బాహ్యదృష్టిగలవారికి కానరా దనుచున్నాడు-

### ముఖారి

వెలుపల వెదకితే - వెస నాత్మఁ గనునా
పలుమారు నిదే య - భ్యాసము గావలెను. ॥పల్లవి॥

1. ఇన్ని చింతలు మఱచి - యింద్రియాలఁ గుదియించి
పన్ని యుండిన హృదయ - పద్మమందును,
ఎన్న నంగుష్ఠమాత్రపు - టీశ్వరు పాదాల కింద
తన్ను నణుమాత్రముగఁ - దలఁచఁగ వలెను. ॥వెలు॥

2. పలుదేహపుఁ గొల్లఁ - బరువులు వారక
బలుదేహపు టింటి లో - పల చొచ్చి,
చలివేఁడిఁ బొరలకే - సర్వేశు పాదాల కింద
తలకొన్న తన్నుఁ దానే - తలఁచఁగవలెను.

3. కైకొన్న భక్తితో ని - కృపు శరణాగతితో
చేకొని విన్నపములు - చేసుకొంటాను,
ఏకాంతాన శ్రీవేంక - టేశ్వరు పాదాల కింద
దాకొని తన్నుఁ దానే - తలఁచఁగవలెను. ॥వెలు॥

ప॥:- వెసఁ = శీఘ్రముగా.

1. పన్నియుండిన = ఏర్పరచియుండిన, వికసించిన; అంగుష్ఠమాత్రపు = బొటనవ్రేలంత పరిమాణముగల
2. చలివేఁడిఁ = శీతోష్ణములలో
3. దాకొని = మఱుఁగుపడి.

భావము :- బాహ్యప్రపంచములో వెదకినచో ఆత్మస్వరూపమును జీవుడు

తెలిసికొనలేడు. దానిని గ్రహించుటకు ఈ చెప్పబోవు పద్ధతినే విడువక అభ్యసించవలెను.

చీటికి మాటికి మనస్సులో పొడసూపు సంసారసంబంధములైన చింతల నన్నిటిని మఱవవలెను. విచ్చలవిడిగా పరుగులుదీయు ఇంద్రియములను నిగ్రహింపవలెను. భగవద్భావనతో వికసించిన హృదయమనెడు పద్మములో అంగుళమంత పరిమాణము గల్గి ప్రకాశించుచున్న పరమేశ్వరుని పాదములక్రింద తన్ను అణుస్వరూపుడై యున్న వానినిగా తలంపవలెను.

అనేక జన్మములుదాల్చి ఆ యా శరీరములకు జెందిన కాళ్లతో బాహ్యజగత్తున పరుగులిడరాదు. అంతర్ముఖుడై పటిష్ఠమైన శరీరమను ఇంటిలోనికి ప్రవేశింపవలెను. శీతోష్ణాదిద్వంద్వములకు జడియరాదు. హృదయాంతర్గతుడైన సర్వేశ్వరుని చరణముల క్రిందనే ఉన్న తన జీవాత్మస్వరూపమును తానే సదా భావింపవలెను.

భక్తినే సాధనముగా గైకొనవలెను. అరమరలులేని నిండైన హృదయముతో శరణాగతి నొందవలెను. తాను 'అకించనుడను, అనన్యశరణ్యుడను' అని సారె సారెకు విన్నపము చేసికొనవలెను. ఏకాంతములో (హృదయాంతరాళములో) శ్రీవేంకటేశ్వరుని పాదపద్మముల క్రింద మరుగుపడి తన స్వరూపమును తానే తలంచవలెను.

**విశేషాంశములు :-** **అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా**
**సదా జనానాం హృదయే సన్నివిష్టః ।**[1]

అని శ్రుతివచనము. అనగా అంగుష్ఠ పరిమాణముగల పురుషుడు అంతరాత్ముడై సర్వదా జనుల హృదయమునందే ఉన్నాడని యర్థము. ఆ పరమాత్ముని క్రిందనే జీవుడు అణుస్వరూపుడై యున్నాడు. 'ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యః, అని జీవాత్ముని అణుస్వరూపునిగా శ్రుతి పేర్కొన్నది.

ఇట్టి జీవాత్మ పరమాత్మల స్వరూపమును గుర్తించుటకు బాహ్యదృష్టి పనికిరాదు. అంతర్ముఖమైన దృష్టితోనే దానిని కనుగొనవలెనని ఈ సంకీర్తన బోధించుచున్నది.

(1) కఠ., 6-17.

సాంసారికమైన చింతలతో చీకాకైనవాడు దృష్టిని హృదయమున నిల్పలేడు. గాన చింతలు మఱవ వలెనని చెప్పబడినది. మరియు ఆత్మావలోకనమునకు ఇంద్రియ నిగ్రహము మిక్కిలి ముఖ్యమైనది.

నిగ్రహము లేక ఇంద్రియానుగుణముగా చిత్తమును వదలిపెట్టినవాని ప్రజ్ఞ గాలిచే నీటిలోని పడవవలె హరింపబడుననియు, విషయములనుండి ఇంద్రియములను నిగ్రహించినవాని ప్రజ్ఞ బ్రహ్మావలోకనమున ప్రతిష్ఠిత మగుననియు గీత నుడువుచున్నది -

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి ॥
తస్మాద్యస్య మహాబాహో ! నిగృహీతాని సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥[1]

'చలివేఁడి బొరలక' అనుటచే శీతోష్ణాదిద్వంద్వములను సహింపవలెనని ఉపదేశింపబడినది. శీతోష్ణ సుఖదుఃఖాదుల నొసంగు మాత్రాస్పర్శములు వచ్చుచు పోవుచుండు స్వభావము గల్గి యనిత్యములై యున్నవి. వాటిని సహింపవలెనని భగవంతుడు వచించెను -

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ ! శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారతః ॥[2]

మూడవ చరణములో భక్తిని, శరణాగతిని ఆశ్రయింపవలెనని అన్నమయ్య బోధించినాడు. నారద శాండిల్యాది మునీంద్రులు భక్తి తత్త్వమును నొక్కి వక్కాణించియున్నారు. అగాధమైన సంసారసముద్రమును దాటుటెట్లని భయపడ నవసరము లేదనియు, నరక నాశకుడైన పద్మనేత్రునిపై నిల్పిన భక్తియే ఆ సాగరమును దాటింపగలదనియు కులశేఖరుడు తన చిత్తమును హెచ్చరించెను -

భవజలధిమగాధం దుస్తరం నిస్తరేయం
కథ మహ మితి చేతో మాస్మగాః కాతరత్వమ్ ।
సరసిజదృశి దేవే తావకీ భక్తి రేకా
నరకభిది నిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్ ॥[3]

కాన భక్తియే భవబంధమును త్రెంచు పరమోపాయమనుటకు సందియము లేదు.

(1) గీత., 2-67, 68. (2) గీత., 2-14. (3) ము. మా., 13.

భక్తియొక్క ప్రాముఖ్య మిట్టిది కావుననే పరభక్తియుక్తునిగా తన్నొనర్పుమని శరణాగతి గద్యలో భగవద్రామానుజాలు భగవంతుని ప్రార్థించిరి -

పురుషస్స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
భక్త్యా త్వనన్యయా శక్యః ।
మద్భక్తిం లభతే పరామ్ !
ఇతి స్థానత్రయోదిత పరభక్తియుక్తంమాం కురుష్వ ॥[1]

మఱియు శరణాగతి నొందువాడు ''మనోవాక్కాయములచే అనాది కాలప్రవృత్తములైన అకృత్యము లొనర్చుట, కృత్యము లొనర్పకపోవుట, భగవదపచారము, భాగవతాపచారము మున్నగు భూతభవిష్యద్వర్తమాన కాలికములైన వివిధాపచారములను పూర్తిగా క్షమింపుము'' ఇత్యాదిగా భగవంతునెదుట విన్నపము లొనర్పవలె నని శరణాగతిగద్యము బోధించుచున్నది -

''మనోవాక్కాయై రనాదికాలప్రవృత్తానన్తాకృత్య కరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచారసహ్యాపచార రూప నానావిధాపచారాన్ ఆరబ్ధకార్యాన్, అనారబ్ధకార్యాన్, కృతాన్, క్రియమాణాన్, కరిష్యమాణాంశ్చ సర్వానశేషతః క్షమస్వ''[2]

ఇట్లు విన్నపము లొనర్చుచు సర్వకల్యాణగుణనిలయుడు, అనంతజ్ఞానానందైకస్వరూపుడు నగు పరమాత్ముని వినుతించుచు -

''శ్రీమన్నారాయణ ! అశరణ్య శరణ్య ! అనన్య శరణస్త్వ త్పాదారవింద యుగళం శరణ మహం ప్రపద్యే !''[3] అని శరణొందవలెను. ఇదే నిక్కమైన శరణాగతి.

ఇట్లు నిక్కమైన శరణాగతితో ప్రపన్నుడైనవాడు జీవాత్మ పరమాత్మల స్వరూపమును చక్కగా గుర్తింపగలడు. 'పలుమారు నిదే యభ్యాసము గావలెను' అనుటచే మాటిమాటికి పై విధమున భగవంతుని సేవింపవలె నని అన్నమయ్య ప్రబోధించినాడు.

## 62

అవతారిక :- భగవంతునిపై నిండు నమ్మకము గలవారికి తక్కిన ఉపాయములతో పనిలే దనుచున్నాడు-

### కన్నడగౌళ

విన్న నమ్మి విశ్వాసము - నీపై నిలుపు కొని
ఉన్నవాఁడ నిఁక వేరే - ఉపాయ మేమిటికి ? ॥పల్లవి॥

(1) శ. గ. (2) శ. గ. (3) శ. గ.

1. గతియై రక్షింతువో - కాక రక్షించవో యని
మతిలోని సంశయము - మఱి విడిచి,
యితరులచే ముందర - నికనెట్టైదునో యని
వెతతోడఁ దలచేటి - వెఱపెల్లా విడిచి. ॥ నిన్ను ॥

2. తిరమైన నీ మహిమ - తెలిసేవాఁడ ననే
గరువముతోడి వుద్యో - గము విడిచి,
వెరవున నీరూపు - వెదకి కానలే ననే
గరిమ నలపు నాస్తి - కత్వమును విడిచి. ॥ నిన్ను ॥

3. ధ్రువమైన నాచేఁతకు - తోడు దెచ్చుకొనే ననే
అవల నన్యులమీఁది - యాస విడిచి
వివరిం చలమేల్మంగ - విభుఁడ శ్రీవెంకటేశ
తవిలితి నా పుణ్యమం - తయు నీకు విడిచి. ॥ నిన్ను ॥

2. తిరమైన = స్థిరమైన; గరువము = గర్వము; అలపు నాస్తి కత్వము = అలసటచే గలిగిన నాస్తిక భావమును.

3. ధ్రువమైన = స్థిరమైన, శాశ్వతమైన.

భావము :- దేవా ! నీవే గతియని నమ్మికొని నా విశ్వాసము నంతయు నీపైననే నిలుపు కొనియున్నాను. కడతేఱుటకు నాకిక వేఱుపాయ మెందుకు ?

నీవు నాకు దిక్కై కాపాడుదువో కాపాడవో అన్న నా మనస్సులోని సందేహమును పూర్తిగా వదలిపెట్టినాను. తప్పక నీవే కాపాడుదువన్న గట్టి నమ్మకముతో నున్నాను. ఇక మీదట ఇతరులవలన ఎట్టి అపకారమునకు గుఱియగుదునో అన్న దిగులుతో చిత్తమున దోచు భయమెల్ల విడనాడి నిర్భయముగా నున్నాను.

స్థిరమైన నీ ప్రభావము నంతయు తెలిసికొనగలనన్న గర్వముతో గూడిన ప్రయత్నము నంతయు త్యజించి నీ మహిమలు ఊహాతీతములని గుర్తించి గర్వరహితుడనైయున్నాను. ఏ ఉపాయముతోనైనను నీ స్వరూపమును వెదకి కనుగొన జాలనన్న అలసటచే గలుగు నాస్తికభావమును వదలినాను. విశ్వాసపూర్ణుడనై నిన్ను సేవించి నీ స్వరూపమును కనుగొనగల నన్న ఆస్తికభావముతో నున్నాను.

నేనుఁ గావించు నీ సేవారూపమైన శాశ్వతకార్యమునకు పరులనుండి సహాయము తెచ్చుకొందు నన్న ఆశనుఁ విడనాడి నాకు నేనే ఆత్మోద్ధరణ గావించుకొనుటకు పూనుకొన్నాను. అలమేల్మంగకు ప్రభుడవైన శ్రీవేంకటేశ్వరా ! నిన్ను మనసార తలపోసి సత్కర్మానుష్ఠానముచే నే నార్జించిన పుణ్యమునంతయు నీకు సమర్పించి నిన్నే ఆశ్రయించినాను. కాన నీవు నన్ను రక్షింపక తప్పదని భావము.

**విశేషాంశములు :-** భగవంతునిపై ఎంత విశ్వాసము గల్గి యుండవలెనో ఈ పాటలో చక్కగా వివరింపబడినది. ''శ్రద్ధావాన్ లభతే జ్ఞానం[1] '' అని భగవాను డానతిచ్చినట్లు శ్రద్ధాళువైనవాడే జ్ఞానము నొందగలడు. శ్రద్ధతో నమ్మకము ముడివడియున్నది. విశ్వాసము లోపించినవాడు సంశయాత్ము డగును. జ్ఞానహీనుడు, శ్రద్ధారహితుడు, సంశయాత్ముడు అగువాడు నశించుననియు, సంశయాత్మునకు ఇహపరములు, సుఖము లేవనియు భగవద్గీత ప్రకటించుచున్నది -

> **అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।**
> **నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥[2]**

కాన భగవంతుడు తన్ను కాపాడునన్న విషయములో భక్తున కెట్టి సంశయముండరాదు. ఇట్టి విశ్వాస మెక్కువ యగుకొలది ఇతరులచే తన కాపద గలుగు నన్న భయముగూడ తొలగిపోవును.

మరియు అవాఙ్మనసగోచరమైన భగవత్తత్త్వమును తాను పూర్తిగా ఎఱుంగగల నన్న గర్వము తగదు. అట్లే ఎంతగా ప్రయత్నించినను భగవంతుడు కానరాడు గాన ఆయన కొఱకై ప్రయత్నించియు ఫలము లేదను నాస్తికభావము గూడ యుక్తము గాదు.

ఎవరో తనకు సహాయపడి తన్నుద్ధరింతురని భావించుట తప్పు. 'ఉద్ధరే దాత్మనాఽఽత్మానం'[3] అని కృష్ణుడు చెప్పెను గదా ! శంకరభగవత్పాదులును స్వప్రయత్నముయొక్క ప్రాధాన్యమును వివరించుచు నిట్లనిరి -

> **ఋణమోచనకర్తారః పితుస్సన్తి సుతాదయః ।**
> **బంధమోచనకర్తా తు స్వస్మాదన్యో న కశ్చన ॥**

---

(1) గీత., 4-39. (2) గీత., 4-40. (3) గీత., 6-5.

మస్తకన్యస్త భారాదేః దుఃఖమన్యై ర్నివార్యతే ।
క్షుదాదికృత దుఃఖంతు వినా స్వేన న కేనచిత్ ॥[1]

తండ్రికి కొడుకు మున్నగువారు ఋణవిముక్తి గావింపగలరు గాని సంసార బంధమును విడిపించువాడు తనకు తానే తప్ప ఇతరు డెవ్వడును లేడు. తలమీది బరువు నొరులు దింపగలరుగాని ఆకలి మొదలగు ఆంతర బాధను తనకు తానే మాన్పుకొన వలెను గదా ! అని భావము.

కాన స్వప్రయత్నము మీద పూర్ణవిశ్వాసము కల్గి పుణ్యకర్మఫలములను భగవంతునకు సమర్పించి బంధమోక్షమునకై ప్రయత్నింపవలె ననుట పరమార్థము.

## 63

**అవతారిక :-** పురుష ప్రయత్నముచే ఎట్టి పనినైన సాధింపవచ్చు ననుచున్నాడు -

### వరాళి

మహి నుద్యోగి గావలె - మనుజుఁడైనవాఁడు
సహజివలె నుండేమీ - సాధింపలేడు. ॥ పల్లవి ॥

1. వెదకి తలఁచుకొంటే - విష్ణుఁడు గానవచ్చు
చెదరి మఱచితే - సృష్టి చీఁకటౌ,
పొదలి నడచితేను - భూమెల్లా మెట్టిరావచ్చు
నిదిరించితేఁ గాలము - నిమిషమై తోఁచు. ॥ మహి ॥

2. వేడుకతోఁ జదివితే - వేదశాస్త్ర సంపన్నుఁడౌ
జాడతో నూరకుండితే - జడుఁడౌను,
ఓడక తపసియైతే - ఉన్నతోన్నతుఁడౌ
కూడక సోమరియైతే - గుణహీనుఁడౌను. ॥ మహి ॥

3. మురహరుఁ గొలిచితే - మోక్షము సాధించవచ్చు
వెర వెఱఁగ కుండితే - వీరిడి యౌను,
శరణంటే శ్రీవేంకటే - శ్వరుఁడు రక్షించును
పరగ సంశయించితే - పాషండుఁడౌను. ॥ మహి ॥

(1) వి. చూ, 53, 54.

ప॥:- ఉద్యోగి = ప్రయత్నశీలుడు; సహజి = సహజమైన స్వభావముతో గూడినవాడు.

3. వెరవు = ఉపాయము, వీరిడి = అవివేకి; పాషండుఁడు = వేదబాహ్యుడు.

**భావము :-** ఇలలో మానవుడై పుట్టినవాడు తప్పక ప్రయత్నశీలుడు కావలెను. పుట్టిన నాటివలె సహజస్వభావముతోనుండి ఏ ప్రయత్నమును చేయనివాడు (యథాజాతుడు) ఏమియు సాధింపజాలడు.

ప్రయత్నముతో అన్వేషణపరుడై భగవంతుని తలంచువానికి విష్ణుడు ప్రత్యక్షమగును. భగవంతుని విస్మరించినచో ప్రపంచమంతయు అంధకారబంధురమైపోవును. ఉత్సాహశీలియై నడచినచో క్రమముగా విశాలమైన భూమియంతయు చుట్టి రావచ్చును. తామసుడై నిద్రించినచో కాలమంతయు రెప్పపాటులో వ్యర్థముగ గడచిపోవును.

వేడుకపడి చదివినవాడు మహావేద శాస్త్రసంపదగల విద్వాంసుడగును. ఏమియు చదువక ఊరకున్నవాడు జడమతియైపోవును. ధీరతతో తపోనిష్ఠగలవాడైనచో ఉన్నతులైన వారిలో ఉన్నతు డగును. సోమరియైనవాడు గుణహీనుడై పోవును.

ముకుందుని భజించినచో ముక్తి కరతలామలక మగును. ఏ యుపాయము తెలియనివాడు వివేక హీనుడైపోవును. శరణన్నవానిని శ్రీవేంకటేశ్వరుడు రక్షించును. ఈ విషయమున సంశయాత్ముడైనవాడు 'సంశయాత్మా వినశ్యతి'[1] అన్నట్లు వేదబాహ్యుడై చెడిపోవును.

**విశేషాంశములు :-** పురుష ప్రయత్నముయొక్క ప్రాముఖ్య మీ సంకీర్తనమున చక్కగా వివరింపబడినది.

> **ఉద్యోగినం పురుష సింహముపైతి లక్ష్మీః**
> **దైవేన దేయమితి కాపురుషా వదన్తి ।**[2]

అని పెద్దలసూక్తి. అనగా ప్రయత్నపరుడైన పురుషశ్రేష్ఠునే లక్ష్మి వరించును తనకు వలసినది దైవమే ప్రసాదించునని కాపురుషులు మాత్రమే వచింతురని భావము.

శాస్త్రములు పురుషప్రయత్నముయొక్క ప్రాముఖ్యమును బహుధా ప్రశంసించుచున్నవి. పయనింపకున్నచో గరుత్మంతుడైనను ఒక అడుగేని

(1) గీత., 4-40 (2) పం. త., 2-137.

పోజాలడనియు, పయనించుచున్నచో చీమల బారైనను నూరుయోజనములు దూరము పోగల్గుననియు మార్కండేయపురాణము చెప్పుచున్నది-

అగచ్ఛన్ వైనతేయోఽపి పదమేకం నగచ్ఛతి ।
గచ్ఛన్ పిపీలికావర్గః యోజనానాం శతంవ్రజేత్ ॥[1]

ధ్రువుడు మున్నగు మహనీయుల సర్వోన్నత స్థానమును పొందుటకు హేతువు వారొనర్చిన జపతపోవ్రతానుష్ఠానాదులే. 'ఊరకే దొరకునా ఉన్నతోన్నతసుఖము'[2] అను కీర్తనములో గూడ మోక్షసుఖము తగు కృషిలేక తేలికగ చేజిక్కునదిగాదని అన్నమయ్య ప్రబోధించియున్నాడు.

సోమరితనము అనర్థహేతువనియు, దానివలననే లోకము మూర్ఖులతో, నిర్ధనులతో నిండినదనియు, ఉద్యోగశీలురు తప్పక ధనికులో, మహాపండితులో కాగలరనియు చెప్పిన వసిష్ఠుని ప్రబోధము ఇట స్మరణీయము -

ఆలస్యం యది న భవే జ్జగత్యనర్థః
కో న స్యాత్ బహు ధనకో బహుశ్రుతో వా ।
ఆలస్యాదియమవనిః స సాగరాన్తా
సంపూర్ణా నరపశుభిశ్చ నిర్ధనైశ్చ ॥[3]

## 64

ఆవతారిక :- కామక్రోధాది దుర్గుణములు సైతము హరిపరములైనచో సుగతికే హేతువులగు నను చున్నాడు -

### రామక్రియ

ఇటువంటి వెల్లా నీకే - యిట్టే సెలవు సేసితి
తటుకున నీవనే ని - ధానము చేకొంటిని. ॥ పల్లవి ॥

1. కామించితి నాత్మ నిన్నుఁ - గలసి భోగించుటకు
వేమరుఁ గ్రోధించితి - నీ విరోధులపై,[4]

(1) మ. చ., P. 16. (2) అ. సం., 6-104.
(3) యో. వా., I. P. 195.
(4) 'క్రోధించితిని విరోధులపై' అని ముద్రిత పాఠము. (చూ - అ. సం. VIP. 144.)

నేమమున లోభించితి - నీ మంత్ర మన్యుల కియ్య[1]
ఆముకొని మోహించితి - హరి నీరూపునకు. ॥ ఇటు ॥

2. ఎలుకతో మదించితి - యిట్టే నీదాస్యమున
మఱి నిన్నొల్లని చదువు - మచ్చరించితి,
తఱిఁ జలపట్టితి నీ - తప్పని భక్తియందు[2]
వెలవక నిన్నొల్లని - విధుల నిందించితి. ॥ ఇటు ॥

3. కలకర్మము లెల్లా నీ - కైంకర్యములందు వెట్టితి
బలు మమకారము నీ - పైఁ జేర్చితి,
ఎలమి శ్రీవెంకటేశ - యిన్నిటా నన్నేలితివి
నిలిచిన కాలమెల్లా - నీ సేవే చేసితి. ॥ ఇటు ॥

వ ॥ :- సెలవు = ఉపయోగము; విధానము = విధి.

1. ఆముకొని = కైపెక్కి

2. నీ తప్పని భక్తియందు = తప్పని నీయందలి భక్తియందు; (ఇట్టి వింత సమాసము లీవాఙ్మయమున సహజములే) విధులఁ = కార్యములను.

3. కైంకర్యములు = సేవలు; నిలిచినకాలము = ఉన్నంతసమయము.

**భావము** :- దేవా ! ఈ చెప్పబోవువానినెల్ల నేను నీకే ఉపయోగించితిని. వెంటనే పెన్నిధి వంటి నిన్ను గైకొంటిని.

హృదయమలో నీతో గూడి రమించుటకు ( భగవదనుభవము నొందుటకు) కామించితిని. నీకు శత్రువులైన వారిపై కోపము వహించితిని. నీ తిరుమంత్రమును (గుణజ్ఞులుగాని) ఇతరుల కియ్యరాదని నియమపూర్వకముగా లోభము వహించితిని. శ్రీహరీ ! నీ దివ్యమంగళస్వరూపమునే కైపెక్కి పైకొని మోహించితిని.

నీ దాస్యము గలిగినది గదా అన్న తెలివితో మదించితిని. నీకు గాని ( నిన్ను ప్రతిపాదించని) చదువుపై మాత్సర్యము బూనితిని. తప్పిపోని నీ భక్తియందు సదా

(1) 'లోభించితివి మంత్రమన్యులకియ్య' (చూ - అ.సం., VIP. 144.)
(2) 'జలపట్టితివి తప్పని' (చూ - అ.సం., VIP. 144.)
ఈ పాఠములు సందర్భము ననుసరించి పైరీతిని సవరించబడినవి.

పట్టుదల గల్గియుంటిని. నిన్నంగీకరించని కార్యములనెల్ల నిర్భయముగా నిందించితిని.

నా కర్మ కలాపమంతయు నీ కైంకర్యమునందే వినియోగించితిని. తీరని మమకారము నీపై నుంచితిని. శ్రీవేంకటేశ్వరా ! ప్రేమతో నీవు ఇన్ని విధముల నన్ను కాపాడితివి. నేను బ్రతికినంతకాలము నీ సేవయే చేసి ధన్యుడనైతిని.

**విశేషాంశములు :-** కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు అరిషడ్వర్గము అనబడును. అట్లే చలపట్టుట, ఇతరుల నిందించుట, కర్మలలో దగులువడుట, మమకారము గల్గియుండుట అనునవిగూడ దుర్గుణములే. ఇవి సహజముగా భగవత్ప్రాప్తికి విఘ్నకరములు. ఐనను ఇవి యెల్ల సహజముగా దోషములయ్యు నిచ్చట భగవత్పరములుగానే సయుక్తికముగ వినియోగింపబడినవి గాన గుణములై భగవత్ప్రాప్తికి సాయపడినవి.

## 65

**అవతారిక :-** విశిష్టాద్వైతవేదాంతరహస్యము నంతయు తొమ్మిది మాటలలో నిరూపించుచున్నాడు-

### హిందోళవసంతం

మూఁడే మాటలు - మూఁడు మూండ్లు తొమ్మిది
వేడుకొని చదువరో - వేదాంత రహస్యము. ॥ పల్లవి ॥

1. జీవస్వరూపము - చింతించి యంతటాను
దేవుని వైభవము - తెలిసి,
భావించి ప్రకృతి సం - పద యిది యెఱుఁగుటే
వేవేలు విధముల - వేదాంతరహస్యము. ॥మూఁడే॥

2. తనలోని జ్ఞానము - తప్పకుండాఁ దలపోసి
పనితోడ నందువల్ల - భక్తి నిలిపి,
మనికిగా వైరాగ్యము - మఱవకుండుటే
వినవలసినయట్టి - వేదాంతరహస్యము. ॥మూఁడే॥

3. వేడుకతో నాచార్య - విశ్వాసము గలిగి
జాడల శరణాగతి - సాధనముతో,

కూడి శ్రీవేంకటేశ్వరుఁ - గొలిచి దాసుఁడౌటే
వీడని బ్రహ్మానంద - వేదాంత రహస్యము. ॥మూఁడే॥

భావము :- వేదాంతములో ముఖ్యముగా గ్రహింపదగిన మాటలు మూడు మూండ్ల తొమ్మిది మాత్రమే కలవు. జిజ్ఞాసగలవారు శ్రద్ధతో గురువుల వేడుకొని ఈ వేదాంత రహస్యము గ్రహింపుడు.

జీవుని స్వరూపమెట్టిదో చింతించవలెను. సర్వకాల సర్వావస్థలలో దేవుని వైభవమెట్టిదో తెలిసికొనవలెను. మఱియు చక్కగా భావనచేసి ప్రకృతి సంపద యెట్టిదో గ్రహింపవలెను. ఈ మూడింటిని తెలిసికొనుటే వివిధములైన వేదాంతముల యొక్క రహస్యమైయున్నది.

తనలోని జ్ఞానమును తప్పక భావింపవలెను. ప్రయత్నపరుడై ఆ జ్ఞానముచే గలిగెడు భక్తిని దృఢముగా నిలుపుకొనవలెను. వైరాగ్యమును జీవితసారముగా గ్రహించి మరవకుండవలెను. దీనిని మించి వినవలసిన వేదాంతరహస్యము మరొకటి లేదు.

సంతసముతో ఆచార్యునిపై నమ్మకము గలిగియుండవలెను. గురునిర్దిష్టమైన మార్గమువనుసరించి శరణాగతిని ముఖ్యసాధనముగా అనుష్ఠింపవలెను. శ్రీవేంకటేశ్వరుని భజించి భగవద్దాసుడు కావలెను. ఇదే శాశ్వతమైన బ్రహ్మానందానుభవ మనబడు వేదాంతరహస్యము.

**విశేషాంశములు :-** పల్లవిలో నిర్దేశింపబడినట్లు మూడు మూడు మాటలవంతున క్రమముగా మూడు చరణములలో తొమ్మిది మాటలు పేర్కొనబడినవి. ఆ మాటలివి -

(1) జీవుడు, (2) దేవుడు, (3) ప్రకృతి, (4) జ్ఞానము, (5) భక్తి, (6) వైరాగ్యము, (7)ఆచార్యవిశ్వాసము, (8) శరణాగతి, (9) భగవద్దాస్యము.

విశిష్టాద్వైతసిద్ధాంతము ననుసరించి ముముక్షువు లెల్లరు తప్పక తెలిసికొనదగినవి తత్త్వము, హితము, పురుషార్థము అను మూడు విషయములు గలవు. మూడే మాటలు అనుటచే ఇవియే సూచింపబడినవి. ఇవియే ఈ సంకీర్తనమున మూడు చరణములయందును అందలి విభాగములతో కూడ క్రమముగా నిరూపితము లైనవి.

**జీవుడు :-** తత్త్వము - చేతనము, అచేతనము, ఈశ్వరుడు అని మూడు

ప్రధవములు. అందు జీవుడు చేతన శబ్దముచే వ్యవహరింపబడుచున్నాడు. అణుస్వరూపుడు, ఉత్పత్తి వినాశరహితుడును అగు జీవుడు భగవంతుని కెల్లవేళల శేషుడుగా నున్నాడు. లెక్కకు మిక్కిలిగానున్న అనంత జీవాత్మలలో బద్ధులు, ముక్తులు, నిత్యులు అని మఱల మూడు భేదములు కలవు. సంసారచక్రములో పరిభ్రమించువారు బద్ధులు, మోక్షోపాయము ననుష్ఠించి ముక్తినొందినవారు ముక్తులు, కర్మ సంబంధములేక సదా వైకుంఠమున భగవత్కైంకర్య మొనర్చుచుండు విష్వక్సేనాదులు నిత్యులు.

దేవుడు :- శ్రీమన్నారాయణుడే ఈశ్వరు డనబడు దేవుడు. జ్ఞానానంద స్వరూపుడైన ఈశ్వరునకు దేశకాలవస్తు కృతపరిచ్ఛేదములు లేవు. 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ'[1] ఇత్యాది శ్రుతు లీభగవత్స్వరూపమునే వివరించుచున్నవి. సృష్టి స్థితి లయము లీశ్వర సంకల్పాధీనములు. సర్వదేవతలలో ఉత్కృష్టుడగు సర్వేశ్వరుడు సకల కల్యాణగుణసంపూర్ణుడు. ఈ దేవుని అర్చామూర్తులే శ్రీవేంకటేశ్వరాది విగ్రహములుగా వైష్ణవక్షేత్రములలో ఆరాధింపబడుచున్నవి.

ప్రకృతి :- అచేతనము, సత్త్వరజస్తమస్సులనబడు గుణత్రయము కాలము, శుద్ధసత్త్వము అని మూడు విధములుగా నున్నది. అందు కాలము కర్మలోకములోని పరిణామములకు కారణ మగుచున్నది. ఇది శ్రీవైకుంఠమునందును కలదుగాని అచ్చట కార్యకరము గాదు. శుద్ధ సత్త్వము వైకుంఠమున మాత్రమే ఉండును. కాగా త్రిగుణములే ప్రకృతిశబ్దముచే చెప్పబడుచున్నవి. అవి మహత్తత్త్వముగను, అహంకారతత్త్వముగను పరిణమించి ఇంద్రియములను పంచభూతములను గలిగించుచున్నవి. ఈ పంచభూతములనుండియే ప్రపంచమునందలి అచేతన పదార్థము లన్నియు గల్గుచున్నవి. త్రిగుణాత్మకమైన ఈ ప్రకృతియే బంధ హేతువు.

జ్ఞాన – భక్తి – వైరాగ్యములు :- మోక్షసాధనమైన ఉపాయము హితమనబడును. అది భక్తి ప్రపత్తులని రెండు విధములుగా నున్నవి. భక్తియోగమునకు కర్మజ్ఞానయోగములు రెండును అంగములే. స్వరూపజ్ఞానముకంటె భిన్నమైన ధర్మభూతజ్ఞానము, దానిచే గలిగెడు జీవునియొక్క శేషత్వాద్యుపలక్షితమైన యథావత్స్వరూపజ్ఞానము భక్తికి సాధనమైన జ్ఞానమనబడును. దీనితోపాటు వైరాగ్యముగూడ అత్యవసరమే. విషయసుఖములపై విరక్తియే వైరాగ్యము. అది లేనిచో

(1) తైత్తి. ఆనం., 1.

కళత్ర పుత్రాదులపై గల సంసారవ్యామోహము వదలదు. ఈ వ్యామోహము వదలనిచో ఆత్మస్వరూప జ్ఞానము పూర్ణముగాదు. భగవంతునిపై భక్తియు నిలువదు. భక్తి విషయత్యాగము వలనను, సంగత్యాగము వలనను స్థిరపడునని నారదభక్తి సూత్రము-

తత్తు విషయత్యాగాత్ సంగత్యాగాచ్చ[1]

'అనురక్తిః పరే తత్త్వే భక్తి రిత్యభిధీయతే '

అని చెప్పిన చొప్పున పరతత్త్వమునందలి అనురక్తియే భక్తి యనబడును. 'సాత్వస్మిన్ పరమప్రేమరూపా'[2] అను నారదభక్తి సూత్రము గూడ భగవంతుని యందలి పరమమైన ప్రేమయే భక్తియని చెప్పుచున్నది.

**ఆచార్య విశ్వాసము :-** ప్రపత్తిమార్గములో ఆచార్యుడు మిక్కిలి ప్రాముఖ్యము వహించును. 'ఆచార్యవాన్ పురుషోవేద'[3] అను శ్రుతి ఆచార్యభక్తి కలవాడే పరబ్రహ్మమ సాక్షాత్కరించుకొనునని చెప్పుచున్నది. శఠకోపముని, నాథముని, యామునముని మున్నగు పరమాచార్యులు ప్రపత్తిమార్గమును లోకమునకు బోధించిరి. కావున ఆచార్యులయందు విశ్వాసముగూడ ప్రపన్నుల కత్యావశ్యకము. వేదసారములైన దివ్యప్రబంధములను సంతరించిన ఆళ్వార్లు గూడ ఆచార్యకోటికి జెందిన పూజ్యచరిత్రులే. వారిలో ప్రపత్తిని ప్రజానీకములో బహుళప్రచారమునకు దెచ్చిన వారు శ్రీరామానుజాలు.

**శరణాగతి :-** భక్తిమార్గము ననుష్ఠించుట మిక్కిలి శ్రమతో గూడినపని, శరణాగతిద్వారా ముక్తినొందుట సులభమని విశిష్టాద్వైత దర్శనము చెప్పుచున్నది. 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'[4] అని శ్రీకృష్ణుడే శరణాగతిని భగవత్ప్రాప్తికి ముఖ్యోపాయముగా నుడివియున్నాడు. భగవంతుని శరణుజొచ్చి ''దేవా! కర్మ జ్ఞాన భక్తియోగముల ననుష్ఠించుటకు నాకు శక్తి లేదు. నీవే నాకు గతి. భక్తియోగఫలమైన మోక్షమును దయతో నా కనుగ్రహింపుము'' అని వేడుకొనుటయే శరణాగతి యనబడును.

**భగవద్దాస్యము :-** ఆచార్యప్రబోధము నాలకించి శ్రద్ధావంతులై శరణాగతి ననుష్ఠించినచో పరమపురుషార్థమైన మోక్షము కరతలామలకమగును. పరమపదమున కేగి శ్రీమన్నారాయణమూర్తినే సర్వకాల సర్వావస్థోచిత సర్వవిధ

(1) నా. భ. సూ., 3-35. (2) నా. భ. సూ., 1-2.
(3) ఛాందో., 6-14. (4) గీత., 18-66.

కైంకర్యములతో కొలిచి ఆనందించుటయే మోక్షము. తృతీయచరణమునందు 'దాసుడౌట' అనుటచే ఈ కైంకర్యమే సూచింపబడినది. ఇదియే ఉపనిషత్తులు ప్రతిపాదించిన బ్రహ్మానందపదవి.

ఇట్టి సంకీర్తనమున తొమ్మిది మాటలలో విపులమైన విశిష్టాద్వైత వేదాంత రహస్యమంతయు నిర్దేశింపబడినది. విస్తరభీతిచే వివరణము సంగ్రహింపబడినది.

## 66

**అవతారిక :-** శ్రీహరిపరములు గాని కొలువులు, కథలు, తపములు, పూజలు మున్నగునవి నిష్ప్రయోజనము లనుచున్నాడు -

### దేసాక్షి

ఎంచి చూడరో ఘనులార - యిందీ వరాక్షుఁడు రక్షకుఁడు
సంచితముగ నీతని శరణంబే - సర్వఫలప్రద మిందరికి ॥పల్లవి॥

1. హరిఁ గొలువని కొలువులు మఱి - యడవిఁగాసిన వెన్నెలలు
గరిమల నచ్యుతు వినని - కథలు భువి గజస్నానములు,
పరమాత్మునికిఁ గాని తపంబులు - పాతాళముల నిధానములు
మరుగురునికిఁగాని పూవులపూజలు- మగఁడులేని సింగారములు॥ ఎం॥

2. వైకుంఠుని నుతియించని వినుతులు - వననిధిఁగురిసిన వానలు
ఆ కమలోదరుఁగోరని కోరిక - లందని మానిఫలంబులు,
శ్రీకాంతునిపైఁజేయని భక్తులు - చెంబుమీఁది కనకపుఁబూఁత
దాకొని విష్ణుని తెలియని తెలువులు - తగనేటినడిమిపైరులు॥ ఎం॥

3. వావిరిఁగేశవు నొల్లని బదుకులు - వరతఁగలపు చింతపండు
గోవిందుని కటుమొక్కని మొక్కులు - గోడలేని పెనుచిత్రములు,
భావించి మాధవుపై లేని తలపులు - పలు మేఘముల వికారములు
శ్రీవేంకటపతి కరుణ గలిగితే - జీవుల కివియే వినోదములు.॥ ఎం॥

**వ॥:-** ఇందీవరాక్షుఁడు = కలువకన్నులవాఁడు; సర్వఫలప్రదము = సమస్తమైన ఫలముల నిచ్చునది.

1. నిధానములు = పాతరలు; మరు గురునికి = మన్మథుని తండ్రికి.
2. వైకుంఠుని = విష్ణుని; వననిధిఁ = సముద్రములో; కమలోదరుఁ = పద్మనాభుని; దాకొని = సమీపించి.

3. వావిరిఁ = అనుగతముగా, పట్టుదలతో.

భావము :- పెద్దలారా ! కలువకన్నులవాడైన శ్రీహరియే ఎల్లరకు రక్షకుడు. ఈ సంగతి చక్కఁగా భావించి గ్రహింపుడు. ఆ దేవుని శరణాగతియే ఎల్లవారికి సమస్తఫలములను సమకూర్చుచున్నది.

శ్రీహరిని సేవించక ఇతరత్ర చేయుసేవలు అడవిగాచిన వెన్నెలవలె నిష్ప్రయోజనములు. ఘనుడైన అచ్యుతునిగూర్చి వినక ఇతరులను గూర్చి విను కథలెల్ల ఏనుగుచేయు స్నానమువలె వ్యర్థములు. పరమాత్ముడగు హరిని గూర్చి కాక ఇతరుల నుద్దేశించి చేయు తపస్సులు పాతాళముననున్న పాతరలవలె అక్కఱకు రానివి. మన్మథుని తండ్రియైన మాధవునికి గాక అన్యులకొనర్చు పూజలెల్ల మగడులేని మగువ చేయు సింగారములవలె నిష్ఫలములు. మరియు అనుచితములు.

వైకుంఠధాముని విడిచి పరులనుగూర్చి చేయు పొగడ్తలెల్ల సముద్రములో గురిసిన వానలవలె నిరుపయోగములు. ఆ పద్మనాభునిగాక అన్యులను గోరెడు కోరిక లన్నియు అందనిమ్రాకుల పండ్లవలె అసాధ్యములు. అట్టి కోరికలు ఫలింప నేరవు. శ్రీకాంతునిపై జేయక ఇతరులపై జేయు భక్తి చెంబుపై బంగరుపూతవలె విలువలేనిది. ప్రయత్నించి విష్ణునిగూర్చి తెలిసికొనక తదితరులను గూర్చి తెలిసికొను విజ్ఞానము లన్నియు వరదపాలై పోవు ఏటినడుమ బెంచిన పైరులవలె నిష్ఫలములు.

తత్పరతతో కేశవు నంగీకరింపక ఒరులపై మోహము పెంచుకొని బ్రతుకు బ్రదుకులు వరద గలుపు చింతపండువలె వ్యర్థములు. గోవిందునకు గాక అన్యుల కొనర్చు నమస్కారములు గోడలేని పెద్ద చిత్రములవలె ఉనికి లేనివే యగును. మఱియు మాధవుని గాక ఇతరులను గూర్చి చేయు భావనలు నానావిధ వర్ణాలైన మబ్బుల ఆకృతులవలె నిలుకడ లేనివి. పైజెప్పినవెల్ల అంతర్గతముగా విష్ణుపరములైనచో జీవులు వెంకటేశ్వరుని దయకు పాత్రులు కాగలరు. అప్పుడా సాధన లెల్ల వారికి వినోదహేతువులే యగుచున్నవి. కాన విష్ణుని శరణు జొచ్చుటయే ముఖ్యకర్తవ్యమని భావము.

**విశేషాంశములు :-** విష్ణుడొక్కఁడే విశ్వాత్మకుడైన దైవము. కావుననే విపన్నులైన గజేంద్రాదు లాపరమాత్మచేతనే రక్షింపబడిరి. ఇతర దేవత లందరు ఆయనచేతనే నియుక్తులయి ఆయా పనులొనర్చుచున్నారు. కావ వారికి శ్రీహరి కున్న ప్రాధాన్యము లేదు. అందుచే భక్తులకు ఆరాధ్యుడైనవాడు శ్రీమన్నారాయణు డొక్కఁడే. ఇతరులను

గూర్చి చేయు ఆరాధనాదు లన్నియు వ్యర్థములే అని ఇక్కడ అన్నమయ్య విష్ణుపారమ్యమును బోధించినాడు.

'అతడు లోకోన్నతుఁడాదిమపురుషుఁడు – అన్నిటాను పరిపూర్ణుఁడు
చతురుఁడితఁడె రక్షించఁగలవాఁడు, శరణని బ్రదుకవో ఓ మనసా !'[1]

ఇత్యాదిగా అనేక సంకీర్తనములలో అన్నమయ్య విష్ణువే పరదైవతమన్న భావమును పదే పదే ప్రకటించియున్నాడు.

ప్రస్తుత సంకీర్తనమున చెప్పినట్లే హరి నారాధింపని వాని బ్రదుకు నిష్ఫల మని చెప్పుచు మరొక సంకీర్తనమున నిట్లు పాడినాడు -

## భైరవి

హరి హరి జగ మెఱుంగ నీ - వాతుమలోనే వున్నాఁడవు.
సురల గాచుటయు నసురల నడఁచుట - చొప్పడియున్నది నీగురుతు.॥ పల్లవి ॥

వేదార్థము దప్పఁదెలి సిన - విద్వాంసుని వంటిది
పాదుగఁ జదువక తర్కించఁబోవు - పాండిత్యము వంటిది.
మేదిని నడవులఁ దెరువు దప్పి మరి - మెలఁగేటి తెరువరి వంటిది
ఆదిమూర్తి నీ శరణు చొచ్చి నిను - నారాధించని వాని బదుకు.॥ హరి ॥

వట్టి జోలితో నూరక దే - వర లేని పూజవంటిది
వొట్టుక ఫలములు లేని పంటకు - వొడిగట్టే యటువంటిది.
నెట్టనఁ గర్ణధారుఁడు లేని జల - నిధి నడిమియోడవంటిది
బట్ట బయటనే పరమేశ్వర నీపై - భక్తిలేనివాని బదుకు. ॥ హరి ॥

పొందుగ ధర్మము బోధించెడి స - త్పురుషులు లేని సభవంటిది
చెంది శ్రీవెంకటేశ్వర నీ మహిమలు - చెప్పని కథవంటిది.
సందడి నన్నియుఁజేసి దక్షిణలు - చాలని యజ్ఞము వంటిది
యిందిరారమణనీవెక్కుడనుచు-నిన్నిటఁ దెలియనివానిబదుకు[2] ॥ హరి॥

కరచరణాదీంద్రియములు ఆయా సాధనలద్వారా విష్ణుపరములైనప్పుడే సార్థకము లగును. అట్లు కానివాని జన్మ నిరర్థక మనుచు ప్రహ్లాదుడు గూడ

(1) అ. సం., 7-79.

''కమలాక్షు నర్చించు కరములు కరములు'','' కంజాక్షునకు గాని కాయంబు కాయమే''[1] ఇత్యాది గా చెప్పియున్నాడు.

## 67

అవతారిక :- ఎంద ఱెన్ని తపస్సాధనల నను ష్ఠించినను వారిలో సాత్త్విక తపస్వియై శ్రీహరి కృపకు పాత్రమైనవాడే శ్రేష్ఠుడని చెప్పుచున్నాడు -

### దేసాళం

ధరణి నెందరెన్ని - తపములు చేసినాను
హరికృప గలవాఁడే - అన్నిటాఁ బూజ్యుఁడు. ॥పల్లవి॥

1. మితిలేని విత్తులెన్ని - మేదినిపైఁ జల్లినాను
తతితో విత్తినవే - తగఁ బండును,
ఇతర కాంతలు మఱి - యెందఱు గలిగినాను
పతి మన్నించినదే - పట్టపు దేవులు. ॥ధర॥

2. పొలుపడి నరులెన్ని - పొట్టఁబడి కొలచినా
నేలిక చేపట్టిన వాఁడే - యెక్కుడు బంటు,
మూల నెంత ధనమున్నా - ముంచి దాన ధర్మములు
తాలిమితో నిచ్చినదే - దాఁపురమై నిల్చును. ॥ధర్మ॥

3. ఎన్నికకుఁ గొడుకులు - యెందరు గలిగినాను
ఇన్నిటా ధర్మపరుఁడే - యీడేరును,
ఉన్నతిఁ జదువు లెన్ని - వుండినా శ్రీవేంకటేశు
సన్నుతించిన మంత్రమే - సతమై ఫలించును. ॥ధర॥

ప॥:- చేసినాను = చేసినను. 'చల్లినాను' ఇత్యాదులగు ఉత్తమ పురుషైకవచనములుగా భ్రాంతిగొల్పు ఇతర పదములకు ఇట్లే అర్థము గ్రహింపవలెను.

1. తతితో = అదనుతో.
2. ముంచి = అతిశయించి.
3. సతమై = శాశ్వతమై.

---

(1) అ.సం., 7-86.

భావము :- ఇలలో ఎందరో ఎన్నో విధముల తపస్సు లాచరించుచున్నారు. కాని వారందరు పూజనీయులు కాజాలరు. వారిలో శ్రీహరి కృపను సాధించినవాడే ఎల్లయెడల పూజ కర్హుడగును.

అదను జూడక నేలపై లెక్కలేనన్ని విత్తనములు చల్లినను అవియేవియు ఫలింపవు. బాగుగా దున్నిన నేలలో అదునున చల్లిన విత్తనములే చక్కగా ఫలించుచున్నవి. 'రాజానో బహువల్లభాః' అన్నట్లు ఒక రాజున కెందరో ఇతర స్త్రీలుందురు. కాని వారెల్లరు పట్టపురాణులుగా పరిగణింపబడరు. అత డెవతె నెక్కువగా మన్నించి గౌరవించునో ఆమెయే పట్టపుదేవేరిగ చలామణి యగుచున్నది.

ఒక ప్రభువు చెంత ఎందరో నరులు భృత్యులై ఎన్నో పాట్లు వడి వానిని సేవించుచుందురు. కాని వారందరు ప్రధానసేవకులు కాజాలరు. ఆ ప్రభు వెవని నెక్కువ నమ్మకముతో చేపట్టునో వాడే ప్రధానాధికారిగా గుర్తింపబడును. ఒకని యింట నెంతో విస్తారమైన ధన ముండవచ్చును. కాని అదియంతయు వానికి సాయపడదు. పాత్రులైనవారికి శ్రద్ధతో సమర్పించిన ధనమే దాతకు జన్మాంతరములో గూడ నిక్కముగా సహాయమై నిల్చుచున్నది.

ఒకనికి లెక్కకెందరో కొడుకులు పుట్టియుండవచ్చును. కాని వారెల్లరును కడతేరజాలరు. వారిలో ఎవడు ధర్మపరుడో వాడే తల్లిదండ్రులను కడతేర్చి తాను గూడ కడతేరగలడు. లోకములో ఎన్నో అత్యున్నతములైన చదువు లుండవచ్చును. కాని ఆ చదువు లన్నింటివలన ఫల మిసుమంతయు లేదు. ''చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు''[1] అని ప్రహ్లాదు డన్నట్లు శ్రీవేంకటేశ్వరుని సన్నుతించు మంత్రమే శాశ్వతమైన చదువై అభీష్టఫలముల నొసంగుచున్నది.

**విశేషాంశములు :-** ఎందరో సాధకులు జప తపోవ్రతములాదిగా గల ఎన్నో సాధనల ననుష్ఠించుచుందురు. వారిలో నిక్కపు భక్తితో ఆర్ద్రచిత్తులై హరిని గూర్చి తప మొనర్చువారు మిక్కిలి అరుదుగా నుందురు.

తపస్సు- సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధముల మున్నది. పరమశ్రద్ధతో ఫలాకాంక్ష వదలి త్రికరణశుద్ధిగా యోగులొనర్చు తపస్సు సాత్త్విక మనబడును. సత్కార సమ్మాన పూజాదుల నపేక్షించి చేయు దాంభికమైన

(1) భాగ., 7-169.

తపస్సు రాజస మనబడును. మూర్ఖపు పట్టుదలతో తన్ను తాను పీడించుకొని ఇతరుల వినాశము నపేక్షించి చేయు తపస్సు తామస మనబడును. ఈ విషయమే గీతలో ఇట్లు చెప్పబడినది -

శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్షతే ॥
సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్ ॥
మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్ ॥[1]

పై త్రివిధ తపస్సులలో రాజస తామసములు తగవు. సాత్త్విక తపస్సే చేయదగినది. దాని ననుష్ఠించు వారిపైననే హరి కరుణ ప్రసరించును. హరికృప ప్రసరింపనివారికి లోకపూజ్యత సిద్ధింపదు. కాన సాత్త్వికములైన జప తపో వ్రతాది విధానములనే చేపట్టి శ్రీవేంకటేశ్వరుని దయకు పాత్రులు కావలయుననుట తాత్పర్యము.

## 68

అవతారిక :- జీవులయొక్క సకల విధ ప్రవృత్తులకు ఆ పరమాత్ముడే మూల కారణమని చెప్పుచున్నాడు-

### ముఖారి

ఇట్టి నా వెఱ్ఱితనము - లేమని చెప్పుకొందును
నెట్టన నిందుకు నగి - నీవే దయఁజూడవే. ॥ పల్లవి ॥

1. పాటించి నాలో నుండి - పలికింతువు నీవు
మాటలాడ నేరుతు నంటా - మరి నే నహంకరింతును,
నీటున లోకము లెల్లా - నీవే యేలుచుండఁగాను
గాటాన దొరనంటా - గర్వింతు నేను. ॥ ఇట్టి ॥

2. వెమ్మదిఁ బ్రజల నెల్లా - నీవే పుట్టించఁగాను
కమ్మి నేనే బిడ్డలఁ - గంటినంటా సంతసింతును,

(1) గీత., 17-17, 18, 19.

సమ్మతి నీవే సర్వ - సంపదలు నొసఁగగాను
యిమ్ముల గడించుకొంటి - నివి నే నంటా నెంతు. ॥ ఇట్టి ॥

3. మన్నించి యిహపరాలు - మరి నీవే యియ్యఁగాను
ఎన్నుకొందు నా తపో మ - హిమ యిది యనుచును,
ఉన్నతి శ్రీవేంకటేశ - నన్ను నేమి చూచేవు
అన్నిటా నా యాచార్య - విన్నపమే వినవే. ॥ ఇట్టి ॥

ప ॥ :- నెట్టన = అనివార్యముగా.

1. గాటాన = గాఢముగా, ఎక్కువగా.

2. కమ్మి = క్రమ్మి, వ్యాపించి; ఇమ్ముల = ఉపాయముతో.

**భావము** :- దేవా ! నన్ను నిమిత్తమాత్రముగా జేసికొని నీవే నాచే పనులెల్ల జేయించు చున్నావు. కాని నీ ప్రభావమును గుర్తింపనేరక వెఱ్ఱివాడనై ఇవి యెల్ల నాశక్తితో నేనే స్వయముగ నిర్వహించుచున్నానని గర్వించుచున్నాను. ఇట్టి నా వెఱ్ఱితనమును సిగ్గు వదలి ఏమని చెప్పుకొనగలను? నా యీ పిచ్చితనమునకు నవ్వుకొని నీవే తప్పక నన్ను దయజూడుమా !

నీవే నాలో అంతరాత్మవై యుండి పలు పలుకులు పలికించుచున్నావు. నేనది గుర్తింపక ''ఇదిగో నే నెంత చమత్కారముగా మాటలాడ నేర్చితివో చూడుడు!'' అని మిక్కిలి అహంకరించుచున్నాను. ఈ భువనముల నన్నింటిని నీవే నేర్పుతో పరిపాలించుచున్నావు. కాని లోకములకెల్ల దొరను నేనే అని మూఢుడనై ఎంతో గర్వించుచున్నాను.

పుట్టెడి జీవుల నందరిని పుట్టించువాడవు నీవే. కాని ఈ బిడ్డలను గన్న తండ్రిని నేనే అని సంతసించుచున్నాను. నాకున్న సకల సంపదలు దయతో నీవిచ్చినవే. కాని వివిధములైన ఉపాయములతో నేనే యీ సిరుల నార్జించుకొంటి నని తలంచుచున్నాను.

ఇహమైనను, పరమైనను నన్ను కృపజూచి నీవే నా కొసగినాడవు. కాని నా తపః ప్రభావముచే వీటిని నేను స్వాధీనము జేసికొన్నానని భావించుచున్నాను. ఓ మహోన్నతుడవైన శ్రీవేంకటేశ్వరా ! ఇంత దురహంకారముతో విఱ్ఱవీగుచున్న నన్నెందు కట్లు చూచెదవు ? బుద్ధిహీనుడనై నే నిట్లు భాగవదపచార మొనర్చుచున్నా

ననియు, కరుణాసిధివైన నీ వది చిత్తములో బెట్టుకొనక ఈ దీనుని కాపాడుమనియు నీతో నా గురుడు నన్ను గూర్చి చేయు విన్నపము విని నాపై దయజూపుము.

విశేషాంశములు :- తానొనర్చు పనులన్నిటికి తానే కర్తయని యహంకరించుట మానవుని స్వభావము. కాని ప్రకృతినుండి కలిగిన సత్త్వరజస్తమోగుణముల చేతనే జీవు లాయాకార్యము లొనర్చుచున్నారు. ప్రకృతికి ప్రేరకుడు పరమేశ్వరుడే కాన మన మాచరించు పను లన్నిటికిని ముఖ్యకర్త పరమేశ్వరుడే కాని ఇతరులు కారు.

ప్రకృతి గుణములచే చేయబడుచున్న నానా కర్మలకు తానే కర్తనని యహంకార విమూఢుడు తలంచుననియు, గుణ కర్మముల తత్త్వము నెరింగినవాడు సత్త్వాది గుణప్రేరితములైన ఇంద్రియములే ఆ యా కార్యములందు ప్రవర్తించుచున్నవని తలంచి కర్తృత్వాహంకారమును పొందడనియు భగవానుడే వచించియున్నాడు.

> ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
> అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే ॥
>
> తత్త్వవిత్తు మహాబాహో ! గుణ కర్మ విభాగయోః ।
> గుణా గుణేషు వర్తన్తే ఇతి మత్వా న సజ్జతే ॥[1]

అర్జునుడు మోహావిష్టుడై బంధునాశ మొనర్పజాలనని కర్తవ్య విముఖుడై నప్పుడు శ్రీకృష్ణు డతని కాత్మతత్త్వోపదేశ మొనర్చి విశ్వరూపమును ప్రదర్శించెను. అప్పు డర్జునుడు కర్ణదుర్యోధనాదులగు ప్రతివీరు లెల్లరు భగవంతునిచే నశింపజేయ బడుచున్నట్లు కాంచెను. అత్తరి శ్రీకృష్ణుడు ''సవ్యసాచీ ! లెమ్ము ! శత్రువుల గెలిచి కీర్తినొందుము. రాజ్యభోగము లనుభవింపుము. వీరందరు మున్నే నాచే విహతులై యున్నారు. నీవు వీరి వధకు నిమిత్తమాత్రుడవు కమ్ము ! నాచే చంపబడియున్న ద్రోణుడు, భీష్ముడు, జయద్రథుడు, కర్ణుడు మున్నగు యోధవీరులను నీవు చంపుము. ఇందులకై వెత నొందకుము. యుద్ధ మొనర్పుము. రణమున శత్రువులను గెలువ గలవు'' అని ప్రబోధించెను -

> తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వజిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్।
> మయైవైతే నిహతాః పూర్వ మేవ నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్ ॥[2]

---

(1) గీత., 3-27, 28. (2) గీత., 11-33.

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాఽన్యానపి యోధ వీరాన్ !
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥[1]

దీనినిబట్టి సర్వకార్యములకు భగవంతుడే ముఖ్యకర్త యని తేటతెల్లమగుచున్నది.

'పాటించి నాలోనుండి - పలికింతువు నీవు'

అను మాట -

'నా నాలికపై నుండి – నా నా సంకీర్తనలు
పూని నాచే నిన్ను – బొగడించితివి''[2]

అను మరొక కీర్తనలోని పలుకులతో సంవదించుచున్నది.

## 69

అవతారిక:- శాంతి, వైరాగ్యము, గురుసేవ, సత్యము మున్నగు భాగవత ధర్మములు కలవారికెట్టి యిక్కట్టులు లేవనుచున్నాడు -

### ముఖారి

దేవ నీవు గల్పించిన - తెరువు లివి
నీవారైన వారి - నేరుపు లివి. ॥ పల్లవి ॥

1. పరమశాంతునకుఁ - పాపము రాదు
విరతి గలవానికి - వెరపు లేదు,
గురుసేవారతునకుఁ - గోపము రాదు
ధర సత్యవిదునకుఁ - దప్పు లేదు. ॥ దేవ ॥

2. పుట్టు బ్రహ్మచారికి - బుద్ధి చెడదు
అట్టె ఆసలేనివారికి - అలపు లేదు,
తొట్టిన సుజ్ఞానికి - దుఃఖము లేదు
గట్టియైన మౌనికి - కలహమే లేదు. ॥ దేవ ॥

3. సమచిత్తునకును - చంచలము గాదు
విమలాచారునకు - వెలితి లేదు,
నెమకి శ్రీవేంకటేశ - నీదాసులై కొల్చి
భ్రమయనివారికి - భారము లేదు. ॥ దేవ ॥

---

(1) గీత., 11- 34. (2) అ. సం., 7-104.

1. విరతి = వైరాగ్యము.
2. తొట్టిన = నిండుకొన్న, పరిపూర్ణుడైన.
3. సమచిత్తునకును = సుఖదుఃఖాదిద్వంద్వములలో సమమైన చిత్తము గలవానికి; వెమకి- వెదకి.

భావము :- దేవా ! ఈ చెప్పబోవు ధర్మము లన్నియు నీవు తీర్చిన బాటలు. ఇవి నిన్ను భావించి సేవించి నీ కధీనులైన పరమభాగవతుల అభ్యాసములోనున్న సద్గుణములు.

పరతత్త్వజ్ఞానము గల్గి మిక్కిలి శాంతుడైన వానికి పాప మంటదు. విషయ సుఖములలో విరక్తి గలవానికి భయ మనునది లేదు. ('సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్య మేవాభయమ్'[1] అను భర్తృహరి వచనము వైరాగ్య మొక్కటే వెరపులేనిదని ఉద్ఘాటించుచున్నది.) గురుసేవయందు ఆసక్తుడైనవానికి కోపము రాదు. సత్య స్వరూపము నెఱింగిన సుజ్ఞానికి ఎట్టి దోషములు అంటవు.

పుట్టినదాది బ్రహ్మచర్యము శీలించు శుద్ధాత్ముని యొక్క బుద్ధి పెడత్రోవ బట్టదు. ఆశను తుద ముట్టించినవానికి ఏవిధమైన శ్రమ ఉండజాలదు. పరిపూర్ణుడైన సుజ్ఞానికి దుఃఖమనునది లేదు. దృఢముగా మౌనము పాటించు మునికి ఎవరితోను ఏ సందర్భమునను కలహము లేదు. ('మౌనేన కలహో నాస్తి' అని పెద్దల వచనము)

శీతోష్ణములు, సుఖదుఃఖములు, జయాపజయములు, మానావమానములు మున్నగు ద్వంద్వములలో సమ చిత్తత గలవానికి మనశ్చాంచల్య ముండనేరదు. నిర్మలమైన ఆచారము పాటించుచు శుచియైనవానికి ఎట్టి లోపమును లేదు. శ్రీవేంకటేశ్వరా ! నిన్ను అన్వేషించి నీకు దాసులై నిన్ను సేవించి సంసారభ్రాంతికి లోనుగాని వారికి సర్వము సుఖమయమే గాని భారము గొల్పున దేదియు లేదు.

**విశేషాంశములు :-** శాంతి, వైరాగ్యము, గురుసేవ, సత్యము, బ్రహ్మచర్యము, ఆశ లేమి సుజ్ఞానము, మౌనము, సమచిత్తత్వము, నిర్మలాచారము అనునవి భాగవతులకొఱకై భగవంతుడు దిద్దితీర్చిన బాటలుగా ఇట పేర్కొనబడినవి. భగవంతుడు ఎవరి ననుగ్రహింప దలచునో వారి కీ పై జెప్పిన సుగుణములను కల్గించును. కాన భాగవతులు నిత్యము అనుష్ఠానములో నుంచు పరమధర్మములుగ వీటిని గుర్తింప వలయును.

(1) భర్తృ., 3-31.

గీతలో త్రయోదశాధ్యాయమున 8 నుండి 12వ శ్లోకమువరకు చెప్పబడిన జ్ఞాని లక్షణములలో ఆచార్యోపాసనము, వైరాగ్యము, సమచిత్తత్వము మున్నగునవి గలవు. ఈ లక్షణములనే పేర్కొనుచు ప్రత్యేకముగా ఒక సంకీర్తనమును[1] గూడ అన్నమయ్య పాడియున్నాడు.

ఇచట శాంతివైరాగ్యాది సద్గుణములుగలవారికి పాపాదిదోషములు లేవని చెప్పుటచే ఆ దుర్గుణములనుండి విముక్తి నొందగోరువారు పై సద్గుణముల నలవరచు కొనవలెనని ప్రబోధించిన ట్లైనది.

## 70

**అవతారిక** :- నారదాదులను వలె తన్నుగూడ తరింపజేయుమని శ్రీవేంకటేశ్వరుని వేడుకొనుచున్నాడు -

### మలహరి

అందుకే పో నీపై - నాసవుట్టి కొలిచేది
మందలించితి నిఁక - మరి నీ చిత్తము. ॥ పల్లవి ॥

1. ఇందరుఁ జెప్పఁగా వింటి - యెవ్వరికైనా విష్ణుఁడే
కందువ మోక్ష మియ్యఁ - గర్త యనఁగా
ముందె వింటి నారదుఁడు - ముంచి నిన్ను బాడఁగా
పొందుగ లోకములోనఁ - బూజ్యుఁడాయ ననుచు. ॥ అందు ॥

2. అప్పటి వింటి లోకము - లన్నిటికి హరియే
కప్పి రక్షకత్వానకుఁ - గర్త యనఁగా,
ఇప్పుడె వింటి ధ్రువుఁడు - యిటు నిన్ను నుతించే
ఉప్పతిల్లి పట్టమేలు - చున్నాఁ డనుచును. ॥ అందు ॥

3. ఇదె వింటి శ్రీ వెంక - టేశ బ్రహ్మకుఁ దండ్రివై
కదిసి పుట్టించఁ బెంచ - గర్త వనుచు,
వదలక వింటి నీకు - వాల్మీకి కావ్యము చెప్పి
చెదర కాద్యులలోఁ - బ్రసిద్ధుఁ డాయ ననుచు. ॥ అందు ॥

---

(1) అ. సం., 11-51 - 'ఇందుకు విరహితములు' అనునది.

ప॥ :- మందలించితిఁ = మనవి చేసితిని.

1. కందువఁ = ముఖ్యముగా; మించి = అతిశయించి.

2. అప్పటి వింటి = అప్పుడే వింటిని; ఉప్పతిల్లి = ఉదయించి.

3. కదిసి = సమీపించి; ఆద్యులలో = మొదటివారలలో.

**భావము :-** దేవా ! నిన్ను భజించిన వారి కెందరికో నీవు పూర్వము శ్రేయస్సు నొడ గూర్చితివని విన్నాను. అందువలన నీ సేవ వ్యర్థము కాదని నమ్మినాను. అందుకే నీపై ఆశపుట్టి నిన్ను సేవించుచున్నాను. నీతో ఈ నా నమ్మకమును సవినయముగా మనవి చేసికొనుచున్నాను. ఇక నీ చిత్తము.

ఎవ్వరికైనను మోక్ష మిచ్చుటకు విష్ణుడొక్కఁడే ముఖ్యకర్త యని ఎందరో చెప్పుచుండగా వింటిని, నారదుడు భక్త్యతిశయముతో నీ గుణకర్మ నామములు కీర్తించి లోకములో పూజ్యుడైనాడని ముందే వింటిని.

లోకములన్నిటికి శ్రీహరియే రక్షణ చేకూర్చు కర్తగాని ఇతరులు గారని అప్పుడే వింటిని. ధ్రువుడు నిన్ను స్తుతించియే మహోన్నతుడై శాశ్వతమైన పట్టమును పరిపాలించుచున్నాడని ఇప్పుడే వింటిని.

శ్రీవేంకటేశ్వరా ! నీవు సృష్టికర్తయైన బ్రహ్మకు తండ్రివై లోకముల బుట్టించుటకును, పోషించుటకును ముఖ్యకర్తవుగా ఉన్నావని ఇదిగో వింటిని. అంతే కాదు, వాల్మీకి మహర్షి నీ మీద కావ్యము చెప్పి ఆది మునీంద్రులలో అగ్రేసరుడై నాడని గూడ వింటిని.

**విశేషాంశములు :-** ముక్తి నిచ్చు ముఖ్యకర్త ముకుందుడే యని సకలశాస్త్రపురాణములు ప్రవచించుచున్నవి. భూదేవి విష్ణుని వినుతించుచు "పరబ్రహ్మమైన నిన్నారాధించియే ముముక్షువులు ముక్తి నొందిరి. వాసుదేవు నారాధింపక ఎవడు మోక్షము నొందగలడు ?" అని చెప్పినట్లు విష్ణుపురాణమున గలదు-

> **త్వా మారాధ్య పరం బ్రహ్మ యాతా ముక్తిం ముముక్షవః ।**
> **వాసుదేవమనారాధ్య కో మోక్షం సమవాప్స్యతి ? ॥[1]**

---

(1) విష్ణు., 1-4-18.

తన్నారాధించిన నరుడు త్వరలో ముక్తి నొందునని విష్ణువు గూడ జెప్పియున్నాడు -

**'మా మారాధ్య నరో ముక్తి మవాప్స్య త్యవిలంబితమ్' ॥**[1]

మరియు నారదాది ముఖ్యులు భక్తితో సంకీర్తనాదు లొనర్చి తన్ను జేరిరనియు భగవానుడే వచించియున్నాడు -

**'భక్త్యైవ మామనుప్రాప్తా నారదాద్యా శ్చిరాయుషః ।'**

సమస్త లోకములయొక్క భయమును నశింపజేయు నారాయణ కథను గాన మొనర్చుచు నారదుడు మనుజుల అజ్ఞానాంధకారమును విధ్వంస మొనర్చుచున్నాడని నారదీయ వచనము -

**గాయ న్నారాయణ కథాం సర్వలోక భయాపహామ్ ।**
**నారదో నాశయన్నేతి నృణా మజ్ఞానజం తమః ॥**[2]

ఇందువలన నారదాదులు తాము ముక్తు లగుటయే కాక తమ భక్తిప్రభావముచే ఇతరులను గూడ ముక్తుల నొనర్ప జాలిరని తెలియ నగుచున్నది.

మరియు శిష్టరక్షణ దుష్టశిక్షణాదులతో లోకహితము చేకూర్చి లోకము లన్నింటిని కాపాడువాడు గూడ శ్రీమన్నారాయణుడే. ధ్రువుని మహోన్నతస్థితికి ఆయన అనుగ్రహమే హేతువైనది.

ఉత్తానపాదుని సుతుడైన ధ్రువుడు సవతి తల్లిచే అవమానింపబడి మరీచ్యాది మహర్షులచే ప్రబోధితుడై భగవంతునిగూర్చి తప మొనర్చెను. అప్పు డతనికి భగవంతుడు ప్రత్యక్షమై యిట్లు వర మొసంగెను -

''ధ్రువా ! నీవు నా యనుగ్రహముచే త్రిలోకములకంటె నున్నతమైన స్థానమున సమస్త తారాగ్రహముల కాశ్రయముగా నుండగలవు. ఇందు సందియము లేదు. సూర్య చంద్రాదులకంటెను, సమస్త నక్షత్రములకంటెను, సప్తర్షులకంటెను, వైమానికులైన దేవత లందఱికంటెను ఉన్నతమైన స్థానమే నేను నీ కిచ్చితిని'' -

**త్రైలోక్యా దధికే స్థానే సర్వతారాగ్రహాశ్రయః ।**
**భవిష్యతి న సన్దేహో మత్ప్రసాదాద్భవాన్ ధ్రువ ! ॥**
**సూర్యాత్ సోమాత్ తథా భౌమాత్ సోమపుత్రాత్ బృహస్పతేః ।**
**సితార్కతనయాదీనాం సర్వర్క్షాణాం తథా ధ్రువ ! ॥**[3]

---

(1) విష్ణు., 1-12-87. (2) నారద., (3) విష్ణు., 1-12-90,91

సప్తర్షీణా మశేషాణాం యే చ వైమానికాః సురాః ।
సర్వేషా ముపరిస్థానం తవ దత్తం మయా ధ్రువః ॥[1]

సృష్టికర్త బ్రహ్మ. అతని పుట్టుకకు హేతువైనవాడు శ్రీహరి. అందువలనే "ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవాఁడు"[2] అని కీర్తింపబడినాడు. కాన శ్రీహరియే లోకముల జనన పోషణములకు ముఖ్యకర్తయై భాసిల్లుచున్నాడు.

రామాయణకర్తయగు వాల్మీకి ఆదికవిగా పేరొందినాడు. అత డొకనాటి మధ్యాహ్నము తమసానదిలో స్నాన మొనర్పబోయి అట నొక బోయవాడు క్రౌంచపక్షుల జంటలో నొకదానిని నేల గూల్చుట జూచి శోకాకులు డయ్యెను. ఆయన శోకమే ఆ బోయవానిపట్ల శాపరూపమైన శ్లోకము[3] గా రూపొందెను. లోకములో వెలసిన మొదటి ఛందోమయవాణి అదియే. పిమ్మట బ్రహ్మ ప్రత్యక్షమై-

"రామస్య చరితం కృత్స్నం కురుత్వం ఋషిసత్తమ !"[4] అని వాల్మీకిని రామాయణరచనకు పురికొల్పెను. అంతకు ముందితరకృతు లెవ్వియు లేవు. అందుచే రామాయణమున కాదికావ్యమనియు, వాల్మీకికి ఆదికవి యనియు ప్రసిద్ధి కల్గినది.

ప్రకృత సంకీర్తనమున అన్నమయ్య భగవంతుని కీర్తించుచునే తనకు పూర్వమే భగవంతుని భజించి ముక్తులైన నారద - వాల్మీకి ప్రభృతులను గూడ నుతించి వారిపై తనకు గల గౌరవాతిశయమును ప్రకటించుకొన్నాడు.

## 71

**అవతారిక :-** తన సంకీర్తనలను భగవత్పాదములకు జేసిన పూజలుగా, పరమాత్ముని కీర్తిరూప పుష్పములుగా పేర్కొనుచున్నాడు -

### గుండక్రియ

దాఁచుకో[5] నీపాదాలకుఁ - దగనేఁ జేసినపూజ లివి
పూఁచి నీ కీరితి రూప - పుష్పము లివి యయ్యా ! ॥పల్లవి॥

---

(1) విష్ణు., 1-12-92. (2) భార. సభా - 2-18.

(3) మానిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీ స్సమాః ।
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామ మోహితమ్ ॥ (రామా., 1-2-15.)

(4) రామా., 1-2-32.

(5) 'దాఁచుకొని' అను పాఠమునకు 'మరుగుపరచుకొని' అనిఅర్థము చెప్పవలెను. దీనికంటె పై పాఠమే సముచితము.

1. ఒక్క సంకీర్తనే చాలు - యొద్దికై మమ్ము రక్షించఁగ
తక్కినవి భండారాన - దాచివుండనీ,
వెక్కసమగు నీ నామము - వెల సులభము ఫల మధికము
దిక్కై నన్నేలితి వికనవి - తీరని నాధనమయ్యా ! ॥ దాఁచు॥

2. నానాలికపైనుండి - నానాసంకీర్తనలు
పూని నాచే నిన్ను - బొగడించితివి,
వేనామాల వెన్నుఁడా - వినుతించ నెంతవాఁడ
కానిమ్మని నాకీపుణ్యము - గట్టితి వింతేయయ్యా ! ॥ దాఁచు ॥

3. ఈ మాట గర్వముగాదు - నీ మహిమే కొనియాడితిఁగాని
చేముంచి నా స్వాతంత్ర్యము - చెప్పిన వాఁడఁగాను,
నేమానఁ బాడేవాఁడను - నేరము లెంచకుమీ
శ్రీమాధవ ! నే నీదాసుఁడ - శ్రీవేంకటేశుఁడవయ్యా ! ॥ దాఁచు ॥

ప॥:- పూఁచి = పూని; కీరితిరూపపుష్పములు = కీర్తిరూపమున నున్న పూలు,

1. ఒద్దికై = అనుకూలమై; భండారాన = బొక్కసమునందు; వెక్కసము = దుర్లభము, అవి = ఆ సంకీర్తనలు.

2. వేనామాల వెన్నుఁడా ! = సహస్రనామములుగల విష్ణుడా !

3. చేముంచి = పనిబూని, (''తలమున్కలువలె పూర్తిగా పనిలో దిగి'' అని 22వ సంపు, సంధ్గిపదసమీక్ష); నేమానఁ = నియమముతో.

**భావము** :- దేవా ! నేను రచించిన ఈ సంకీర్తనలు నీ చరణములకు తగురీతిగా పూని నే నొనర్చిన పూజలే, ఇవి నీ యశోరూపములైన కుసుమములు. కాన భద్రముగా దాచుకొనుము.

వేలకొలదిగా నున్న ఈ పాటలలో అన్ని విధముల అనుకూలమై మమ్ము కాపాడుటకు ఒక్కపాటయే చాలును. మిగిలిన వెల్ల భాండాగారములో దాచి యుండనిమ్ము. నీ నామము దుర్లభము. దానివెల తక్కువ. కాని దాని ఫలము మిక్కిలి దొడ్డది. ఆ నామసంకీర్తన ప్రభావముచేతనే నాకు దిక్కై నన్ను నీవు రక్షించితివి. ఇక నీ నామ సంకీర్తనలే నాకు తరిగిపోని సంపదలయ్యా !

అందుకని పూని నా నాలుకపై నిలిచి పెక్కు సంకీర్తనలతో నాచే నిన్ను స్తుతింప జేసితివి. వేయి నామములు గల విష్ణుదేవా ! నిన్ను స్తుతింప నేనెంత వాడను? నీవే నా పై దయదలచి కానిమ్మని నాకీ పుణ్యము నంటగట్టితివి. ఇంతే.

నే నీమాట గర్వముతో పలుకుట లేదు. నీ మహిమనే నే నిట్లు వినుతించితిని గాని పనిబూని నా స్వాతంత్ర్యమును నేను చెప్పుకొనలేదు. నియమము తప్పక నిన్ను నిత్యము గానము చేయుచున్నాను. నాలోని తప్పు లెంచకుము. శ్రీమాధవా ! నీవు శ్రీవేంకటేశ్వరుడవు. నేను నీ దాసుడ నయ్యా !

విశేషాంశములు :- భగవన్నామ సంకీర్తన రూపములైన తన సంకీర్తనలను అన్నమయ్య భగవంతునికి తాను కావించిన పూజలుగా పేర్కొన్నాడు. ఇందుచే ఆయన భగవత్కైంకర్య పరత్వ మెట్టిదో తెల్లమగుచున్నది. భగవంతుని కీర్తిరూపపుష్పములుగా ఈ పాటలను రూపించుటచే ఇందలి ప్రతిపాట ఆ దేవుని యశస్సును ప్రకటించుటకే రచింపబడిన పూజా కుసుమముగా గ్రహింపనగును.

వైకుంఠుఁబొగడని వక్త్రంబు వక్త్రమే – ఢమఢమధ్వనితోడి ఢక్క గాక ![1]

అని ప్రహ్లాదుని వచనము. కవితచే భగవత్కీర్తిని గానమొనర్చి అన్నమయ్య తన వాక్కును పవిత్రము చేసికొన్నాడు.

ఆయన వేలకొలది సంకీర్తనలు రచించినాడు. అందు ఒక్క సంకీర్తనయే తమ్ము రక్షించుటకు చాలునని చెప్పుకొన్నాడు. తన ప్రతిపాటయు సంసారతరణోపాయ మగుటలో ఆయనకు గల ఆత్మవిశ్వాస మెంత దృఢమైనదో దీనినిబట్టి వెల్లడి యగుచున్నది.

తపోధ్యానాదులతో పోల్చినచో నామ సంకీర్తనము పేలవముగ గనపడవచ్చును. అందలి శ్రమ ఇందు లేదుగదా ! ఐనను దీని మహిమ వాటికి లేదనుటకే ఫలమధికము అని చెప్పబడినది.

''పలికించెడు వాడు రామభద్రుండు''[2] అని పోతన చెప్పినట్లే ''నా నాలిక పై నుండి నాచే నిన్ను బొగడించితివి'' అని అన్నమయ్య చెప్పెను. ఇందుచే ఆయన వినయాతిశయము ప్రకట మగుచున్నది. ''ఇది గర్వపుమాట గాదు. నా స్వాతంత్ర్యము నేను చెప్పుకొనలేదు. నీ మహిమనే ఇట్లు కొనియాడితిని.'' అన్న ఆ పదకవితాపితామహుని భక్తి తాత్పర్యము నిరుపమానము గదా !

## 72

**అవతారిక :-** మనస్సును విచ్చలవిడిగా వదలక నిగ్రహించి భగవంతునిపై నిలుపుటే ముఖ్యకర్తవ్య మనుచున్నాడు -

---

(1) భాగ., 7-170. (2) భాగ., 1-16.

## శుద్ధవసంతం

అందుకే సుమ్మీ నేఁ జేసే - ఆచారాలు దైవమా !
నిందవాయ నా మనసు - నీపై నిలుపవే. ॥ పల్లవి ॥

1. బట్టబయటఁ దోలితేను - బందెమేయుఁ బసురము
పట్టి మేపితేను తన - పనులు సేయు,
ఇట్టె వదలితేను - యెందైనాఁ బారు మనసు
కట్టుక నేమస్తుఁడైతే - కై వసమైయుండును. ॥ అందు ॥

2. బడి దప్పితే బంట్లు - పరదేసు లౌదురు
ఎడయక కూడుకొంటే - హితులౌదురు,
విడిచితే నిటులనే - కడకుఁబారు మనసు
ఒడలిలో నణచితే - వొద్దికై వుండును. ॥ అందు ॥

3. చే వదలితే పెంచిన - చిలుకైనా మేడలెక్కు-
రావించి గూఁటఁబెట్టితే - రామా యనును,
భావించ కుండితే యిట్టె - పారునెందైనా మనసు
శ్రీవెంకటేశుఁగొల్చితే - చేతఁ జిక్కి-వుండును. ॥ అందు ॥

1. నేమస్తుఁడు = నియమస్థుడు, కట్టుబాటులో నున్నవాడు.
2. బడి = క్రమము, కట్టుబాటు.

**భావము** :- ఓ దైవమా ! మిక్కిలి చంచలమై నింద వాటిల్లజేయు ఈ నా చిత్తమును నింద తొలగు నట్లు నీపై నిలుపుకొమ్ము. నిత్యము నే నొనర్చు ఆచారము లన్నియు నా మనస్సును నిగ్రహించి నీపై నిలుపుటకే సుమా !

పశువును బట్ట బయట దోలినచో పైరు మేసి బందె బడిపోవును. కట్టివేసి మేపినచో యజమాని కవసరమైన పనులు చేసి ఉపయోగపడును. అట్లే చిత్తమును వదలినచో ఎక్కడికైన పరుగులిడి తగులువడిపోవును. అట్లు వదలక నిగ్రహించి సాధకుడు నియమము గలవాడైనచో మనస్సు స్వాధీనమై యుండును.

కట్టుబాటు దప్పించి వదలిపెట్టినచో సేవకులు పరదేసులై విచ్చలవిడిగా సంచరింతురు. విడువక కూడియున్నచో హితులై చేయదగిన పనులు చేయుదురు. ఇట్లే విడిచిపెట్టినచో మనస్సు ఎక్కడికైన పోవును. తనలోనే నిగ్రహించినచో అనుకూలమై చెప్పిన మాట వినును.

తానుం పముద్దుగా పెంచిన చిలుకైననుం చేయువదలినచో వేడలెక్కి తిరుగులాడును. చేరదీసి పంజరములో నుంచినచో చెప్పినమాట విని 'రామా' యని పలుకును. అట్లే భగవంతుని భావించనిచో చిత్తము ఎక్కడెక్కడికో పరుగులు దీయును. శ్రీవేంకటేశ్వరుని భావించి సేవించినచో స్వాధీనమై మేలు గూర్చును.

విశేషాంశములు :- మనస్సును నిగ్రహింపవలసిన ఆవశ్యకత ఈ సంకీర్తనమున ప్రతిపాదింపబడినది.

''మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః''[1]

''యాదృశీ భావనా యస్య సిద్ధి ర్భవతి తాదృశీ''[2]

అన్నట్లు వారివారి మనోభావన ననుసరించియే జనులకు మంచిచెడ్డలు, బంధమోక్షములు కలుగుచున్నవి.

శబ్దస్పర్శ రూపాదులగు విషయములనే ధ్యానించువానియొక్క మనస్సు ఆ విషయములందే సంలగ్న మగుచున్నది. నన్ను స్మరించువాని చిత్తము నా యందే లీనమగుచున్నదని భగవంతుని మాట -

విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విసజ్జతే ।
మా మనుస్మరత శ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే ॥[3]

కాన విషయువములనుండి మరలించి చిత్తమును భగవదాయత్తము గావింపవలెను. చిత్తమునకు చంచలత్వము సహజమైయున్నది. అగ్నికి వేడిమివలె మనస్సునకు చాంచల్యము ధర్మమైయున్నదని వసిష్ఠుడు నుడివెను -

చంచలత్వం మనోధర్మో వహ్నేర్ధర్మో యథోష్ణతా ।[4]

అందువలన మనోనిగ్రహమునకు గట్టిప్రయత్నము చేయవలసియున్నది. భగవద్గీతలో మనోనిగ్రహము గూర్చి భగవంతు డిట్లు వచించెను -

సంకల్ప ప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః ।
మనసైవేంద్రియ గ్రామం వినియమ్య సమన్తతః ॥
శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మ సంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్ ॥[5]

---

(1) అమృత., 2. (2) విక్రమ., 64. (3) భాగ., 11-14-27.
(4) వ. గీత., P. 458. (5) గీత., 6-24,25.

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥[1]

దీని తాత్పర్యమిది - సంకల్పముచే కలుగు కామములను పూర్తిగా పరిత్యజింపవలెను. మనస్సుచే ఇంద్రియములను విషయములనుండి మరలించవలెను. ధైర్యముతో గూడిన బుద్ధితో మనస్సును ఉపరతము గావించి ఆత్మయందు నిల్పి ఇతర చింతలు వీడవలెను. మనస్సు ఏ యే విషయములవైపు పరుగిడునో ఆ యా విషయములనుండి దానిని మరలించి ఆత్మయందే నియమింపవలెను.

ఈ పని చేయుటకు అభ్యాసము, వైరాగ్యము తోడ్పడునని గీత ఆరవ అధ్యాయములో నిరూపించబడినది.

మనసు చంచలమైనా మరి నిన్నుఁదలఁచితే- జనులకు నిహపర సాధకమౌను.[2]

అని అన్నమయ్య మరొక సంకీర్తనమున ప్రబోధించినాడు.

భగవంతుని రుచి మరగుటయే క్లేశముగాని అది మరగినచో మరల చిత్తము ఇతర పదార్థముల నాశింపదు. ఈ విషయమునే ప్రహ్లాదు డిట్లు చెప్పినాడు -

మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు ?
నిర్మల మందాకినీ వీచికలఁ దూగు
రాయంచ సనునె తరంగిణులకు ?
లలిత రసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు ?
పూర్ణేందు చంద్రికా స్ఫురితచకోరక
మ్మరుగునే సాంద్ర నీహారములకు ?

అంబు జోదరదివ్య పాదార వింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు ?
వినుత గుణశీల ! మాటలు వేయు నేల ?[3]

(1) గీత., 6-26. (2) అ. సం., 7-117. (3) భాగ., 7-150.

# 73

అవతారిక :- సమస్త విశ్వమును విష్ణుస్వరూపముగా వర్ణించుచున్నాడు -

## నాట

విష్ణుఁ డొక్కఁడే - విశ్వాత్మకుఁడు
వైష్ణవమే స - ర్వంబును. ॥పల్లవి॥

1. పరమేష్ఠి సేయు - బ్రహ్మాండసృష్టియు
హరునిలోని సం - హారశక్తి,
పరగఁగ నింద్రుని - పరిపాలనమును
అరసి చూడ శ్రీ - హరి మహిమ. ॥విష్ణు॥

2. ఇలఁ బంచభూత - ములలో గుణములు
అల నవగ్రహ వి - హారములు,
తలకను కాల - త్రయ ధర్మంబును
అలరఁగ నారా - యణుని మహిమలే. ॥విష్ణు॥

3. అంతటఁ గల మా - యావిలాసములు
పొంతఁ బరమపద - భోగములు,
మంతుకు నెక్కిన - మరి సమస్తమును
ఇంతయు శ్రీ వేంక - టేశు మహిమలే ॥విష్ణు॥

ప॥:- విశ్వాత్మకుఁడు = విశ్వమును స్వరూపముగా గలవాడు.
వైష్ణవమే = విష్ణునికి సంబంధించినదే.

1. పరమేష్ఠి = బ్రహ్మ.
2. పంచభూతములలో = పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనబడు ఐదు భూతములలో; గుణములు = శబ్ద స్పర్శ రూప రస గంధము లనబడు ఐదు గుణములు; కాలత్రయ ధర్మంబు = భూత భవిష్యద్వర్తమానము లనబడు మూడు కాలములయొక్క ధర్మము.
3. మంతుకుఁ = ప్రసిద్ధికి.

భావము :- విష్ణు వొక్కఁడే సమస్త విశ్వస్వరూపుడై యున్నాడు. ఈ చరాచరమైన లోకమంతయు విష్ణునికి సంబంధించినదే కాని ఇతరము గాదు.

బ్రహ్మ చేయు బ్రహ్మాండసృష్టి, శివునిలో గల జగత్తును సంహరించు శక్తి, ఇంద్రునికి గల లోక పరిపాలన సామర్థ్యము ఆలోచింపగా శ్రీహరి మహిమలే.

పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అనెడు ఐదు భూతములలోనున్న గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము అనెడు ఐదు గుణములు; సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహువు, కేతువు అనబడు నవగ్రహములయొక్క క్రమము తప్పని సంచారములు, భూతభవిష్యద్వర్తమానము లనబడు త్రికాలములకు జెందిన ధర్మములు ఆ శ్రీమన్నారాయణుని ప్రభావములే.

లోకములో ఎల్లెడల గల మాయా విలాసములు, ముక్తాత్ములైనవారు శ్రీవైకుంఠమున ననుభవించు నిత్య సుఖానుభూతి, మఱియు ప్రసిద్ధి గాంచిన విశేషము లేవేవి కలవో అవి యన్నియు శ్రీవేంకటేశ్వరుని మహిమలే కాని మఱేమియు గావు.

విశేషాంశములు :- మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥[1]

అని భగద్వచనము. అనగా తనకంటె వేరైనది కొంచెమైనను లేదనియు, సూత్రములో మణులవలె తనయందే సర్వము గుదిగ్రుచ్చబడి యున్నదనియు గీతలో పరమాత్ముడు తెలిపియున్నాడు.

ఒకచో నున్న అగ్నియొక్క వెలుగు నలువైపుల ప్రసరించునట్లు శ్రీమన్నారాయణాఖ్యమైన పరబ్రహ్మయొక్క శక్తియే జగద్రూపముగా విస్తరించి యున్నదని విష్ణుపురాణము చెప్పుచున్నది -

ఏకదేశస్థితస్యాగ్నే ర్జ్యోత్స్నా విస్తారిణీ యథా ।
పరస్య బ్రహ్మణః శక్తి స్తథేద మఖిలం జగత్ ॥[2]

'సర్వం విష్ణుమయం జగత్' అను మాటలోని పరమార్థము గూడ ఇదియే.

మరియు సత్త్వాదిగుణముల నాశ్రయించి బ్రహ్మేంద్ర హరరూపములతో జగత్తును సృజించుట, పాలించుట, హరించుట అను క్రియలను గూడ జగద్రూపుడైన ఆ భగవంతు డొక్కడే నిర్వహించుచున్నాడు -

(1) గీత., 7-7. (2) విష్ణు., 1-22-56.

ఏవమేవ జగత్స్రష్టా జగత్పాతా తథా జగత్ ।
జగద్భక్షయితా దేవః సమస్తస్య జనార్దనః ॥
సృష్టి స్థిత్యన్త్యకాలేషు త్రిధైవం సంప్రవర్తతే ।
గుణప్రకృత్యా పరమం పదం తస్యాగుణం మహత్ ॥[1]

మఱియు జలాది భూతములలో రసాదిరూపమున తానున్నట్లు భగవంతుడే సెలవిచ్చియున్నాడు -

రసో౽హమప్సు కౌన్తేయ ! ప్రభా౽స్మి శశిసూర్యయోః ।
ప్రణవస్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥
పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ॥[2]

మరియు -

కలాకాష్ఠా నిమేషాది దినర్త్వయనహాయ నైః ।
కాలస్వరూపో భగవాన్ అపాపో హరి రవ్యయః ॥[3]

అని పరాశరు డన్నట్లు కలాకాష్ఠాది వివిధ విభాగములతో గూడిన కాల స్వరూపుడుగా నున్నవాడు గూడ ఆ దేవుడే.

ఈ క్రింది భూదేవి వచనములను బట్టి సూర్యాది గ్రహములై తిరుగువాడును, మూర్తములు, అమూర్తములు, దృశ్యములు, అదృశ్యములుగా నున్న సమస్త మాయావిలాసములును శ్రీమన్నారాయణుడే యనుట కెట్టి సందియమును లేదు -

సూర్యాదయో గ్రహాస్తారా నక్షత్రాణ్యఖిలం జగత్ ।
మూర్తామూర్త మదృశ్య ం చ దృశ్యం చ పురుషోత్తమ !
యచ్చోక్తం యచ్చ నైవోక్త్తం మయాత్ర పరమేశ్వర !
తత్సర్వం త్వం నమస్తుభ్యం భూయో భూయో నమో నమః ॥[4]

సర్వత్ర విష్ణుస్వరూపమునే దర్శించిన అన్నమయ్య మరొకచో తన అనుభూతి నిట్లు పాడినాడు -

(1) విష్ణు., 1-22-40,41. (2) గీత., 7-8,9.
(3) విష్ణు., 1-22-79. (4) విష్ణు., 1-4-23, 24.

## శ్రీరాగం

ఇంతటా హరినే కాని - యెందునను గాన నన్ను
కొంత నాకుఁ దెలుపరో - గురువులాల ! ॥ పల్లవి ॥
తనువు హరియే - తలపు హరియే
వీనికి మనికియును - విష్ణుఁడే.
కనుఁగొను చూపులు - కమల నాభుఁడే
యెనసి జీవుని శక్తి - యేడ నేడ నున్నదో. ॥ ఇంత॥

లోకమెల్ల మాధవుడే - లోనెల్లఁ గేశవుఁడే
నాకును కర్మము శ్రీ - వైకుంఠుడే.
చేకొని చైతన్యమెల్ల - శ్రీనారాయణుఁడే
యీకడ నేననువాఁడ - నేడ నుండు వాడనో. ॥ ఇంత॥

వెనకను కృష్ణుఁడే - వెస ముందచ్యుతుఁడే
కొన మొదలు నడుము - గోవిందుఁడే.
ఎనయఁగ శ్రీ వెంక - టేశు మయ మింతాను
అనుగు నా స్వతంత్ర - మది యేడ నున్నదో.[1] ॥ ఇంత ॥

## 74

**అవతారిక :-** పాపకారణమైనదే భగవత్పరమైనచో పుణ్యహేతు వగుననుచున్నాడు -

## దేసాళం

పనిగొన నేరిచితే - పాపమే పుణ్యమౌను
నినుఁ గొలిచే యట్టి - నీ సేవకులకు. ॥ పల్లవి ॥

1. మనసు చంచలమైనా - మరి నిన్నుఁ దలచితే
జనులకు నిహపర - సాధన మౌను,
తనువు హేయమైనా - తగ నిన్నుఁ గొలిచితే
పనివడి యంతలోనే - పవిత్ర మౌను. ॥ పని ॥

---

(1) అ. సం., 7-229.

2. కర్మము బంధకమైనా - కమ్మి నీ సొమ్ము చేసితే
నర్మిలి మోక్షమియ్య - నాధార మౌను,
మర్మము కోరిక యైనా - మహి నీ భక్తి కెక్కితే
ధర్మములకుఁ బరమ - ధర్మము దా నౌను. ॥పని॥

3. జగమెల్లా మాయయైనా - సరినీ కే శరణంటే
పగటున నదే తపః - ఫలమౌను,
అగపడి శ్రీవేంక - టాధిప నన్నేలితివి
మిగుల నిహమైనా - మించి పరమౌను. ॥పని॥

1. హేయము = రోయదగినది.
2. కమ్మి = క్రమ్మి.
3. పగటునఁ = ప్రకటముగా.

భావము :- దేవా ! సర్వేశ్వరుడవైన నిన్ను సదా భజించు నీ సేవకులు సహజముగా దోష భూయిష్ఠములై నింద్యములైన వాటిని గూడ నీకే సమర్పించి, వినియోగింప నేర్చినచో అవి పుణ్యహేతువులుగానే మారిపోవును.

జనుల మనస్సు చంచలమైనదే. ఐనను కొంత నిగ్రహించి నిన్నే తలచువట్లు చేసినచో, అది ఇహమందును, పరమందును ఉత్తమగతికి సాధనము కాగలదు. అట్లే ఈ శరీరము హేయమైనదే. ఐనను దీనిని పూనికతో నీ సేవలోనే వినియోగించినచో ఇదే మిక్కిలి పవిత్రము కాగలదు.

కర్మము సహజముగా బంధించునదే. ఐనను నీకు సమర్పించినచో అదే నీవు మాకు ప్రీతితో మోక్షము నొసగుట కాధారము కాగలదు. అధర్మాచరణకు దారిదీయు ప్రవృత్తిలోని మర్మము కోరికయే. ఐనను నీ భక్తి పరమైనచో అదియే ధర్మములలో నెల్ల ఉత్తమధర్మము కాగలదు.

జగమంతయు నీ మాయా విలాసమే. ఐనను నీకే శరణన్నచో అదే తపఃఫలము కాగలదు. అహా మాయామయమైన జగత్తులోనుండియే శరణాగతి నుపాయముగా అనుష్ఠించువారికి ఈ జగత్తే అన్ని విధముల శ్రేయస్సాధనము కాగలదనుట. శ్రీవేంకటేశ్వరా ! నాకు సాక్షాత్కరించి నన్ను కాపాడితివి. నీ దయకు పాత్రమైతివి గాన దుఃఖ భూయిష్ఠమైన యిహమే నా పట్ల శాశ్వత సుఖప్రదమైన పరముగా పరిణమించుచున్నది.

**విశేషాంశములు :-** సహజముగా దూషితమైన మానవ జన్మమును పవిత్రము గావించుకొను విధానము నీ సంకీర్తనము తేటపఱచుచున్నది.

మనస్సు, శరీరము, కర్మము, కోరిక, జగత్తు అనునవి ప్రకృతిని బట్టి దోష భూయిష్ఠములు. మనస్సు మిక్కిలి చంచలమై ఇంద్రియముల ననుసరించి ప్రవర్తించుచు జీవుని అపమార్గములలోనికి లాగు స్వభావము గల్గియున్నది. కాని అదియే అభ్యాసవైరాగ్యములచే నిగ్రహింపబడి పరమాత్మపరమైనచో ఇహపరములలో శ్రేయస్సాధన మగుచున్నది.

కావుననే తన్ను తన శుద్ధ మనస్సుచే ఉద్ధరించుకొనవలె ననియు, విషయ సక్తమైన మనస్సుచే తన్ను నశింపజేసికొనగూడదనియు, శుద్ధ మనస్సే తనకు బంధువనియు, మలిన మనస్సే శత్రు వనియు గీత చెప్పుచున్నది -

> ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్ ।
> ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః ॥[1]

అట్లే రక్త మాంసాదులచే నిండి మలమూత్ర నిలయమైన శరీరము 'స్థూలం నిన్ద్యమిదం వపుః' అన్నట్లు మిక్కిలి రోయ దగియున్నది. కాని అర్చనము, వందనము మున్నగు భగవద్దాస్యములో వినియోగించినచో అదే పరమపావన మగుచున్నది. ఈ దృష్టితోనే 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనం'[2] అని కాళిదాసు వచించెను.

సకామ కర్మములన్నియు బంధహేతువులే. 'సర్వారంభా హి దోషేణ ధూమే నాగ్ని రివావృతాః '[3] అని గీత పేర్కొన్నట్లు మనమొనర్చు పనులన్నియు దోషదూషితములుగనే ఉన్నవి. కాని నిష్కామ కర్మ భగవత్పరమై ముక్తి నొసంగు చున్నది.

అభ్యాసయోగముచే చిత్తమును భగవదాయత్తము జేయు శక్తిలేనివారు భగవత్పరములైన నిష్కామ కర్మ లొనర్పవలెననియు, తద్ద్వారా మోక్షసిద్ధి చేకూర గలదనియు గీత ప్రకటించుచున్నది -

> అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ ।
> మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి ॥[4]

---

(1) గీత., 6-5. (2) కు. సం., 5-33.
(3) గీత., 18-48. (4) గీత., 12-10.

మరియు కోరికలు భౌతికపదార్థములపై ప్రసరించి మనుజుని అధర్మపతితుని జేయును. భగవంతునిపై ప్రసరించెనేని అవియే ఉత్తమధర్మములై సద్గతి జేకూర్చును.

మాయకు లోనైన జీవు లీ ప్రపంచమున నా నా దుఃఖముల ననుభవించు చున్నారు. కాని భగవంతుని శరణు జొచ్చినవారు మాత్రము మాయను అవలీలగా దాటగలరు. ఇందుకు

'మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే'[1]

అను భగవద్వచనమే ప్రమాణము. ప్రపన్నునకు ప్రపంచమే ప్రపత్త్యనుష్ఠానమునకు క్షేత్రమై తపఃఫలముగా మారుచున్నది. కాన ఐహిక దుఃఖములనుండి విడివడుటకు శరణాగతియే గతి యగుచున్నది.

ఈ విధముగా జీవున కధోగతి చేకూర్చు మనస్సు మున్నగునవి సద్వినియోగ మొనరింపబడినచో భక్తులకు, ప్రపన్నులకు ముక్తి హేతువు లగుచున్నవి గాన ఎల్లరు ఎల్ల విధముల భగవద్భజనపరులు కావలెనని గ్రహింపవలెను.

## 75

**అవతారిక :-** భగవద్భక్తి యొక్కటే ఉత్తమ జాతి లక్షణము. తదితర జాతి భేదము లెల్ల వ్యర్థములే అని చెప్పుచున్నాడు -

### లలిత

విజాతు లన్నియు - వృథా వృథా
అజామిళాదుల - కది యేజాతి ? ॥పల్లవి॥

1. జాతిభేదములు - శరీర గుణములు
జాతి శరీరము - సరితోడనె చెడు,
ఆతుమ పరిశుద్ధం బెప్పుడును - అది నిర్దోషం బనాది
యీతల హరివిజ్ఞానపు దాస్యం - బిది యొక్కటె పో సుజాతి ॥విజా॥

2. హరి యిందరిలో - నంతరాత్ముఁడిదె
ధరణి జాతి భే - దము లెంచిన,

(1) గీత., 7-14.

పరమయోగు లీభావ మష్టమదము - భవనికారమని మానిరి
ధరణిలోనఁ బరతత్త్వజ్ఞానము - ధర్మమూలమే సుజాతి. ॥విజా॥

3. లౌకికవైదిక - లంపటులకు నివి
కైకొను నవశ్య - కర్తవ్యంబులు,
శ్రీకాంతుఁడు శ్రీవేంకటపతి సే - సిన సంపాద మిందరికి
మేకొని యిన్నియు మీరినవారికి - మీ నామమే సుజాతి. ॥విజా॥

ప ॥ :- విజాతులు = విశిష్టములైన జాతులు, లేదా విభిన్న జాతులు.

1. ఆతుమ = ఆత్మ; ~~ఈతల = ఈవలి చోటు.~~
2. అష్ట మదము = ఎనిమిది మదములతో గూడినది.
   అష్ట మదములు - అన్న మదము, అర్థ మదము, స్త్రీ మదము, విద్యా మదము, కుల మదము, రూప మదము, ఉద్యోగ మదము, యౌవన మదము; భవవికారము = సంసారమునకు సంబంధించిన అవమానము.
3. లౌకికవైదికలంపటులకు = లోకసంబంధి, వేదసంబంధి ఐన కార్యములలో మిక్కిలి ఆసక్తులైన వారికి; అవశ్యకర్తవ్యంబులు = తప్పక చేయదగినవి; మేకొని = పూని.

భావము :- విశిష్టములైన (విభిన్నములైన) జాతులన్నియు వ్యర్థములు. వాటి వలన ప్రయోజన మిసుమంతయు లేదు. అజామిళుడు మున్నగు కులభ్రష్టులైనవారి దేమి జాతి ?

జాతులలో గల భేదము లన్నియు నశ్వరమైన శరీరమునకు మాత్రమే సంబంధించిన స్వభావములు. శరీరములు నశించినంతనే అవియు నశించుచున్నవి. కాని ఆత్మ మాత్రము సదా పరిశుద్ధమైనది. అది దోషము లేనిది, మరియు ఆది లేనిది. కాబట్టి దేహభావము వదలి ఆత్మ దృష్టి నలవరచుకొని ఆత్మలోని హరినెఱుంగుటకై చేయు దాస్య మొక్కటే ఉత్తమగతికి హేతువగుచున్నది గాన ఉత్తమ జాతి చిహ్నమనదగియున్నది.

అదిగో ! శ్రీహరి అన్ని జీవులలో అంతరాత్ముడై యున్నాడు. ఆ పరమాత్ముని ధ్యానించు శ్రేష్ఠులైన యోగులు లోకములో జాతిభేదములను ప్రధానముగా పాటించుభావము అన్న మదము, అర్థ మదము మున్నగు అష్ట మదములతో గూడిన దనియు, మాయామయమైన సంసారమునకు సంబంధించిన తిరస్కారభావమనియు నిశ్చయించి జాతిభేదదృష్టిని విడనాడిరి. కావున పరతత్త్వము

నెఱుంగుట, అందు కవసరమైన ధర్మములను పాటించుట మాత్రమే ఉత్తమజాతిలక్షణ మగును.

లౌకిక కార్యములలోను, వైదికాచారములలోను తలమునుకలై తపించువారికి మాత్రమే పై జాతిభేదములు తప్పక పాటింపదగినవై యున్నవి. ఇవి యన్నియు లక్ష్మీకాంతుడైన శ్రీవేంకటేశ్వరుడు తన మాయాప్రభావముచే జీవులకు చేకూర్చి పెట్టిన సంపదలు. దేవా ! యత్నపూర్వకముగా లౌకికవైదిక కర్మకాండల నతిక్రమించి మాయను దాటి సదా మిమ్ము ధ్యానించువారికి మీ నామసంకీర్తనము మొక్కటే సుజాతి లక్షణము.

**విశేషాంశములు :-** ఉత్తమజాతిలో జననమొందుటే మోక్షహేతువని వివేక హీనులు తలంతురు. ఏ జాతిలో బుట్టినను భగవద్భక్తిహీనుడు ముక్తి నొందలేడు. పైగా జాత్యహంకార మనేక విధముల దుర్మదములకు హేతువై పతనమునకే దారి దీయుచున్నది. కాన విభిన్న జాతులను గల్పించి అందు విశిష్టజాతులలో జన్మించుటచేతనే ధన్యుల మైతిమని తలంచుట తగదనియు, భగవద్భజనమొక్కటే ఉత్తమజాతిలక్షణమనియు పదకవితాపితామహు డీసంకీర్తనములో స్పష్టము చేయుచున్నాడు.

అజామిళుడు జాతిచే బ్రాహ్మణుడైనను ''పాతకుం డతులనిర్భాగ్యుం డవ జ్ఞుండు నష్టసదాచారి కష్టరతుడు''[1] అని భాగవతమున వర్ణించినట్లు మిక్కిలి దుర్వృత్తి గలిగి భ్రష్టుడయ్యెను. ఐనను -

> 'అరయ పుత్రోపచారితమైన విష్ణునామ మవసాన కాలంబునను భజించి
> శార్ఙ్గి నిలయంబు జేరె నజామిళుండు నిట్లు సద్భక్తి గలిగిన నేమి సెప్ప'[2]

అన్నట్లు అతడవసానకాలమున నారాయణనాముడగు పుత్రునిపేరు నుడివినంత మాత్రమున సద్గతి నొందెను. అతని ముక్తికి హేతువైనది భగవన్నామ సంకీర్తనమే కాని జాతివైశిష్ట్యముగాదు. కాన కేవలజాతి కెట్టి ప్రాధాన్యము లేదనుట స్పష్టము.

మరియు జాతిభేదములు శరీరముతో ముడివడియున్నవి. దేహములు శాశ్వతములు గావు. కావున జాతిభేదములు గూడ అశాశ్వతములే. అందుచే అవి వ్యర్థములు.

---

(1) భాగ., 6-60. (2) భాగ., 6-58.

మరియు ఆద్యంతరూపములైన జనన మరణములతో గూడిన శరీరములు రక్తమాంసాదులైన అపరిశుద్ధ పదార్థములచే నిర్మింపబడినవి కాన క్షయభూయిష్ఠములు. ఆత్మ అట్టిది కాదు.

**ఆత్మా శుద్ధోఽక్షరః శాన్తో నిర్గుణః ప్రకృతేః పరః ।**
**ప్రవృద్ధ్యపచయౌ నాస్య ఏకస్యాఖిలజన్తుషు ॥**[1]

అను ప్రమాణము ననుసరించి ఆత్మ శుద్ధమైనది, నాశములేనిది, శాన్తమైనది. నిర్గుణమైనది, ప్రకృతి కతీతమైనది. సమస్త జీవులలో ఏకరూపమున నున్న ఆత్మకు హానివృద్ధులు లేవు.

సమస్త జీవులలో అంతరాత్మగానున్న పరబ్రహ్మమును 'నిర్దోషం హి సమం బ్రహ్మ'[2] అని దోష రహితమై సమమై యున్నదానినిగా గీత నిరూపించినది. సర్వ సమదర్శనులైన మహాత్ములు దేహబుద్ధి కలిగియుండరు. వారు సర్వత్ర బ్రహ్మమునే దర్శింతురు గాని జాతిభేదములను చూడరు.

జాతి భేదదృష్టిగల భావము అనేకములైన దురహంకారములకు మూల మగుచున్నది. ఇది యంతయు మాయామయమైన సంసారముచే గల్గిన దోష విశేషమని తలచి యోగీశ్వరులు జాతిభేదదృష్టిని విడనాడిరి. కాన ఎవరు తత్త్వజ్ఞులో, ఎవరు భాగవత ధర్మమును పాటింతురో, వారు మాత్రమే మానవజాతిలో ఉత్తమశ్రేణికి చెందినవారు.

మాయను గడవలేనివారు లౌకిక వైదిక లంపటు లగుచున్నారు. జాతిభేదములకు చెందిన పట్టింపులు వారికి మాత్రమే చెందును.

మాయను దాటి బ్రహ్మపదమున ప్రవేశించి సదా గోవిందనామస్మరణ మొనర్చు మహాత్ములే ఉత్తమశ్రేణికి చెందినవారు.

అందువలననే 'భగవద్భక్తుల విషయమున - జాతి, విద్య, కులము, ధనము, క్రియ మున్నగు భేదములు లేవు. వారు భగవంతునికి చెందినవారు' అని నారదుడు నుడివెను -

**నాస్తి తేషు జాతి విద్యా రూప కుల ధన క్రియాది భేదః ।**
**యతస్తదీయాః ॥**[3]

---

(1) విష్ణు., 2-13-71. (2) గీత., 5-19. (3) నా. భ. సూ., 72, 73.

మఱియు 'కుక్కమాంసము దినువాడైనను విష్ణుభక్తుడగువాడు ద్విజునికంటె శ్రేష్ఠుడు. విష్ణుభక్తి లేనివాడు యతియైనను చండాలుని కంటె అధముడే' యని పెద్ద లనిరి -

**శ్వపచోఽపి మహీపాల విష్ణుభక్తో ద్విజాధికః ।**
**విష్ణుభక్తి విహీనస్తు యతిశ్చ శ్వపచాధమః ॥**

హరిదాసు లెచట బుట్టినను పూజనీయులే అను తత్త్వార్థము ననేక దృష్టాంతములతో సమర్థించు మరొక సంకీర్తన మిది -

## శ్రీరాగం

తలమేల కులమేల - తపమే కారణము
యెలమి హరిదాసులు - యేజాతియైన నేమి ? ॥ పల్లవి ॥

కాకమువల్లఁ బుట్టదా - ఘనమైన యశ్వత్థము
దాకొని గుల్లలోఁ బుట్ట - దా ముత్తెము
చేకొన విషలతనె - జన్మించదా నిర్విషము
యే కడ మహానుభావు - లెందు పుట్టిరేమి ? ॥ తల ॥

చిడిపిరాళ్లఁ బుట్టవా - చెలువైన వజ్రములు
పుడమి నీగల వల్లఁ - బుట్టదా తేనె
వెడఁగు బిల్లి మేనను - వెళ్ళదాయనా జవ్వాది
వుడి వోని పుణ్యు లెందు - నుదయించి రేమి ? ॥ తల ॥

పంకములోఁ బుట్టదా - పరిమళపు దామెర
పొంకపుఁ గీటములందు - పుట్టదా పట్టు
కొంకక శ్రీవేంకటేశుఁ - గొలిచిన దాసులు
సంకె లేని జ్ఞాను లెందు - జనియించి రేమి ? ॥ తల ॥

ప్రథమ భాగం సమాప్తం
శ్రీ సద్గురు పరబ్రహ్మార్పణ మస్తు

**ఓమ్ తత్ సత్ ఓమ్.**

❀ ❀ ❀

# ప్రస్తావన

శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు,
స్పెషల్ ఆఫీసర్,

తాళ్ళపాక వాఙ్మయ పరిష్కరణశాఖ.
తి. తి. దేవస్థానములు, తిరుపతి.

---

వేంకటేశ పరబ్రహ్మ రసతుందిలమానసమ్ ।
అధ్యాత్మవిద్యా మర్మజ్ఞ మన్నమార్యం నమా మ్యహమ్ ॥

పదసాహిత్యమునకు అన్నమాచార్యులు మొదటి సృష్టికర్త యని లోకమంతయు వాడుకొనుచున్నది. నాకు చూడగ ఈ పద సాహిత్యము వేదవిద్యతోపాటు అనాదిగా ఉన్నదనియే. ఎన్ని వేద మంత్రములతో ఎంత గొప్ప యజ్ఞము చేసినను అగ్నిదేవుని ఉద్వాసన చేయుటకు ముందు సుమంగలులు తమ మంగళహారతిని వినిపించిననే గాని యజ్ఞము పూర్తిగాదు.

"అగ్నిదేవునకు హారతిదే
యజ్ఞేశ్వరునకు హారతిదే.
పవలును రాత్రియు భవమున ముక్తివి
పవిగా దోచెడి సర్వేశ్వరునకు
అగ్నిదేవునకు హారతిదే
యజ్ఞేశ్వరునకు హారతిదే."

అట్లే వివాహాదితంత్రములు ఎంతవైదికముగ నడచినను తుదలో 'గౌరీకల్యాణవైభవమే' అను మంగళగీతిక లేనిదే పూర్ణములు కావు. కావున ఈ పదసాహిత్యము వేదకాలమునుండియే ఆ నోట ఆ నోట అట్లా అట్లా వ్యాప్తి చెందుతూ వచ్చినది. తుదకు రామాయ

ణములోని కొన్ని ఘట్టములకు లక్ష్మణ మూర్ఛ, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిళనిద్ర, అట్లే మార్కండేయ చరిత్ర మొదలైన పెద్దపెద్ద పాటలును అనాదిగనే ఉన్నట్లు తెలియవచ్చుచున్నది.

మరి ఈ అన్నమాచార్యుల కీర్తనలకు ఇంత ప్రశస్తి, ఇంత పెద్ద వ్యాఖ్యా ఎందు కవసరమైనట్లు? అన్ని పదాలలో ఇవి కొన్ని అని అడిగేవా రుండక పోరు.

"శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
అతిలోకాగమవీథులై వివిధ మంత్రార్థంబులై నీతులై,
కృతులై వేంకటశైల వల్లభ రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళులపాక అన్నయ వచోనూత్నక్రియల్ చెన్నగున్."

అనిన మహత్త్వము మిగత పదముల కున్నదా? 'సకలవేదములను సంకీర్తనలు చేసి' అన్న ఘనత మరి ఏ సంకీర్తనరాశికైన కలదా! సూర్యునికి గ్రహణమువలె ఈ అనంతపద తేజోరాశికి కొన్ని శతాబ్దముల పాటు వేంకటేశ్వరుని గుడిలో ఒక అరలో దాగియుండవలసిన దుర్దైవమహిమ తప్పితే, ఈ పదరాశి క్రింద ఎంతమంది ప్రబంధకర్తలు, ఎంతమంది గాయకులు, ఎంత పదసాహిత్యము చేతులు జోడించుకొనవలసినదో మనము తేల్చిచెప్పవచ్చు. దాదాపు అరువదియేండ్ల కాలముగా ఈ వాఙ్మయము వెలుగు చూచినది మొదలు దీనిపై సహృదయలోకమున కంతటికి, గాయకలోకమున కంతటికి ఎక్కడలేని ప్రీతి పొర్లుకొని వచ్చినది.

ఈ అన్నమయ్య పదసాహిత్యము, పైకి తేటగా లోపల దిగితే భావ పరంపరలతో లోతుగా కనుపట్టుట దీని సహజస్వభావము. అన్నమయ్య ఉద్దేశము కూడ సామాన్య ప్రజలకు భగవత్తత్త్వమును సులభముగ అందీయవలె ననియే. అందులకే ఆయన వేదములలోని సార మంతటిని తేట తెనుగు పదములతో నింపి బోధించుచు వచ్చినాడు.

ఆయన మహాతపస్వి కాబట్టి ఆ పాటలను అర్థము తెలిసి పాడినా, తెలియక పాడినా "ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్" అన్న కోవకు చెందినవై పురుషార్థసిద్ధిని కలిగించుచున్నవి.

సాధారణముగా మహాభారతాది గ్రంథములే కూడ పరతత్త్వమును బోధించునపుడు, చెప్పిన విషయమునే భంగ్యంతరముగ పలుమారు చెప్పుచుండుట సహజము. "న హి సకృన్నిపాతమాత్రేణ ఉదబిందురపి గ్రావణి నిమ్నతా మాదధాతి" అను రీతిని, దుర్బోధమైన అధ్యాత్మవిద్య మనకోటి మూఢసంసారులకు ఎన్నివిధములుగ ఎన్నిసారులు వివరించిచెప్పినా బోధపడుట కష్టము. శ్రుతిస్మృతులను వ్యాఖ్యానించిన పెద్దలే—

"శ్రుతిశ్చ భిన్నా స్మృతయశ్చ భిన్నా
మహామునీనాం మతయోఽపి భిన్నాః।
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గతస్స పంథాః॥"

అని సెలవిచ్చినారు.

మన అన్నమాచార్యులు విష్ణునామకయతిచే—

"తాపః పుండ్ర స్తథా నామ మంత్రోయాగశ్చ పంచమః।
అమీ పంచసంస్కారాః పారమైకాంత్య హేతవః॥"

అను శ్రీవైష్ణవదీక్షా పంచసంస్కారములను పొంది, అహోబలమునందున్న ఆదివణ్ శఠకోపయతిచే విశిష్టాద్వైత వేదాంతమును, దివ్యప్రబంధములను అధ్యయనము చేసి, బసవడు, పాల్కురికి సోమనాథుడు మొదలగువారు తమ శైవమత వ్యాప్తికి సామాన్య జనులకు అనువైన వచనములు, ద్విపదలలో ప్రబోధము కావించినట్లు, అంతకంటె కూడ సులభముగా, రాగరక్తితో మైమరచిపాడే పదములతో విష్ణుభక్తి లోకమునకు చాటదలచి ఈ పదవాఙ్మయమును ఎన్నుకొన్నారు. ఈయన కుమారుడు పెద తిరుమలాచార్యులు వచనములతో కూడ

పదవాఙ్మయమును పోషించినాడు. ఈయన మనుమడు చిన తిరుమలాచార్యులు పదములతో, దండకము మొదలైనవానితో కూడ విష్ణుభక్తినే చాటినాడు. ఈయన మరియొక మనుమడు చిన తిరువేంగళనాథుడు (చిన్నన్న) ఎక్కువభాగము ద్విపదలతోనే హరిభక్తి మయములైన కావ్యములను రచించినాడు.

వీరశైవ వాఙ్మయమునకు ఎదురొడ్డి నిలిచిన శ్రీ వైష్ణవ వాఙ్మయము ఆంధ్రమునందు ఇంతకంటె పెద్దదేదియును కనపడదు. ఈ కీర్తనలకు సరియైన వ్యాఖ్యాత శ్రీ సముద్రాల లక్ష్మణయ్యయే.

దేవస్థానమువారి యాజమాన్యము క్రింద ఒక్కొక్కవారము సంగీత కళాశాలలోని గాయకులు ఒక్కొక్కరు, కొన్ని పాటలను ఎన్నుకొని గానముచేయుట, వానిని ఆ సభలో భావ ప్రధానముగ వ్యాఖ్యానించుట, ఆ వ్యాఖ్యానములను సప్తగిరి పత్రికలో ప్రకటించుట అను కార్యము కొన్నాళ్లు సాగినది. తరువాత 1976 లో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల సాహిత్య విభాగమునుండి శ్రీ లక్ష్మణయ్యను ఈ వ్యాఖ్యానమునకుగాను నియమించినారు. నా పరిష్కరణకార్యము, శ్రీ లక్ష్మణయ్య వ్యాఖ్యాకార్యము ఒకే టేబిలుకు ఈవల, ఆవల జరుగుచుండెడివి. "సకలవేదములు సంకీర్తనలు చేసి" అనిన అన్నమయ్య కీర్తనలకు ఏ యే పాటలో ఏయే శ్రుతి, ఏయే ఉపనిషత్తు, ఏయే గీత, మరి ఇతర భాగవతాదులు చొప్పింపబడినవో వాని నన్నింటిని సప్రమాణముగ, ఆయా శ్రుతి - ఉపనిషత్తు - గీతాదులను ఉద్ధరించుచు వ్యాఖ్యానము చేయుట సామాన్యమైన పనికాదు.

మన ఆంధ్రదేశమునకు ఒక పెద్ద దురదృష్టము ముంచుకొని వచ్చినది. అది ఏమిటంటే షట్ఛాస్త్ర పండితుడైనా, బహు వ్యాఖ్యానములు చేయగలిగినవాడైనా, శ్రుతి స్మృతి పురాణములందు ఎంత గట్టివాడైనా అటంతా మన ఆంధ్రదేశమునందు లెక్కకేరాదు. అట్టి వారిని పండితులుగా గ్రహించుట కూడ మన ఆంధ్రలోకమున అపు

రూపమే. చచ్చుపుచ్చు పదములతో నాలుగు పద్యములు వ్రాసినా డంటే వాడే సర్వజ్ఞుడు. వాడే మహాకవి. సంస్కృతమున ఇట్లు లేదు. కాళిదాసాదులకెంత పేరున్నదో, వారి వ్యాఖ్యాతలగు మల్లినాథాదు లకూ అంత పేరున్నది. వ్యాఖ్యాతలకు గొప్ప పేరు సంస్కృత వాఙ్మ యమున సుప్రసిద్ధము. సౌందర్యలహరీ వ్యాఖ్యాత యగు లొల్ల లక్ష్మీ ధరుడు తనను గురించి చెప్పుకొనిన పద్యమిది—

"వయ మిహ పదవిద్యాం తంత్ర మాన్వీక్షకీం వా
యది పథి విపథే వా వర్తయామ స్స పంథాః।
ఉదయతి దిశి యస్యాం భానుమాన్ సైవ పూర్వా
నహి తరణి రుదీతే దిక్పరాధీన వృత్తిః॥"

దీనితో సంస్కృత వ్యాఖ్యాతల స్థానము స్పష్టమగుచున్నది.

"వాణీం కాణభుజీ మజీగణ దవాశాసీచ్చ వైయాసికీ
మంత స్తంత్ర మరంస్త పన్నగ గవీ గుంఫేషు చాజాగరీత్।
వాచా మాచకల ద్రహస్య మఖిలం యశ్చాక్ష పాదస్ఫురాం
లోకే ఒభూద్యదుపజ్ఞమేవ విదుషాం సౌజన్యజన్యం యశః॥"

అనిన మల్లినాథుని మాట వ్యాఖ్యాత కెంత పరిజ్ఞాన మవసరమో, వాని వలన లోకమున కెంత మేలో తెల్పుచున్నది.

"కవితారస మాధుర్యం వ్యాఖ్యాతా వేత్తి నో కవిః।
సుతాసురత మాధుర్యం జామాతా వేత్తి నో పితా॥"

అను వాక్యము కవికంటె వ్యాఖ్యాతనే పై కెత్తిపెట్టినది.

శ్రీ లక్ష్మణయ్య చదివినది సాహిత్యశిరోమణియైనా, సాధించి నది శ్రీ శ్రీ మలయాళయతీంద్రులతో వేదాంతవిద్య. దానికి సంబం ధించిన శ్రుతి స్మృతి పురాణేతిహాస వాక్యములు తన స్వతంత్రకృషితో బాగా పెంచుకొన్నాడు. ఈ ఇంత సామగ్రి అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తనల వ్యాఖ్యానమునకు సూటిగా ఉపయోగపడినది. గమనింపుడు మొదటి పాటలోనే—

"బ్రహ్మ మొకటే పర - బ్రహ్మమొకటే పర
బ్రహ్మ మొకటే పర - బ్రహ్మ మొకటే."

ఈ రెండు చరణములలో 'పరబ్రహ్మమొకటే, పరబ్రహ్మ మొకటే' అన్నారు. కాని పరబ్రహ్మమునకును, ఇతర జగత్తునకును కల భేదము తెలిసిననే కాని మనము పరబ్రహ్మ నారాధింపలేము. అందుకని వ్యాఖ్యాత 'భావము' అను శీర్షిక క్రింద "భిన్న భిన్న స్వరూప స్వభావములతో సదా పరిణామము చెందుచున్న ఈ విశ్వము నందు ఎట్టి మార్పులేక శాశ్వతమైయున్నది బ్రహ్మమొక్కటే" అని వివరించినాడు. దీనితో పరబ్రహ్మమునకు, మిగత జగత్తునకును భేదము స్పష్టముగా తెలిసినది.

"కందువగు హీనాధికము - లిందులేవు
అందరికి శ్రీహరే - అంతరాత్మ.
ఇందులో జంతుకుల - మింతా నొకటే
అందరికి శ్రీహరే - అంతరాత్మ."

ఈ విషయమునకు తగిన శ్రుతి వాక్యములను, భగవద్గీతను ఉదాహరించుట ఎంతైన ప్రశంసనీయము. అట్లే రెండవపాటలో—

'దైవమొక్కటేగాని దానికి పలువురు మతస్థులు పలు రూపములు కల్పించుచుందురు' అనుటను "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అను శ్రుతివాక్యముతోను, తరువాత ఛాందోగ్యోపనిషత్తు, భగవద్గీత, శివస్తోత్రము మొదలైన అనేక ఉపపత్తులతో సమన్వయించుచే కాక ఈ పాట భావమునే పోలిన మరియొక పాటను గూడ—

"బ్రువంతి బౌద్ధా - బుద్ధ ఇతి
స్తువంతి భక్తా - స్సులభ ఇతి."

ఇత్యాదిగా ఉదాహరించుచు, వ్యాఖ్యానించుట విడి విడిగానున్న సేమ్యాలు, చక్కెర, ముంతమామిడిపప్పు, ద్రాక్ష, పాలు వగైరాలను ఒక్కటిగా చేసి పాయసముగా వండి వడ్డించుటయే అగుచున్నది.

ఇక, అన్నమయ్య చాల లోకజ్ఞుడు. తన సమకాలిక ప్రపంచ మును, దానిలో నున్న మంచి చెడ్డలను, ప్రజలు ఎట్లు పరమాత్మ తత్త్వమునుండి జారిపోతున్నారో, వాండ్లకు చక్కని ఉపమానము లతో విషయమును బోధించి వారిని తత్త్వోన్ముఖులను చేయుట ఆయనకు వెన్నతో పెట్టిన పని. 21 వ పాట గమనింపుడు. ఈ ప్రపంచ మంతా ఒక సంత బేరము వంటిదట! పుణ్యాపాపాలు అనే రొక్కములు ఖర్చుచేసి, జననాలు, మరణాలు, సంసారభోగాలు వగైరాలను కొన వచ్చునట! మామూలుగా సంతలలో చింతచెట్లక్రింద అంగళ్లుపెట్టుట ఈ రాయలసీమలో సహజము. స్త్రీలు వలపులు అనే అంగళ్ళు పెట్టి నారట, తమ వయసులు అనే చింతచెట్లక్రింద.

ఎంత పెద్ద వేదాంతమునైనా తేట తెలుగు పదములతో అరటి పండు ఒలిచి చేతి కందించినట్లు వర్ణించడము అన్నమయ్యకు ఉగ్గుబాల విద్య. 29 వ పాట గమనింపుడు. దీనికి వ్యాఖ్యాత చక్కని వ్యాఖ్యా నముచేసి భగవద్గీతను, నన్నెచోడుని కుమారసంభవమును ఉదాహ రించుచు ఈ పాటభావమునే కలిగిన మరియొకపాటను ఉదాహరించి నాడు.

30 వ పాటలో అన్నమయ్య సంసారమును చాల నీచముగ ఈసడించుకొన్నాడు. శరీరమును 'తోలుబొంత అని, తాను 'పంచ భూతపు చుట్టాల బతుకులో వాడననీ' 'నెత్తురు జలదుర్గాన నిలిచిన వాడననీ వర్ణించినాడు. దానికి వ్యాఖ్యాత చాల చక్కని పద్యమును—

"అమేధ్యపూర్ణం క్రిమిజాల సంకులం
స్వభావ దుర్గంధ మశౌచ మధ్రువమ్ ।
కళేబరం మూత్ర పురీషభాజనం
రమంతి మూఢా న రమంతి పండితాః ॥"

అని ఉదాహరించి కవి చెప్పినదానికంటె శరీరముపై మరింత ఏహ్య భావమును కలిగించినాడు.

40 వ పాట నిజముగా వ్యాఖ్యాత పాండిత్యాన్ని పట్టిచూపేది. అన్నమయ్యకు అక్కడక్కడా పాటలలో దశావతారాలు సంజ్ఞ కొనుట అలవాటు. అవి కొన్ని పట్టుల సుగ్రహములుకావు. ఈ పాటలో కూడ అట్టులే. సంసారియైనవాడు సాధుజీవితమును ఎట్లు గడపవలెను? అను విషయమును "వినయముతో విద్య నభ్యసించుట, అప్పులపాలు కాకుండుట, భూమికి బరువైన జీవితము గడపకుండుట, కోపము వీడుట, యాచనావృత్తి లేకుండుట, జీవులను హింసింప కుండుట, ఇడుములకు లోనుగాకుండుట, ఇతరులను నొప్పించి వారిచే దూషింపబడకుండుట, పరస్త్రీల ననమానింపకుండుట, అపమార్గమున బడకుండుట" అను పది ధర్మములను చెప్పినాడు. దీనిలో ఈ పదింటితో దశావతారములకు వ్యాఖ్యాతయే చక్కని సంబంధమును కల్పించినాడు. చదువరులు ఆస్వాదింపగలరు.

అట్టులే 43 వ పాటలో 'ఒక మౌని', 'నెరవేరె నొకడు', 'భోగియాయ నొకడు' ఇత్యాదులు అన్నింటికి నారదుడు, ఘంటాకర్ణుడు, కుచేలుడు మొదలగువారిని సప్రమాణముగ ఉదాహరించుట సాధారణులకు చాలని పని.

సహజముగ వాదములు మూడు విధములు :— 1. ప్రమాణ వాదమని, 2. యుక్తివాదమని, 2. వితండావాదమని. ప్రమాణ వాద మనగా తాను చెప్పిన, లేక తాను వ్యాఖ్యానించిన విషయమునకు ప్రమాణముగా వేదమునో, స్మృతులనో, పురాణేతి హాసములనో ఉదాహరించుట. దీని వలన తాను చెప్పిన మాట సనాతన మని తేలుచున్నది. ఇదియే పెద్దలందరు ఆచరించిన పని. రెండవది ఏ తత్త్వమునుగాని-యుక్తులతో నిర్ణయించలేము. ఈ రోజు నా యుక్తి నీకంటె పైన అయితే నాదే గెలుపు. రేపు నీ యుక్తి నా కంటె పైన అయితే నీదే గెలుపు. దీనికి ఒక వ్యవస్థ ఉండదు. అందువలన ఇది అంత ప్రామాణికము గాదు. ఈ వాదమే బౌద్ధాదిమతములకు ఆధారము. మూడవది వితండావాదము. ఎదుటివారు చెప్పే ప్రమాణ

మును గాని, యుక్తిని గాని పట్టించుకొనక 'తాను పట్టిన కుందేటికి మూడే కాళ్లు' అన్నట్లు లోకవిరుద్ధముగ, శాస్త్రవిరుద్ధముగ వాదించుట వితండావాదము. ఇదియే నాస్తికుల కాధారము.

మన అన్నమయ్య మొదటి వాదమునకు చెందినవాడే. గమనింపుడు. 50 వ పాట మొదటి చరణములో "ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావృత్తి" అని, రెండవ చరణములో "మాముపేత్యతు కౌన్తేయ! మహిని నటనఁ బునర్జన్మ న విద్యతే" అని, మూడవ చరణములో "మన్మనా భవ" అని భగవద్గీత నుదాహరించుట దీనికి తార్కాణము. అన్నమయ్య పలుతావుల ఇట్టులే శ్రుతిస్మృతి పురాణములను ఉదాహరించినాడు. అందుకనియే మన వ్యాఖ్యాత కూడ అన్నమయ్య పాటల వ్యాఖ్యానములో ఆ శ్రుతిస్మృతి పురాణాదులను కోకొల్లలుగా చూపించినాడు. ఇది అతని పాండిత్యమునకు నికషోపలము.

ఇంతటితో వట్టి వ్యాఖ్యాత మాత్రమే కాదు మన లక్ష్మణయ్య, చక్కని కవి కూడ. ఈతని 'అమరవాణి', 'శ్రీ మలయాళ సద్గురు స్తుతి' మొదలగునవి ఇందుకు తార్కాణములు,

ఇట్లే ఉదాహరిస్తూ పోతే గ్రంథమంతా మరలా ఎత్తి వ్రాయవలసి వచ్చును. కావున స్థాలీపులాకముగ ఉదాహరించితి నింతే.

ఈతని బుద్ధికుశలతను విద్యార్థిదశనుండి నే నెరుగుదును.

"గుణదోషౌ బుధో గృహ్ణ న్నిందుక్ష్వేళా వివేశ్వరః ।
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి ॥"

అను రీతి ఉత్తమజీవనము సాగించువారిలో ఈత డొకడు.

ఇట్లు సప్రమాణమైన వ్యాఖ్యానము, ఏ మాత్ర మక్షరాస్యుడైనను చదువుకొని ఆనందించు రీతి రచించిన వ్యాఖ్యాతకు నా దండి మంగళాశాసనములు.

తిరుపతి,
30-9-1983

—గౌ॥ రామసుబ్బశర్మ.

# సంకీర్తనల అకారాది సూచిక

## ద్వితీయ భాగము

ఓమ్

శ్రీ వేంకటేశ్వర పరబ్రహ్మణే నమః

# అన్నమాచార్య సంకీర్తనామృతము

## ద్వితీయ భాగము

---

పద్మావతీ హృదంభోజ భాస్కరం భక్తరక్షకమ్ ।
శేషాద్రి నిలయం దేవం వందే శ్రీ వేంకటేశ్వరమ్ ॥

సకలవేదములను సంకీర్తనములుగా
సంఘటించి హరిని సన్నుతించి
ముక్తిఁ జూఱగొన్న మునివర్యు నన్నమా
చార్యు భక్తితోడ సంస్మరింతు.

అలఘు తపః కలితుఁడు భ
క్తులపాలిటి కల్పతరువు గుణనిధి ధర్మో
జ్జ్వల చరితుఁడైన శ్రీమ
న్మలయాళ యతీశ్వరుండు మముఁ గృపఁజూచున్.

### 1

అవతారిక:- 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అను శ్రుతి ననుసరించి ఉన్నది ఒకే పరబ్రహ్మమనుటను మన నిత్యానుభవములతో పోల్చి నిరూపించుచున్నాడు.

బౌళి

తందనాన ఆహి - తందనాన పురే
తందనాన భళా - తందనాన. ॥పల్లవి॥

1. బ్రహ్మమొకటే పర - బ్రహ్మమొకటే పర
బ్రహ్మమొకటే పర - బ్రహ్మమొకటే. ॥తంద॥

2. కందువగు హీనాధికము - లిందులేవు
అందరికి శ్రీహరే - అంతరాత్మ.
ఇందులో జంతుకుల - మింతా నొకటే
అందరికి శ్రీహరే - అంతరాత్మ. ॥తంద॥

3. నిండార రాజు నిద్రించు - నిద్రయు నొకటే
అండనే బంటునిద్ర - అదియు నొకటే,
మెండైన బ్రాహ్మణుఁడు - మెట్టుభూమి యొకటే
చండాలుఁ డుండేటి - సరిభూమి యొకటే. ॥తంద॥

4. అనుఁగు దేవతలకును - అలకామ సుఖమొకటే
ఘనకీట పశువులకు - కామసుఖ మొకటే,
దిన మహోరాత్రములు - తెగి ధనాఢ్యున కొకటే
వొనర నిరుపేదకును - వొక్కటే అవియు. ॥తంద॥

5. కొరలి శిష్టాన్నములు - గొను నాఁక లొకటే
తిరుగు[*] దుష్టాన్నములు - తిను నాఁక లొకటే,
పరగు దుర్గంధముల - పై వాయు వొకటే
వరుసఁ బరిమళముపై - వాయు వొకటే. ॥తంద॥

6. కడఁగి యేనుఁగు మీఁద - గాయు యెండొకటే
పుడమి శునకము మీఁదఁ - బొలయు నెండొకటే,
కడుఁ బుణ్యులను పాప - కర్ములను సరిగావ
జడియు శ్రీ వేంకటే - శ్వరు నామ మొకటే. ॥తంద॥

ప॥ 1 తందనాన — ఇది గానసమయమున మాటిమాటికి లయను చూపుచు చేయు రాగాలాపధ్వని. 'ఆహి, పురే, భళా' అనునవి ఆశ్చర్యప్రశంసార్థకములు.

---

1. పల్లవిలోని కఠినపదముల కర్థములు. ప. అను గుర్తుతోను, ఒక్కొక చరణములలోని కఠినపదముల కర్థములు. "1; 2; 3" ఇత్యాది చరణముల సంఖ్యతోను సూచింపబడినవి.

2. కందువగు = తెగలుగానున్న; హీనాధికములు = హెచ్చుతక్కువలు.

3. మెట్టు = త్రొక్కు.

4. అహోరాత్రములు = పగలు, రేయి.

6. జడియు = ప్రకటమగు.

భావము:- భిన్నభిన్న స్వరూపస్వభావములతో సదా పరిణామము చెందుచున్న ఈ విశ్వమునందు ఎట్టి మార్పులేక శాశ్వతమైయున్నది బ్రహ్మమొక్కటే. సమ్మాటికి సర్వస్వమైన ఆ పరబ్రహ్మమొక్కటే ఉన్నదిగాని వేఱెద్దియు లేదు.

అంతయు బ్రహ్మమయమైన ఈసృష్టిలో తెగలు తెగలుగా విడదీసి చూపుట కనువైన హెచ్చు తక్కువ లెవ్వియు లేవు. అందరికిని అంతరాత్మ శ్రీహరియే. అందుచే జగత్తులోని ప్రాణివర్గమెల్ల ఒకటేగాని భేద మిసుమంతయు లేదు. జంతుజాలము లన్నింటికి శ్రీహరి యొక్కడే అంతరాత్మగా నున్నాడు.

ఒక భూపాలుడు హంసతూలికాతల్పముపై నిద్రించును. ఆ చెంతనే అంటని భటుడు కటికనేలపై నిద్రించును. శయనములలో భేదమున్నను వారిరువురు నిండుగా నిద్రించు నిద్రలో మాత్ర మెట్టి వ్యత్యాసము లేదు.

వేదశాస్త్ర పారంగతుడైన విప్రు డొకడు, చెప్పులు కుట్టి జీవించు చండాలు డింకొకడు. విద్యావృత్తులయందు వారిరువురికి వ్యత్యాసమున్నను నిలుచుట కాధారమైన నేలమాత్ర మొక్కటే!

అన్యోన్యానురాగముగల దేవతాదంపతులు కామ సుఖ మనుభవించుచున్నారు. కీటకములు పశువులుగూడ ఆ సుఖము ననుభవించుచునే యున్నవి. ఈ యిరుతెగల ప్రాణుల జన్మములలో తేడా యున్నను వారనుభవించు కామ సుఖములో మాత్ర మెట్టి తేడా లేదు.

ఒకడు అష్టైశ్వర్య సంపన్నుడైన ధనికుడు. మరొకడు కూటికిలేని నిరుపేద. కాని ఈ యిరువురికిని చేపపళ్ళ పరివర్తనము, పరిమాణము ఒకేతీరుగా నున్నవి.

గౌరవసంపన్నుడైన ఒకడు షడ్రసోపేతములైన శిష్టాన్నములు తృప్తిగా తినుచున్నాడు. దీనుడైన మరొకడు ఎవరి ఎంగిలి మెతుకులకో కాచుకొని కాచుకొని ఆ ఉచ్ఛిష్టముతో పొట్ట పోషికొనుచున్నాడు. ఈ యిరువురికిని ఆకలిలో మాత్ర మెట్టి తేడా లేదు.

ఒకచో దుర్గంధ భూయిష్ఠములైన పదార్థము లున్నవి. మఱొకచో సుగంధ భరిత వస్తువులు కలవు. ఈ రెండువిధములైన వస్తువులపై వీచుగాలికోమాత్ర మెట్టి భేదము లేదు.

జంతుకోటిలో పెద్దదైన ఏనుగుమీదను, నీచమైన కుక్కపైనను ప్రసరించు సూర్యుని వెలుగులో ఎట్టి వ్యత్యాసము లేదు. అట్లే అటు పుణ్యాత్ములను, ఇటు పాప కర్ములను సమానముగా సంరక్షించుటకు సమర్థమైన శ్రీ వేంకటేశ్వరుని నామము గూడ ఒక్కటేగాని దానికి సాటి రాగలది వేరొకటి లేనేలేదు.

విశేషాంశములు:- స్థూలదృష్టికి వివిధ ప్రాణివర్గములలో హెచ్చుతగ్గులు కన్పించుట సహజము. కాని సమస్త జంతుజాలమునకు అంతరాత్మగా నున్నవాడు పరబ్రహ్మస్వరూపుడైన శ్రీహరి యొక్కడే.

'ఏకో దేవః సర్వభూతేషు గూఢః'
సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా ॥1
'సర్వం ఖల్విదం బ్రహ్మ' ।2
'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' ।3

ఇత్యాది శ్రుతులు ఏకైక పరబ్రహ్మము సర్వత్ర వ్యాప్తమైయున్నదని నిర్దేశించుచున్నవి.

మరియు విశ్వము దశదిశల వ్యాప్తమైనది. అమృతస్వరూపమైన బ్రహ్మ మొక్కటే అని శ్రుతి యిట్లు చాటుచున్నది.

బ్రహ్మైవేద మమృతం పురస్తాత్
బ్రహ్మ పశ్చాత్ బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ ।
అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మైవేదం
విశ్వమిదం వరిష్ఠమ్ ॥4

1. శ్వేతాశ్వ., 6-11.
2. ఛాందోగ్య., 3-14-1.
3. ఛాందోగ్య., 6-2-1.
4. ముండక., 2-2-11.

మరియు 'చక్రి సర్వోపగతుండు[1]' అన్న ప్రహ్లాదుని వచనము గూడ పై సత్యమునే నిరూపించుచున్నది.

సర్వత్ర వ్యాపించిన ఆ దేవుని సూక్ష్మదృష్టిగల జ్ఞానసంపన్నులు, భక్తిభరితులు మాత్రమే చూడగలరు. అందువలననే బ్రాహ్మణుడు, గోవు, గజము, శునకము, చండాలుడు—వీరి యందు పండితులు సమదర్శనులై యుందురని శ్రీకృష్ణుడు నుడివెను—

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః ॥[2]

నిద్ర, నేల, కామసుఖము, రేపవళ్లు, ఆకలి, గాలి, ఎండ - ఇవి యెల్లవారికి నిత్యానుభవములో నున్నవి. అవి అంతట ఏకరూపముగా వ్యాపించి యున్నవి. అందరికివి ఒకే రకమైన అనుభూతిని ప్రసాదించుచున్నవి. అట్లే పరబ్రహ్మము అంతరాత్మయై అంతట ఏకరూపమున నిండియున్నది. కాన విషమదృష్టి వీడి సమదృష్టి నలవరచుకొనవలెననుట ఈ సంకీర్తనలోని సారాంశము.

ఇట్టి సమదర్శనముగల ధన్యజన్ముడు అన్నమయ్య. ఆయనకు అంతటను ఆ పరబ్రహ్మమే గోచరమైనది. ఆనందము మేరమీరినది. తన్మయమైన చిత్తముతో చిందులు ద్రొక్కుచు తన అనుభూతిని ఆయన ఇట్లు గానమొనర్చినాడు. తద్వారా తోడి మానవులను గూడ సమదర్శనులై తరింపుడని ఉద్బోధించినాడు. పల్లవిలోని పదములన్నియు ఆయన తన్మయావస్థనే వ్యక్తమొనర్చుచున్నవి.

ఏనుగుమీద, శునకముమీద ఒకే ఎండపొలయునట్లు శ్రీ వేంకటేశ్వరుని నామమొకటే పుణ్యాత్ములను, పాపాత్ములను సమముగా రక్షించునని చెప్పబడినది. భగవంతుడు పుణ్యాత్ములను గాపాడు ననుట సమంజసమే. పాపాత్ముల నెట్లు కాపాడును? అని సంశయము గలుగవచ్చును. భగవంతుని భజించు వాడెట్టి కలుషాత్ముడైనను తప్పక పవిత్రుడు కాగలడనియే శాస్త్రములు వక్కాణించుచున్నవి. ఎంత దురాచారుడైనను పట్టుదల గలిగి తన్ను అనన్యభావముతో భజించువాడు సజ్జనుడే యని శ్రీకృష్ణుని మతము.

---

1. భాగ., 7-275. 2. గీత., 5-18.

అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥[1]

కాన తరతమ భావముగల రాజు, భటుడు మున్నగువారికి నిద్ర మున్నగునవి సమముగా తృప్తి ఘటించునట్లు భక్తి గలుగుచో సుజనులను దుర్జనులను సమముగనే దేవుడు కాపాడుననియు గ్రహింపదగును.

## 2

అవ:— 'ఏకం సద్ విప్రా బహుధా వదన్తి' అను శ్రుతి ననుసరించి భిన్న భిన్న మతానుయాయులచే నానారీతుల పేర్కొనబడు పరతత్త్వ మొక్కటే యను చున్నాడు—

### బౌళి

ఎంతమాత్రమున నెవ్వరు దలచిన – అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచిచూడఁ బిండంతే నిప్పటి యన్నట్లు.॥పల్లవి॥

1. కొలుతురు మిము వైష్ణవులు-కూరిమితో విష్ణుడని
పలుకుదురు మిము వేదాంతులు – పరబ్రహ్మం బనుచు,
తలఁతురు మిము శైవులు-తగిన భక్తులను శివుఁడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు-ఆది భైరవుఁడనుచు. ॥ఎంత॥

2. సరి నెన్నుదురు శాక్తేయులు – శక్తిరూపు నీ వనుచు
దరిశనములు (లె?) మిము నానావిధులను-తలఁపుల కొలఁదుల భజింతురు,
సిరుల మిమ్మునే యల్పబుద్ధిఁ దలఁ – చినవారికి నల్పంబవుదువు
గరిమల మిమునే ఘనమని తలఁచిన-ఘన బుద్ధులకు ఘనుఁడవు.॥ఎంత॥

3. నీవలనఁ గొరతే లేదు మరి – నీరుకొలఁది తామెరపు
ఆవల భాగీరథి దరిబావుల – ఆ జలమే వూరినయట్లు,
శ్రీ వేంకటపతి నీవైతే మముఁ – జేకొనివున్న దైవమని
యీవల నే నీ శరణని యెదను-యిదియే పరతత్త్వము నాకు.॥ఎంత

వ॥ అంతరాంతరములు = అంతర్భేదములు.

2. దరిశనములు = దర్శనములు, చూపులు, శాస్త్రములు. ఈ పదమును 'భజింతురు' అను క్రియతో అన్వయించవలెను. 'శాస్త్రములు' అను అర్థము గ్రహించినచో 'దరిశనముల' అను పాఠము సమంజసము.

3. భాగీరథి = గంగానది.

దేవా : ఎవ్వరెవ్వ రెంతెంతమాత్రముగా నిన్ను దలచుదురో, వారివారికంతంత మాత్రముగానే నీవు తోచుచుందువు. భిన్నభిన్న దైవతముల జెప్పు నానాశాస్త్రములు, వలతెరువులగు ఉపాసనా విధానములు, వాటికి గలుగు ఫలభేదములు పరిశీలింపగా పిండికొలది నిప్పటి యన్నట్లే యున్నది.

వైష్ణవులు ప్రేమతో నిన్ను 'విష్ణు'వని సేవింతురు. వేదాంతులు నిన్ను 'పరబ్రహ్మ' మను నామముతో వ్యవహరింతురు. శైవులు తమకు దగిన భక్తి పద్ధతులతో నిన్ను శివుడని భావింతురు. మరియు కాపాలికులు నిన్ను ఆదిభైరవుడని సంతసించి పొగడుచుందురు.

ఇక శాక్తేయులన్ననో నీవు శక్తిరూపుడవే యని పరిగణించుచుందురు. ఇట్లు వివిధములైన ఉపాసనా విధానములతు జెందినవారు వారివారి భావములకొలది నిన్ను దర్శించుచుందురు. (తమతమ తలపుల ననుసరించి వివిధములైన మతశాస్త్రములను సేవించుచు నిన్ను ఉపాసింతురు.) శ్రీమంతుడవైన నిన్నెవరు అల్పబుద్ధితో భావింతురో, వారికి నీ వల్పముగానే దోచెదవు. మహామహిమోపేతుడ వగు నిన్ను ఘనుడని భావించిన మహాత్ములకు నీవు ఘనుడవుగానే కన్పట్టుదువు.

నీ యెడల నెట్టి లోపమును లేదు. నీవు నీరుకొలది తామరవు. అనగా భక్తి కొలది ఫలము నొసంగువాడవు. గంగానది గట్టున గల బావులలో ఆ గంగాజలమే ఊరి వట్లు పైజెప్పిన చొప్పున పలురీతుల నిన్ను భావించువారి హృదయములలో భావనానుసారముగా నీవే తోచుచుందువు. శ్రీ వేంకటేశ్వరా : నీవే మమ్ము రక్షింప బూనిన దైవమవని నమ్మి నేను నిన్ను శరణు జొచ్చుచున్నాను. ఇదే నాకు పరమప్రాప్యమైన పరతత్త్వముగాని ఇంకొకటి కాదు.

వి :— 'ఏక మేవాద్వితీయం బ్రహ్మ[1]' అని శ్రుతి పేర్కొన్నట్లు పర బ్రహ్మ మొక్కటియే కలదు. వివిధ మతముల నాశ్రయించి అనేకములైన ఉపాసనా మార్గములలో పయనించు ఉపాసకుల కందరికిని చిట్టచివర పొందదగిన పరతత్త్వ మదియే. 'నదీనాం సాగరో గతిః' - నదులకు సాగరమే గతియైనట్లు సమస్త మత ముల గమ్యము ఆ బ్రహ్మ మొక్కటే యనుట నిక్కము.

ఉపాసకు లందరును ఒకే మార్గమున చరించుట అసంభవము. 'భిన్న రుచిర్హి లోకః[2]'—లోకము భిన్నరుచి గదా ! వారివారి అభిరుచుల ననుసరించి ఆయా మత స్థులు ఆయా స్రోవల పయనింతురు.

"ఎవరెట్లు నాకు ప్రపన్నులగుదురో, వారి నట్లే నే ననుగ్రహింతును. మనుజు లెల్లరు సర్వవిధముల నా మార్గమునే అనుసరించుచున్నారు" అని భగవంతుడే గీతలో పలికియున్నాడు—

యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ ! సర్వశః[3] ॥

ఈ పరమార్థమే ఈ సంకీర్తనమున స్పష్టము గావింపబడినది. వైష్ణవులు, వేదాంతులు, శైవులు, కాపాలికులు, శాక్తేయులు మున్నగువారు వివిధమతముల నాశ్రయించి పెక్కుభావనలతో దైవము నారాధించుచున్నారు. పెక్కు పేళ్ళతో భగ వంతుని పిలుచుచున్నారు. స్థూలదృష్టికి వారిలో పరస్పరభేదము కన్పట్టినను సూక్ష్మ దృష్టిగల విజ్ఞునకు వారెల్లరు ఒకే పరమాత్మను చేరుటకై ప్రయత్నించుచున్నారని స్పష్టము కాకపోదు.

శివుడు, బ్రహ్మము, విష్ణువు - శూన్యము, అర్థము, కాలము, ప్రకృతి పుంభావ విభాగము - ఇత్యాదిగా నానాభేదములతో వ్యపదేశింపబడునది అవ్యపదేశ్యమైన ఆ పర తత్త్వమే యని యోగవాసిష్ఠము పలుకుచున్నది.

కైశ్చిత్ప్ర శివ ఇత్యుక్తా కైశ్చిద్బ్రహ్మే త్యుదాహృతా ।
కైశ్చిద్విష్ణు రితి ప్రోక్తా కైశ్చిచ్ఛూన్యమితి స్మృతా ॥

---

1. ఛాందోగ్య., 6-2-1. 2. రఘు., 6-30. 3. గీత., 4-11.

అర్థ ఇత్యుదితా కైశ్చిత్ కైశ్చిత్కాల ఇతి స్మృతా।
కైశ్చిత్ప్రకృతిపుంభావ విభాగ ఇతి చేరితా ॥

అన్యైరప్యన్యథా నానాభేదై రాత్మ వికల్పితైః।
నిత్యమవ్యపదేశ్యోఽపి కథంచి ద్వ్యపదిశ్యతే ॥[1]

శైవులు శివుడని, వేదాంతులు బ్రహ్మమని, బౌద్ధులు బుద్ధుడని, నైయాయికులు కర్తయని, జైనులు అర్హతుడని, మీమాంసకులు కర్మయని ఉపాసించునది ఆ త్రైలోక్యనాథుడగు హరి నొక్కనినే అని మహానాటకకర్త నుడివెను.

యం శైవా స్స ముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః।
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోఽయం వో విదధాతు వాఞ్ఛితఫలం త్రైలోక్యనాథో హరిః ॥[2]

శివమహిమ్న స్తోత్రమున పుష్పదంతుడుగూడ వేదత్రయము, సాంఖ్యము, యోగము, పాశుపతము, వైష్ణవము ఇత్యాదిగాగల వివిధప్రస్థానములలో 'అది మేలు, ఇది మేలు' అని భిన్నరుచులై ఋజుకుటిలములగు నానామార్గముల ననుసరించు నరులకు జలములకు సముద్రమువలె గమ్యు డొక్కడే యని స్తుతించెను.

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్య మితి చ।
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానాపథజుషాం
నృణా మేకో గమ్య స్త్వమసి పయసా మర్ణవ ఇవ॥[3]

ఈ సంకీర్తనము భిన్నభిన్న మతములయెడ అన్నమాచార్యులకు గల సమన్వయదృష్టిని చక్కగా నిరూపించుచున్నది. ఇతరత్రగూడ 'బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే'[4] ఇత్యాది వాక్యములయందును, 'భవ కమలభవ మాధవరూప'[5] ఇత్యాది భగవత్సంబోధనలయందును ఇట్టి సమదృష్టినే అన్నమయ్య ప్రకటించియున్నాడు. ఇట్టిదృష్టి ఏర్పడుటవలననే భిన్నభిన్న మతస్థులు పరస్పరము కలహించుకొనుట తటస్థించుచున్నది.

---

1. యో. వా. ,
2. మహా. నా. , 1-3.
3. శివ. స్తో. , 7.
4. అ. సం. , 7-151.
5. అ. సం. , 11-2-37.

సర్వమత సమన్వయాత్మకమైన ఈ భావమునే ప్రకటించుచు గీర్వాణవాణిని అన్నమయ్య పాడిన మరొక సంకీర్తన వినుడు.

సామంతం

బ్రువంతి బౌద్ధా - బుద్ధ ఇతి
స్తువంతి భక్తా - స్సులభ ఇతి. ॥పల్లవి॥

గదంతి కిల సాం - ఖ్యాస్త్వాం పురుషం
పదవాక్యజ్ఞాః - పద మితి చ,
విదంతి త్వా - వేదాంతిన
స్సదా బ్రహ్మే ల - సత్పదమితి చ. ॥బ్రువం॥

జపంతి మీ మాం - సకాస్త్వాంచ
విపులకర్మణో - విభవ ఇతి,
లపంతి నయసక - లాన్సలతం.
కృపాశకర్తా - కేవల మితి చ. ॥బ్రువం॥

భణంతి వేంకట - పతే మునయో
హ్యణిమాదిప్రద - మతులమితి,
గుణవంతం ని - ర్గుణం పునరితి
గృణంతి సర్వే - కేవలమితి చ. 1 ॥బ్రువం॥

3

అవ:- సమబుద్ధియే సమస్తవేదముల సార మనుచున్నాడు.

## సామంతం

సమబుద్ధే యిందరికి - సర్వవేదసారము
సమఁ డిందరికి హరి - సాధనమో యయ్యా! ॥పల్లవి॥

1. చీమకుఁ దన జన్మము-చేరి సుఖమై తోఁచు
దోమకుఁ దనజన్మము - దొడ్డసుఖము.
ఆమని యీఁగకు సుఖ - మా జన్మమై తోఁచు
ఏమిటా నెక్కువ సుఖ - మెవ్వరి కేదయ్యా! ॥సమ॥

1. అ. సం., 5-106.

2. జంతురాసులకు నెల్లా - జననము లొక్కటే
అంతటాను మరణము - లవి యొక్కటే,
చెంత నాహార నిద్రలు - స్త్రీ సుఖా లొక్కటే
ఇంతటా నిందుకంటె - నెవ్వరేమి గట్టిరయ్యా ! ॥సమ॥

3. ఇందులోన నెవ్వరైనా - నేమి శ్రీ వేంకటపతి
నందముగాఁ దలఁచిన - దది సుఖము,
ఎందుఁ జూచినా నితఁ - డింపరిలో నంతరాత్మ
చందముగా నెవ్వరికి - స్వతంత్రమేదయ్యా ! ॥సమ॥

1. ఆమని = సమృద్ధి.

వేదము లన్నింటిలోని సారము ఎల్లవారికి సర్వప్రాణులయెడ సమబుద్ధి గలుగ వలె ననుటయే. అందరిలో సముడై యున్నవా డొక్క శ్రీహరియే. అతడే అందరికి ముక్తిసాధనమై యున్నాడు. అంతట సముడుగానున్న శ్రీహరిని సాధనముగా (ప్రమాణముగా) గ్రహించి సర్వత్ర సమభావన పెంపొందించుకొనవలెను.

స్థూలదృష్టికి చీమ. దోమ మున్నగునవి అల్పాల్పములుగా కనబడవచ్చును. కాని చీమ తన జన్మమునే సుఖముగా భావించును. దోమకు తన పుట్టుకయే మిక్కిలి సుఖకరమైనది అనిపించును. ఈగకు దాని జన్మమే సంపూర్ణసుఖము గూర్చునదిగా తోచును. ఇందులో ఎవ్వరికి దేనివలన ఎక్కువ సుఖమున్నది ? ఈ సుఖములో తారతమ్యమును నిర్ణయించుట కెట్టి అవకాశము లేదుగదా !

పుడమిలోని జంతురాసు లన్నిటికిని పుట్టుక లొక్కతీరుననే ఉన్నవి. వాటి మరణములు గూడ ఒకే మాదిరి నున్నవి. అట్లే ఆహారము, నిద్ర, కామసుఖము గూడ అన్నింటికి సమానములే. ఇంతకంటె ఈ లోకమున నెవ్వరేమి ఎక్కువగా మూట గట్టుకొనుచున్నారు ?

ఈ సృష్టిలో నెవ్వరైనను సరే ! శ్రీ వేంకటేశ్వరుని చక్కగా స్మరించినచో వారికదే నిజమైన సుఖము. ఎక్కడ చూచినను శ్రీహరి అందరికి అంతరాత్మగా నుండి సర్వము ప్రవర్తింప జేయుచున్నాడు. ఇట్లుండ జీవులలో ఎవ్వరి కేమి దొరతనమున్నది ?

వి:— జీవులు వారివారి కర్మల కనుగుణముగా ఎన్నో జన్మలు దాల్చుచున్నారు. అన్ని ప్రాణులలో అంతరాత్మగా నున్నవాడు పరమాత్మ యొక్కడే. కావున తత్త్వవేత్తలు సర్వత్ర సమభావమునే కల్గియుందురు. అజ్ఞులుమాత్రమే ఆ జీవులలో ఎక్కువ తక్కువలను పరిగణింతురు. సమస్త వేదములు ఎల్లెడల సమబుద్ధినే బోధించుచున్నవి. ఇట్టి బుద్ధినే కల్గియుండవలెనని అన్నమయ్య ఇట ప్రబోధించినాడు.

“బాగుగా ప్రజ్వలించెడు అగ్నినుండి వేలకొలది సమానరూపములైన మిణుగురు లుద్భవించినట్లు అక్షరుడైన పరమాత్మనుండి వివిధజీవులు జనించుచున్నవి. మరల అందే లయించుచున్నవి” అని శ్రుతి బోధించుచున్నది.

యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగాః
సహస్రశః ప్రభవన్తే సరూపాః।
తథాఽక్షరా ద్వివిధాః సోమ్య! భావాః
ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి[1]॥

సర్వప్రాణుల ఉత్పత్తికి ఒకే బ్రహ్మము స్థానముగా పేర్కొన్న వేదముల దృష్టిలో ప్రాణు లెల్లరు సమానులే యగుచున్నారు. కాన వేదవేత్త యగు తత్త్వజ్ఞునికి సర్వత్ర సమభావనయే కల్గును.

గీతలో భగవంతుడు విద్యావినయసంపన్నుడైన బ్రాహ్మణునియందు, గోవునందు, గజమునందు, కుక్కయందు, కుక్కమాంసము దిను చండాలునియందును పండితులు సమదర్శనులై యుందురనియు; ఎవరి మనస్సు సమభావనతో నుండునో వారీ జన్మమునందే సంసారమును జయించినవారనియు; బ్రహ్మ దోషరహితము, సమముగాన సమదృష్టి కలవారు బ్రహ్మమునందే స్థిరపడినవారనియు చెప్పెను. మరియు సుఖదుఃఖముల విషయమున సమస్తప్రాణులను తనవలెనే సమముగా జూచువాడే శ్రేష్ఠుడైన యోగి యనియు ప్రతిపాదించెను—

1. ముండక., 2-1-1.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః ॥1

ఇహైవ తై ర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥2

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥3

మఱియు ఆహార నిద్రా భయ మైథునములు మనుజులకు ఇతర జంతువులకు సామాన్యములు. వివేక మొక్కటే మనుజులలో అధికముగా నున్నది. అది లేనివాడు పశుతుల్యుడే అని ఉత్తరగీత నుడువుచున్నది.

ఆహారనిద్రా భయమైథునాని
సమానమేత త్పశుభి ర్నరాణామ్ ।
ఏకో వివేకో హ్యధికో మనుష్యే
తేనైవ హీనః పశుభి స్సమానః ॥4

ఈ వివేకము నుపయోగించుకొని భగవంతుని దలంచుటే నిజమైన సుఖముగాని కామాదిసుఖములు సుఖములు గావని తెలుపుటకే 'శ్రీ వేంకటపతి నందముగా దలంచిన దది సుఖము' అని అన్నమయ్య ప్రబోధించినాడు.

కాని భగవంతుని దలచు టన్నది ఒక్క మానవులకే పరిమితమైన ధర్మము గాదు. జంతువులుగూడ భగవంతుని దలచి ముక్తినొందుట కలదు. గజేంద్రమోక్షము. శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము మున్నగు చరిత్ర లిట ప్రమాణములగుచున్నవి. అందువలననే "ఇందులో (జంతురాసులలో) ఎవ్వరైనా నేమి?" అని అన్నమయ్య అన్నాడు.

ఈ సంకీర్తనమును పోలిన మరొకపాట పరిశీలింపుడు.

ఏదాయనేమి హరి - యిచ్చిన జన్మమే చాలు
ఆదినారాయణుండే - యఖిలరక్షకుడు ॥పల్లవి॥

---

1. గీత. , 5-18.
2. ,, , 5-19.
3. గీత. , 6-32.
4. ఉ. గీ. ,

శునకము బతుకును - సుఖమయ్యే తోఁచుఁగాని
తనకది హీనమని - తలఁచుకోదు,
మనసొడఁబడితేను - మంచిదేమి కానిదేమి
తనువులో నంతరాత్మ - దైవమౌట దప్పదు ॥ఏదా॥

పురువుకుండే నెలవు - భువనేశ్వరమై తోఁచు
పెరచోటి గుంతయైన - ప్రియమై యుండు,
ఇరవై పొండితేఁ జాలు - యెగువేమి దిగువేమి
వరుసలోకములు స - ర్వం విష్ణుమయము ॥ఏదా॥

అచ్చమైన జ్ఞానికి - నంతా వైకుంఠమె
చెచ్చెరఁ దనతిమ్మచే - జీవన్ముక్తి,
కచ్చుపెట్టి శ్రీ వేం - కటపతి దాసుఁడైతే
హెచ్చు కుందేమిలేదు - యేలినవాఁ డితఁడే[1] ॥ఏదా॥

## 4

అవ:- ధనము, భయము, పాపము, సంసారము అనునవిగూడ భగవత్ప్రాప్తికి త్రోవచూపుటద్వారా తనకు మొదటి గురువులైన వనుచున్నాడు.

### గుండక్రియ

**అవియు నాకుఁ బ్రథ - మాచార్యులు**
**తవిలి యీ నెపము మిముఁ - దలఁపించుఁగాన. ॥పల్లవి॥**

1. ధనవాంఛ మతిలోనఁ - దగిలినప్పటివేళ
దనుజారి మీమీఁద - దలఁపు గలుగు,
పొవిగి భయదుఃఖములఁ - బొరలినప్పటివేళ
పవివూని మీమీఁది - భక్తిగలుగు. ॥అవి॥

---

1. అ. సం., 10-264.

2. చెలఁగి పాపములు మిం - చినవేళ హరి మీ
నలువు నామోచ్చార - ణంబు గలుగు.
బలిమి భవరోగముల - బడలినప్పటివేళ
పలుమారు మీ సం - ప్రార్థనలు గలుగు. ॥అవి॥

3. ఇన్నిటాఁ దొలఁగి మిము - నెరిఁగి కొలిచినవేళ
మన్ననల పరిణా - మంబు గలుగు,
ఉన్నతపు శ్రీ వేంక - టోత్తముఁడ మిము నెదుట
గన్న యీవేళ సౌ - ఖ్యంబులే కలుగు. ॥అవి॥

వ॥ నెపము = కారణము.

1. పొవిగి = తేజము చెడి, పట్టుదప్పి.

2. నలువు = ఒప్పిదము.

దేవా ! ఆయా సమయములం నేను నిన్ను స్మరించుటకు కారణము లగు చున్నవి గాన ఈ చెప్పబోవునవిగూడ నన్ను నీ సన్నిధి జేర్చుటలో నాకు మొదటి గురువులే.

దానవాంతకా ! హృదయములో ధనముపై కోరిక జనించినప్పుడు నీ మీద చింత గల్గును. వివిధములైన భయదుఃఖములలో పొరలి తేజముచెడి పట్టుదప్పినప్పుడు నీపై భక్తి ప్రబలును.

శ్రీహరీ ! పాపములు మేరమీరి చెలగినవేళ ఒప్పిదమైన నీ నామోచ్చారణ మొనర్పవలెనను బుద్ధి పుట్టును. బలమైన భవరోగములచే బడలిక జెందినప్పుడు పలు మారులు నిన్ను ప్రార్థించుట సంభవించును.

పై జెప్పిన ధనవాంఛకు, భయదుఃఖములకు, పాపములకు, భవరోగములకు అతీతుడై నీ యథార్థ స్వరూపము నెరింగి నిన్ను సేవించినప్పుడు నీమన్ననలకు పాత్ర మైన ఉత్తమగతి ప్రాప్తించును. సర్వోన్నతుడవైన శ్రీ వేంకటేశ్వరా ! ఎట్టయెదుట నిన్ను సాక్షాత్కరించుకొన్న ఈ సమయమున సౌఖ్యములే సమకూడును.

వి :— సహజముగా సుఖవంతులై చీకుచింతలు లేక కాలము గడపునప్పుడు భగవంతుని చింతింపవలెనను బుద్ధి సామాన్యమానవులకు గలుగదు. ఏవైన కష్టములు గల్గినప్పుడే వారికి దేవుని గూర్చిన చింతపొడముసు. సంపదలపై అపేక్ష తీవ్రమై నప్పుడు గూడ భగవంతుని భజించుట కలదు.

అందువలననే శ్రీకృష్ణుడు గీతలో జిజ్ఞాసువు, జ్ఞాని యనువారితోపాటు ఆర్తుడు, అర్థార్థి అను వారిని గూడ చేర్చి ఆ నాలుగురకముల సుకృతాత్ములను తన్ను భజించు వారే యని చెప్పెను—

చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున !
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ![1]

వారిలో జ్ఞాని నిత్యయుక్తుడు గాన తన కత్యంత మిష్టుడైనను ఈ నలుగురును ఉదారులే అని (ఉదారాస్సర్వ ఏవైతే[2]) అని గీత పేర్కొనుటచే ఆర్తుడు, అర్థార్థి గూడ భగవంతుని మన్ననకు పాత్రు లయినట్లు స్పష్టమగుచున్నది.

'విపదః సన్తు నః శశ్వద్యాసు సంకీర్త్యతే హరిః'— 'విపత్తులలోనే శ్రీహరి తలపునకు వచ్చును గాన మాకు సదా విపత్తులే కల్గుగాక' యని కుంతి కోరుటలోని పరమార్థము భగవంతుని సంతతము స్మరింపవలెననుటయే. ద్రౌపది మున్నగువారు గూడ తీరని విపత్తికి లోనై భగవంతుని స్మరించి ఆపదలకు తొలగిరి. గజేంద్రుడు గ్రాహముచే పట్టువడి విపన్నుడై కదా భగవంతు నిట్లు స్మరించెను—

లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితః పరంబెఱుఁగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావే యీశ్వర ! కావవే వరద ! సంరక్షించు భద్రాత్మకా ![3]

ఇట్లు ధనము వాంఛను; భయములు, పాపములు, భవములు ఆర్తిని రేకెత్తించి హరిని స్మరింప జేయుచున్నవి. ఈ రీతిగా హరిని స్మరించినవారు క్రమముగా జిజ్ఞాసువులుగా, జ్ఞానులుగా పరిణమించి ముక్తులగుటకు వీలుగలదు గాన ధనము మున్నగునవి ప్రథమాచార్యులుగా పేర్కొనబడెనవి.

1. గీత., 7-16. 2. గీత., 7-18. 3. భాగ., 8-90.

5

అవ :— ఆత్మ శాశ్వతము, శరీరము అశాశ్వత మన్న సత్యమును భగవద్గీత ననుసరించి ప్రతిపాదించుచున్నాడు—

బౌళి

దేహి నిత్యుఁడు - దేహము లనిత్యాలు
ఈహల నామనసా - యిది మరవకుమీ. ॥పల్లవి॥

1. గుదిఁ బాఁతచీర మాని - కొత్తచీర గట్టినట్టు
ముదిమేను మాని దేహి - మొగిఁ గొత్తమేను మోచు,
అదన జంపఁగలేవు - ఆయుధము లితని
గదిసి యగ్నియు నీరు - గాలియుఁ జంపఁగలేవు. ॥దేహి॥

2 ఈతఁడు నరకువడఁ - డీతఁ డగ్నిఁగాలఁడు
ఈతఁడు నీట మునుఁగఁ - డీతఁడు గాలిఁబోఁడు.
చేతనుఁడై సర్వగతుండౌ - చెలియించఁ డేమిటను
ఈతల ననాది యీతఁ - డిరవు గదలఁడు. ॥దేహి॥

3. చేరి కానరానివాఁడు - చింతించరానివాఁడు
భారపు వికారాలఁ - బాసినవాఁ డీయాత్మ.
ఆరయ శ్రీ వేంకటేశు - నాధీన మీతఁడని
సారము దెలియుటే - సత్యం జ్ఞానము. ॥దేహి॥

వ॥ దేహి = దేహము గలవాడు, ఆత్మ; ఈహలు = కోరికలు.

1. కదిసి = సమీపించి,

2. సర్వగతుండు = అంతట వ్యాపించినవాడు; అనాది = ఆదిలేనివాడు. సనాతనుడు; ఇరవు = స్థానము.

3. భారపు వికారాలు = పెద్దవికారములు, షడ్భావవికారములు.

ఆత్మ శాశ్వతము. శరీరములు శాశ్వతములు గావు. పలుకోరికలతోగూడిన ఓనాచిత్తమా : ఈ సత్యమును విస్మరింపకుము.

మానవుడు ప్రాతవస్త్రమును వదలి క్రొత్తవస్త్రమును ధరించినట్లు ఆత్మ ముదిసిన శరీరమును వీడి క్రొత్తశరీరమును గైకొనును. ఆయుధము లీయాత్మను చంపలేవు. నిప్పు, నీరు, గాలియు పైకొని దీనిని చంపజాలవు.

ఈ యాత్మ శస్త్రములచే ఛేదింపబడదు. ఇది నిప్పుచే కాలదు. ఇది నీట మునుగదు (నానదు). ఇది గాలికి ఆరిపోదు. ఇది చేతనము, సర్వత్ర వ్యాపించి యున్నది, దేనిచేతను చలించునది గాదు. ఇది సనాతనమైనది. ఉన్నచోటు నిలుచునది.

ఈ యాత్మ ఇంద్రియములకు గోచరము గాదు. మనస్సుచే భావించుటకు వీలుగానిది. షడ్భావవికారములకు లోనుగానిది. పరికింపగా ఇది శ్రీ వేంకటేశ్వరుని కధీనమై యున్నదన్న సారార్థమును గ్రహించుటే నిజమైన తెలివి.

వి:- అగ్ని జలాదులు పంచభూతములలో జేరినవి. ఆత్మ పంచభూతముల కతీతమైనది. పంచభూతములచే ఆత్మ కెట్టి వికారమును గలుగదు. శరీరము పాంచ భౌతికము. కాన పంచభూతముల ప్రభావము శరీరముపై పనిచేయును.

గర్భస్థుడై యుండుట, పుట్టుట, పెరుగుట, మార్పుచెందుట, క్షీణించుట, నశించుట, (అస్తి, జాయతే, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి) అనునవి షడ్భావ వికారము లనబడును. ఇవి శరీరమునకేగాని శరీరికి గలుగవు.

భగవద్గీత ద్వితీయాధ్యాయమునందలి ప్రతిపాదనము ననుసరించి ఆత్మస్వరూప మీ సంకీర్తనమునందు నిరూపింపబడినది. కురుక్షేత్రమున అర్జునుడు బంధువర్గము జూచి శోకమోహములకు గురియై నేను యుద్ధ మొనర్ప జాలనని చెప్పగా శ్రీ కృష్ణు డాతని మోహమును దొలగించుటకై శ్రుతి ప్రతిపాదితమైన శాశ్వతమగు ఆత్మ స్వరూపము నిట్లు బోధించెను.

> వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
> తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥
> నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।
> న చైనం క్లేదయన్త్యాపః న శోషయతి మారుతః ॥
> అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ ।
> నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః ॥
> అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే ।
> తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి ॥ 1

---

1. గీత. , 2-22, 23, 24, 25.

ఈ శ్లోకములందలి భావమే పై సంకీర్తనమున నిబంధింపబడినది. ఇందలి 23, 24 వ శ్లోకములలోపలెనే సంకీర్తనమునందలి 1, 2 వ చరణములలోగూడ శస్త్ర శస్త్రాదిసాధనములచే ఛేదనాదుల నొందదను భావము పునరుక్తమైనది. దుర్బోధమైనవిషయము బోధపడునట్లు చెప్పుటలో పునరుక్తి దోషము కాదు. విస్మయము, విషాదము, దైన్యము, అవధారణము మున్నగు సందర్భములలో ఒకే విషయమును రెండుసార్లు చెప్పుట శాస్త్రసమ్మతమే.

విస్మయే చ విషాదే చ దైన్యే చైవావధారణే ।
తథా ప్రసాదనే హర్షే వాక్యమేకం ద్విరుచ్యతే ॥

## 6

అవ:—పాపము, కోపము మొదలగు కలిదోషములు భగవద్భజనపరులకు లేవనుచున్నాడు....

### మాళవి గౌళ

కలియుగ మెటులైనాఁ - గలదుగా నీ కరుణ
జలజాక్ష! హరి హరీ! - సర్వేశ్వరా! ॥పల్లవి॥

1. పాప మెంత గలిగినఁ - బరిహరించే యందుకు
నా పాలఁగలదుగా నీ - నామము,
కోపమెంత గలిగిన - కొచ్చి శాంత మిచ్చుటకు
చేపట్టి కలవుగా నా - చిత్తములో నీవు. ॥కలి॥

2. ధర వింద్రియా లెంత - తరముకాడిన నన్ను
సరిఁగావఁ గద్దుగా నీ - శరణాగతి,
గరిమఁ గర్మబంధాలు - గట్టిన తాళ్లు వూడించ
విరతిఁ గలదుగా - నీ భక్తి నాకు. ॥కలి॥

3. హితమైన యిహపరా - లిష్టమైన వెల్లా నియ్య
పతమై కలదుగా నీ - సంకీర్తన,
తతి శ్రీ వెంకటేశ నా - తపము ఫలియింపించ
గతి గలదుగా నీ - కమలాదేవి.. ॥కలి॥

1. కొచ్చి = క్రొచ్చి, నశింపజేసి.

3. సతమై = శాశ్వతమై, తతి = తగినకాలమున, కమలాదేవి = లక్ష్మీదేవి.

కమలములవోలు కన్నులు గలవాడా : హరిహరీ : సర్వమునకు ప్రభువైన వాడా ! దోషభూయిష్ఠమైన కలియుగ మెట్లున్నను నన్ను కాపాడుటకు నీ కృప కలదు గదా ! ఇక నాకేమి భయము ?

నాయెడల నెన్ని పాపములు గల్గినను, వాటిని సమూలముగా తుద ముట్టించుటకు నీ నామ మున్నదిగదా ! నాకెంత కోపము గల్గినను నశింపజేసి శాంతమును ప్రసాదించుటకు నామనస్సులో నీవు నెలకొనియున్నావు గదా :

ఇంద్రియములు ఎంతగా తరుముకొనివచ్చినను నన్ను వాటి బారినుండి తప్పించుటకు నీ శరణాగతి గలదు గదా ! ఘనమైన కర్మబంధము లనెడు కట్టిన త్రాళ్ళనుండి నన్ను విడిపించుటకు నాకు నీయెడల నున్న భక్తి కలదు కదా :

నా కిష్టము లైనవి, హితకరము లైనవియు అగు ఇహమునకు పరమునకు సంబంధించిన వాటినెల్ల ఇచ్చుటకు శాశ్వతమైన నీ సంకీర్తన కలదు గదా ! తగిన కాలమున నాతపస్సు ఫలింపజేయుటకు నీ లక్ష్మీదేవియే నాకు గతియై యున్నది గదా !

వి:—కలియుగము పెక్కు దోషములకు నెలవైనది. జూదము, పానము, స్త్రీలోలత, ప్రాణివధ మరియు కాంచనమూలకములైన అసత్యము, మదము, కామము, హింస, వైరము మున్నగు దోషముల నాశ్రయించి కలి ప్రవర్తించు నని భాగవతము చెప్పుచున్నది.

అభ్యర్థిత స్తదా తస్మై స్థానాని కలయే దదౌ ।
ద్యూతం పానం స్త్రియః సూనా యత్రాధర్మ శ్చతుర్విధః ॥

పునశ్చ యాచమానాయ జాతరూప మదాత్ప్రభుః ।
తతోఽనృతం మదం కామం రజో వైరంచ పంచమమ్ ॥

అమూని పంచ స్థానాని హ్యధర్మప్రభవః కలిః ।
ఔత్తరేయేణ దత్తాని న్యవస త్తన్నిదేశకృత్ ॥[1]

---

1. భాగ., 1-17-38, 39, 40.

అట్లయినను భగవానుని కృపకు పాత్రులైన భక్తులను కలి ఏమియు చేయ జాలదు.

'నామసంకీర్తనం యస్య సర్వపాపప్రణాశనమ్'[1]

అన్నట్లు భగవన్నామమును కీర్తించినవానికి పాపము లేదు. పరమేశ్వరుని చిత్తమున నిల్పినవారి కోపాది దుర్గుణములు నశించును. దేవుని శరణు జొచ్చినవారికి శబ్ద స్పర్శ రూపరసాదులగు విషయదోషములవలన నెట్టి ప్రమాదమును లేదు. భగవద్భక్తి పరులకు కర్మబంధము లంటవు. భగవత్సంకీర్తన పరులకు ఐహికాముష్మికములైన హితము లెల్ల కరతలామలక మగును.

శ్రీ వేంకటేశ్వరుడు జీవులకు ఆయా కర్మఫలముల నిచ్చుటలో ఒక్కొక్క సారి దయలేక కఠినముగా ప్రవర్తింపబూనవచ్చును. కాని జగన్మాత, కరుణాస్వరూపిణి అయిన శ్రీ మహాలక్ష్మి ఆయన హృదయమును మెత్తపడునట్లొనర్చి మాతృప్రేమతో జీవులను సంరక్షించుచున్నది. ఆమె అజ్ఞాత నిగ్రహ (నిగ్రహము తెలియనిది) గదా!

అందుచేతనే వేదాంతదేశికులు దయాశతకమున శ్రీదేవిని శ్రీనివాసుని దయాస్వరూపిణిగా పేర్కొనుచు నిట్లు నుతించిరి.

సమస్తజననీం వందే చైతన్య స్తన్యదాయినీమ్।
శ్రేయసీం శ్రీనివాసస్య కరుణామివ రూపిణీమ్॥2

## 7

అ:—జీవుని సేవకత్వమును, దేవుని రక్షకత్వమును తేటపఱచుచున్నారు—

గుండక్రియ

నే నేమిఁ జేయఁగలేను - నీవు పరిపూర్ణుఁడవు
హీనుఁడ నే నధికుఁడ వ - న్నిటా నీవు. ॥పల్లవి॥

1. దండము వెట్టుట నాది - తప్పు లోఁగొనుట నీది
నిండి నీ వెప్పుడు దయా - నిధివి గాన.
అండఁజేరుకొంట నాది - అందుకు నూఁకొంట నీది
దండియైన దేవదేవో - త్తముఁడవు గాన. ॥నేనే॥

---

1. భాగ., 12-13-23.
2. ద. శ., 1-8.

2. శరణుచొచ్చుట నాది - సరుగఁ గాచుట నీది
పరమపురుష శ్రీ - పతివి నీవు,
విరులు చల్లుట నాది - వేవే లిచ్చుట నీది
పొరి నీవు భక్తసుల - భుఁడ వటుగాన. ॥వేవే॥

3. దాసుఁడ ననుట నాది - తప్పక యేలుట నీది
ఆసదీర్చే వరదుఁడు - వటుగాన,
నీ సేవ యొక్కటి నాది - నిచ్చలుఁ గైకొంట నీది
యీసులేని శ్రీ వేంక - టేశుఁడవుగాన. ॥వేవే॥

1. దండి = ప్రతాపము గలవాడు.

2. విరులు = పూలు.

3. నిచ్చలు = నిత్యము.

దేవా ! అల్పజీవుడనైన నే నింతకంటె ఏమియు చేయజాలను. నీవు పరిపూర్ణ స్వరూపుడవు. నేను ఎట్టిశక్తియులేని హీనుడనైన జీవాత్ముడను. నీ వన్నివిధముల గొప్పవాడవైన పరమాత్ముడవు.

నీకు వందనమొనర్చుట నావని. నాతప్పులు సైరించి నన్ను క్షమించుట నీపని. ఏలన నీ వెల్లవేళల పరిపూర్ణుడవైన కరుణానిధివి గదా ! నీప్రక్కనే నిల్చి నీ నామ ముల బేర్కొనుట నాపని. పిలుపు విని పలికి నాకోరిక లీడేర్చుట నీపని. ఏలన నీవు శౌర్యశాలివైన దేవాదిదేవుడవు గదా !

నిన్ను శరణు చొచ్చుట నావంతు. నన్ను రక్షించుట నీవంతు. ఎందుకన, ఓ పరమపురుషా ! శరణాగతుల రక్షణకై నిన్ను పురికొల్పు లక్ష్మికి నీవు పతివి గదా ! పూలతో నిన్ను పూజించుట నావంతు. సకలసంపద లొసగి నాకోరిక లీడేర్చుట నీవంతు. ఎందుకన నీవు భక్తజనులకు సులభుడవు గదా !

నేను నీ దాసుడ ననుట నాకర్తవ్యము. నన్ను దయజూచి కాపాడుట నీ కర్తవ్యము. ఏలన నీవు దాసజనుల ఆశలు దీర్చు వరదాయకమూర్తివి గదా ! ఈరీతిగా నిన్ను సేవించు టొకటే నాపని. నాసేవల నెల్లవేళల నంగీకరించుటే నీపని. ఎందుకన నీవు ఈర్ష్యలేని శ్రీ వేంకటేశ్వరుడవు గదా !

వి:—జీవుడు అల్పుడు. దేవుడు అధికుడు. జీవుడు దేవుని సేవింపవలెను. దేవుడు జీవుని కరుణింపవలెను. జీవునికి, దేవునికి గల ఈ సంబంధమునే ఈ పాటలో అన్నమయ్య నిరూపించినాడు.

అనాదియైన అవిద్యచే జీవుల స్వరూపము కప్పబడియున్నది. అందుచే అన్యథా జ్ఞాన విపరీతజ్ఞానములచే వారు దూషితులై యున్నారు. రాగద్వేషములు గలిగి భగవదాజ్ఞ నతిక్రమించి ప్రవర్తించుచున్నారు. వివిధనిషిద్ధాచారము లొనర్చుచున్నారు. ఆయా కర్మల కనుతూపములైన శరీరముల దాల్చుచున్నారు. ఆయా శరీరముల కనుగుణమైన సుఖదుఃఖముల ననుభవించుచున్నారు. బద్ధజీవుల లక్షణ[1] మిట్టిది కావుననే వారు హీను లగుచున్నారు.

పరమాత్ముడు అనన్తకల్యాణగుణ నిలయుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, ఆనందస్వరూపుడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు, దివ్యమంగళవిగ్రహుడు, హేయ గుణములు లేనివాడు, నిత్యసత్య స్వరూపుడు. శ్రీ వైకుంఠమున నిత్యానపాయిని యైన లక్ష్మితోగూడి జగత్పతియు, అచింత్యస్వరూపుడునైన ఆ విష్ణువు భక్తులతో, భాగవతులతో గూడియున్నాడు.

శ్రీ వైకుంఠే పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః ।
ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతైస్సహ ॥[2]

సమస్తచరాచర జగత్ప్రవర్తకుడు ఈ భగవానుడే కావున అన్నిట ఆయన అధికు డగుచున్నాడు.

జీవుడు దేవుని భజించుటలో శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అని తొమ్మిది పద్ధతులు కలవని ప్రహ్లాదుడు చెప్పినాడు.

---

1. "తత్రానాద్యవిద్యా తిరోహిత స్వరూపాః, అన్యథాజ్ఞాన విపరీతజ్ఞాన దూషితాః, తదనుగుణ రాగద్వేషాది పారవశ్యాత్ ఉల్లంఘిత భగవదాజ్ఞాః, స్వరూప విరోధి వివిధ నిషిద్ధాచారాః, తదపరాధానురూప లబ్ధ చతుర్విధ శరీర ప్రవేశాః, తత్తచ్ఛరీరోచిత సుఖదుఃఖోపేతాః బద్ధాః" రా. సి. సా. P. 59.

2. రా. సి. సా. ,-P. 55.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్ ॥ 1

'దండము పెట్టుట, పేరుకొంట, శరణుచొచ్చుట, విరులు చల్లుట, దాసుడగుట, సేవ' అను పదములచే పై భక్తిపద్ధతులే ఈ పాటలో నిర్దేశింపబడినవి. జీవుడు భక్తిగలిగి తన కర్తవ్యమును తాను నెరవేర్చినచో దేవుడును తన పని, అనగా జీవుని రక్షణమును తాను నిర్వహింపగలడు.

పరమాత్ముడు సర్వపరిపూర్ణుడు, దయాసముద్రుడు. నిఖిలదేవతలకు తానే నియామకుడు గాన దేవతలలో శ్రేష్ఠుడగుచున్నాడు. భక్తరక్షణలో ఒకవేళ ఆయన శ్రద్ధ చూపనిచో చెంతనున్న లక్ష్మి ఆయనకు కర్తవ్యము నెఱుకపఱచుచున్నది. 'శ్రీపతివి' అను విశేషణములోని తాత్పర్య మిదే.

ఇక భగవంతుడు భక్త సులభుడనుట సుప్రసిద్ధము. "నేను అస్వతంత్రుడవలె భక్తపరాధీనుడనై యుందును. భక్తులైన సాధువులు నా హృదయమును వశపఱచుకొనియున్నారు. నేను భక్తజనప్రియుడను. పుత్ర కళత్ర మిత్ర గృహాదులను వీడి నన్ను శరణొందినవారిని నేనెట్లును విడువజాలననని భగవంతుడే చెప్పియున్నాడు.

అహం భక్త పరాధీనో హ్యస్వతంత్ర ఇవ ద్విజ ।
సాధుభి ర్గ్రస్తహృదయో భక్తై ర్భక్తజనప్రియః ॥
యే దారాగార పుత్రాప్తాన్ ప్రాణాన్ విత్తమిదం పరమ్ ।
హిత్వా మాం శరణం యాతాః కథం తాం స్త్యక్తు ముత్సహే ॥2

ఇక్కడ చెప్పినట్లే జీవునికి దేవునికి గల భేదమును వివరించుచు శరణాగతితో దేవుని జేరవలసిన విధిని బోధించు మరొక కీర్తనమును పరికింపుడు.

మాళవిగౌళ

నీవు సర్వగుణ సంపన్నుండవు - నేనొక దుర్గుణిని
మానవు (ః) నన్నొక యెదురుచేసుకొని - మనసుచూడ నేలా అయ్యా
॥పల్లవి॥

---

1. భాగ., 7-5-23.

2. భాగ., 9-4-63, 65.

1. ఏలినవాఁడవు నీవు - యిటు నేఁ గొలిచినవాఁడ
పోలింపఁగ నీవే దేవుఁడవు - భువి నేనొక జీవుఁడను,
పాలించేవాఁడవు నీవు - బ్రదికేవాఁడను నేను
తాలిమి నన్నొక సరిచేసుక నను - దప్పులెంచ నేలా యయ్యా ॥నీవు॥

అంతర్యామివి నీవు - అంగమాత్రమే నేను
చింతింపఁగ నీవే స్వతంత్రుఁడవు - జిగినేఁ బరతంత్రుఁడను,
ఇంత నీవే దయగలవాఁడవు - యెప్పుడు నే నిర్దయుఁడను
చెంతల నన్నొకమొన చేసుక నా - చేఁత లెంచనేలా యయ్యా ॥నీవు॥

శ్రీ వేంకటేశ్వరుడవు నీవు - సేవకుఁడను యిటు నేను
ఆవల నీవల దాతవు నీవు - యాచకుఁడను నేను,
నీవే కావఁగఁ గర్తవు - నేనే శరణాగతుఁడను
కైవసమగు నను ప్రతివెట్టుక నా - కథలు యెంచనేలా యయ్యా![1] ॥నీవు॥

## 8

అవ:—గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగమున శ్రీకృష్ణుడు గావించిన యుపదేశమును వివరించుచున్నాడు—

లలిత

అని యానతిచ్చెఁ గృష్ణుఁ - డర్జునువితో
విని యాతని భజించు - వివేకమా। ॥పల్లవి॥

1. "భూమిలోను చొచ్చి సర్వ - భూత ప్రాణులనెల్ల
దీమసాననే మోచేటి - దేవుఁడ నేను.
కామించి సస్యములు - గలిగించి చంద్రుఁడనై
తేమల బండించేటి - దేవుఁడ నేను. ॥అని॥

1. అ. సం., 7-280.

2. దీపనాగ్నినై జీవ - దేహములఁ యన్నములు
తీపుల నరగించేటి - దేవుఁడ నేను.
ఏపున నింవరిలోని - హృదయములోన నుందు
దీపింతుఁ దలఁపు మరపై - దేవుఁడ నేను. ॥ఆది॥

3. వేదము లన్నిటిచేతా - వేదాంతవేత్తలచేతా
ఆది నే నెరఁగఁదగిన - యాదేవుఁడను.
శ్రీదేవితోఁగూడి - శ్రీ వేంకటాద్రి మీఁద
పాదైన దేవుఁడను - భావించ నేను." ॥ఆది॥

1. దీమసాన = ధైర్యముతో, ఓజోబలముతో.
2. దీపనాగ్ని = జఠరాగ్ని (వైశ్వానరుడు).
3. పాదైన - నెలకొన్న.

శ్రీ కృష్ణు డర్జునునితో ఈ క్రిందివిధముగా నానతిచ్చెను. వివేకమా ! ఇది విని ఆ దేవుని భజింపుము.

"నేను భూమిలో ప్రవేశించి చేతనాచేతనములైన సమస్తప్రాణులను ఓజో బలముతో ధరించు దేవుడను. నేను చంద్రుడనై రసములు నింపి ఓషధులను వృద్ధి నొందించి పండించు దేవుడను.

నేను జఠరాగ్నినై ప్రాణులదేహము లందలి అన్నములను ఆరగించు దేవుడను. నే నందరి హృదయములో నుందును. జీవులలోని స్మృతి, విస్మృతులు గానున్న దేవుడను నేనే.

నేను సమస్తవేదములచేతను, వేదాంతవేత్తలచేతను మొదట తెలియదగిన దేవుడను. శ్రీ లక్ష్మితోగూడి శ్రీ వేంకటాచలముపై స్థిరపడిన దేవుడను నేనే."

వి:—ఈ సంకీర్తనకు మూలములైన గీతా శ్లోకము లివి—

గామావిశ్య చ భూతాని ధారయామ్యహ మోజసా ।
పుష్ణామి చౌషధీః సర్వా స్సోమో భూత్వా రసాత్మకః ॥

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ ।
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥1

ఈ శ్లోకములు భగవద్విభూతిని ప్రతిపాదించుచున్నవి. భూమి సమస్తభూతము లను ధరించియున్నది. భూమియందలి ఆధారకత్వశక్తి భగవంతునిదే 'స దాధార పృథివీమ్' అను శ్రుతివాక్య మిట ప్రమాణము. అమృతరసమయుడైన చంద్రుడుగానుండి ఓషధులనెల్ల పోషించునదిగూడ భగవంతుడే. మరియు ఆ పరమాత్ముడు వైశ్వానర రూపమున ప్రాణులదేహములలో ప్రాణాపానములతోగూడి భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యము లనబడు చతుర్విధాన్నములను పచనము చేయుచున్నాడు.

భగవంతుడు సర్వప్రాణుల హృదయమున నున్నాడు. ''శాస్తా విష్ణు రశేషస్య జగతో యో హృదిస్థితః''2 అని విష్ణుపురాణము. ''ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి''3 అని గీతలోనే మరొకచో కృష్ణుని వచనము.

సమస్తప్రాణుల స్మృతి, జ్ఞానము, విస్మృతి అనునవిగూడ ఆయనవలననే ప్రవర్తిల్లుచున్నవి. పూర్వానుభూత విషయకమైనది స్మృతి, అనుభవసంస్కారముచే గల్గునది జ్ఞానము. జ్ఞాన నివృత్తిరూపమైనది విస్మృతి. సర్వవేదవేద్యుడు, వేదాన్త కర్త, వేదవేత్త ఆ పరమాత్ముడే.

గీతలో పదునైదవ అధ్యాయమగు పురుషోత్తమ ప్రాప్తియోగము శిష్టులచే భోజనకాలమున పారాయణము చేయబడుచున్నది. అందుకు కారణము ఇందలి 14 వ శ్లోకములో వైశ్వానరోపాసన చెప్పబడియుండుటయే.

---

1. గీత. , 15-13, 14, 15.

2. విష్ణు. , 1-17-20. 3. గీత. . 18-61.

## 9

అవ:—రక్తితో జేయు పరసేవకంటె విరక్తితో జేయు హరిసేవ మేలను చున్నాడు.

### శ్రీరాగం

చాలునిదే నా విరతి - సకల సామ్రాజ్యము
నాలోని పని యెంతైనా - నా నాకుఁ గలదు. ॥పల్లవి॥

1. వడఁబడి పరులిండ్ల - వాకిలిగాచే నేను
వడి నాలో హరియున్న - వాకిలి గాచేను.
బడి నౌకరిఁగొలిచి - బహురాజ్యమేలే నేను
యెడ నా మనోరాజ్య - మింతా నే లేను. ॥చాలు॥

2. చేరి యొరులకుఁ బని - వేసి యలపే నేను
సారె నా యోగాభ్యా - సాన నలసేను.
ఆరసి నే నడుగఁగ - నన్యులిచ్చే యీవులు
తారి పూర్వ కర్మాది - దైవమే యిచ్చివి. ॥చాలు॥

3. అందు సంతోషమే ఫల - మిందు సంతోషమే ఫల
మందును మాయాకల్పిత - మిందును మాయే.
అందు నిందు శ్రీ వేంక - టాధీశుఁడే కర్త
అందైతేఁ బరతంత్రుఁ - డిందునే స్వతంత్రుఁడ. ॥చాలు॥

ప॥ విరతి = వైరాగ్యము.

1. వడఁబడి = శ్రమపడి.

2. ఈవులు = త్యాగములు, దానములు: తారి = సమీపించి.

నా వైరాగ్యమే నాకు సకలవిధ సంపదలతోగూడిన సామ్రాజ్యమై యున్నది. ఇదే నాకు చాలును. ఇతరరాజ్యములతో నాకు పనిలేదు. విరక్తుడనై నివృత్తిమార్గమున నడచు నేను నాకై నాలో జేసికొనవలసినపని (ఆత్మవిచారము) ఎంతో కలదు.

ఇంతవరకు సంసారమే శాశ్వతమని భ్రమించి ఎంతో శ్రమించి ఇతరమాన వుల యిళ్ళ వాకిళ్ళు గాచుచుంటిని. ఇప్పుడు నాకు జ్ఞానోదయ మైనది. నా వైరాగ్య సామ్రాజ్యముయొక్క గొప్పతనమును గుర్తించితిని, నాలో అంతరాత్మగా నున్న పరమాత్మను గ్రహించితిని. ఆయనకు నివాసమైన హృదయమునే ఇప్పుడు లక్ష్యము జేసికొని కాచుకొనియున్నాను. ఇంతదనుక ఇతరులను సేవించి వారిరాజ్యము లేలు చుండిన నేను నాలోని మనోరాజ్యమునే ఇప్పుడు పాలించుచున్నాను.

ఇతరులకు పలుతెరగుల చాకిరిజేసి అలసిపోవుచుండిన నేను ఇప్పుడు చిత్త వృత్తి నిరోధాత్మకమైన[1] నా యోగాభ్యాసముతోనే అలసిపోవుచున్నాను. నేను యాచిం పగా ఇంతవరకు ఇతరులు నా కొసగుచుండిన సంపదలు ఇప్పుడు నా పూర్వకర్మాత్మక మైన దైవమే తనకు తానుగా ఇచ్చుచున్నది.

ఇంతవరకు నేను చేయుచుండిన పనికి ఫలము సంతోషమే. ఇప్పుడు నేనొనర్చు పనికిగూడ ఫల మదే. అదియు హరిమాయచే కల్పితమే. ఇదిగూడ హరిమాయా విలాసమే. ఆ ప్రవృత్తిమార్గమునకును, ఈ నివృత్తిమార్గమునకును కర్త శ్రీ వేంక టేశ్వరు డొక్కడే. కాని ఆ మార్గములో నున్నంతవరకు నేను పరతంత్రుడనై యుంటిని. ఈ త్రోవలో కాలిడినతర్వాత స్వతంత్రుడనైతిని.

వి:—ప్రవృత్తిమార్గమునకును, నివృత్తిమార్గమునకును గల భేద మిచట నిరూపింపబడినది. పరసేవచే జీవించు ప్రవృత్తిమార్గస్థుడగు సంసారి సేవాధర్మము నాశ్రయించి పరతంత్రు డగుచున్నాడు. పరతంత్రవృత్తి దుఃఖభూయిష్ఠమైనది.

సేవాధర్మ మెంత గహనమైనదో చెప్పుచు భర్తృహరి యిట్లనెను:-

మౌనాన్మూకః ప్రవచన పటుర్వాచకో జల్పకో వా
ధృష్టః పార్శ్వే భవతి చ వసన్ దూరతోఽప్యప్రగల్భః ।
క్షాన్త్యా భీరుర్యది న సహతే ప్రాయశో నాభిజాతః
సేవాధర్మః పరమగహనో యోగినా మప్యగమ్యః ॥2

దీని భావమిది:- మౌనముగా నున్నచో మూగయనియు, పటువుగా మాటాడినచో ప్రేలరియనియు, దగ్గఱనున్నచో దిట్టయనియు, దూరముగ నున్నచో ప్రగల్భుడు

1. యోగశ్చిత్తవృత్తి నిరోధః - యో-సూ-, 1-2.

2. భర్తృ. , 1-47.

గాడనియు, ఓర్పుతో నున్నచో భీరువనియు, ఓర్మిలేనిచో అభిజాతుడు గాడనియు సేవకుని ప్రభువులు నిందింతురు. కాన సేవాధర్మము మిగుల గహన మైనది. యోగులకుగూడ అగమ్య మైనది.

విరక్తు డితరులపై ఆధారపడడు. అతడు తన అంతరాత్మయైన హరి మాత్రమే నమ్మను. కాన ఇతడు స్వతంత్రుడు. స్వతంత్రవృత్తి సుఖావహమైనది. సేవకుడుగూడ సంతోషమును గోరియే ఒరుల సేవించుచున్నాడు. కాని పరతంత్రుడై పడయు సుఖము నిజమైన సుఖము గాజాలదు. లోకములో సమస్తవస్తువులు భయముతో గూడినవి, వైరాగ్య మొక్కటే నిర్భయమైనదని భర్తృహరి నుడివెను.

సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్య మేవాభయమ్ ॥1

మరియు ప్రవృత్తి నివృత్తిమార్గములు రెండును హరిమాయా విలసితములే. కాని హరిని నమ్మినవాడు పరమపదముచేరి శాశ్వతసుఖము నొందును. పరుని నమ్మినవాడు క్షణికభోగము లనుభవించినను చావుపుట్టుకల క్లేశమునుండి తప్పించుకొనలేడు. కాన విరక్తుడైన హరిసేవాపరుని మార్గమే శ్రేష్ఠమైనది.

## 10

అవ:—తనసర్వస్వము భగవంతునిదే కాన తిరిగి తన్ను భగవంతునికి సమర్పించుకొనుట హాస్యాస్పదమే యగు ననుచున్నాడు—

### గుండక్రియ

నీవే నేసిన చేత - నీవే చేకొనుటింతే
యీవల నీసొమ్ము నీకే-యియ్య నిగ్గయ్యీ నయ్యా॥ ॥పల్లవి॥

1. అలుబిడ్డలఁగని - యటు దవమగనికి
పేలాన సమర్పణ - సేయవలె నటయ్యా.
తాలిమిఁ బుణ్యాలు సేసి - దైవమా నే నీకు
యే లీల సమర్పించే - విందుకే నవ్వు వచ్చీనయ్యా. ॥నీవే॥

---

1. భర్తృ. , 3-31.

2. అంకెలం గన్నకొడుకు - కటు దమ తండ్రికివి
తెంకి నీ వాండనని - తెలుపంగవలె నటవయ్యా.
లంకె నాలోపల నున్న - లక్ష్మీశ నే నీకు
పొంకపు బంటనౌటం - బునరుక్తయ్యా నయ్యా ॥నీవే॥

3. తన నీడ యద్దములోం - దానే యటు చూచి
పనివడి పూరకే - భ్రమయవలె నటయ్యా!
అనుగు శ్రీ వేంకటేశ! - ఆతుమలోనున్న నిన్ను
గని మని శరణంటిం - గడం బూజించనేలయ్యా. ॥నీవే॥

1. సీలాన = శీలముతో.

2. అంకెలం = సమీప మునందలి; తెంకి = చెంకి, స్థానము.

3. ఆతుమలో = ఆత్మలో.

దేవా! నే నొనర్చు పనులన్నియు నీ ప్రేరణచే గలిగినవే. నా స్వరూపముగూడ నీ కల్పనయే. కాన నన్ను, నాపనులను నీవు పరిగ్రహించుట యనగా నీవు చేసినపని నీవే పరిగ్రహించుటయే గాని వేతేమియు గాదు. నీ వస్తువులను నీవే చేకొనవలెనుగాని ఇతరులు నీ కీయవలసిన పనిలేదు. కాబట్టి నీ సొమ్మునే నీకు సమర్పించవలసి వచ్చి నందుకు నేను మిక్కిలి సిగ్గుపడుచున్నానయ్యా!

సతి పతితో కాపురముచేసి బిడ్డల గన్నది. ఇక ఆ బిడ్డ లాయనకు చెందినవారే గదా! 'ఇదిగో! ఈ బిడ్డలను నీకు సమర్పించుచున్నాను' అని ఆమె వారి నతని కర్పింపవలెనా? దేవా! నే నెన్నో పుణ్యకార్యములు నీప్రేరణచే చేయుచున్నాను. కాన అవి నీకు చెందినవే గాని నావి గావు. నీ పుణ్యములను మరల నీకే నేనెట్లు సమర్పింపగలను? ఈ పింతపనికే నాకు నవ్వు వచ్చుచున్నదయ్యా!

తండ్రిచెంత నున్నకొడుకు ఆయనతో 'నేను నీ కుమారుడను' అని తెలుపుకొన వలసినపని యేమున్నది? నాహృదయమునం బ్రభుడవై నన్నేలుచున్న లక్ష్మీశ్వరా! నేను నీకు పొందికైన బంటునని వేతే చెప్పుకొనవలెనా? అట్లు చెప్పినచో అది పునరుక్తియే గదా!

తన నీడను తానే అద్దములో చూచుకొని ఎవరో మరొక రందున్నారని ఊరక భ్రమపడుట తగునా? ఓ ప్రియమైన శ్రీ వేంకటేశ్వరా! నా ఆత్మలో నీవున్నావు.

నిన్ను చూచి ఆనందించి నీకు నేను శరణాగతుడనైతిని. మఱల ప్రత్యేకముగా నీవెందో ఉన్నావని తలంచి అక్కడ నీకు పూజ లొనర్పవలెనా ?

విశే:—భక్తులు భగవంతుని అనేకరీతుల సేవింతురు. శ్రవణకీర్తనాదులైన భక్తిమార్గములెల్ల ఆ సేవావిధానములోని భేదములే. తన్ను, తన సర్వస్వమును భగవంతునికి సమర్పించుకొనుట అందులో నొకటి. ఇదే 'ఆత్మనివేదన'మని చెప్పబడుచున్నది.

కాని నిజముగా ఆలోచించినచో ప్రపంచమున నున్న దంతయు దేవునిదే. 'ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్'[1] ఇత్యాది శ్రుతులీ సత్యమునే చాటినవి. జీవుని దేమియు లేదు. ఇక జీవుడు దేవుని కేమి సమర్పింపగలడు ? అట్లు సమర్పించుట వింతగా నున్నదని అన్నమయ్య ఈ పాటలో తేటపరచుచున్నాడు.

జీవులు స్వతంత్రులు కారు. దేవుడే స్వతంత్రుడు. జీవు లొనర్చు సత్కర్మలు దేవుని ప్రేరణాఫలములే. అందరి హృదయపీఠముల నధిష్ఠించిన ప్రభు వాపరమాత్ము డొక్కడే. కాన సర్వదా భగవద్భావనతో జీవుడు పవిత్రుడు కావలెను.

తన్ను భగవంతునికి సమర్పించుకొనుట శరణాగతుని కర్తవ్యమని శాస్త్రములు నిర్దేశించుచున్నవి. తన దేమియు లేదనియు, అంతయు భగవంతునిదే యనియు భావించి తదనుగుణముగా ప్రవర్తించుట శరణాగతిలో పరాకాష్ఠకు చెందిన తత్త్వమై యున్నది. ఆ తత్త్వమునే అన్నమయ్య ఈ పాటలో నిరూపించినాడు.

11

అవ:—ఛాయాఽపహారులైన కవులను గర్హించుచున్నాడు—

రామక్రియ

వెఱ్ఱులాల మీకు - వేడుక గలితేను
అఱ్ఱువంచి తడు - కల్లంగ రాదా. ॥పల్లవి॥

1. ముడిచివేసిన పువ్వు - ముడువ యోగ్యము గాదు
కుడిచివేసిన పుల్లె - కుడువఁగాఁ గాదు.
బడి నొకరు చెప్పినఁ - బ్రతి చెప్పఁబోతేను
అడరి శ్రీహరి కది - అరుహము గాదు. ॥వెఱ్ఱు॥

1. ఈశ., 1.

2. గంపెఁడుముక దినఁ - గా నొక్క పరిగింజ
తెంపునఁ గలసితే - తెలియనెట్లు వచ్చు,
జంపులఁ బలవరించఁగ నొక మంచిమాట
ఇంపైతే హరియందు - కిచ్చునా వరము. ॥వెట్టు॥

3. ఉమిసిన తమ్మలో - నొక కొంత కర్పూరము
పమకూర్చి చవిగొని - చప్పరించ నేల,
అమరఁగ ఛాయాప - హారము వేసుక
తమమాట గూర్చితే - దైవము నగఁడా ॥వెట్టు॥

4. చిటికివేసినగింజ - చేతఁబట్టఁగ నేల
గటుక కెంగిలిబూరె - గదుగగ మరి యేల
తొటుక కవిత్వాల - దోషాలఁ బొరలితే
దిటుకార నవ్వఁడా - దేవుఁడైనాను. ॥వెట్టు॥

5. మించు చద్దికూటి - మీఁద నుమిసినట్టు
మంచి దొకటి చెప్పి - మరి చెప్పనేరక,
కంచుఁబెంచు నొక్క - గతి నదికితే మటు
పెంచువలెనే చూచు - పెరుమాళ్లు వాని ॥వెట్టు॥

6. పుచ్చినట్టి పండు - బూఁటిలోనవె వుండు
బచ్చన కవితలు - బాఁతి గావు యెందు,
ముచ్చుఁగన్న తల్లి - మూల కొదిగినట్టు
ముచ్చిమి నుతులేల - మొక్కరో హరికి. ॥వెట్టు॥

7. ఉల్లి దిన్న కోమ - టూరక వున్నట్టు
జల్లెడ నావాలు - జారిపోయినట్టు,
కల్లలు చెప్పి యా - కథకు త్తరములేఁక
మెల్లనే వుండితే - మెచ్చునా దైవము. ॥వెట్టు॥

8. నేతి బీరకాయ - నేయి అందులేదు
రాతి పీఁటనికి బీ-రము యుంచుకాలేదు.
ఘాత బూఁతుగుఁబండు - కడుపులోన దూది
యేతుల నుడుగులు - యెక్కునా హరికి. ॥వెట్టు॥

9. ఇరుగు వా రెరఁగరు - పొరుగువా రెరఁగరు
గొరబైన మాటలు - గొణఁగుచు నుందురు.
పరులఁగా దందురు - బాఁతిగారు తాము
విరసు లట్టివారి - విడుచు దేవుఁడు. ॥వెట్టు॥

10. ఎన్నగ శ్రీ వేంక - టేశుఁ దాళ్ళపాక
అన్నమాచార్యులు - అఖిల దిక్కులు మెచ్చ
నున్నతితోఁబాడి - రొకఁ డెవ్వఁడో తాను
సన్న నొరమునట - సమ్మతా హరికి. ॥వెట్టు॥

ప॥ కలితేను = కలిగితేను.

1. బడిఁ = క్రమమున, అరుహము = అర్హము, తగినది.

2. జంపులఁ = విడివిగా.

3. తమ్మ = చర్వితతాంబూలము, ఛాయాపహారము = నీడను దొంగిలుట - ఒకరి కవితాచ్ఛాయను గ్రహించి మరొకరు కవిత్వ మల్లుట.

4. గబుకకు = కబళమునకు; తొబుక కవిత్వాలు = నిస్సారమైన కవితలు; దిబు కార = సశబ్దముగా, (దిముకు = మృదంగశబ్దము).

5. పెంచు = పెంకు, ముట్టుపెంచు = అంటునడిన పెంకు.

6. బాఁజి = బాజా; బచ్చన కవితలు = పై పై మెఱుగు కవితలు; ముచ్చిమి మతులు = దొంగతనపు స్తుతులు.

8. ఏతుల నుడుగులు = విడివి మాటలు.

9. గొరబైన = వికృతమైన-(చూడు. 22 సంపు. సందిగ్ధపద సమీక్ష.)

10. సన్నఁ = సంజ్ఞతో, ఒరమఁ = మచ్చరించును.

పెఱ్ఱి కప్పలారా! మీకంత వేడుకగల్గినచో మెడవంచి తడిక అల్లుకొనరాదా? (మీధోరణి కనువైన కవితలు మీరు చెప్పుకొనరాదా? ఒరుల ననుకరించి నవ్వుల పాలగు టెందుకు? అని భావము.)

ఒకరు తలదాల్చిన పూవు మరొకరికి దాల్పదగదు. ఒకరు భుజించిన విస్తరి మరొకరికి భుజింపదగదు. ఒకరొక క్రమమున శ్రీహరినిగూర్చి కవిత చెప్పగా దానికి దీటుగా మరొకరు ఆ పదములనల్లే గ్రహించి కొన్ని స్వయముగా కల్పించుకొని చెప్ప బోయిన ఆ దేవున కట్టి కవిత్వ మర్హమైనది గాదు.

ఒకడు గంపెడు పొట్టు దిన్నాడు. అందొకే ఒక వరిగింజ కలిసియుండినది. అతడు దిన్న పొట్టే కనిపించునుగాని వరిగింజగూడ అందు కలదనుసంగతి లోకమున కెట్లు తెలియును? అట్లే ఒకడు కవిత చెప్పుటాని చాలసేపు ఏమేమో పలవరించి నాడు. అందొకే ఒక మంచిమాట యింపైనది కలదు. దానికి మెచ్చి హరి అతని కభీష్టము లిచ్చునా?

ఒకడు చవిగొని ఉమ్మి వేసిన తాంబూలములో కొంత కర్పూరము కలిపి రుచి యని చప్పరించు టెందుకు? ఒకని కవితాచ్ఛాయను దొంగిలించి అందు తమ మాటలు కొన్ని కూర్చినవానిని జూచి దేవుడు పరిహసింపడా?

ఒకడు చప్పరించి పారవేసిన గింజ మరొకడు చేకొనుట తగదు. ఒక డెంగిలి చేసిన బూరెను కబళముగా గొనుటకై మరొకడు కడుగుట ఉచితము గాదు. విస్తార మైన కవితలకు సంబంధించిన దోసములలో బొరలెడు వానిని జూచి దేవుడైనను విరుగబడి నవ్వకుండడు.

చద్దికూటిపై ఉమ్మి వేసినట్లు, మంచిమాట ఒకటిచెప్పి తరువాత చెప్పలేక కంచు పెంకు ఒక్కటిగా అతికినట్లు అతుకులబొంతకైత లల్లినవానిని భగవంతుడు ముట్టుపెంకువలె అస్పృశ్యునిగానే చూచును.

పుచ్చిపోయిన పండు బూజుపట్టిపోవును. లోకము దాని వాశింపదు. అట్లే పసలేని పైపై మెఱుగు కవితలు లోకమున నాదరింపబడవు. దొంగను గన్న తల్లి సిగ్గుతో మూలనొదిగి నిలబడినట్లు నక్కినక్కి చేసెడు ఈ దొంగతనపు స్తుతు లెందుకు? ఊరక భగవంతునికి సాగిలబడి మ్రొక్కుడు. అదే చాలును.

ఉల్లి దిన్న కోమటి ఆ గబ్బు ఎదుటివానికి తెలియునేమో యని మాటలాడక ఊరకుండును. జల్లెడలో బోసిన ఆవాలన్నియు జారిపోవును. అట్లే ఏదో బొల్లి కైత చెప్పి తెలిసినవారు దానిపై ప్రశ్నింపగా తగిన సమాధానము లొసంగలేక

పేరేమో నేతిబీరకాయ. కాని అందు నేయిలేదు. రాతితోచేసి నిలబెట్టిన పీఁడకు ఇనుమంతయు పరాక్రమము లేదు. బూరుగుపండు నెంతగా పరిశీలించినను దానిలో దూదియే కాని ఆస్వాదింపదగిన సారాంశ ముండదు. అట్లే నిడుపులైన మీ ఆలోపన్న మాటలు సారహీనములుగాన హరికి రుచింపవు.

మీరు చెప్పుమాట లిరుగువారికి తెలియవు. పొరుగువారికి తెలియవు. మీరేవో వికృతములైన పలుకులు గొణుగుకొనుచుందురు. పైగా ఇతరుల నీసడించుకొను చుందురు. లోకము భ్రాంతిపడదగిన పస మీలో లేదు. మీవంటి విరసులను దేవుఁడు పరిగ్రహింపడు.

తాళ్ళపాక అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని నలుదిక్కులు మెచ్చునట్లు త్యున్నతముగా కీర్తించిరి. ఎవడో ఒకడు తాను పయిపయిమాటలతో ఆయనతో పోటీ పడునట: అది శ్రీహరి కంగీకారమా?

విశే:—కొంగ్రొత్తధోరణిలో అన్నమయ్య భగవంతుని కీర్తించుచు వ్రాసిన కవితలు ఆ కాలముననే ప్రజలలో సత్వరముగ వ్యాపించి ఆయన కెనలేని కీర్తి ఘటించినవి. ఇతరకవు లాధోరణిలోనే కవితలు చెప్పి తాముసు అట్టికీర్తి నొందవలె నని తలచి ఆయన కవితాచ్ఛాయల నపహరించి కవిత లల్లిరి. కాని ఆ పదకవితా పితామహునివలె రసము చిప్పిలునట్లు పదములు పాడు నేర్పు వారి కబ్బ లేదు. వారి అనుకరణము హాస్యాస్పదమైనది. తన్ననుకరింపబూనిన ఛాయాప హారులను అన్నమయ్య ఈ సంకీర్తనమున తీవ్రముగా గర్హించినాడు.[1] ఈ గర్హణ లోని తీవ్రత ఇందలి ఉపమానాంశములగు "ముడిచివేసిన పువ్వు, కుడిచివేసిన పుల్లె, గంపెడుపుక, ఉమిసిన తమ్మ" ఇత్యాదులచే మిక్కిలి స్పష్టముగా వ్యక్తీకరింపబడు చున్నది. అన్నమయ్యకు సమకాలికులగు ఆ అనుకర్తలెవరో మనకు తెలియుటలేదు.

---

1. ఈ పాటలోని "అన్నమాచార్యులు ఉన్నతితోఁ బాడిరి" అను వాక్యమును బట్టి ఈ సంకీర్తనము అన్నమయ్య పాడినది కాదేమో అను సంశయము కల్గుట కవకాశమున్నది. అన్నమయ్య పాటలరేకులలో ఆయన సంతతికి జెందిన తరువాతి కవులు రచించిన పాటలుగూడ కొన్ని క్వాచిత్కముగ గలవు. 8-వ సంపుటములోని 126, 183; 9-వ సంపుటములోని 184 వ సంకీర్తనము ఇత్యాదులు అన్నమయ్యవి కావనుటకు అవే సాక్షిగా నున్నవి. కాని ప్రకృత సంకీర్తనములోని పదబంధము తీరు, భావతీవ్రత పరిశీలింపగా ఇది అన్నమయ్యదే అన్న తలంపు స్థిరపడుట కవకాశ మున్నది. శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిలవారు మున్నగు పెద్దలు దీనిని అన్నమయ్య దిగనే గుర్తించిరి. (చూ: అన్నమాచార్య చరిత్ర పీఠిక—పుట. 102).

ప్రబంధవాఙ్మయమునందుగూడ ఛాయాపహారులైన కుకవులను నిందించుట కలదు. ఆంధ్ర కవితాపితామహుడగు అల్లసాని పెద్దనార్యుడు కుకవిని చోరునిగా నిరూపించుచు నిట్లు దూషించెను.

భరమైతోచు కుటుంబరక్షణకుగాఁ బ్రాల్మాలి చింతన్ నిరం
తరతాళీదళ సంపుట ప్రకర కాంతారంబునం దర్థపుల్
దెరువాటుల్ దెగికొట్టి తజ్జ్ఞ పరిషద్విజ్ఞాత చౌర్యక్రియా
విరసుండై కొఱఁతన్ బడున్ కుకవి పృథ్వీ భృత్సమీపక్షితిన్.1

వాఙ్మయజగత్తులో అనుకరణము కవులకు సహజము. సుప్రసిద్ధములైన మహా కావ్యములలోనే భావైక్యము కొల్లలుగా గలదు. భిన్నభిన్నకావ్యములలో పరస్పర భావైక్య మున్నను అది రసోల్లసితమైనప్పుడు దోషము లేదు. సాహిత్యప్రపంచమున నిట్టి సంవాదముల స్వరూపమును తీక్ష్ణముగా పరిశీలించిన ధ్వనికారు డీవిషయమున నిట్లు సిద్ధాంతీకరించియున్నాడు.

"మేధావుల భావనలలో సంవాదము లనునవి ఉండక తప్పవు. అవియన్నియు ఏకరూపములే అని భావించుట తగదు. అన్యసాదృశ్యరూపమైన సంవాదము శరీరులకు ప్రతిబింబమువలె, చిత్రాకృతివలె. తుల్యశరీరివలె ముత్తెఱగుల నుండును. అందు అనన్యాత్మకము, తుచ్ఛాత్మకము అగు మొదటి రెండుతెగల సంవాదములు పరిహరింపదగినవి. మూడవదగు ప్రసిద్ధాత్మకసంవాదము ఉచితమైనదే కాన త్యజింపరాదు."

సంవాదాస్తు భవన్త్యేవ బాహుళ్యేన సుమేధసామ్ ।
నైకరూపతయా సర్వే తే మన్తవ్యా విపశ్చితా ॥
సంవాదో హ్యన్యసాదృశ్యం తత్పునః ప్రతిబింబవత్ ।
ఆలేఖ్యాకారవత్తుల్య దేహివచ్చ శరీరిణామ్ ॥
తత్రపూర్వ మనన్యాత్మ తుచ్ఛాత్మ తదనన్తరమ్ ।
తృతీయంతు ప్రసిద్ధాత్మ నాన్యసామ్యం త్యజేత్కవిః ॥2

కావున అన్నమయ్య, పెద్దన మున్నగువారు ధ్వనికారుడు చెప్పిన ప్రతిబింబకతుల్యములైన అనుకరణములనే నిందించినట్లు గ్రహింపవలెను.

---

1. మనుచ - పీఠిక-9.

2. ధ్వన్యా. IV; 11, 12, 13.

అన్నమయ్య పలుకుబళ్ళను విజయనగర కవులును, తదితరులును, తమ కావ్యములలో ఎక్కువగా ప్రయోగించుచున్నారు.[1] అన్నమయ్య తర్వాత పదసాహిత్యమున శృంగారరచనలతో క్షేత్రయ్య, ఆధ్యాత్మికరచనలతో త్యాగయ్య ఎక్కువ ప్రశస్తిగాంచిరి. "అన్నమాచార్యుని శృంగార సంకీర్తనరచనాంశము క్షేత్రయ్యగను, అధ్యాత్మ సంకీర్తన రచనాంశము త్యాగయ్యగాను అవతారము దాల్చెనన జెల్లును"[2] అని శ్రీ వేటూరివారి వచనము. వేమనలోగూడ తాళ్ళపాకవారి ఛాయలు గలవని శ్రీ శాస్త్రిగారే తెలిపియున్నారు.

## 12

అవ:—అజ్ఞానఫలములైన పాపము, కలిదోషము, కామము మున్నగువాటి వారినుండి తమ్ము రక్షింపుమని శ్రీపతిని వేడుకొనుచున్నాడు.

### లలిత

కడు నజ్ఞానపు - కరవుకాల మిదె
వెడలదొబ్బి మా - వెరపు దీర్చవే. ॥పల్లవి॥

1. పాపపు పసురము - బందెలు మేయఁగ
పోపుల పుణ్యము - పొలివోయ,
శ్రీపతి నీకే - చేయి చాఁచెదము
యేపున మమ్మిఁక - నీదేర్చవే. ॥కడు॥

2. అలఁగలి యుగమను - యెండలు గాయఁగ
చెలఁగి ధర్మమను - చెరువింకె,
పొలసి మీ కృపాం - బుధిచేరితి మిదె
తెలిపి నా దాహము - తీర్చవే. ॥కడు॥

---

1. చూడు: 6 సం. - 12 సంపు. ద్వి. ముద్రణ - పీఠిక. P. P. 41-47.
2. అ. చ. పీ. , P. 101.

3\. వడిగొని మనసిజ - వాయువు విసరఁగ
పొడవగు నెఱుకలు - పుటమెగసె
ఇడె శ్రీ వేంకట - పతి నీ శరణము
విడువక చొచ్చితి - వెసఁగావఁగదే. ॥కడు॥

1\. పోపులు = ప్రోపులు, పోషణములు, పొలివోయ = నశించెను.

2\. పొలసి = తిరిగి; కృపాంబుధి = దయయను సముద్రము.

3\. మనసిజవాయువు = మన్మథుడను గాలి, పుటమెగసెక = మీది కెగిరి పోయెను; వెసఁ = శీఘ్రముగా.

దేవా ! ఇదిగో ! మిక్కిలి అజ్ఞానమనెడు కరవుకాలము మమ్ము పైకొన్నది. ఈ అజ్ఞానమును కడకునెట్టి మా భయమును తొలగింపుమా !

పాపమను పశువు బందెలు మేసినది. మేము శ్రమపడి పెంచుకొన్న పుణ్యమను పైరు నశించినది. శ్రీపతీ ! దీనులమైన మేము నీ దయాభిక్షగోరి నీకే చేయి చాచితిమి. ఇక నీవే మమ్ము కడతేర్చుము.

కలియుగమను మండుటెండలు కాయగా భువిలో ధర్మమను చెరువు ఇంకి పోయినది. ఇటునటు తిరిగి చివరికి ఇదిగో మేము నీదయ యనెడు జలరాశిని చేరు కొంటిమి. ఈ దుఃస్థితి గ్రహించి మా దప్పిక దీర్చుము.

కామమను వడగాడ్పు వడిగా విసరగా మే మార్జించిన గొప్ప విజ్ఞానము అన్నియు త్రుటిలో మీది కెగిరిపోయినవి. శ్రీ వేంకటేశ్వరా ! తుదకు విన్ను వదలక శరణు జొచ్చితిమి. త్వరగా మమ్ము కాపాడుమా !

వి:—జీవుల నావరించిన అజ్ఞానము ఈ సంకీర్తనమున భయంకరమైన కరవు కాలముగా నిరూపింపబడినది. కరవుకాలములో అపురూపముగా పెంచుకొన్న పంటలను పశువులు మేసిపోవుట, మండుటెండలు గాయుట, వడగాడ్పులు విసరుట మున్నగు కష్టములు సంభవించును. వాటికి గురియైనజనులు దీనులై దయగల ప్రభువుల నాశ్రయించి బ్రదుకుట కలదు. అట్లే అజ్ఞానమునకు లోబడిన జీవులు పాపము లాచరించుచు ఇంద్రియనిగ్రహము గోల్పోయి పుణ్యవిహీనులు, ధర్మరహితులు, ప్రజ్ఞాహీనులు ఆగుదురు. అట్టివారు భగవంతుని శరణుజొచ్చి తరింపవలెను.

'అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః'1 అన్నట్లు జ్ఞానము అజ్ఞానముచే ఆవరింపబడియుండుటవలననే జీవులు మోహములకు గురియగుచున్నారు. అందువలననే పాపకృత్యము లొనర్చుట, ధర్మము నశించుట, కామప్రవృత్తి విజృంభించుట జరుగుచున్నవి. కాన అజ్ఞానమును నశింపజేసికొనుటయే జీవుల ముఖ్య కర్తవ్యము.

జ్ఞానముచే ఎవరి అజ్ఞానము నశింపజేయబడునో, వారికి ఆ జ్ఞానమే పరబ్రహ్మ స్వరూపమును సూర్యునివలె ప్రకాశింపజేయుచున్నదని గీత చెప్పుచున్నది.

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥2

అజ్ఞానమును తొలగించుకొనుటకు భగవంతునికృపయే ముఖ్యసాధనము. దేవుని శరణుజొచ్చిన జీవులు ఆయన అనుగ్రహమునకు పాత్రులగుదురు. వారికి అజ్ఞానఫలములైన పాపము, కలిదోషము, కామదోషము అనునవి అంటవు. అందువలన పుణ్యము, ధర్మము, ఆత్మజ్ఞానము వృద్ధి కాగలవు.

కాన ముముక్షువు లెల్లరు అజ్ఞాననివృత్తికై భగవానుని హృదయపూర్వకముగా ప్రార్థింపవలెననుట ఇందలి పరమార్థము.

## 13

అవ:—భగవదిచ్ఛ నతిక్రమించి ముక్తికై పాటుపడుటగూడ తప్పిదమే యనుచున్నాడు.

గుజ్జరి

భావించనేర నైతి - పశుబుద్ధి నైతిని
యీవల నా యపచార - మిది గావవయ్యా! ॥పల్లవి॥

1. హరి నీవు ప్రపంచ - మందుఁ బుట్టించితి మమ్ము
పరము నే సాధించేది - బలు ద్రోహమవుఁగాదో,
సిరుల నేలేటివాఁడు - చెప్పినట్టు సేయక
వికసాలు బంట్లకు - వేరే సేయఁదగునా? ॥భావిం॥

1. గీత., 5-15. 2. గీత., 5-16.

2. పంచేంద్రియములు నాపైఁ - బంపు వెట్టితివి నీవు
ఎంచి వాని దండించే - దిది నేరమౌఁగాదో,
పెంచేటి తల్లిదండ్రులు - ప్రియమై వడ్డించఁగాను
కంచము కాలఁదన్న సం - గతియా బిడ్డలకు ? ॥భావిం॥

3. మిక్కిలి సంసారము - మెడఁగట్టితివి నాకు
అక్కర నే వేసారేది - అపరాధ మవుఁగాదో,
దిక్కుల శ్రీ వేంకటాద్రి - దేవుఁడ నీవియ్యఁగాను
ఎక్కడో జీవుఁడ నేను - యెదురాడఁదగునా ? ॥భావిం॥

1. పరము = మోక్షము; విరసాలు = విరుద్ధమైన నడవడికలు.

2. పంపు వెట్టితివి = ఆజ్ఞ వెట్టితివి, నియమించితివి

దేవా ! లోకపాలకుడవైన నీయొక్క మహిమాతిశయమును, నా పరతంత్ర తను నేను ఊహింపజాలనైతిని. అజ్ఞానవశమున కేవలము పశుప్రాయుడనైతిని. ఇది నీయెడల నే నొనర్చిన గొప్ప తప్పిదము, దయజూచి యీనా నేరమును మన్నించి నీవే కాపాడుమయ్యా !

శ్రీహరీ ! నీవు కదా మమ్మీప్రపంచములో బుట్టించితివి. అట్లు పుట్టినవారము మేము పుట్టినట్లుండక నీయాజ్ఞను తిరస్కరించి మోక్షముకొఱకై యత్నించుట నీపట్ల దొడ్డ ద్రోహమొనర్చినట్లు కాదా ! సకలసంపదలొసగి పరిపాలించు ప్రభువు చెప్పినట్లు సేవకులు చేయవలెనుగాని అందుకు విరుద్ధముగాచేయుట తగునా ?

నీవు నాపై శ్రోత్రత్వ క్చక్షుర్జిహ్వాఘ్రాణము లనెడు ఐదింద్రియములను నియా మకములుగా నుండ నియమించితివి. అవి చెప్పినట్లు నేను చేయవలెనేగాని వాటిని నేను దండించుట నేరము కాదా ! ప్రేమతో బెంచు తల్లిదండ్రులు ప్రియముగా వడ్డిం చినదానిని బిడ్డలు తృప్తిగా తినవలెనేగాని కంచమును కాలదన్నుట ఉచితమా !

నీవే ఈ బరువైన సంసారమును నాకు అక్కరతో మెడగట్టితివి. దానిని నేను భరించవలెనేగాని శ్రమయని విసుగుకొనుట అపరాధమగునుగదా ! అన్నిదిక్కుల వ్యాపించి అంతట నిండియున్న ఓ వేంకటాద్రీశ్వరా ! - నీ విచ్చినదేదో నేను పుచ్చు కొని అనుభవించవలెనుగాని అణుస్వరూపుడనై ఎక్కడో ఒకమూలనున్న జీవుడనైన నేను నీ కెదురాడుట న్యాయమా ?

వి:—భవబంధమును వదలించుకొనవలెననియు, ముక్తికై పాటుపడవలె వనియు, పంచేంద్రియములను నిగ్రహింపవలెననియు ఆధ్యాత్మికగ్రంథములన్నియు నొక్కి ఎక్కాణించుచున్నవి.

అన్నమయ్యగూడ—

"చాలదా నా సంసారము
గాలి యుయ్యేలలఁ దొలఁగక యూగవలసె"[1]

"సడిఁబెట్టె కటకటా! సంసారము-మూడ
జడధిలోపలి యీత - సంసారము."[2]

ఇత్యాదులైన అనేక సంకీర్తనములలో సంసారమును పలురీతుల రూపడించి యున్నాడు. మరియు—

"ఊరకే దొరకునా ఉన్నతోన్నతసుఖము
సారంబు దెలిసికా జయము చేకొనుట."[3]

ఇత్యాదిపదములలో ముక్తికొఱకై తగుయత్నము చేయవలసిన ఆవశ్యకతను నిరూపించియున్నాడు.

'ఇన్నిచింతలు మఱచి - యింద్రియాలు గుదియించి"[4]

ఇత్యాదులలో ఇంద్రియములను నిగ్రహింపవలెనని ఉపదేశించియున్నాడు.

కాని ప్రకృతసంకీర్తనము ముక్తి సాధించుట ద్రోహమనియు, ఇంద్రియము నిగ్రహించుట నేరమనియు, సంసారముపట్ల విసుగు జెందరాదనియు బోధించుచున్నది. చదువరుల కిది కొంత వింత గొల్పకపోదు. కాని యిందలి యాంతర్యమేమన— సాధకుడు ముక్తికై పలుపాట్లు పడియు విఫలయత్నుడై విసిగి వేసారుట కద్దు. భగవదిచ్ఛ ననుసరించి తాను సంసారబంధమున నుండక తప్పదేమో అన్న నిర్వేదము వతిడు ప్రకటించుట న్యాయమే.

మరియు భగవంతుడు తన వినోదమునకై సృష్టిని సంకల్పించి జీవుల నిందు పరిభ్రమించున ట్లొనర్చినాడు. ఆయనయే కరుణించి వీరికి ముక్తిగూడ ప్రసాదింప గలడు. ఆయన దయలేక మోక్షము లభింపదు. పరతంత్రుడైన జీవుడు తనకు

---

1. అ. సం., 11-2-27.    2. అ. సం., 11-3-70.
3. అ. సం., 6-104.    4. అ. సం., 6-198.

తానుగా ఏమియు సాధింపజాలడు. అతడు చేయవలసినదెల్ల భగవంతుని శరణు జొచ్చుటయే. శరణాగతుల కా భక్తవత్సలుడు తన సాన్నిధ్యము నొసంగగలడు. కాన భగవదిచ్ఛానుసారము జీవించుచు భగవంతుని శరణొందవలెనే గాని తనకు తానుగా ఏమో సాధింపగలనని భావించి విఱ్ఱవీగుట తగదని గ్రహింపనగును.

మరియు భగవల్లీలయైన జగన్నాటకమును తా నతిక్రమింప దగదనుటలో జీవుని పరతంత్రత వ్యక్తమగుచున్నవి. అట్లతిక్రమింపరాదనుట అపచారమనుటచే భక్తుని భక్త్యతిశయము ప్రకటమగుచున్నది. అట్లని ఎల్లకాలము సంసారములో బడి యుండవలెనా ? అన్నచో అది కాదు. దేవునిపై భారమువేసినచో జీవుని చిక్కు ఆ దయానిధియే విడిపింపగలడనుట పరమార్థము. పైగా ముక్తి కిది సుకరమైన ఉపాయము. ఈ క్రింది పాటలో ఈ భావ మింకను స్పష్టముగా ప్రకటితమైయున్నది.

సామంతం

ఎందరితోఁ బెనగేను - యెక్కడని పొరలేను
కందర్ప జనక నీవే - గతిగాక మాకు. ॥పల్లవి॥

నిక్కి నా బలవంతాన - నేనే గెలిచే నంటే
నొక్క పంచేంద్రియముల - కోపఁగలనా ?
తక్కిన సంసారవార్ధి - దాటఁగలనో మరి
దిక్కుల కర్మబంధము - తెంచివేయఁగలనో ? ॥ఎంద॥

పన్నుకొన్న పాయమున - పరము సాధించేనంటే
యెన్న నీమాయ కుత్తర - మీయఁగలనా ?
వన్నెల నా మనసే - వంచుకోగలనో మరి
కన్నట్టి యీ ప్రపంచమే - కడవఁగఁ గలనో ? ॥ఎంద॥

ఉల్లములో నిన్ను ధ్యాన - మొగి నేఁ జేసేనంటే
తొల్లిటి యజ్ఞానము - తోయఁగలనా ?
ఇల్లిదే శ్రీ వేంకటేశ ! - యెదుటనే నీకు మొక్కి
బల్లిదుఁడ నౌదు గాక ! - పంద నేఁ గాఁగలనా ?[1] ॥ఎంద॥

---

1. అ. సం., 8-38.

## 14

అవ:—అజ్ఞానులలో అగ్రగామియైన తన్ను కాపాడినప్పుడే భగవంతుని కీర్తి సుప్రతిష్ఠిత మగు ననుచున్నాడు—

### బౌళి రామక్రియ

నే నొక్కడ లేకుండితే - నీ కృపకుఁ బాత్ర మేది
పూని నావల్లనే కీర్తిఁ - బొందేవు నీవు. ॥పల్లవి॥

1 అతి మూఢులలోన - నగ్రేసరుఁడ నేను
ప్రతిలేని ఘనగర్వ - పర్వతమను,
తతిఁబంచేంద్రియముల - ధనవంతుఁడను నేను
వెతకి నా వంటివాని - విడువఁగఁ జెల్లునా? ॥నేనొ॥

2. మహిలో సంసారపు సా - మ్రాజ్య మేలేవాఁడ నేను
యిహమునఁ గర్మవహి - కెక్కితి నేను,
బహుయోని కూపసం - పదఁ దేలేవాఁడ నేను
వహించుక నా వంటి - వానిఁదేనో పేవా? ॥నేనొ॥

3. భావించి నావంటి నీచుఁ - బట్టి కాచినప్పుడుగా
యే వంక నీ కీర్తి గడు - నెంతురు భువి,
నా వల్ల నీకుఁ బుణ్యము - నీ వల్లనే బ్రదుకుదు
శ్రీ వెంకటేశుఁడ యింత - చేరెఁ జుమ్మీ మేలు. ॥నేనొ॥

ప॥ పాత్రము = యోగ్యము.

1. అగ్రేసరుఁడ = ముందు నడచువాడను; ప్రతిలేని = సాటిలేని; ఘన గర్వ పర్వతమను = దొడ్డ గర్వమనెడి కొండను; తతిఁ = అదనులో.

2. కర్మవహికి = కర్మవిధికి; బహు యోనికూపసంపదఁ = అనేకములైన యోని కూపములనెడు సంపదలో; వహించుక = పట్టుబట్టి.

దేవా ! నేనొక్కడను లేనిపక్షమున నీదయ ప్రసరించుట కనువైనచోటు ఇంకెక్కడ కలదు ? ఎందును లేదు కావ నన్ను పూనికతో దయజూచుటద్వారా నా ఒక్కనివల్లనే నీకు కీర్తి కలుగవలసి యున్నది.

బొత్తిగా తెలివిలేని వారలలో నేను మొదటివాడను. పై పెచ్చు సాటిలేని మహా గర్వమనెడు పర్వతమునై యున్నాను. శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము అనెడు పంచేంద్రియములే నా సంపద. ఇన్ని యోగ్యతలు గల్గిన నా వంటి వానివి వదలిపెట్టుట నీకు తగునా ?

ఇలలో నేను సంసారమనెడు సామ్రాజ్యమును పాలించు ప్రభువును. ఇహ లోకమున కర్మలచే నేను మిక్కిలి ప్రశస్తి గాంచియున్నాను. వివిధజన్మములలో పెక్కు యోనికూపములనెడు సంపదలో నేను మునిగి తేలుచున్నాను. నావంటివాన్ని పట్టువట్టియైన నీవు మరొకచోట వెదకి తేగలవా ?

నావంటి నీచునిపై దయదాల్చి విడిచిపుచ్చక కాపాడినప్పుడు గదా లోకమంతట నీ యశోగరిమను గానమొనర్తురు. నన్ను రక్షించినచో నావలన నీకు పుణ్యము రాగలదు. నీవలన నేను క్లేశములేని సుఖస్థితిని పొందగలను. శ్రీ వేంకటేశ్వరా ! మన కిద్దరికి లంకె బాగుగా కుదిరినది. మనము పరస్పరము లాభపడు తరుణము వచ్చినది. కావన నన్ను కాపాడి పుణ్యము కట్టుకొనవయ్యా !

వి:—సకల కల్యాణగుణ సంపన్నుడైన సర్వేశ్వరుడు కరుణామయుడు. భగవంతుని గుణముల కన్నింటికి వన్నె దెచ్చునది ఆయన కరుణ. తన కృపను దేవుడు పుణ్యాత్ములపై ప్రసరింపజేయుటలో వింతలేదు. అందువల్ల ఆయనకీర్తి పెరుగదు. పాపాత్ములలో మేటియైన జీవుని పరిరక్షించినప్పుడే ఆయన ఘనత నందరు కీర్తింపగలరు. కావుననే అజామిళాదులను కాపాడిన భగవంతుడు భాగవతాది గ్రంథములలో అనేకరీతుల ప్రశంసింపబడినాడు.

అన్నమయ్య ఇట తన నైచ్యాతిశయమును ఘనముగా ప్రస్తావించి అట్టి తన్ను కాపాడినప్పుడే భగవంతుని యశస్సు శాశ్వతస్థితి నొందునని చెప్పినాడు. తాను మూఢులలో అగ్రేసరుడైనను తన గర్వము కొండవంటిదని చెప్పుకొనుట "తెలివి యొకింత లేనియెడ దృప్తుడనై కరిభంగి సర్వము౯ దెలిసితినంచు గర్వితమతి౯ విహరించితిఁ దొల్లి"[1] అను భర్తృహరి వచనమును స్మృతికి దెచ్చుచున్నది.

---

1. భర్తృ. 1-7.

మూఢత్వము, గర్వము, ఇంద్రియలోలత, సంసారసాగరమున దగులువడుట, కర్మబంధమున జిక్కుకొనుట, భోగము లాశించుట మున్నగునవి జీవుని నీచత్వమునకు గొనిపోవును, తన నైచ్యమును భగవంతు నెదుట ఫేర్కొని తన్ను కాపాడుమని వేడుకొనుట నైచ్యానుసంధానమను ఒక ప్రక్రియ. ఇది వైష్ణవమతములో మిక్కిలి ముఖ్యమైనది. "అహమస్మ్య పరాధి చక్రవర్తీ ః కరుణేత్వం చ గుణేషు సార్వభౌమీ-1 నేను అపరాధులలో చక్రవర్తిని. ఓ దయాదేవీ ః నీవు భగవద్గుణములలో సార్వభౌమివి" ఇత్యాదిగా వేదాంతదేశికులు పై ప్రక్రియనే దయాశతకములో ప్రతిపాదించియున్నారు.

## 15

అవ:—తాను దుష్టుడైనను తన్ను కాపాడక ఉపేక్ష వహించుట పరమాత్మునకు తగదనుచున్నాడు—

### వరాళి

పెంచి తమ పెట్టుఁజెట్టు - పెరికివేయ రెవ్వరు
మంచివాఁడఁ గాకున్న - మన్నించకుండేవా ? ॥పల్లవి॥

1. తెరువు దప్పి యడవిఁ - దిరిగేటివారిఁదెచ్చి
తెరువునఁ బెట్టుదురు - తెలిసినవారలు,
వరుఁడనై నేరక - నడిచేటి నన్ను నీవు
మరగించి కావక - మానవచ్చునా ? ॥పెంచి॥

2. దిక్కుమాలినట్టి వారిఁ - దెచ్చి దయగలవారు
దిక్కయి కాతురు వారి - దిగఁదోయరు,
తక్కక మాయలోఁబడి - దరిదాపులేని నన్ను
వెక్కసాన రక్షించక - విడిచేవా నీవు ? ॥పెంచి॥

1. ద. శ., 30.

3\. ఆవల భయపడ్డవా - రంగడిఁబడితే దొర
లో వ(వు?)ల విచారించి - వూరడింతు రంతలోనే
శ్రీ వేంకటేశ! నీవు - సృష్టికల్లా నేలికవు
వేవేలు మా మొఱ నీవు - విచారించకుండేవా?" ॥పెంచి॥

2\. వెక్కసాన = మిక్కిలిగా.

3\. అంగడిఁ = కొలువుకూటమునందు; ఓవలఁ = ఉచితపద్ధతులతో.

దేవా: తామే పెట్టి పెంచిన చెట్టు చెడ్డదైనను తమ చేతులార ఎవరును పెరికి వేయరు. నీవే కదా నన్ను పుట్టించి పోషించితివి! నేను మంచివాడను కాకున్నచో నన్ను మన్నింపకుండుట నీకు తగునా?

ఎరుగనివా రెవరైన దారితప్పి అడవిలో బడి తిరుగుచున్నచో తెలిసినవారు వారికి సరియైన తెరువు జూపి కాపాడుదురు. నరుడనై పుట్టి నేను సన్మార్గము నెఱుగక అపమార్గములో బడి పోవుచున్నాను. ఇట్టి నన్ను నీవు. ఐహికభోగములకు మరగించి శరణోపాయము జూపి కాపాడక వదలిపెట్టవచ్చునా?

దయగల పుణ్యాత్ములు దిక్కులేనివారికి దిక్కయి సంరక్షింతురే కాని వారిని విడవాడరు. దయామయుడవని పేరు గాంచిన నీవు మాయామయమగు ప్రపంచములో బడి దిక్కు దెస గానక తికమక లాడుచున్న నన్ను ఎంతేని కృపజూచి రక్షింపక విడిచివృత్తువా?

ఏ కారణముచేనైన భీతి జెందినవారు తమ కొలువుకూటము చొచ్చినచో అచ్చటి దొరలు వెంటనే వారి భీతిహేతువును ఉచితరీతిని విచారించి భయపడకుమని చెప్పి ఆశ్రయమిచ్చి ఊరడింతురు. శ్రీ వేంకటేశ్వరా! చరాచరాత్మకమైన ఈ విశాల సృష్టి కంతటికి నీవే ఏలికవు. అట్టి నీవు జన్మ జరా మరణాత్మకమైన ఈ సంసార మునకు భయపడి పదింబదిగా మే మొనర్చు మొఱ లాలకింపక మాసంగతి పట్టించు కొనకుందువా?

వి:—ప్రపన్నుడు తన రక్షణభారము వహింపుమని భగవంతుని ప్రార్థించుట కలదు. జీవులను పుట్టించుటకు, పోషించుటకు కర్త పరమాత్ముడే. కాన వా రెట్టివా రైనను వారిని దయజూచి సంరక్షింపవలసిన ధర్మముగూడ ఆయనదే. ఒకడు దుష్టు డైనంతమాత్రాన వానిని కాపాడక విడనాడుట ఆయనకు తగదు. 'విషవృక్షోఽపి

సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్'[1] అని కాళిదాసు వచించెను. అనగా విషవు చెట్టయినను దానిని పెట్టి పోషించినవాడు స్వయముగా నఱకివేయుట యుక్తముగాదని యర్థము.

లోకములో దారితప్పి తిరుగువారికి తెలిసినవారు తెన్ను జూపుదురు. దిక్కులేని వారికి దయగలవారు దిక్కగుదురు. భయపడి చెంత జేరినవారిని ప్రభువులు కాపాడుదురు. సామాన్య దయాపరుల విషయ మిట్లుండ నిక సర్వజగద్రక్షకుడైన పరమాత్ముడు జీవాత్ముల రక్షణలో ఉపేక్ష వహించుట తగునా? కాన ప్రకృత కీర్తనములో అన్నమయ్య భగవంతునికే ఆయన కర్తవ్యము నెఱుకపఱచినవాడైనాడు.

పైగా పుణ్యాత్ములైన సజ్జనులను రక్షించుటలో భగవంతుని గొప్పతన మేమున్నది? పెడతెరువు బట్టిన దుర్జనులను కాపాడుటలోనే గదా ఆ దయామయుని రక్షకత్వము సార్థకమగుచున్నది!

"తెలియ చీకటికి - దీపమెత్తక, పెద్ద
వెలుగులోపలికి - వెలుగేలా?"[2]

అను సంకీర్తనములో పాపాత్ములను రక్షించినప్పుడే భగవంతుని ఉనికి సఫలమగునని అన్నమయ్య నిరూపించియున్నాడు.

16

అవ:- వివేకహీనుడైన జీవుడు దేవుని దయతోనే బాగుపడవలసి యున్నాడని యనుచున్నాడు—

ఆహిరి

కలకాల మిట్లాయఁ - గాఁపురమెల్లా
అలదైవ మెందున్నాఁడో - ఆలకించఁడుగా. ॥పల్లవి॥

1. తనకే సంతసమైతే - తనభాగ్యము వొగడు
తనకుఁజింత పుట్టితే - దైవము దూరు,
మనుజుని గుణమెల్లా - మాపుదాఁకా నిట్లానె
ఘనదైవ మెందున్నాఁడో - కరుణఁ జూడఁడుగా. ॥కల॥

1. కుమార. 2-55. 2. అ. సం. ,-5-18.

2. విరివిఁ బాపాలు సేసే - వేళ నాదాయము లెంచు
నరకమందిది పుణ్యము - నాఁడు వెదకు,
తిరమైన జీవుని - తెలివెల్లా నీలాగె
ధర దైవ మెందున్నాఁడో - దయఁ జూడఁడుగా. ॥కల॥

3. వేళతో నిద్దిరింపుచు - విరక్తునివలె నుండు
మేలుకొన్న వేళ నన్నీ - మెడఁబూనును,
ఈ లీల దేహిగుణము - యెంచి శ్రీ వేంకటేశుఁడు
యేలే దైవమెందున్నాఁడో-యిట్టే మన్నించఁడుగా. ॥కల॥

3. దేహి = దేహము గలవాడు, జీవుడు.

బ్రతికినంతకాలము చేసిన కాపురమంతయు వివేకము లేకపోవుటచే ఇట్లే వ్యర్థమైనది. సర్వమునకు సాక్షిభూతుడైన ఆ దేవు డెచటనున్నాడో ! ఎంతగా మొఱ పెట్టుకొన్నను అత డాలకించి జీవుని మంచిత్రోవలో పెట్టడుగదా!

తన కేదైన సంతోషకరమైనపని జరిగినచో మానవుడు తన అదృష్టమును పొగడుకొనును. తనకు విషాదకరమైన సంఘటన జరిగినచో దైవమును నిందించును మానవుని స్వభావమంతయు పుట్టినదాది మరణించువరకు ఇట్లే ప్రవర్తిల్లుచున్నది. ఘనుడైన ఆ దేవు డెచట నున్నాడో గాని మనుజులను దయజూచి వీరికి బుద్ధి చెప్పడు గదా !

ఎక్కువగా పాపపుపనులు చేయునపుడు వాటిచే గలుగు లాభములమీదనే మన జాడు దృష్టి నుంచును. కాని భవిష్యత్తులో కలుగనున్న గొప్ప విపత్తును ఊహింపడు. తుదకు పాపఫలమైన నరకమునుపొంది అనాడు 'అయ్యో ! పుణ్యము చేయనైతినే' అని విచారించును. జీవుని తెలివియంతయు ఇట్లే ముందుచూపులేక మోసపోవుచున్నది. ఇంతకు ఆ దయామయుడైన దేవు డెక్కడ దాగియున్నాడో, వీనిని కరుణింపడు గదా !

జీవుడు రాత్రిసమయమైనంతనే నిద్రించుచు ఏమియు లోకసంబంధము లేని విరక్తునివలె నుండును. కాని ఉదయము మేల్కాంచినంతనే లౌకికకార్యము లన్నింటిని మెడకు దగిలించుకొని కష్టపడుచున్నాడు. దేహధారియైనవాని స్వభావమంతయు

ఇట్లే యున్నది. సమస్తలోకపాలకుడైన శ్రీ వేంకటేశ్వరు డెందున్నాడో ! ఈ దుఃస్థితిని పరిశీలించి ఆయన జీవునికి వివేకము కలిగించి కాపాడుట లేదుగదా !

వి:- జీవులు అనాదిగా పరిభ్రమించుచున్న సంసారచక్రములో దగులబడి యున్నారు. పుణ్యపాపము లాచరించి సుఖదుఃఖము లనుభవించుచున్నారు. కాని జగ న్నాటకసూత్రధారియైన దేవునిమాత్రము చింతించుటలేదు. ఇక వీరికి బుద్ధిచెప్పి సరి యగు త్రోవలో నడిపించువారెవరు ? ఏనాటికైనను ఆ పరమాత్ముడే వారిని వివేక వంతులజేసి కాపాడవలసియున్నాడు అని అన్నమయ్య ఈ సంకీర్తనములో తన ఆవేద నను వ్యక్తపఱచుచున్నాడు.

పుణ్యమునకు సుఖము, పాపమునకు దుఃఖము ఫలముగా లభించుచున్నవి. కాని మూఢులు సుఖము లభించినపుడు తమ పూర్వపుణ్యము కారణమని తలంతురు గాని దుఃఖము గల్గినప్పుడు తమ పూర్వపాపమును స్మరింపరు. దేవుని నిందింపబూను దురు. అట్లే తాత్కాలికమైన స్వల్పలాభముల నాశించి ఎన్నో పాపము లాచరింతురు. తుదకు ఘోరనరకమున కేగి అనాడు పుణ్యముకొఱకై అన్వేషణ ప్రారంభింతురు. ఇట్టి గతజల సేతుబంధనముచే ప్రయోజనము శూన్యము గదా ! ఇదియంతయు అవి వేకముచే గలుగు దోషము. అందుకే పెద్ద లిట్లనిరి—

పుణ్యస్య ఫలమిచ్ఛన్తి పుణ్యం నేచ్ఛన్తి మానవాః ।
న పాపఫల మిచ్ఛన్తి పాపం కుర్వన్తి యత్నతః ॥

అనగా మనుజులు పుణ్యఫలమైన ఉత్తమగతిని కోరుదురుగాని పుణ్యము నాచ రింపరు. పాపఫలమైన అధోగతిని వాంఛింపరు గాని ప్రయత్నపూర్వకముగా పాపమునే చేయుచున్నారని భావము.

గాఢనిద్రలో నున్నప్పుడు జీవుడు సంసారచింత లేవియు లేక హాయిగా నుండును. జాగ్రద్దశలోగూడ అట్టి అనాసక్తియోగమునే అత డాశ్రయించినచో సులభముగా కడతేరగలడు. కాని మేల్కాంచిన ప్రతివాడును నెమకటి వ్యవహార ములలో తల మునుక లగుచున్నాడు. దానివలన దుఃఖము పొలగుచున్నాడు.

ఈ దుర్దశనుండి విడివడుటకు పరమాత్ముని కరుణతప్ప మరొక ఉపాయము లేదు. భక్తిగలవానిపైననే భగవంతుడు దయజూపును. కావున భగవద్భక్తి నలవరచు కొనవలెనని మట సారాంశము.

17

అవ:- సర్వోన్నతమైన పరమాత్ముని మహిమాతిశయమును వర్ణించుచున్నాడు.

## దేసాళం

అనంత మహిముఁడవు - అనంతశక్తివి నీవు
ఎనలేని దైవమా! ని - న్నేమని నుతింతును? ॥పల్లవి॥

1. అన్ని లోకములు నీ - యందునున్నవందురు నీ
వున్నలోక మిట్టిదని - వూహించరాదు.
ఎన్న నీవు రక్షకుఁడ - విందరిపాలిటికి
నిన్ను రక్షించేటివారి - నే నెవ్వరినందును. ॥అనం॥

2. తల్లివి దండ్రివి నీవు - తగు బ్రహ్మాదులకు
ఎల్లగా నీ తల్లిదండ్రు - లెవ్వరందును.
ఇల్లిదె వరములు నీ - విత్తు విందరికిని
చెల్లఁబో నీ కొకదాత - చెప్పఁగఁ జోటేది. ॥అనం॥

3. జీవుల కేలికవు - శ్రీ వేంకటేశుఁడవు నీ
వేవలఁ జూచిన నీకే - యేలికె లేఁడు.
వేవేలు మునులును - వెదకేరు నిన్నును
నీ వెవ్వరి వెదకేవు - నిర్మలమూరితివి. ॥అనం॥

ఓ సాటిలేనిదైవమా! నీవు ఇంతింతలని చెప్పుట కలవిగాని తుదిలేని మహిమలు గలవాడవు. నీశక్తి సామర్థ్యములకు మేరయే లేదు. మనోవాక్కులకగోచరుడవైన ఇట్టి నిన్ను నేనేమని పొగడుదును?

ఈ సమస్తలోకములు నీయందే ఉన్నవని చెప్పుదురు. ఇంతకు నీవున్న లోక మెట్టిదో, అది ఎక్కడ నున్నదో ఊహించుటకు సాధ్యముగాదు. ఎల్లవారిని కాపాడువాడవు నీవు. నిన్ను కాపాడువాడు ఫలానివాడని నే నెవ్వరిని నిర్దేశింపగలను?

లోకసృష్టి మొదలైన వివిధకార్యము లొనర్చు బ్రహ్మ మున్నగువారికి నీవే తల్లివి, తండ్రివి అగుచున్నావు. ఇక నీకు తల్లి దండ్రులని నే నెవ్వరిని పేర్కొనగలను ? ఇదిగో నీవే అందరికి కోరినవరము లిచ్చువాడవు. నీ కోరికలు దీర్చు దాత ఒకడు కలడని చెప్పి చూపుట కవకాశమేది ?

నీవు జీవులకెల్లరకు ప్రభుడవు. శ్రీ వేంకటేశ్వరుడవు. ఎందుజూచినను నీపై పెత్తనము నెఱపు ప్రభు వొక్కడును లేడు. వేలకొలది మునులు జపతపోధ్యానాదికము లొనర్చుచు నిన్నన్వేషింతురు. నిర్మలమూర్తివైన నీ కెవ్వరిని అన్వేషింపవలసిన అక్కర లేదు.

వి:- లోకములెల్ల పరబ్రహ్మమూర్తియైన శ్రీమన్నారాయణునియందే లీనమై యున్నవి. సర్వవ్యాపియైన ఆ పరమాత్మను ఒకచో నున్నవానినిగా చెప్పుట తగదు. ఆయన ఎల్లవారిని రక్షించువాడు గాన ఆయనకు రక్షకు డింకొకడు లేడు. జనన రహితుడైన ఆ దేవునకు జననీ జనకు లెవ్వరు ? అను ప్రశ్నయే తగదు. ఆయన వరప్రదాతయేగాని వరములు స్వీకరించువాడు గాడు. సర్వలోకపరిపాలకుడైన ఆ పరమాత్మునకు మరొక పరిపాలకు డెట్లుండగలడు ? మునులు మున్నగువారు రక్కసులచే ఇక్కట్టుల పాలైనప్పుడు, లేదా మోక్షాపేక్షతో ఆయనను వెదకుదురుగాని అవాప్త సమస్తకాముడైన ఆ దేవుడు మరొకరిని వెదకి వారినుండి పొందవలసిన దేమియు లేదు. ఇట్లు ఏ విధముగ జూచినను శ్రీ వేంకటేశ్వరుని ప్రభావాతిశయము మేరమీరి యున్నదని తాత్పర్యము.

ఈ రీతిగనే శ్రుతులుగూడ పరమాత్ముని ప్రభావమును వేనోళ్ళ కీర్తించు చున్నవి. శ్వేతాశ్వతరోపనిషత్తు వర్ణించిన తీరెట్టిదో పరికింపుడు—

తమీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమంచ దైవతమ్ ।
పతిం పతీనాం పరమం పరస్తాత్
విదామ దేవం భువనేశ మీడ్యమ్ ॥

న తస్య కార్యం కరణం చ విద్యతే
న తత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే ।
పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ ॥

న తస్య కశ్చిత్పతిరస్తి లోకే
న చేశితా నైవ చ తస్య లింగమ్ ।
న కారణం కరణాధిపాధిపో
న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః ॥[1]

దీని తాత్పర్యమిది — "ఆ పరమాత్ముడు ఈశ్వరులకు పరమ మహేశ్వరుడు దైవతములకు పరమదైవతము. పతులకు పరమపతి. త్రిలోకపరిపాలకుడు. ఆయనకు కార్యకరణములు లేవు. ఆయనతో సమానుడుగాని, అధికుడుగాని కనిపింపడు. ఆయన పరాశక్తి వివిధములుగా వినిపించుచున్నది. జ్ఞానబలముతో గూడిన క్రియ ఆయనకు స్వభావసిద్ధము. ఆయనకు పతి లోకమున నింకొకడు లేడు. లింగము లేదు. ఆయన సర్వమునకు కారణమైనవాడు. ఇంద్రియముల కధిపుడు. ఆయనకు జనకుడుగాని, అధిపుడు గాని మరొకడు లేడు."

బలిచక్రవర్తి నీ వెవ్వరివాడవు? నీ నివాసమెద్ది? ఇత్యాదిగా ప్రశ్నించినపుడు వామనావతారమున నున్న భగవంతుడు చెప్పిన సమాధానవచనములలో గూడ ఆయన స్వరూప మిట్టిదిగానే నిర్దేశింపబడినది -

ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు
　నాకచో టనక నెందు నుండనేర్తు
నెవ్వనివాఁడ నంచేమని పలుకుదు
　నాయంతవాఁడనై నడపనేర్తు
నీ నడవడియని యెట్లు వక్కాణింతుఁ
　బూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు ననియేల చెప్పంగ
　నేరుపు లన్నియు నేన నేర్తు

నొరులు గారు నాకు నొరులకు నే నౌదు
నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లిఁ గలదు చెప్పెద నా టెంకి
సుజనులందుఁ దఱచుఁ జొచ్చియుందు.[2]

1. శ్వేతాశ్వ., 6-7, 8, 9.

2. భాగ., 8-552.

18

అవ:- ప్రపన్ను డగుటతప్ప ప్రకృతినుండి విడిపడుటకు మరొకమార్గము లేదనుచున్నారు—

వరాళి

ఇన్నిటికి నీశ్వరేచ్ఛ - యింతే కాక
తన్నుదానే హరిగాచు - దాసుఁడై తేఁజాలు. ॥పల్లవి॥

1 ప్రకృతిఁబుట్టినదేహి - ప్రకృత (తి?) గుణమే కాని
వికృతి బోధింపబోతే - విషమింతే కాదా,
ఒక విత్తు వెట్టితే వే - రొకటేల మొలచును
ప్రకటమైన వట్టి - ప్రయాసమే కాక. ॥ఇన్ని॥

2. పాపానఁబుట్టిన మేను - పాపమే వేయించుఁగాక
యేపునఁబుణ్యముతోవ - యేల పట్టును,
వేఁచేఁదు వంఁడితేను - వెంనేల బెల్లమవును
పైపై బలిమిసేసే - భ్రమయింతేకాక. ॥ఇన్ని॥

3. ప్రపంచమైన పుట్టుగు - ప్రపంచమునకే కాక
ఉపమించ మోక్షమున - కొదఁబడునా?
ప్రపన్నుడైన వేళ - భాగ్యాన శ్రీ వేంకటేశుఁ
డపుడు దయఁజూడఁగ - సిధికుఁడౌఁగాక। ॥ఇన్ని॥

1. దేహి = దేహధారి - జీవుడు.

ఏది జరుగవలెనన్నను భగవంతుని యిచ్ఛ ననుసరించి జరుగవలసినదే. ఆయనకు దాసు డగుటొక్కటే జీవుని కర్తవ్యము. అప్పుడు దయానిధియైన శ్రీహరి తానే వీనిని కాపాడగలడు.

దేహధారియైన యీ జీవుడు భగవన్మాయా ప్రభావముచే గల్గిన ప్రకృతినుండియే శరీరముతో జన్మించినాడు. వీనికి ప్రకృతి సహజములైన గుణములే ఉండును గాని ఇతరగుణము లుండవు. ప్రకృతి కతీతముగా ప్రవర్తింపుమని వానిని మనము బో

వంతముచేసినచో ఆశించిన ప్రయోజనము సిద్ధించకపోవుటచేకాక అది విషమమైన పరిణామమునకే దారితీయును. ఒకచెట్టువిత్తు నాటినచో ఆ చెట్టే మొలచునుగావి మరొక చెట్టు ఎట్లు మొలచును ? ఒకవేళ అట్లు మొలపించుటకు ప్రయత్నించినచో అది వట్టి ప్రయాసయే యగునుగాని ఫలముండదు గదా !

ఈ శరీరము పాపకర్మముచే బుట్టినది. ఇది మనచే తనకు సహజమైన పాప కర్మమునే చేయించునుగాని పుణ్యమార్గము నెందు కనుసరించును ? వేప చేదు వండి నచో చేదుగనే ఉండునుగాని బెల్లముపలె తియ్యగా నెట్లుండును ? కాన ఈ తనువును పుణ్యపథమున నడిపింపగలమని భూనుకొనుట భ్రమయేగాని మతేమియుగాదు సుమా!

మన జన్మము ప్రపంచ ప్రవృత్తికి సంబంధించినది. ఇది ప్రపంచమాయా జాలమున మనలను తగిలింపుటకే ప్రయత్నించునుగాని మోక్షమున కంగీకరించునా ? కావున జీవుడు భగవంతునెడల ప్రపన్నుడు కావలెను. అపుడు భాగ్యవశమున శ్రీ వేంకటేశ్వరుడు వానిని దయజూచును. అంతట నతడు ముక్తుడై అధికుడగును. ఇంతకంటె వేరొక సులభోపాయము జీవునకు లేదు.

వి:- ప్రకృతిని జయింపవలెననియు, పుణ్యము లొనర్చవలెననియు, పాపము లకు దూరముగావలెననియు, ప్రాపంచిక ప్రవృత్తిని జయించి ముక్తికై ప్రయత్నించ వలెననియు జిజ్ఞాసువులైన సాధకులు యత్నింతురు. కాని పై పనులు సులభమైనవి కావు. భగవదిచ్ఛాధీనమైన ప్రకృతియొక్క ప్రభావమువలననే జీవుడు దేహధారి యైనాడు. ప్రకృతి మహాశక్తిసంపన్నమైనది. ప్రకృతికి లోబడియుండవలెనా ? లేక ముక్తుడు కావలెనా ? అనునది జీవుడు సులభముగా తనకు తానే తీర్చుకొనగల చిక్కుకాదు. ఎంత ప్రయత్నించినను జీవులను ప్రకృతి లోగొనుచునే యుండును.

మన మాచరించు కర్మలన్నియు ప్రకృతిగుణముల మహిమవలననే జరుగు చున్నవని గీత చెప్పుచున్నది.—

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।[1]

మరియు "జ్ఞానవంతుడుగూడ తన ప్రకృతి కనుగుణముగనే ప్రవర్తించు చున్నాడు. భూతములెల్ల ప్రకృతి ననుసరించియే పోవుచున్నవి. ఇక నిగ్రహ మేమి చేయగలదు ?" అని శ్రీ కృష్ణుడు ప్రకృతిమహిమను వివరించెను—

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥[2]

---

1. గీత., 3-27. 2. గీత., 3-33.

కావున స్వతంత్రుడై యమనియమాది యోగసాధనలద్వారా ప్రకృతిని జయించుటకు ప్రయత్నించి లేనిపోని ప్రయాసల పాలగుటకంటె ప్రకృతికి ప్రవర్తకుడైన భగవంతుని శరణొందుటయే సులభోపాయము. ప్రపన్నునికి భగవంతుడే ముక్తి నొసంగగలడు. 'మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే'[1] అని భగవంతుడే సెలవిచ్చియున్నాడు గదా!

అందువలననే భగవద్రామానుజులు ముక్తికి కత్యంత సులభోపాయమైన ప్రపత్తిని జనులకు బోధించిరి. ఆ త్రోవ ననుసరించియే అన్నమయ్య ప్రపన్నులై తరించుడని వివిధరీతుల ప్రజలకు ప్రబోధము గావించినాడు.

## 19

అవ:- భగవంతుని మరవక తలంచువారికి సకలార్థములు చేకూరుననుచున్నాడు.

భైరవి

అతఁడే యన్నియు నిచ్చు - నడిగిన వల్లాను
చేతిలోనే వుండఁగాను - చింతించరు హరిని. ॥పల్లవి॥

1. వలెనంటే సంపదలు - వట్టి యలమటఁబెట్టు
అలసి వోప వంచేను - అందనే వుండు.
తలఁచి యిందరు నీ - తరితీపులఁ జిక్కి
తలఁచ రెందును బర - తత్త్వమైన హరిని. ॥అత॥

2. ఆసపడితే వింతులు - అన్నిటాను బిగుతురు
వాసితో మంచేనే తామే - వత్తు రొద్దికి.
పోసరించి యిందరు నీ - పొందుల భ్రమలఁబడి
పాసివున్నారదే తమ - పతియైన హరిని. ॥అత॥

3. గట్టిగా రాతిరెల్లాను - కలయై యుండు జగము
వట్టపగలైతే తమ - పాల నుండును.
బట్టబయలు వందిలి - పెట్టేరు గాని చే
వట్టరు శ్రీవేంకటాద్రి - పైనున్న హరిని. ॥అత॥

1. గీత., 7-14.

2. వాపి = బెట్టు, గౌరవము; పోసరించి – మదించి.

ఆ పరమాత్ముడే భక్తితో ప్రార్థించినచో జీవులు కోరిన కోర్కెలెల్ల నెరవేర్చును. అందుకొఱకో, అనగా తమ హృదయగుహయందే ఉన్నను ఆ శ్రీహరిని మూఢులు చింతింపరు.

అందుకని ఆశపడి ఆర్జింపబూనినచో సంపదలు చేతికి జిక్కక అనేకశ్రమలకు గురిచేయును. వాటిపై విసిగి 'నాకీ సిరు లక్కరలేదు' అని భగవంతునే భావించుచు ఊరకున్నచో తమకు తామే అవి వెంటకునచ్చి చేపను. లోకులెల్లరు ఈ రహస్యము తెలియక సంపదల వ్యామోహములోబడి పరతత్త్వమైన హరిని భావింపకున్నారు.

పురుషులు ఆశపడి తామే పైకొనబూనినచో కామినులు అన్నివిధముల బిగువు చూపుదురు. గౌరవము వీడక బెట్టుగా ఊరకున్నచో వారే తమపొందుకు వత్తురు. కాని జనులెల్లరు కాంతలపై భ్రాంతిగొని కామోన్మత్తులై వారికై ఆరాటపడి తమ పతియైన శ్రీహరిని వీడియున్నారు.

రాత్రి గాఢనిద్రలో నున్నప్పుడు జగమంతయు కలవలె ఉనికి లేనిదగుచున్నది. మరల తెల్లవారగనే జీవులపాలిటి కది అన్నిరూపులతోను ప్రత్యక్షమగుచున్నది. ఇంతగా అశాశ్వతమైన ఈ ప్రపంచములో జీవులు బట్టబయలు పందిలి పెట్టినట్లుగా ఏమో సాధింపగోరి వ్యర్థప్రయత్నములు చేయుచున్నారేగాని శాశ్వతుడై శ్రీ వేంకటాద్రిపై నున్న శ్రీహరినిమాత్రము చేపట్టరు.

వి:- 'నారుపోసిన దేవుడే నీరు పోయు' నన్నట్లు జీవులను సృష్టించిన దేవుడే వారికి వలయునవెల్ల సమకూర్పగలడు. జీవులు దేవు నారాధించి ఆయనకృపకు పాత్రులై ఇష్టార్థముల ననుభవించుట తగును. మరియు ఆశకు దాసుడైనవాడు లోకమునకు దాసుడగును. ఆశనే దాసిగా జేసికొన్నవానికి లోకమే దాస్యము వహించునని పెద్దల సూక్తి—

ఆశాయా దాసా యే తే దాసా స్సర్వలోకస్య।
ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః॥[1]

కాన జీవులు కాంతాకనకాదులపై ఆశమాని కరుణామయుడైన శ్రీ వేంకటేశ్వరునిపైననే ఆశగల్గియున్నచో వారి వాంఛితము లన్నియు ఆతడే తీర్చగలడనుట ఇందలి సారాంశము.

---

1. కవితా. , 27.

## 20

అవ:- మన భక్తికి లోపమేకాని భగవంతుని దయ కెట్టి కొఱతయు లేదను చున్నాడు—

### లలిత

శ్రీపతి యీతఁ డుండఁగాఁ - జిక్కినవారి నమ్మట
తీపని మీసాలమీఁది - తేనె నాకుట సుండీ. ॥పల్లవి॥

1. తలఁచి నంతటిలోనె - దైవ మెదుటఁ గలఁడు
కొలువనేరని యట్టి - కొరతే కాని
యిల నరుఁ గొలుచు - నెందో కోకలు వేసి
బలుకొక్కెరలవెంటఁ - బారాడుట సుండీ. ॥శ్రీప॥

2. శరణన్న మాత్రమున - సకలవరము లిచ్చు
విరతి మరచినట్టి - నేరమే కాని,
పొరి నితరోపాయానఁ - బొరలుట గాజుఁబూస
గరిమ మాణిక్యమంటాఁ - గట్టుకొంట సుండీ. ॥శ్రీప॥

3. చేత మొక్కితేఁ జాలు - శ్రీ వేంకటేశుఁడు గాచు
కాతరాన సేవించని - కడమే కాని,
యాతల విడి మాని మ - రెన్ని పుణ్యాలు వేసినా
రీతి నడవిఁ గాసిన - చిత్త వెన్నెలసుండీ. ॥శ్రీప॥

2. విరతి = మిక్కిలి ఆసక్తి; గరిమ మాణికము = ఘనమైన మాణిక్యము.

3. కాతరాన = చాంచల్యముతో, కడమ = కొఱత.

శ్రీ లక్ష్మీపతి నమ్మినవారిని కాపాడుటకు సిద్ధముగా నున్నాడు. ఇత డుండగా చిక్కినవా రెవరో తమ్ము రక్షింతురని నమ్మట వలసినంత తేనె చెంతనుండగా దాని నాస్వాదింపక మీసాలపై తేనె తీపని నాకుట వంటిది సుమా!

తలంచినంతమాత్రమున భక్తుల తాపత్రయము తొలగించుటకు దేవుడు కాచుకొనియున్నాడు. కాని ఆయనను కొలువనేరని లోపము మనలోనే కలదు. నారాయణుని గొలువక నరుల గొలుచు టెట్లున్నదనగా - తెల్లనివస్త్రముల నెచ్చటనో వేసి అల్లంతదూరముననున్న కొంగలను చూచి గుడ్డలని భ్రమించి వాటివెంట పరుగిడిన ట్లున్నది.

శరణన్న చాలును. సమస్తములైన కోరికల నొసంగుటకు భక్తపరతంత్రుడైన శ్రీహరి సంసిద్ధుడైయున్నాడు. ఆయన భక్తవాత్సల్యమును, దయాళుత్వమును మరచిన నేరము మనయందే ఉన్నది. ఆ దేవుని శరణనక ఇతరములైన ఉపాయములతో కోరికలు నెరవేర్చుకొనబూనుట గొప్ప మాణిక్యమని భ్రమించి మిలమిల మెరయు గాజుపూసను ధరించినట్లే సుమా :

చేమెత్తి మ్రొక్కిన చాలును. శ్రీ వేంకటేశ్వరుడు దన్నివిధముల భక్తులను గాపాడును. చంచలమైన చిత్తముతో ఆయనను సేవించని లోపము మనలోనే గలదు. భగవంతునికి ఎట్టి లోపము లేదు. శ్రీ వేంకటేశ్వరునకు మ్రొక్కక ఇతరములైన పుణ్యము లెన్ని చేసినను అడవిగాసిన వెన్నెలవలె నిష్ప్రయోజనమే సుమా !

వి:- శ్రీ వరుని గోరినవారికి ముక్తి చేరువ యగును, తదితరుల కది దూరమగునని భాగవతము చెప్పుచున్నది—

కోరనివారల కెల్లను
జేరువ కైవల్యపదము శ్రీవరుని మదిం
గోరనివారల కెల్లను
దూరము మోక్షప్తి యెన్ని త్రోవలనైనన్.[1]

"మేము శ్రీహరి దాసులము, ఆ దేవునిదప్ప బ్రహ్మాదులను సైతము కొలువము" అని చెప్పుచునే లోకులను గొల్చు హరిదాసుల నన్నమయ్య పరోక్ష కీర్తనమున నిట్లు ఈసడించినాడు—

"పైకొని పీదాసుల బ్రహ్మాదులం గొల్వరాని
లోకులం గొల్చితే వారు లోలో నవ్వరా ?
కోక చాకియింట వేసి కొక్కెరాల వెంటం బోతే
ఆకడం బురుషార్థము నందీనా జీవుఁడు."[2]

1. భాగ., 6-159. 2. అన్న. సం. P. 59.

కావున సంపూర్ణవిశ్వాసముగలిగి శ్రీమన్నారాయణునే సేవింపవలెను. శరణాగతినే ముఖ్యోపాయముగా గ్రహింపవలెను. శ్రీహరిని సేవించువారే నిజమైన హరిదాసులుగాని తక్కినవారు కారని గ్రహింపవగును.

## 21

అవ:- సంసారలీలను ఒక సంతబేరముతో పోల్చుచున్నాడు—

### బౌళి

కొంగున పుణ్యపాపాలే - కొంగురొక్కములు వెట్టి
వెలదెంచి బేరమాడ - వేగిరమే రారో. ॥పల్లవి॥

1. జననాలు మరణాలు - సంసారభోగములును
అనిశము భూమిమీఁద - సగ్గునలు,
కొనేవారుఁ దినేవారు - కూడి కూడి మూఁకలై
దినసంత లెక్కువిదే - దేహులాల ! రారో. ॥కొం॥

2. అంగనలవలపుల - అంగళ్లు వెట్టిరదే
చెంగట వయసులనే - చింతలకింద,
సంగతిఁగాయమనే - సంచుల నించుకొందము
చెంగిపోరాదు మనకు - జీవులాల ! రారో. ॥కొం॥

3. లంపటాలు సంపదలు - లలి నంబారాములాయ
యింపుల మించి తలల - కెత్తుకోరో,
దింపక యింములోననే - తిరిగి శ్రీవేంకటేశు
పంపున లాభము చేరె(రీ) - ప్రాణులాల ! రారో. ॥కొం॥

1. అనిశము = ఎల్లప్పుడు; దినసంతలు = ప్రతిదినము జరుగు సంతలు.

3. లంపటాలు = తగులములు; అంబారాములు = ధాన్యపు రాసులు; పంపునకా = ఆజ్ఞచే, పంపకముచే.

జీవులారా ! ఇదిగో సంతబేరములకు రండు ! మీమీ కొద్దిపాటి పుణ్యపాపము అనెడు కొంగున ముడిచిన రొక్కములు వెచ్చించి వెల నిర్ణయించుకొని బేరమాడుటకై త్వరగా రండు !

ఇదిగో భూవలయమునందు ప్రతిదినము ఎడతెరపి లేకుండ సంతలు సాగిపోవు చున్నవి. చావులు, పుట్టుకలు, సంసారమునకు జెందిన భోగములు ఇచట మిక్కిలి చవుకగా లభించును. వీటిని కొనదలచినవారు, తినదలచినవారు గుంపులు గుంపులుగా కూడి దినసంతలు బలిసినవి. కావున దేహధారులారా! రండు!

అదిగో! సమీపముననే యౌవనప్రాయము అనెడు చింతచెట్లక్రింద పవితల వలపుల అంగళ్ళు పెట్టియున్నారు. చెంతజేరి శరీరములనెడు సంచులనిండ వారి వలపు లను నింపుకొందము. వీటిని తొలగద్రోసికొనిపోవుట మనకు సాధ్యముగాని పని. కావున జీవులారా! బిరబిర రండు!

ఈ సంతలలో తగులములు, సంపదలు ధాన్యపురాసులవలె కుప్పలు కుప్పలుగా నున్నవి. సంతసముతో వీటిని మోయజాలినంతవరకు మించి తల కెత్తుకొనుడు. తల దాల్చినవాటిని దింపక ఈ సంతలలోనే తిరిగి శ్రీ వేంకటేశ్వరుని ఆజ్ఞచే (వంపక ముచే) తప్పక ఇష్టార్థము పొందగలరు. కాన ఈ సంతబేరములో స్వేచ్ఛగా పాల్గొను టకై రండు!

వి:-జీవులు కర్మ లాచరించి అందు కనుగుణమైన ఫలము ననుభవించుచున్నారు. కర్మలు సత్కర్మలనియు, దుష్కర్మలనియు రెండు తెరగులుగా నున్నవి. సత్కర్మ లచే పుణ్యము, దుష్కర్మలచే పాపము గలుగుచున్నవి. జనన జరామరణాత్మకమైన ఈ సంసారలీలలో జీవులు పెక్కు సుఖదుఃఖాది ద్వంద్వముల ననుభవించుటకు పుణ్య పాపములే హేతువు లగుచున్నవి. కావున తన పుణ్యపాపములనే వెచ్చించి జీవుడు సుఖదుఃఖములను గొని తినుచున్నాడు గాన సంసారలీల సంతబేరమును పోలియున్నది. ఈ పోలికనే అన్నమయ్య తన సహజచమత్కారధోరణిలో ప్రకృత సంకీర్తనమున వివరించినాడు.

పుణ్యపాపము లిట కొంగు రొక్కములతో పోల్చబడినవి. కొంగున ముడిచిన రొక్కము ఆయా పదార్థములను కొని తినుట కెల్ల వేళల అందుబాటులో నుండును. అట్లే పుణ్యపాపములు జీవుని సదా వెన్నంటియుండి ప్రారబ్ధరూపములై వానికి సుఖ దుఃఖానుభవములను గలిగించుచున్నవి.

జీవులు కర్మములలో సులభముగా తగులువడుచున్నారు. కర్మపాశము లవి త్రెంచుకొనుట కష్టముగాని అందు బంధింపబడి పుణ్యపాపము లార్జించుటలో క్లేశ

మేమాత్రమును లేదు. అందుచేతనే పుణ్యపాపఫలములైన జననమరణములు, సంసారభోగములు చవుకగా లభించునని అన్నమయ్య చెప్పినాడు.

లోకమున నడచు మామూలు సంతలు ఏదో ఒక నిర్ణీతకాలములో జరుగుచుండును. కాని సంసారపు సంతలు అనాదిగా, నిర్విరామముగా సాగుచునే యున్నవి. కావుననే ఇవి 'దినసంతలు' అని పేర్కొనబడినవి.

కొంత కష్టపడిన దేనినైన విగ్రహింపవచ్చును గాని గుహ్యేంద్రియమును విగ్రహించుటమాత్రము మిక్కిలి కష్టము. అది చాల బలవత్తరమై సంసారప్రవృత్తి కంతటికి మూలమగుచున్నది. అందువలననే అన్నమయ్య యువతుల వలపు టంగళ్ళ చెంతకు దేహధారుల నాహ్వానించుచు "జీవులారా! మనకు చెంగిపోరాదు" అని హెచ్చరించినాడు.

ఈ సంసారలీలకు ముఖ్యప్రవర్తకుడు సర్వజగన్నియామకుడైన శ్రీమన్నారాయణుడే. ఆయన సంకల్పము ననుసరించి జీవులీ సంతబేరము కొనసాగించుచున్నారు. కాన వారిందుకు చింతింప నవసరము లేదు. ఇందులో సంచరించుచునే దీనికి మూలమైన పరమాత్మని విస్మరింపకుండిరేని తప్పక ఆయన కృపచే ముక్తులు కాగలరు. ధర్మార్థ కామమోక్షము లనెడు చతుర్విధములైన పురుషార్థములలో ఎవరి కెప్పు డేది పంచి యివ్వవలెనో ఆ భగవంతుడు చక్కగా నెఱుంగును. కావున దేవుని మరువక సంసారము చేయువానికి మోక్షలాభము చేకూరు ననుటలో సందేహమెందుకు?

## 22

అవ:- జీవులు సంసారముయొక్క అశాశ్వతత్వమును కనియు, వినియు గ్రహింపజాల కున్నారనుచున్నాడు—

శంకరాభరణం

కని గుద్దుము వదె - విని చెవుడుము విదె
వనిచి జగత్తు - నడచీనదివో. ॥పల్లవి॥

1. ఉదయాస్తమయము - లోకదినమునసే
యెదుటనె వున్నవి - యెంచినను.
ఇదివో జీవులు - యెంచక తమతమ
బ్రదుకులు సతమని - భ్రమసెదరు, ॥కని॥

2. వెలుఁగును జీకటి - వెసఁ గనుఁగొనలనె
విలిచీ నూరక - విమిషములో.
కలవలె నుండిన - గతి సంసారము
బలువుగ సతమని - భ్రమసెదరు. ॥కని॥

3. కాంతలుఁ బురుషులు - కాయమొక్కటనె
పొంతనె పుట్టుచుఁ - బొదలెదరు.
ఇంతయు శ్రీవేంక - టేశ్వరు మహిమల
పంతము దెలియక - భ్రమసెదరు. ॥కని॥

ప॥ గుద్దు = గ్రుడ్డితనము; నవిచి = చిగిర్చి, పుష్పించి, అతిశయించి.
1. సతము = శాశ్వతము.

ఔరా! అవిగో! లోకము కన్నులార కనియు గ్రుడ్డితనము, చెవులార వినియు చెవిటితనము పెంపొంద ప్రవర్తించుచున్నది.

పరికింపగా ప్రొద్దు వొడుచుట, ప్రొద్దు గ్రుంకుట అనునవి ఒక్కదినమందే కన్నుల యెదుటనే జరుగుచున్నవి. ఐనను జీవులు సదా పరివర్తనశీలమైన ఈ జగత్తు యొక్క నిజస్వరూపమును గుర్తింపక తమ తమ బ్రదుకులు శాశ్వతమని తలంచి భ్రమకు లోనగుచున్నారు.

ఒక నిమిషములోనే కనుగొనలలో వెలుగు, చీకటి వెంటవెంటనే నిలిచి యున్నవి. అట్లే చంచలమైన ఈ సంసారము కలవలె బూటకమై యున్నది. లోకులు దీనిని శాశ్వతమని నమ్మి భ్రాంతి నొందుచున్నారు.

స్త్రీలు, పురుషులు ఒకే శరీరమునందు చెంతనే పుట్టుచు వృద్ధినొందుచున్నారు. ఇదంతయు శ్రీ వేంకటేశ్వరుని మహిమాతిశయమువలననే కలుగుచున్నది. దాని ప్రభావవిధానము దెలియక జీవులు ఊరక భ్రమపడుచున్నారు.

వి:- జగత్తు సదా పరిణామశీలమైనది. జీవుల బ్రదుకులు శాశ్వతములు గావు. ఒకేదినమున ఉదయము, అస్తమయము జరిగినట్లే అల్పకాలమునందే ప్రాణుల పుట్టుట, గిట్టుట జరిగిపోవుచున్నవి. తామరాకుపై నీటివలె జీవితము మిక్కిలి చంచలమైనది. దీనిని జీవులు నిత్యము చూచుచునే యున్నారు, వినుచునేయున్నారు. కాని వారికి వివేకము గల్గుటలేదు. తమ బ్రదుకులు శాశ్వతమని భ్రమించి వారు తాపత్రయమునకు లోనగుచున్నారు అన్న సత్యము నీ పాట ప్రకటించుచున్నది.

ఒకచో చంద్రుడస్తమించుచుండగా మరొకచో సూర్యు డుదయించుచున్నాడు. ఈ రెండు తేజములకు ఒకే కాలమున జరుగు అస్తోదయములు లోకముయొక్క సుఖ దుఃఖాత్మకములైన రెండు దశలకు నియామకములు గాబోలునని కాళిదాసు పలికెను—

యాత్యేకతో ఽస్తశిఖరం పతిరోషధీనాం
ఆవిష్కృతో ఽరుణ పురస్సర ఏకతో ఽర్కః।
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇవాత్మ దశాంతరేషు ॥1

జీవితము శాశ్వతము గావన్న విషయమును చూచియు మాయామోహితులై సత్యము నెఱుంగజాలక భ్రమపడు లోకులపట్ల వ్యాసు డిట్లు తన ఆశ్చర్యమును ప్రకటించెను—

అహన్యహని భూతాని ప్రవిశన్తి యమాలయమ్।
శేషాః స్థావరమిచ్ఛన్తి కి మాశ్చర్య మతః పరమ్ ॥2

అనగా నిత్యము ప్రాణులు యముని యింటికేగుచునే యున్నారు. కాని మిగిలినవా రది చూచియు తమకు శాశ్వతత్వము నభిలషించుచున్నారు. ఇంతకంటె ఆశ్చర్య మేమున్నది? అని భావము.

స్త్రీ పురుష లోకే శరీరములనుండి పుట్టినట్లే సుఖ దుఃఖాది ద్వంద్వములు ఒకే దేవుని మాయాప్రభావముచే గల్గుచున్నవి. కావున ఆ దేవుని శరణొందుటయే వివేకవంతుల కర్తవ్యము. లేనిచో మాయా మయమైన సంసారజాలమునుండి విముక్తి పొందజాలమని తాత్పర్యార్థము.

1. శాకుం., 4-1. 2. భార.,

## 23

అవ:- యోగీశ్వరుల సాధనక్రమమును వర్ణించుచున్నాడు—

భూపాలం

పరమయోగీశ్వరుల - పద్ధతి యిది
ధరణిలో వివేకులు - దలపోసుకొనుట. ॥పల్లవి॥

1. మొదల నాత్మజ్ఞాన - ము దెలిసె పిమ్మట
హృదయములోని హరి - నెరుఁగుట.
ఉదుటైన యింద్రియాల - నొడిసి వంచుకొనుట
గుదిగొన్న తనలో - కోరికె లుడుగుట ॥పర॥

2. తన పుణ్యఫలములు - దైవము కొసగుట
పనివడి యతనిపై - భక్తి చేసుట.
తనివితో నిరంతర - ధ్యానయోగపరుఁడౌట
మనసులోఁ బ్రకృతిసం - బంధము మానుట. ॥పర॥

3. నడుమ నడుమ విజ్ఞా - నపు కథలు వినుట
చిడుముడి నాచార్య - సేవ సేయుట.
యెడయక శ్రీ వేంక - టేశుపై భారమువేసి
కడువైష్ణవుల కృప - గలిగి సుఖించుట.

1. ఉదుటైన = ఉద్ధతమైన; గుదిగొన్న = దట్టమైన.

2. నిరంతర ధ్యానయోగపరుఁడు = ఎల్లవేళల ధ్యానయోగమునం దాసక్తుడైన వాడు.

ఈ చెప్పబోవునది శ్రేష్ఠులైన యోగీశ్వరు లనుసరించు త్రోవ. ఇలలో వివేకము గల మనుజు లెల్లరు ఈ పద్ధతిని చక్కఁగా పరిశీలింతురు.

మొదట యోగమార్గమున పయనించువాడు తన జీవాత్మ స్వరూపమెట్టిదో తెలిసికొనవలెను. పిమ్మట తన హృదయమునవే అంగుష్ఠపరిమాణము గలిగియున్న

పరమపురుషుని భావింపవలెను. ఉద్ధతములైన ఇంద్రియములను నిగ్రహించి స్వాధీనము గావించుకొనవలెను. తనకో దట్టముగా బలపడిన కోరికలను నిర్మూలింపవలెను.

తా నొనర్చిన సత్కర్మముల ఫలములను దైవమునకు సమర్పింపవలెను. పూనికతో భగవంతునిపై భక్తిగలిగి యుండవలెను. నిండైన తృప్తితో ఎల్లవేళ భగవచ్చింతనాత్మకమైన ధ్యానయోగమునందే ఆసక్తుడై యుండవలెను. మనస్సునో ప్రకృతితోడి సంబంధమును మఱచి వైరాగ్యవంతుడై యుండవలెను.

యోగసాధనకాలములో అప్పు డప్పుడు భగవద్విజ్ఞానమునకు సంబంధించు కథలు వినుచుండవలెను. భక్తిశ్రద్ధలతో ఆచార్యుని సేవింపవలెను. సమస్తభారమును శ్రీ వేంకటేశ్వరునిపై వేసి ఆ దేవు నెడబాయక పరమభాగవతులైన శ్రీ వైష్ణవుల దయకు పాత్రుడై సుఖింపవలెను.

వి:- భగవత్ప్రాప్తిని గోరువారు యోగమార్గము ననుసరింతురు. యోగవిధానములు శ్రుతి స్మృతులలో అతి విపులముగా ప్రతిపాదింపబడియున్నవి. అందలి కొన్ని ముఖ్యమైన పద్ధతులను అన్నమయ్య ఇట వివరించినాడు.

వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్య చ।
భాగో జీవస్స విజ్ఞేయః స చానన్త్యాయ కల్పతే ॥1

ఇత్యాది శ్రుతులలో వెండ్రుక కొనయొక్క శతాంశములో శతాంశతుల్యుడైన జీవుడు ముక్తుడైనచో అనంతుడగునని చెప్పబడుచున్నాడు. అట్టి జీవుని స్వరూపమును తెలిసికొనుట యోగియొక్క ప్రథమకర్తవ్యము.

తదుపరి హృదయకుహరమున మన్నట్టియు, 'సర్వవ్యాపిన మాత్మానం క్షీరే సర్పిరివార్పితమ్'2 అన్నట్లు పాలలో నేయివలె సర్వత్ర వ్యాపించియున్నవాడు నగు పరమాత్మనుగూడ గుర్తింపవలెను. జీవాత్మ పరమాత్మల స్వరూపమును గుర్తించి పిమ్మట ఆ పరమాత్మను చేరుటకు వలయు సాధనతంత్రమును ననుష్ఠింపవలెను.

అందు ఇంద్రియనిగ్రహము మిక్కిలి ముఖ్యమైనది. సంకల్పవశమున గలుగు కోరికలనుగూడ తుదముట్టింపవలెను.

సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః।
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥3

1. శ్వేతాశ్వ. 5-9.
2. శ్వేతాశ్వ. 1-16. 3. గీత, 6-24.

ఐవి భగవంతుడు అక్కడ సంయస యోగమునందు కామత్యాగమును, ఇంద్రియవిగ్రహ మును అనుష్ఠింపవలెనని హెచ్చరించియున్నాడు.

ఇక సత్కర్మల నాచరించి ఫలములను భగవంతునికి వదలిపెట్టునట్టియే త్యాగ శీలుడైన యోగికి ముఖ్యకర్తవ్యము. శరీరధారియైనవాడు కర్మరహితుడై యుండ జాలడు. గాన కర్మఫలత్యాగియే నిక్కమైన త్యాగి యనబడునని కృష్ణుడు నుడివెను—

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥1

మరియు—

భక్త్యా మా మభిజానాతి యావా న్యశ్చాస్మి త త్త్వతః ।2

అని భగవంతుడే చెప్పినట్లు భగవంతు నెరుంగుటకు భక్తియే ముఖ్యోపాయము గాన భక్తిపరుడు గావలెను. భక్తిగలవాడే సతతము భగవంతుని ధ్యానింపగలడు. ప్రకృతి సంబంధమును విస్మరింపవలె నన్నచో తీవ్రమైన వైరాగ్య మవసరము. బ్రహ్మనిష్ఠునికి సంతతధ్యానయోగము, వైరాగ్యము ఆచరణీయములుగా స్మృతి విధించుచున్నది—

ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ।3

అట్లే ఆచార్యుడు వచించు భగవత్కథలు వినుట యోగవృద్ధి కుపకరించును. గర్గాచార్యుడు భగవత్కథాశ్రవణమునం దాసక్తియే భక్తియని చెప్పినట్లు నారదుడు తెలిపెను—"కథాదిష్వితి గర్గః".4 ఆచార్యుడు ప్రత్యక్షదైవము గాన ఆయనను సేవించుట సాధకుని ధర్మము.

భారమంతయు భగవంతునిపై వేసి శరణాగతుడై యుండుటే ప్రపత్తియోగము. పై యనుష్ఠానములన్నియు ఈ యోగమునకు సహకరించును. అట్టి యోగశీలుని పరమ భాగవతులైన వైష్ణవులు తప్పక దయ జూడగలరు. అంతకంటె వానికి కావలసిన దేమున్నది ?

---

1. గీత. , 18-11.　　2. గీత. 18-55.
3. గీత. , 18-52.　　4. నా. భ. సూ. -17.

## 24

అవ:- శీతోష్ణ సుఖదుఃఖాదులను విరక్తులైన ఆత్మజ్ఞులు మాత్రమే ఓర్వగా గల రనుచున్నారు—

### మలహరి

దేహము సంబంధము - యివి దేహికి బనిలేదు
వూహించనేర్చినవారలే - వోడుచుకుందురయ్యా. ॥పల్లవి॥

1. విడువవు శీతోష్ణంబులు - విడువవు సుఖదుఃఖంబులు
వెడవెడ మరణభయంబులు - విడిచినయందాకా.
ఉడుగవు కాంక్షలు మమతలు - నుద్యోగంబులు చింతలు
పొడవగు విరక్తి తనలోఁ - బొడమిన యందాఁకా ॥దేహ॥

2. మానదు చిత్తవికారము - మానదు దుర్గుణదోషము
మానదు భోగము లన్నియు - మానినయందాఁకా.
పోనీదు చేసిన దురితము - పోనీదు ప్రాఁతఫలంబును
పూనిన తన యజ్ఞానము - పోయినయందాఁకా. ॥దేహ॥

3. తెగవటు భవబంధంబులు - తెగవెడయవి గర్వంబులు
విగిడిన యీయాత్మజ్ఞానము - పీ విచ్చినయందాఁకా.
జగదేకవిభుఁడ శ్రీవెంకటేశ్వర - సర్వము నీయానతికొలఁదే
తగులుచుండు నివి నిశ్చలముగ నీ - దాస్యము గలిగిన
యందాఁకా. ॥దేహ॥

ప॥ దేహికి = ఆత్మకు.

1. కాంక్షలు = కోరికలు, పొడవగు = ఉన్నతమైన, దృఢమైన.

2. దురితము = పాపము.

3. భవబంధంబులు = జన్మబంధములు, సంసారపు బంధనములు.

ఈ చెప్పబోష్వవ వన్నియు దేహమునకు మాత్రమే సంబంధించినవి. దేహియగు ఆత్మకు వీటితో పనిలేదు. పరిశీలింపగా దేహముయొక్కయు, దేహియొక్కయు స్వరూపమును చక్కగా నెరింగిన నేర్పరులగు ఆత్మజ్ఞులు మాత్రమే వీటిని సహించు కొనగలరు.

మరణభయములు తన్ను విడుచునంతవరకు శీతోష్ణములు, సుఖదుఃఖములు మున్నగు ద్వంద్వములు ప్రాణిని విడువవు. గట్టి వైరాగ్యము తనకు గల్గునంతవరకు కోరికలు, మమకారములు, కోరికలు దీర్చుకొనుటకై ప్రయత్నములు, అవి విఫలమైనప్పుడు చింతలు తప్పవు.

భోగము లన్నియు త్యజించునంతవరకు మనోవికారము, దుర్గుణములవలన గలుగు దోషము తొలగవు. తన్నావహించిన అజ్ఞానము నశించునంతవరకు చేసిన పాపము, దానిచే గలుగు నొసటి వ్రాతయొక్క ఫలము విడువవు.

లోకైక విభుడవగు శ్రీ వేంకటేశ్వరా ! ఉజ్జ్వలమగు ఆత్మజ్ఞానమును నీవు ప్రసాదించునంతవరకు ఈ జన్మ (సంసార) బంధములు, ఎడతెగని గర్వములు తెగవు. అంతయు నీ యాజ్ఞ ననుసరించియే జరుగుచున్నది. నిశ్చలమైన నీదాస్యము చేకూరు నంతవరకు పై జెప్పిన శీతోష్ణాదులగు బాధలన్నియు ప్రాణులను వెన్నంటియే యుండును.

వి:- దేహి నిత్యుడు. దేహము లనిత్యములు. "దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత !"[1] అని భగవద్వచనము. శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు, లాభాలాభములు, జయాపజయములు మున్నగునవి ద్వంద్వము లనబడును. అవి దేహమునకే గాని దేహికి జెందినవి గావు. దేహమే తానని భావించు వానినే మరణభయము బాధించును. ఆత్మజ్ఞాన కాభయము లేదు. అందుచే నతడే శీతోష్ణాదుల నోర్చుకొనగలడు.

మరియు ఇంద్రియములు విషయములతో సంయోగము నొందినప్పుడే శీతోష్ణాదులు గలుగును. ఈ ద్వంద్వములు రాకపోకలు గలవి, అనిత్యములు. నిత్యాత్మవిజ్ఞానము గలవాడు వాటివలన హర్షవిషాదముల నొందడు. వాటికి లొంగక సుఖదుఃఖముల సమముగ జూచు ధీరుడే అమృతత్వము నొందగలడని గీత బోధించుచున్నది—

1. గీత. , 2-30.

మాత్రా స్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత ॥

యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥1

కోరికలు, అహంకార మమకారములు, లేనిపోని ప్రయత్నములు, చింతలు విరక్తునికి పొడచూపవు. భోగాసక్తి గలవానికి చిత్తవికారము సహజము. దుర్గుణములచే గల్గు దోషములకు చిత్తవికారమే హేతు వగుచున్నది.

పాపకర్మములచే గల్గు దురితము నొసటివ్రాతయై దుష్ఫలితమును గలుగజేయుచున్నది. అజ్ఞాన మున్నంతవరకు హరిహరాదులుగూడ నొసటివ్రాతను తుడుపలేరు. కావుననే—

హరిణాఽపి హరేణాపి బ్రహ్మణాఽపి సురైరపి ।
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం న శక్యతే ॥2

అని పెద్దలనిరి. కాన ఆత్మజ్ఞానముచేతనే దురితఫలమును తొలగించుకొనవలెను.

సమస్తపాపములు జ్ఞానప్లవముచేతనే తరింపదగినవనియు, అగ్ని కొట్టెలను కాల్చునట్లు జ్ఞానాగ్ని కర్మములను కాల్చివేయు ననియు గీత చెప్పుచున్నది—

అపిచే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా ॥3

ఆత్మజ్ఞానముగూడ భగవదనుగ్రహముచేతనే కలుగవలసియున్నది. తన దాస్యము నంగీకరించిన భక్తులకే భగవంతు డట్టి జ్ఞానము నను గ్రహించును.

1. గీత. , 2-14, 15. 2. విక్రమ. , 1-230.
3. గీత. , 4-36, 37.

## 25

అవ:- శ్రీ నరసింహస్వామి ప్రాదుర్భావమును, హిరణ్యకశిపుని సంహారమును వర్ణించుచున్నారు——

సాళంగనాట

శరణని బ్రతుకరో - జనులాల!
గరిమ మెరసె నిదే - కనకసింహము. ॥పల్లవి॥

1. ఆహారహమునఁ బ్ర - హ్లాదుఁడు దొరకొని
బహువిధముల హరి - మహిమలు వొగడఁగ,
కహకహ హిరణ్య - కశిపుఁడునగి హరి
సహజ మేది యని - చఱచెఁ గంభము. ॥శర॥

2. అటమరి పెటపెట - మని బెల్లెగసి
చిటచిట రవములఁ - జిరుతపొగ లెగసి,
తటతట మనుచును - తరలి - బ్రయ్యలై
పటపట మనుచును - పగిలెఁ గంభము. ॥శర॥

3. బెడిదపు చూపుల - మిణుఁగురు లెగయఁగ
పుడమి యదర నూ - ర్పులు చెలఁగ,
గడగడ వడఁకి ది - క్తటము లల్లాడఁగ
వెడలెఁ గంభమున - విజయసింహము. ॥శర॥

4. నగవుల మెఱవడె - నభోంతరంబులు
పొగలెగసెను పెను - బొమముళ్ళు,
పగలు నార్పులను - పగిలెను గొండలు
వెగటున వెడలెను - వీరసింహము. ॥శర॥

5. తెలిచిననోరఁ బ్ర - తిధ్వను లెసగఁగ
కలకు గతుల చు - క్కలు చెదర,
వెలి హుంకృతులను - వికలము బెదరఁగ
వెలువడఁ గెరలె - విమలసింహము. ॥శర॥

6. పటువిహారముల - బ్రహ్మాండ మగల
గుటగుటరవళి నా - కుల వొగడ,
విటలనేత్రమున - నెఱమంట లడర
పటుగతి మెరసెను - భయదసింహము. ॥వర॥

7. పెదపెద కోఱల - పిడుగులు రాలఁగ
తుద నఖముల నె - త్తురు దొరుగ,
గుదిగొను కనుఁబల - కులగిరు లూఁటాడ
పుదయించె నపెవొ - వుగ్రసింహము. ॥వర॥

8. అట్టహాసమున - నసురలు వారఁగ
ముట్టి వాయువులు - మొగతిరుగ,
దట్టములై జల - ధరములు ముసరఁగ
దిట్టయై వెడలె - ధీరసింహము. ॥వర॥

9. జలధులు గలఁగెను - జడిసె లోకములు
తలఁకె సప్త పా - తాళములు,
ఉలికిపడదొడఁగె - నూర్ధ్వలోకములు
కొలువున నిలిచెను - ఘోరసింహము. ॥వర॥

10. ఉచ్చట హిరణ్యు - నదరంటఁబట్టి
యిచ్చలఁదొడపై - నిడి చించి,
కుచ్చి వావి పే - గులు జంద్యములుగ
విచ్చి వేసుకొనె - విష్ణుసింహము. ॥వర॥

11. పొగడిరి దివిజులు - భువనములు వెలసె
పగ యుడిగి చెలఁగెఁ - బ్రహ్లాదుఁడు,
మిగుల శాంతమున - మించె శ్రీవేంకట
నగమున నహోబల - నారసింహము. ॥వర॥

వా గరిమన్ = గొప్పతనముతో; కనకసింహము = బంగారువంటి మేనికాంతిగల నరసింహుడు. ('కనక' శబ్దపర్యాయముగా 'హిరణ్య' శబ్దమును గ్రహించి నామైక దేశన్యాయమున 'హిరణ్యకశిపుడు' అను అర్థము చెప్పినచో 'హిరణ్యకశిపుని పాలిటి సింహము' అనియు చెప్పనగును).

1. అహరహమును = ప్రతిదినమును; హరిసహజము = విష్ణుని స్వభావము.

3. బెడిదపు = భయంకరమైన; దిక్తటములు = దిక్కుల తీరములు.

4. నభోఽంతరంబులు = ఆకాశమధ్యభాగములు. పగటు నార్పులను = ప్రకటమైన బొబ్బరింపులచే.

5. నిఖిలము = సమస్తము; వెఱచఱవన్ = భయపడి పారగా, కెరలెన్ = విజృంభించెను.

6. అగలన్ = పగులగా; రవళి = శబ్దము; నాకులు = దేవతలు; వికటనేత్రమునన్ = నొసటి కంటియందు.

7. గుదిగొను = అతిశయిల్లు; కసరులన్ = అదలింపులచే.

8. మొగతిరుగన్ = విముఖములు కాగా; జలధరములు = మబ్బులు.

11. దివిజులు = దేవతలు.

ప్రజలారా! అడుగో కనకకాంతిగల నృసింహస్వామి మహావైభవముతో ప్రకాశించుచున్నాడు. శరణని ఆ దేవు నాశ్రయించి బ్రదుకుడు.

ప్రతిదినమును ప్రహ్లాదుడు పూనుకొని అనేకరీతుల శ్రీహరి మహిమలు పొగడుచుండగా, హిరణ్యకశిపుడు కహకహ నవ్వి నీ వనినట్లు అంతట వ్యాపించిన ఆ విష్ణుని స్వభావమేదో చూపుమని గద్దించుచు, ప్రక్కనున్న స్తంభమును అఱచేత వేసెను.

వెంటనే ఆ స్తంభమున పెటపెటమని పేళ్లెగసెను. చిటచిట శబ్దములు గలిగి పొగలు గ్రమ్మకొనెను. మఱియు ఆ స్తంభము తటతటమని చలించి బ్రయ్యలుగా చీలి పటపట మనుచు పగిలిపోయెను.

భయంకరములగు చూపులనుండి అగ్నికణములు పైకి చిమ్మగా, భూమి కంపించునట్లు విట్టూర్పులు చెలగగా, దిశాతటములెల్ల గడగడ వడకి అల్లాడగా స్తంభమునుండి విజయశీలుడైన నృసింహుడుద్భవించెను.

ఆ నరసింహుని నవ్వులచే గగనాంతరాళములు సుడివడెను. పెద్ద బొమముళ్ళ నుండి పొగలు వ్యాపించెను. ప్రకటమైన బొబ్బరింపులచే కొండలు పగిలెను. వీరుడైన నృసింహుఁ డట్లు ఆ కంబమునుండి వెగటుగా బయల్వెడలెను.

తెఱచిన అతని నోటనుండి ప్రతిధ్వనులు అతిశయించెను. ఉద్దండములైన వడకలచే చుక్కలు చెదరెను. హుంకారములచే సమస్తలోకము చెదరిపోయెను. ఆ విధముగా విషమడైన నృసింహుఁ డా స్తంభమునుండి వెడలి విజృంభించెను.

విక్రమోపేతములైన తన విహారములచే బ్రహ్మాండము బ్రద్దలుకాగా; తోట్రుపడు మాటలచే స్వర్గలోకవాసులు పొగడుచుండగా, ఫాలనేత్రమునుండి మంటలు వ్యాపింపగా భయంకరుడగు ఆ నరసింహుఁడు ప్రకాశించెను.

నిడుపులైన ఆయన కోఱలనుండి పిడుగులు రాలెను. నఖాగ్రములనుండి నెత్తురు కారెను. అతిశయిల్లెడు కోపార్పులచే సప్తకులపర్వతములు ఊటాడెను. ఆ రీతిగా ఉగ్రుడైన నరసింహస్వామి ఆవిర్భవించెను.

అట్టహాసము వలన రక్కసులు బెదరి పరువిడగా, గాడ్పులు విముఖములై ప్రవరింపగా, మబ్బులు దట్టములై ముసరుకొనగా ధీరనరసింహుఁడు దిట్టడై బయలువెడలెను.

అప్పుడు సముద్రములు కలగబారెను. లోకములు భయపడెను. పాతాళలోకము వేరును చలించెను. ఊర్ధ్వలోకములన్నియు నులికిపడెను. భీకరుడైన నృసింహుఁ డట్లు వచ్చి కొలువుకూటమున నిలిచెను.

ఆ సభాస్థలమునవనే విష్ణుసింహము హిరణ్యకశిపు నొడిసిపట్టి స్వేచ్ఛగా తొడపై నిడి గోళ్లతో వాని గర్భము జీల్చి చెండాడి ప్రేవులు జందెములుగా వేసికొనెను.

అప్పుడు దేవతలు పొగడిరి. లోకములు ఉపద్రవరహితములై చెలువొందెను. ప్రహ్లాదుడు తండ్రితోడి పగ నాటితో వదలించుకొని హాయిగా నుండెను. తన ఉగ్రత్వము విడిచి మిక్కిలి శాంతస్వరూపుడై అహోబల నృసింహస్వామి శ్రీ వేంకటాద్రిపై ప్రకాశించెను.

వి:- సంస్కృత భాగవతమున నృసింహావతార ఘట్టము అత్యద్భుతముగా వర్ణింపబడినది. పోతన ఒక సుదీర్ఘమైన గద్యముతో ఈ ఘట్టమును కొంత పెంచి వర్ణించెను. అన్నమయ్య తన సహజ కవితాచాతురి చూపుచు రసానుగుణమైన పదబంధ

ముతో నృసింహావిర్భావము నిట హృద్యముగా వర్ణించినాడు. ఈ గేయమున అర్థాస్వాదసమయమునకంటె తగినవారు దీనిని చదువునప్పుడు సహృదయులకు గలుగు పారవశ్య మెక్కువ.

సాధారణముగా అన్నమయ్య సంకీర్తనములు మూడు చరణములతో ముగియుచుండును. విపుల వర్ణన మవసరమని తోచినచోట్ల చరణముల సంఖ్య పెంచుటకలదు. నృసింహుని అవతారమును కన్నులకు గట్టినట్లు వర్ణింపగోరియే ఈ పాటలో పదునొకండు చరణములు కూర్పబడినవి. నృసింహు డావిర్భవించినప్పటి జగద్భయావకస్థితి యిందు రసానుగుణముగా వర్ణింపబడినవి. ఇట పల్లవిని, తొలి రెండు చరణములను తప్పించినచో సింహపదాంతములైన చివరి తొమ్మిది చరణములలోను నవ నారసింహులు వర్ణింపబడిన ట్లున్నది.

అహోబలమున నున్న నృసింహుని కీర్తించుచు అన్నమయ్య అనేక కీర్తనలు రచించెను. ఒక్క అహోబలమే కాక తన కాలమున సుప్రసిద్ధమైన వైష్ణవక్షేత్రములలోని అనేక దేవతలను ఆయా యూళ్ళ పేళ్ళతోనే పదకవితాపితామహుడు కీర్తించి యున్నాడు.

ఏ దేవతను కీర్తించినను, చివరి చరణమున ఆ దేవతకును, శ్రీ వేంకటేశ్వరునకును అభేదమును ప్రతిపాదించుచు సంకీర్తనమును ముగించుట ఈ వాఙ్మయము నందలి విశేషము.

## 26

అవ:- హరిమాయకు లోనై ప్రాణులు దుష్కృతములలో ఓలలాడుచున్నారనుచున్నాడు—

### వరాళి

బయ లీదించి వదివో - ప్రాణులను హరిమాయ
క్రియ దెలుసుకొనేటి - కీలింతేకావి. ॥పల్లవి॥

1. పెక్కు పురుషులలోన - బెరపొక సతి యుంటే
యిక్కువై యుందే నాటు - విందరిచూపు.
దక్కి యందరి కౌగిళ్ల - తరుణి యుండుట లేదు
గక్కున వట్టి యాసలఁ - గరఁగుటేకావి. ॥బయ॥

2. చింతకాయ కజ్జాయము - చేరి యిసుమంత వుంటే
అంతటనే నోరూరు - నందరికివి..
కొంతనే నాలుకలకు - పులుసై యుండుటే లేదు
కొంత భావించి మింగేటి - గుటుకలే కాని ॥బయ॥

3. శ్రీవేంకటేశు తేరు - దీనేటి మనుజులెల్లాను
సేవగా నేమే తీ - సితిమందురు.
ఆవల నాతఁడే తమ - అంతరాత్మయై యుండి
కావించుట యెరఁగరు - గర్వములే కాని. ॥బయ॥

1. బెరపి = చేరి; ఇక్కువ = స్థానము, ఉనికి.

2. చింతకాయ కజ్జాయము = చింతపులుసు, ఉప్పు, కారము మున్నగు పదార్థములతో చేయు ఒక చిరుదిండి.

అదిగో! శ్రీహరిమాయ ప్రాణులను బట్టబయలున తలఁగొట్టించుచున్నది. లోకములోని ప్రాణుల గావించు చేష్టలను చక్కగా పరిశీలించి తెలిసికొన్నచో అందలి కీలక మంతయు హరిమాయయే గాని మరేమియు గాదు.

పెక్కుమంది పురుషులమధ్య ఒక్కస్త్రీ చేరియున్నచో వారందరి చూపులు ఆమెయందే నాటుకొనుచున్నవి. ఆ తరుణి అచటి పురుషు లందరి కౌగిళ్ళలో నుండుట లేదు. వారు తమ భావనలోనే ఆమెను తమదిగా భావించుకొనుచు శుష్కమైన ఆశలతో కరగిపోవుచున్నారు.

రవంత చింతకాయ కజ్జాయము ఉన్నచో దానిని చూచువారందరికి నోరూరు చున్నది. వారి నాలుకలకు ఆ పులు సంటుటలేదు. వారు దాని నాస్వాదించినట్లు ఊరక భావించి లొట్టలు వేసికొనుచున్నారే కాని మరేమియు లేదు.

శ్రీ వేంకటేశ్వరుని రథములాగు జనులందరు భగవత్కైంకర్యముగా ఆ రథము మేమే లాగితి మందురు. ఇవి వట్టి గర్వపుమాటలే. ఆ పరమాత్ముడే తమ అంతరాత్మగా నుండి ఆ రథమును తమచే లాగించుచున్నాడని వారు గ్రహింపరు.

వి:- పలురకములైన జీవుల ప్రవృత్తులన్నియు హరి మాయచేతనే కలుగు చున్నవి. భోగ్యపదార్థములలో ఏదో ఆనందము కలదని భ్రమించి జీవులు వాటిపై ఆశ గొనుచున్నారు. ఆ పదార్థములవలన జీవులు పొందు సుఖము మిక్కిలి స్వల్పము,

మరియు క్షణికము. పైగా ఆ సుఖము నిజముగా పదార్థములనుండి కలుగుటలేదు. జీవుల భావనలోనే అది కలదు. ఈ తత్త్వమునే పద కవితాపితామహుం డీ సంకీర్తనములో చక్కని దృష్టాంతములతో వివరించినాడు.

పెక్కుమంది పురుషుల నడుమనున్న ఒక్క యువతి అందరికిని కౌగిటి సుఖము పంచింపజాలదు. ఐనను 'కామీ స్వతాం పశ్యతి'[1] అన్నట్లు ఆమెను తనదిగానే భావించుకొని మరులుగొని పురుషులందరు కరగిపోవుట మాయా ప్రభావము గాక మరేమి? అట్లే రవ్వంత చింతకాయ కజ్జాయము అందరి నోటి కందదు. దానిని చూచి నంతనే అందరికి నోరూరుటయు మాయావిలాసమే.

ఈ దృష్టాంతములచే భోగ్యపదార్థముల సంస్పర్శము లేకయే కలుగు సుఖాభాసము వర్ణింపబడినది. వాటి సంస్పర్శచే కలుగు సుఖముగూడ సుఖాభాసమేయనియు, అదియు జీవుల భావనవలననే కలుగుచున్నది కాని పదార్థములనుండి కలుగుట లేదనియు తత్త్వజ్ఞులు చెప్పుదురు.

సుఖదుఃఖములు పదార్థములనుండియే కలుగుచో ఒకే పదార్థము అందరికి సుఖమునో లేక దుఃఖమునో కలిగించవలసియున్నది. లోకములో అనుభవ మట్లు లేదు. "కొన్నిజంతువులు రోసిన హేయము కొన్నిజంతువుల కమృతము"[2] అని అన్నమయ్య పలుకుచో పేర్కొన్నట్లు జీవులు మాయకు లోనై తమ తమ భావనల ననుసరించియే ఆయా సుఖదుఃఖముల ననుభవించుచున్నా రనుట పరమార్థము.

శ్రీ వేంకటేశ్వరుని తేరు లాగువారు తమలో అంతర్యామిగానున్న పరమాత్మని గుర్తింపలేక తామే లాగుచున్నామని గర్వించుటయు మాయావైభవమే.

ఈ దైవమాయ త్రిగుణాత్మకమైనది. దీనిని దాటుట మిక్కిలి కష్టము. భగవంతునియెడల ప్రపన్నులైనవారు మాత్రమే ఈ మాయను దాటగల రని గీత చెప్పుచున్నది—

> దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
> మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే॥[3]

1. శాకుం., 2-2. 2. అ. సం., 9-57.
3. గీత., 7-14.

27

అవ:- భగవంతుని పూజావిధానముయొక్క నిజమైన స్వరూపమును నిరూపించుచున్నాడు—

బౌళి

నింకె మనసే - నీ పూజ
అండఁగోరకుండు - టదియు నీ పూజ. ॥పల్లవి॥

1. ఇందు హరి గలఁ - డందు లేఁడనేటి
నిందకుఁ బాయుటె - నీ పూజ,
కొందరు చుట్టాలు - కొందరు పగనే
అందదుకు మాను - టదియె నీ పూజ. ॥నిండు॥

2. తిట్టులు గొన్నని - దీవెన గొంతని
నెట్టుకోనిదే - నీ పూజ.
పెట్టిన బంగారు - పెంకును నినుమును
అట్టే సరి యను - టదియు నీ పూజ. ॥నిండు॥

3. సర్వము నీ వని - స్వతంత్ర ముడిగి
నిర్వహించుటే - నీపూజ.
సర్వ శ్రీవేంకట - పతి నీదాసుల
పూర్వ మనియెడి - బుద్ధి నీపూజ. ॥నిండు॥

1. అందదుకు = మిక్కిలి అదుకు,

2. అపూర్వము = అపురూపము.

దేవా! లేనిపోని చింత లుడిగి నిండు చిత్తముతో నెమ్మదిగా నుండుటే నీపూజ. ఇతరుల ఆశ్రయము గోరకుండుట, లేదా చీటికి మాటికి ఇతరుల సహాయ మర్థింపక తన కున్నదానితో తృప్తిపడియుండుటే నీయెడల నిజమైన పూజయగును.

శ్రీహరి ఇందున్నాడు, అందు లేడు అను అజ్ఞానము వీడి ఆయన అంతట కలడను విజ్ఞానదృష్టి కలిగియుండుటే నీ పూజ. మరియు వీరు నాకు బంధువులు, వారు నాకు శత్రువులు అను భేదదృష్టిని వీడుటే నీ పూజ యగును.

కొన్నిమాటలు తిట్లని, మరికొన్నిమాటలు దీవెన లని భావింపక నిందాస్తుతుల యెడ ఎట్టి వికారమునకు లోనుగాక సమత్వమును వహించుటే నీపూజ. బంగారు తునకను, ఇనుపముక్కను సమానముగా తలచుటే నీకు నిజమైన పూజ.

అంతటికి ఆధారమైన సర్వాంతర్యామివి నీవే అని తలచి తాను స్వతంత్రుడ నవే గర్వము వదలి లోకయాత్ర జరుపుటే నీపూజ. శ్రీ వేంకటేశ్వరా ! నీ దాసులే లోకములో అపురూపమైనవారని భావించి వారియెడల ఆదరము జూపు బుద్ధి గల్గియుండుటే నీకు నిక్కమైన పూజ.

వి:-పూవో పండో పరమాత్మకు సమర్పించి చేయునదే దేవుని పూజయని సామాన్యులు తలంతురు. కాని పరమభాగవతాగ్రేసరు డగు పదకవితాపితామహుడీ సంకీర్తనములో భగవత్పూజయొక్క నిజమైన స్వరూపము నిరూపించినాడు.

పూర్ణమనస్కుడై యుండుట, పరుల నాశ్రయింపకుండుట, భగవంతుని సర్వాంతర్యామిగా భావించుట, తోడిమానవులయెడ శత్రు మిత్రభావము వీడుట, స్తుతి నిందలలో సమత్వము వహించుట, బంగారు - ఇనుము ఇత్యాదిగాగల వెక్కలి విలువైన, విలువలేని పదార్థములలో సమదృష్టి గల్గియుండుట, తాను స్వతంత్రుడ నను తలపు వీడుట, భగవద్దాసులను శ్రేష్ఠులుగా నెంచి పూజించుట - ఇవియే భగవంతుని యెడల నిజమైన పూజలు. పత్ర పుష్ప ఫలాదులు సమర్పించి చేయుపూజలు బాహ్య పూజలు మాత్రమే.

గీతలో గుణాతీతుని లక్షణము లిట్లు పేర్కొనబడినవి:—

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥
ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥
సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియా ప్రియో ధీరః తుల్యనిందాత్మసంస్తుతిః ॥
మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారి పక్షయోః ।
సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥[1]

దీని తాత్పర్య మిది:—

1. గీత. . 14-22, 23, 24, 25.

అర్జునా ! సత్త్వరజస్తమోగుణములకు చెందిన ప్రకాశము, ప్రవృత్తి, మోహము - వీటియెడ రాగద్వేషములు లేనివాడు, ఆ యాగుణము లాయాకార్యములలో ప్రవర్తించుచున్న వని భావించి తన నిష్ఠనుండి చలించని ఉదాసీనుడు, సుఖ దుఃఖముల యందు సమభావము గలవాడు, స్వస్వరూపమున నిలుకడ గలవాడు, మట్టిపెళ్ళ, రాయి, బంగారు - వీటిని సమముగా చూచువాడు, ధీరుడు, ఇష్టానిష్టములయందు, నిందా స్తుతులయందు, మానావమానములయందు, మిత్ర శత్రుపక్షములయందు తుల్యభావము గలవాడు, సమస్త కామ్యకర్మములు విడినవాడు గుణాతీతు డనబడుచున్నాడు

పై సంకీర్తనములోగూడ ఇంచుమించు ఈ గుణాతీతుని లక్షణములే భగవత్పూజలుగా నిరూపింపబడినవి. తత్త్వజ్ఞుడైన గుణాతీతుని దృష్టికి భగవంతుడు సర్వవ్యాపిగా గోచరించును.

ఫలపుష్ప సమర్పణాత్మకములైన బాహ్యపూజలుగూడ క్రమముగా చిత్తశుద్ధి కల్గించి పై జెప్పిన ఆత్మగుణములను పెంపొందించుటకే ఉద్దేశింపబడిన వని గుర్తింప వలెను.

## 28

అవః- భగవద్భక్తి దక్క ఆనందకర మైనది మరేద్దియు లేదనుచున్నాడు—

### శుద్ధవసంతం

భక్తి నీపై దొకటె - పరమసుఖము
యుక్తి చూచిన నిజం - బొక్కటే (టీ?) లేదు. ॥పల్లవి॥

1. కులమెంత గలిగె నది - కూడించు గర్వంబు
చలమెంత గలిగె నది - జగడమే రేచు,
తలఁపెంత పెంచినాఁ - దగిలించు కోరికలు
యెలమి విజ్ఞానంబు - యేమిటా లేదు. ॥భక్తి॥

2. ధనమెంత గలిగె నది - దట్టమౌ లోభంబు
మొనయుఁ జక్కఁదనంబు - మోహములు రేఁచు,
ఘనవిద్య గలిగినను - కప్పుఁబై పై మదము
యెనయంగఁబరమపద - మించుకయు లేదు. ॥భక్తి॥

3\. తరుణు లెందరు అయిన - తాపములు సమకూడు
సిరు లెన్ని గలిగినను - చింతలే పెరుగు,
ఇరవయిన శ్రీవేంక - టేశ! నిను(గొలువ(గా
పెరిగె నానందంబు - బెళకు లి(క లేవు. ॥భ క్తి॥

3\. బెళకులు = చాంచల్యములు.

దేవా! నీపైగల భక్తి ఒక్కటే ఉత్తమసుఖము గల్గించునది. ఎంత యోచించి చూచినను అది తప్ప నిజముగా సుఖకరమైనది మరొకటి లేనే లేదు.

తన కుల మెంత దొడ్డదో, అది అంత యెక్కువ గర్వము గల్గించును. ఎంత మత్సరము నొరులపై పెంచుకొందుమో అంతగా అది కలహమునకు కారణమగును. తలపులు పెరుగుకొలది కోరికలు కూడ పెరిగి జీవుని బంధించివేయును. కాబట్టి కులము, చలము, తలపు మున్నగువాటిలో దేనిచేనైనను నిక్కమైన విజ్ఞానము గలుగుట లేదు.

ఎంత ఎక్కువగా ధనము సమకూర్చుకొందుమో, అంత మెండుగా లోభము వృద్ధియగును. ఎంతకెంతకు అంద మతిశయించునో అంతకంతకు మోహము పెన గొనును. పెద్దపెద్ద చదువులు నేర్చినకొలది మదము పై పై నావరించుచుండును. కావ కలిమి, అందము. చదువు మొదలగువానిచే ఉత్తమగతి యించుకంతయు లభింపదు.

ఎందరు యువతుల ననుభవించినను తృప్తి యనునది లేకపోగా పై పైని కామసంతాపములు బలపడుచునే యుండును. సంపద లెన్ని కల్గినను వాటితోపాటు చింతలు పెరుగునే కాని శాంతి లభింపదు. శాశ్వతుడ వయిన శ్రీ వేంకటేశ్వరా! చివరకు నిన్ను సేవింపగా నిజమైన ఆత్మానందము వృద్ధి నొందినది. నిలుకడ కుదిరి నది. ఇక మాకు చిత్తచాంచల్యము లేదు.

వి:- భగవద్భక్తి యొక్కటే పరమానందము నొదగూర్చునది. తదితరమైన దేదియు నిక్కమైన సుఖము నొసంగజాల దను తత్త్వార్థ మీ సంకీర్తనములో ప్రతిపా దింపబడినది.

అనేకజన్మలలో చేసిన పుణ్యము ఫలించిననే నరులకు భగవద్భక్తిపై ప్రీతి గల్గుననియు, కలియుగమున భక్తియే ముక్తికి హేతువనియు, భక్తిగలవానియెదుటనే కృష్ణుడు సాక్షాత్కరించు ననియు పెద్దలు భక్తిమహిమను శ్లాఘించిరి—

నృణాం జన్మ సహస్రేణ భక్తౌ ప్రీతిర్హి జాయతే ।
కలౌ భక్తిః కలౌ భక్తిః భక్త్యా కృష్ణః పురః స్థితః ॥

కులము, కలిమి, అందము, చదువు, స్త్రీలు మున్నగువానిలో సుఖమున్నదని పామరులు భ్రమింతురు. నిజమునకు వాటిలో నెట్టి సుఖమును లేదు. పై పెచ్చు అవి అనర్థహేతువు లగుటచే దోషభూయిష్ఠములు.

ఉత్తమ కులజునకు గర్వము, మచ్చరము గలవానికి కలహము, ధనికునకు లోభము, సౌందర్యవంతునకు మోహము, విద్యావంతునకు మదము, స్త్రీలోలునకు తాపము, సిరులు పెరిగినవానికి చింతలు పెరుగుట కలదు.

సంపద, యౌవనము, సౌందర్యము, అనుమానశక్తి - అనునవి అనర్థ పరంపరలనియు, అందులో ఒక్కొక్కటి అన్ని అవినయములకు హేతువనియు, అవి యెల్ల నొకచో జేరినచో ఇక చెప్పవలసినపనియే లేదనియు బాణుడు నుడివెను—

"గర్భేశ్వరత్వం, అభినవ యౌవనత్వం, అప్రతిమరూపత్వం, అమానుష శక్తిత్వం చేతి మహతీయం ఖల్వనర్థ పరంపరా, సర్వా వినయానా మేకైక మప్యేషా మాయతనం, కిముత సమవాయః ".[1]

కాని ధనము, విద్య మున్నగునవి వివేకహీనులైన దుర్మతులకే అనర్థదాయకము లగును, సజ్జనులకు వాటివలన అడకువ, వినయము గల్గునని విదురుడు వచించెను—

ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబు - బొనరించును స
జ్జనులైనవారి కడకువ
యును వినయము నివియ తెచ్చు - నుర్వీనాథా ![2]

కావున సౌజన్యముగల్గి భగవద్భక్తుడైనవానికి ధనము మొదలగు వాటిచే అపకారము కలుగదు. మొత్తముమీద భగవద్భక్తి యొకటే పరమసుఖము నిచ్చునుగాని ఉత్తమకులము మున్నగునవి కావనుట పరమార్థము.

---

1. కాదం., శుకనాసోపదేశము. 2. భార. ఉద్యో. 2-35.

## 29

అవ:- పుణ్యపాపములమండి తన్ను విముక్తుని గావింపుడని పంచేంద్రియము లను ప్రార్థించుచున్నాడు—

సాళంగనాట

పంచేంద్రియము లనే - పట్టణస్వాములాల
తెంచి బేర మాడుకొని - దించరో బరువు. ॥పల్లవి॥

1. తగిన సంసార సము - ద్రములోనఁ దిరిగాడి
బిగువు దేహపుటోడ - బేహారివాఁడ.
జగతిఁ బుణ్యపాపపు - సరకులు దెచ్చినాఁడ
బిగిసి బూతురేవునఁ - దీరుచరో సుంకము. ॥పంచే॥

2. అదరి గుణత్రయము - లనేటి యెద్దుల చేత
వదుమ విన్నాళ్లదాఁకా - నడపినాఁడ.
కదుఁ జంచలము లనే - గాలివాప లెత్తినాఁడ
వెడమాయపు సరకు - వెలకియ్యరో. ॥పంచే॥

3. ఆతుమ యనేటి కంభ - మంతరాత్మఁడెక్కియుండి
నీతితో మమ్ముఁ గాచుక - నిలుచున్నాఁడు.
అతఁడే శ్రీవేంకటేశుఁ - డటు మాకు మీకుఁగర్త
ఘాతమాని యిఁక మాకు - కడుగుణ మియ్యరో. ॥పంచే॥

ప॥ పంచేంద్రియములు = శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము అను ఐదు జ్ఞానేంద్రియములు.

1. బేహారి = వ్యాపారి; బూతురేవు = నింద్యమైన సంసారవ్యామోహ మను రేవు.

2. గుణత్రయములు = సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములు; చంచలములు = చంచలమైన చిత్తమున జనించు కోరికలు.

3. కంభము = స్తంభము; ఘాత = దెబ్బ.

శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము అనబడు ఐదు జ్ఞానేంద్రియములు అను పట్టణ ప్రభువులారా ! త్వరగా బేరము వగదెంచుకొని నాబరువు దించుడు.

నేను బిగువైన శరీరమను ఓడలోనుండి వ్యాపారము చేయువాడను. సంసారమనెడి సముద్రములో తిరిగి తిరిగి పుణ్యపాపము లనెడు సరకులు దెచ్చితిని. వింధ్యమైన సంసారమునందలి వ్యామోహమను రేవులో దిగితిని. సుంకము దీర్చి వచ్చిన వెంటనే భారవిముక్తుని జేయుడు.

సత్త్వరజస్తమస్సు లనెడు మూడుగుణము లను ఎద్దులచే ఇన్నాళ్ళవరకు ఈ శరీరమను పడవను నడపితిని. చంచలమైన మనస్సులో పుట్టు పలు కోరికలనెడు తెరచాప లెత్తితిని. కడకు మాయామయమై వికృతమైన ఈ పుణ్యపాపపు సరకులు దెచ్చితిని. వీటిని వెలకిచ్చి నా బరువు దించి నన్ను కృతార్థుని గావింపుడు.

జీవాత్మ డనెడు పడవలోని స్తంభమును అంతరాత్మ డొకడు అధిష్ఠించియుండి మమ్ము ప్రమాదములకు గురిగానీక ప్రీతితో కాపాడినాడు. సర్వాంతర్యామియైన అతడే శ్రీ వేంకటేశ్వరుడు. వ్యాపారులమైన మాకును (జీవులకును), పట్టణ ప్రభువులైన మీకును (ఇంద్రియములకును) అతడే కర్త. కాన మాపై ఆగ్రహించి దెబ్బదీయుట మాని ఇక మాకు శ్రేయము గూర్చుడు.

వి:- ఈ సంకీర్తనము జీవుని ఒక వ్యాపారితో బోల్చుచున్నది. శరీర మను పడవనెక్కి జీవు డను వ్యాపారి సంసారసాగరములో సంచరించి పుణ్యపాపములను సరకులను ఆర్జించుచున్నాడు. దూష్యమైన కాంతా వ్యామోహ మను రేవుచెంతకు జేరుచున్నాడు. సత్త్వరజస్తమము లనబడు మూడుగుణములు పై పడవను నడపు ఎద్దులుగా మన్నవి.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్ ॥[1]

అను గీతోక్తి ననుసరించి త్రిగుణములే జీవుని దేహముతో బంధించుచున్నవి. వివిధములైన కోరికలే ఆ పడవకు తెరచాపలుగా పని చేయుచున్నవి.

పై వ్యాపారమంతయు పంచేంద్రియములనెడు ప్రభువుల ఆజ్ఞకు లోబడి జీవుడు చేయుచున్నాడు.

---

1. గీత., 14-5.

విని చెవుల, ముట్టి తోలం,
గని కన్నుల, నమలి నాలుకను, మూర్కొని ము
క్కున, పురుషుఁ డెఱుగు మనమా
రను శబ్ద స్పర్శరూప రస గంధంబుల్.[1]

అన్నట్లు ఇంద్రియముల నిగ్రహింపలేక వాటిద్వారా శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అను విషయముల ననుభవించుచు జీవుడు పుణ్యాపాపము లార్జించు చున్నాడు. సరకులు దింపి రావలసిన ధనము రాబట్టుకొననిచో వ్యాపారికి ఫలము లేదు. అట్లే సుకృత దుష్కృతము లనెడు సరకులను పూర్తిగా వదలించుకొని కర్మశేషమును తీర్చికొనకున్నచో జీవునికి విముక్తి లేదు. అందుచే తన్ను అపమార్గములో జని వష్ట పడనీయక అనుగ్రహింపుమని పంచేంద్రియములను జీవుడు వేడుకొనుట ఉచితమే.

ప్రతి జీవునిలో అంతర్యామిగా పరమాత్మ డున్నాడు. ఆ దేవుడు యంత్రా రూఢములైన సమస్తభూతములను మాయతో త్రిప్పుచు వారి హృదయములలో నున్నా డని గీత చెప్పుచున్నది—

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥[2]

అటు పంచేంద్రియముల ప్రవృత్తికిని, ఇటు జీవుల స్థితికిని కర్త ఆ పరమా త్మదే. ఆయన తనపై భక్తిగల జీవుల నుద్ధరించుటకు బద్ధకంకణుడై యున్నాడు. కాన భగవదాజ్ఞకు లోబడిన పంచేంద్రియములు భక్తులైన జీవులను శబ్దాదివిషయముల వైపులాగి పతనము నొందించుట తగదు. కాన భక్తులను హింసించుట మాని అవి వారికి శ్రేయము గూర్చవలసియున్నదని తాత్పర్యము.

మరొక సంకీర్తనమునగూడ ఇదే భావమును వివరించుచు విట్టూర్పు అను గాలి విసరగా, కోరికలనెడు తెరచాప లెత్తి జీవుడను మరకాడు పయనించుచున్నా డనియు, శ్రీ వేంకటేశ్వరుడే నలుదిక్కులకు పడవ నడపువా డనియు, చివరికి భగవ దనుగ్రహముచే జీవుడు ధర్మార్థ కామములతోపాటు మోక్షమునుగూడ గడించుచున్నా డనియు అన్నమయ్య గాన మొనర్చెను—

1. వ. కు. పం., 6-67. 2. గీత., 18-61.

రామక్రియ

కొంతల మానమనేటి - కరపట్నాలకు దిగె
మంతనాన జీవుడనే - మంచి మరకాఁడు. ॥పల్లవి॥

అరిది సంసారమనే - యంబుధిలోనఁ దిరిగి
ఉరుగతి దేహపు - టోడమీఁద,
సరిఁ బాపపుణ్యముల - సరకులు వించుకొని
దరిచేరె జీవుఁడనే - తల మరకాఁడు. ॥కొంత॥

కడలేని విట్టూర్పు - గాలి విసరఁగాను
జడియుఁ గోరికలనే - చాప లెత్తి,
అడి బరువుగ మాయ - అందు నిండా వించుకొని
యెడతాఁకె జీవుఁడనే - యీ మరకాఁడు. ॥కొంత॥

అలర శ్రీ వేంకటేశుఁ - డనివేటి మాలిమి
నలుదిక్కులకు నోడ - నడపఁగాను,
మెలిగె ధర్మార్థ కామ - మోక్షధనము గడించి
పలుమారు జీవుఁడనే - బలు మరకాఁడు.[1] ॥కొంత॥

## 30

అవ:- తన దురవస్థను ప్రకటించుచు తన్ను వదలి పొమ్మని సంసారము. మాయ, ఆశలు, పాపములు మొదలగువానిని బతిమాలుకొనుచున్నాడు___

### దేవగాంధారి

ఇఁకనైనా రోయరాదా - యీ పాటివారమింతే
మంతుఁదనమేల మా - మాట వినరాదా। ॥పల్లవి॥

1. తోలుబొంత గట్టుకొన్న - దొరవింతే నన్ను నీవు
కూళ సంసారమా। యేల - కొసరేవు
ఈలకొన్న యెముకల - యింటిలో కాఁపురమింతే
యేల మాయ వెంటఁబెట్టే - వేమిగద్దు పీకుమ? ॥కొంత॥

1. అ. సం., 9-99.

2. పంచభూతపు చుట్టాల - బదుకులోవాఁడ నింతే
యెంచ కింద్రియ యాచకు - లేల వచ్చేరు?
కంచపు గాలావటించే - కలిమిలో వారమింతే
చంచలపుటాసలు చేయి - చాఁచనేఁటికి? ॥ఇంక॥

3 నెత్తురు జలదుర్గాన - నిలిచినవాఁడ నింతే
జొత్తుఁబాపములు - యేల చోటడిగేరు?
హత్తిన శ్రీ వేంకటేశుఁ - డాత్మలోన నున్నవాఁడు
మత్తపు టజ్ఞానమా! - మమ్మేమి చూచేవు? ॥ఇంక॥

ప॥ మంకుఁదనము = మూర్ఖత్వము.
1. తోలుబొంత = శరీరము; కూళ = కుత్సితుడు; ఊలకొన్న = ప్రాణములు బిగబట్టుకొన్న.
2. కంచపుగాలి = కూటిమీది మరులు; ఆవటించు = పొందుపడు.
3. జొత్తుఁబాపములు = దట్టములైన (దారుణములైన) పాపములు; హత్తిన = అంటిన.

ఓ సంసారాదులారా! ఇంకనైన మీరు మాపై రోతపడి మమ్ము విడిచిపో రాదా? మా బ్రదుకే ఎంతో హీనమైనది. మమ్ము పట్టుకొని వ్రేలాడిన మీకేమి లాభము? ఎందు కింత మొండితనము? మామాట వినగూడదా?

నేను తొమ్మిది తూటులుగల తోలుబొంతను (శరీరమును) గట్టుకొన్న దొరను. నా దొరతనమంతా ఇంతే. ఓ కుత్సితమైన సంసారమా! ఇంత హీనుడనైన నన్ను నీవేల పై కొందువు? ఓ మాయా! ఇంకెందును నిలువ నీడలేక ప్రాణము లెట్లో బిగబట్టుకొని ఒకటి కొకటి అంటుకొనియున్న ఈ యెముకలగూటిలో నేను కాపుర మున్నాను. నా దురవస్థ నీకు తెలియుటలేదా? ఇట్టి నన్ను నీవేల వెంబడింతువు? ఇందువల్ల నీకేమి ప్రయోజనము?

నేను స్వయముగా జీవించలేక పంచభూతములనెడు చుట్టముల పంచజేరి బ్రదుకుచున్నాను. ఓ ఇంద్రియము లనెడు యాచకులారా! ఇంత నిరుపేదనైన నా దుర్దశను తలంపక మీరేల నన్నిట్లు పీడించుచున్నారు? ఓ చంచలములైన ఆశలారా!

నా జీవనసంపద అంతయు నేను తిను కంచములోని పిడికెడు మెదుకులు మాత్రమే. అంతకుమించి ఐశ్వర్యవంతుడను కాను. ఇక నా చెంత మీరు చేయి చాచు టెందుకు?

ఓ పరమదారుణములైన పాపములారా! ఇంకెక్కడను నిలువ వీలుగాక నేను నెత్తురుమయమైన ఈ జలదుర్గములో (శరీరములో) నిలువబడియున్నాను. ఇట్టి నన్ను మీరేల చోటడిగెదరు? సర్వాంతర్యామియైన శ్రీ వేంకటేశ్వరు డాత్మలో నున్నాడు. ఓ మదించిన అజ్ఞానమా? నీవిక నన్నేమి పరీక్షింతువు?

వి:- జీవుని సంసారము పైకొనుచున్నది. మాయ వెన్నాడుచున్నది. శబ్ద స్పర్శ రూప రస గంధములను విషయములకై శ్రోత్ర త్వక్చక్షు ర్జిహ్వా ఘ్రాణములను ఇంద్రియములు ఉన్ముఖుని గావించుచున్నవి. ఆశలు భోగ్య పదార్థములకై ప్రేరణ చేయుచున్నవి. పాపము లాశ్రయించుచున్నవి. అజ్ఞానము పై జెప్పిన సంసారాది రూపమున అతనిని కబళించివేయుటకై కాచుకొనియున్నది. ఇది జీవుని విషమపరిస్థితి.

ఇంతకు ఆ జీవు డెట్టివాడు? ఏమాత్రము స్వతంత్రత లేనివాడు. తొమ్మిది తూటుల తోలుబొంతను కట్టుకొన్నాడు. క్రిక్కిరిసిన యెముకల యింటిలో కాపుర మున్నాడు. పృథివ్యప్తేజో వాయ్వాకాశములనెడు పంచభూతముల నాశ్రయించి బ్రదుకు చున్నాడు. ఆతని కలిమి యంతయు కంచములోని పిడికెడు మెదుకులమాత్రమే. రక్త మాంసాదులతో నిండిన శరీరమే అతని నెలవు.

ఇంత హీనదశలో నున్న జీవుడు తన్ను పైకొని పలుతెరంగుల పీడించు చున్న సంసారాదుల నెట్లు తృప్తిపరచ గలడు? తాను సర్వవిధముల తృప్తి నొందిన వాడు తన్నాశ్రయించినవారిని తృప్తిపరచగలడు. తన బ్రదుకే దుర్భరముగా నున్న వ్యక్తి ఇతరుల నెట్లు ఆదుకొనగలడు? జీవుడు సంసారాదుల నెట్లును తనివి నొందింప లేడు. కాన వాటిని దూర మొనర్చుకొనుటే శ్రేయస్కరమని తాత్పర్యము.

శరీరము పంచభూతాత్మకము. దీనిని తోలుబొంతగా, ఎముకలగూడుగా, నెత్తురు జలదుర్గముగా పేర్కొనుటవలన ఇది యెంత నికృష్టమైనదో వ్యక్తమగు చున్నది. వేదాంతులు వైరాగ్యమును పురికొల్పుటకై శరీరముయొక్క హేయత్వమును గూర్చి మాటిమాటికి ప్రబోధింతురు.

అమేధ్యపూర్ణము, క్రిమిసంకులము, దుర్గంధభూయిష్ఠము, అశౌచనిలయము, అశాశ్వతము, మూత్రపురీషములకు నెలవు అగు ఈ శరీరమున మూఢులేగాని పండితులు రమింపరని పెద్దల సూక్తి—

అమేధ్యపూర్ణం క్రిమిజాలసంకులం
స్వభావ దుర్గంధ మశౌచ మధ్రువమ్ ।
కళేబరం మూత్ర పురీషభాజనం
రమన్తి మూఢా న రమన్తి పండితాః ॥

అజ్ఞానోపహతుడైన జీవుడు జుగుప్సాకరము, నశ్వరము అగు ఈ శరీరము నాశ్రయించి సంసార విజృంభణకు, మాయకు వశమగుచున్నాడు. ఇంద్రియములకధీనుడై రాగద్వేషముల పాలగుచున్నాడు. ఆశాపాశములచే బంధింపబడుచున్నాడు. ఎన్నో పాపము లొనర్చుచున్నాడు. ఈ దుఃస్థితి కంతటికి అజ్ఞానమే మూలకారణము.

విజ్ఞుడైనవాడు తన ఆత్మలో అంతర్యామిగా నున్న పరమాత్మని గుర్తింపగలడు. అట్టివానిని అజ్ఞాన మేమియు చేయజాలదు. వానికి పై జెప్పిన బంధము లెవ్వియు నుండవు. కాన ఆత్మలో పరమాత్మను దర్శించుటే పై చిక్కులనుండి తప్పించుకొనుటకు పరమోపాయము. అందుచేతనే శరీరములో దగులుకొన్న జీవుని దుస్థితిని వర్ణించి—

"హత్తిన శ్రీ వేంకటేశుఁ - డాత్మలో నున్నవాడు
మత్తపు టజ్ఞానమా ! - మమ్మేమి చూచేవు ?"

అని అన్నమయ్య చివరి చరణములో ముక్తిమార్గమును చూపినాడు.

31

అవ:- మనుజులు పెరిగి పెద్దవారైనకొలది ఆశకు లోనై సంసారవ్యామోహమున బడుచున్నారే కాని ముక్తినొందుట లేదనుచున్నాడు—

## వసంతవరాళి

పెఱుగఁగఁ బెఱుగఁగఁ - బెద్దలమైతిమి నేము
కఱకఱలే కాని - కడగంటలేదు. ॥పల్లవి॥

1. నరి విన్న భుజియించి - చాలునన్న యన్నమే
అఱిది నేఁ దప్పటిని - నాస రేఁచీని.
ధరలో రాతిరి గూడి - తనిసిన సతులే
వరగ నప్పటిని వి-భ్రాంతి రేఁచీని. ॥పెఱు॥

2 మాయఁగట్టి విడిచిన - మలినపుఁ గోకలు
యీయెడ నుదికితేనే - యిచ్చ రేఁచీని.
కాయముపై మోఁచిపెట్టెఁ - గట్టివేసిన సొమ్ములు
మాయలై దినదినము - మమత రేఁచీని. ॥పెను॥

3. నీవు వట్టిన చలమో - నేము వేసినట్టి తపో
శ్రీ వేంకటేశ్వరుఁడ - చిక్కి-తి మిందు,
మోవరాని మోపంటి - ములుగ నియ్యదు మమ్ము
చేవ సంసారముపైఁ - జిమ్మి రేఁచీని. ॥పెను॥

ప॥ కలకలలు - ప్రయాసలు, పరితాపములు,

1. అప్పటిని = అప్పటివలె.[1]

3. ములుగనియ్యదు = మూలుగనియ్యదు; చిమ్మిరేఁచీని = మిక్కి-లి విజృంభించు చున్నది.

దేవా ! మేమీ సంసారములో పుట్టి నానాటికి పెరిగి పెరిగి పెద్దలమైతిమి. ఎన్నో పను లొనర్చితిమి. ఎన్నో భోగము లనుభవించితిమి. ఎంత చేసినను ఏమి యనుభవించినను తుదకు ప్రయాసలపా లగుచున్నామేకాని సంసారము దరిద్రొక్కు-ట మాత్రము లేదు.

నిన్న తృప్తిదీర తిని త్రేపి ఇక చాలునన్న అన్నమే నేడు మరల నిన్నటివలె ఆశగొల్పుచున్నది. గతరాత్రి సురతకేళిలో సుఖింపజేసి తనివిదీర్చిన వనితలే నేడు మరల అప్పటివలె మరులు రెక్కొ-లుపుచున్నారు.

పూర్తిగా మాసిపోవునట్లు కట్టి విడిచిన మలినవస్త్రములే ఉదికినంతనే మరల కట్టుకొనవలె నవిపించుచున్నవి. ఒడలిపై అలంకరించి పిమ్మట పెట్టెలో కట్టి పడ వేసిన సొమ్ములే మాయాప్రభావితములై ప్రతిదినము మాలో మమకారము రేపుచున్నవి.

1. చూడు: శృ. సం. 12-సంపు-ద్వితీయముద్రణ పీఠిక. P. 29.

ఇది దేవుడవైన నీవు జీవులమైన మాపై బెట్టిన పంతమో? లేక మాకై మేము జన్మాంతరములలో చేసికొన్న పాపఫలమో! భరింపరాని భారమై మమ్మిది శోరెత్తనీకున్నది. బలమైన సంసారముపై మాకు భ్రాంతిగొల్పి మిక్కిలి విజృంభించుచున్నది.

వి:- ఇతర ప్రాణులకంటె మనుజులకు వివేక మధికము. కాన బుద్ధిమంతులైన మానవులు తాము పెరిగి పెద్దలైనకొలది ఆశవీడి సంసారభోగములపై విరక్తిగొని ముక్తులు కావలసియున్నారు. కాని నిజమున కట్లు జరుగుచున్నదా? లేదు. వయస్సు పెరుగుచున్నకొలది వారి ఆశలుగూడ పెరుగుచునే యున్నవి—

అంగం గలితం పలితం ముండం
దశనవిహీనం జాతం తుండమ్।
వృద్ధో యాతి గృహీత్వా దండం
తదపి న ముంచ త్యాశాపిండమ్॥[1]

అని శంకర భగవత్పాదు లన్నట్లు శరీరము శిథిలమైనను, తల నెఱసినను, పండ్లూడినను, మూడుకాళ్ళ ముదుసలియైనను ఆశ వదలుటలేదు. అది జీవుని సంసారముతో గట్టిగా పెనవేయుచునే యున్నది. కావుననే మనుజుడు అనుభవించిన సుఖమునే మఱల మఱల అనుభవించుచున్నాడు. వస్త్రములు, ఆభరణములు మున్నగువానిపై మమకారము పెంచుకొనుచున్నాడు. దీని ఫలితముగా ముక్తికి దూరమగుచున్నాడు.

కావున వివేకవంతుడైన మానవుడు ప్రయత్నపూర్వకముగా ఆశను విడనాడి ముక్తికై పాటుపడవలెను. ప్రవృత్తిమార్గము వీడి నివృత్తిమార్గములో నడుగిడవలెను. ప్రేయస్సును వదలి శ్రేయస్సును చేపట్టవలెను.

32

అవ:- కాంతల భ్రాంతిలో బడిన భవరోగపీడితులకు భగవంతు డొకడే వైద్యుడనుచున్నాడు—

## సాళంగనాట

భవరోగ వైద్యుండవు - పాటించ నీ వొకండవే
నవనీతచోర నీకు - నమో నమో. ॥పల్లవి॥

1. భ. గో., 15.

1. అతివ లనెడి సర్పా - లధరాలు గఱచిన
తతి మదనవిషాలు - తలకెక్కెను,
మితిలేని రతులం ది - మ్మిరివట్టె దేహాలు
మతి మఱచె నిందుకు - మందేదొకో ! ॥భవ॥

2. పొలంతు లనెడి మ - భూతాలు సోఁకిన
తలమొలలు విడి బి - త్తలై యున్నారు,
అలరు చెనకులచే - నంగములు జీరలాయ
మలసి యిందుకు నిఁక - మంత్ర మేదొకో ! ॥భవ॥

3. తరుణుల కౌఁగిలనే - తాపజ్వరాలు వట్టి
కరఁగి మేనెల్ల దిగఁ - గారఁ జొచ్చెను,
విరతి శ్రీ వేంకటేశ - నీవే లోకులకు దిక్కు
అరుదు సుఖానమందే - యంత్ర మేదొకో ! ॥భవ॥

ప॥ భవరోగ వైద్యుడవు = సంసారమనెడు వ్యాధికి వైద్యుడవు; నవనీతచోర = వెన్నదొంగా !

1. అతివలు = స్త్రీలు; తతిఁ = సమయమున.

2. పొలంతులు = స్త్రీలు; బిత్తలై = దిసమొలవారై; చెనకులచేఁ = నొక్కులచే; అంగములు = శరీరములు; జీరలు = గీరలు.

3. యంత్రము = బీజాక్షరచక్రము.

దేవా ! ఆలోచించి చూడగా సంసారమను జబ్బుకు నీవొకడవే వైద్యుడవు. ఓ వెన్నదొంగా ! నీకు దండము ! దండము !

స్త్రీలనెడు పాములు పెదవులు గఱచినంత పురుషులకు కామవిషములు తల కెక్కినవి. అంతులేని రతిక్రీడలలో మునిగి తేలుటచే శరీరములు తిమ్మిరి పట్టినవి. మతిమఱపు గలిగినది. ఈ విషము దిగుటకు, ఈ తిమ్మిరి వదలుటకు తగిన మందేదో!

వనిత లనెడు పెద్ద దయ్యములు సోకగా మనుజులు తలమొలలు వీడి ఒడలు తెలియక దినములలతో నున్నారు. కామక్రీడలకు సంబంధించిన నఖక్షత - దంతక్షతాదులచే శరీరములన్నియు గీఱలు పడినవి. ఈ దయ్యములను విడిపించుటకు మంత్రమేదో కదా!

అంగనల ఆలింగనములనెడు తాపజ్వరములు పట్టి శరీరములెల్ల కరగి చెమటలు దిగగారుచున్నవి. శ్రీ వేంకటేశ్వరా! ఈ విషమ పరిస్థితులలో నున్నవారికి నీవే రక్షకుడవు. ఈ చిక్కులనుండి విడివడి శాశ్వతమైన సుఖము నొందుటకు సాధనమైన యంత్రమేదో అనుగ్రహింపరాదా!

వి:- కాంతలు సంసారమునకు కారణములుగా పేర్కొనబడియున్నారు.

"యోషి ద్దర్శనమాత్రేణ ముహ్యతి క్షుభ్యతి స్వయమ్"।

అన్నట్లు మోహమునకు, క్షోభమునకు కాంతల సందర్శనమే కారణమగుచున్నది. అందుచే ఈ సంకీర్తనమునందు భవరోగమునకు ముఖ్యహేతువులైన స్త్రీలను సర్పములుగా, మహాభూతములుగా, వారి ఆలింగనములను తాపజ్వరములుగా నిరూపించుటైనది.

రతిక్రీడలలో పెదవులు గఱచుట, మైమరపులు, వగ్నులై యుండుట, నఖదంతక్షతములచే శరీరమున గీఱలు పడుట, ముచ్చెమటలు పోయుట ఇత్యాదులు సుప్రసిద్ధములు. అవియే ఇచ్చట భవరోగచిహ్నములుగా పేర్కొనబడినవి.

పాములు గఱచిన విషమెక్కుట, భూతములు సోకినప్పుడు వగ్నులై తిరుగుట, తాపజ్వరములలో ముచ్చెమటలు పోయుట మొదలుగాగల లక్షణములు సహజములు. విషము దిగుటకు మందు, దయ్యములు వీడిపోవుటకు మంత్రములు, జ్వరములు వదలుటకు యంత్రములు ఉపయోగింపబడుట లోకమున గలదు.

భవరోగ నివారణకు భగవన్నామాదులే తగిన ఔషధములు. కావ సంసార రోగ పీడితులు భగవంతుడను వైద్యునే శరణు వేడవలెనని తాత్పర్యము.

## 33

ఆవ:- సంసారభ్రాంతి అజ్ఞులకే గాని విజ్ఞులకు లేదనుచున్నాడు—

### శుద్ధ వసంతం

కడమండే విజ్ఞానికిఁ గాదిటువలెను
వొడలిరోఁతలు చూచి - వూరకైనా నవ్వును. ॥పల్లవి॥

1. ఆఱిడిఁ బాముగరచి - నట్టివాఁడు దినఁబోతే
జాఱని వేపచేదైనాఁ - జవ్వనై తోఁచు.
వీఱిడై సంసారపు - విషమెక్కినవానికి
చూఱలై హేయకాంతలు - సుఖములై తోఁచును. ॥కడ॥

2. చెంగట వెఱ్ఱివానికి - చేసినచేఁతలెల్ల
తొంగలించి వివేకాలై - తోఁచినట్లు,
మింగుచుఁ గర్మపునాము - మేసిన సంసారికి
అంగడి కర్మమే బ్ర - హ్మమై తోఁచును. ॥కడ॥

3. జగమిది యొక్కటే - చవులు వేరే వేరే
మొగి వెఱుక మాటపు - ముడిచున్నది.
పగటు శ్రీ వేంకటేశుఁ - బట్టి కొలువనివాఁడు
తెగవి మాయలలోనఁ - దేలాడవలసె. ॥కడ॥

1. ఆఱిడిగా = వ్యర్థముగా; వీఱిడై = అవివేకియై; చూఱలై = కొల్లలై; హేయ కాంతలు = రోయదగిన వనితలు.

2. తొంగలించి = అతిశయించి; నాము = జొన్న లోనగువాని కొయ్యగాలువ చిగి రించిన మొలక (ఇది తిన్న పశువులు మృతినొందును.)

3. ఎఱుక = ఆత్మజ్ఞానము; పగటు = ప్రకటమైన.

సంసారసాగరమున చిక్కుకొనక ఒడ్డున నున్న విజ్ఞానికి ఈ చెప్పబోవు దుఃస్థితి సంభవింపదు. అతడు శరీరములోని రోతలు చూచి ఏవగించుకొని ఊరక నవ్వుచుండును.

పాము గఱచి విష మెక్కినవాడు వేపచేదు దిన్నను అది చప్పగా తోచును. వివేకహీనుడై సంసారపు విష మెక్కినవానికి రోయదగిన స్త్రీలు సుఖములు కుప్ప లుగా తోచుదురు.

వెఱ్ఱివానికి తాను చేసిన చేష్టలన్నియు మిక్కిలి తెలివితోగూడిన పనులుగా తోచుచుండును. అట్లే కర్మమనెడు విసపు తిండి తిన్న సంసారికి ఆ హీనమైన కర్మమే బ్రహ్మముగా భావించును.

ఉన్న జగత్తు ఒక్కటే. కాని దీనియందు వివిధజీవులకు గల్గుచున్న రుచులు మాత్రము వేఱువేఱుగా నున్నవి. అజ్ఞులకీ లోకము మిక్కిలి రమణీయమై అనుభవింపదగినదిగా నున్నది. విజ్ఞులుమాత్రము అశాశ్వతమై, దుఃఖభూయిష్ఠమైన జగత్తును హేయముగా నెంచుచున్నారు. జీవుల జ్ఞానమును విస్మృతి కప్పియున్నది. అనగా అజ్ఞులు ఆత్మస్వరూపమును, అంతరాత్మయైన పరమాత్మని విస్మరించియున్నారు. ఆత్మస్వరూపస్మృతి గల్గినవారికి సంసారవ్యామోహ ముండనేరదు. ప్రకటమైన శ్రీ వేంకటేశ్వరు నాశ్రయించి సేవింపనివాడు అంతులేని మాయలలోబడి కొట్టుమిట్టాడ వలసినదే.

వి:- కాంతలపై భ్రాంతి, కర్మలపై అనురాగము సంసారులకు లోగొను చున్నవి. సంసారమున కతీతులుగా నున్న విజ్ఞులుమాత్రము వాటిలో దగులువడరు. అజ్ఞుడు ఒడలి పై మెఱుగులుచూచి మోహించుచున్నాడు. విజ్ఞు డందలి రోతలుచూచి ఏవగించుకొనుచున్నాడు. కావుననే మూత్రరక్తాదులచే దుర్గంధమై, మలద్వారమగుటచే దూషితమైన చర్మకుండమున రమించువారు నిస్సంశయముగా బద్ధు లగుదురని పెద్ద లనిరి—

మూత్రశోణిత దుర్గంధే హ్యామేధ్య ద్వారదూషితే ।
చర్మకుండే యే రమంతే తే బధ్యంతే న సంశయః ॥

మఱియు అజ్ఞులే కామ్య కర్మములలో ఆసక్తి వహింతురు. అన్నమయ్య కర్మము విట వాముగా రూపించినాడు. నాముదిన్న పశువులు మరణించినట్లే కామ్య కర్మపరులు మృతప్రాయు లగుచున్నారు. మాయాప్రభావముచే వారికి కర్మములే బ్రహ్మ ముగా తోచుచున్నవి. విజ్ఞులు గీతలో బోధింపబడిన నిష్కామకర్మయోగము నాశ్ర యింతురు.

'భిన్న రుచిర్హి లోకః'[1] అని మహాకవి పేర్కొన్నట్లు వివిధ విషయములలో ప్రజల అభిరుచులు భిన్నభిన్నములుగా నున్నవి.

కొన్నిజంతువులు రోసిన హేయము.
కొన్ని జంతువుల కమృతము.
కొన్ని జంతువుల దివములె రాత్రులు.
కొన్ని జంతువులకు.
అన్నియు విట్లనె వొక్కటొక్కటికి
అన్యోన్య విరుద్ధములు.
పన్నిన జీవుల కేక సమ్మతము.
భావించఁగ మఱి యిఁక నేదయ్యా![2]

అని అన్నమయ్య ఈ భిన్నరుచిత్వమును మరొకసందర్భమున వివరించియున్నాడు.

'ఎఱుక మఱపు ముడిచున్నది' అని సంకీర్తనాచార్యుడు తత్త్వార్థమును చెప్పినాడు. జీవు లాత్మస్వరూపమును మరచియున్నారు. భగవద్దయకు పాత్రుడు కానివాడు మాయను దాటలేడు. ఎఱుక నొందజాలడు. విస్మృతి నశించి స్మృతి లభించుటే మాయను దాటినందుకు గుర్తు - 'నష్టో మోహః స్మృతిర్లబ్ధా'[3] - మోహము నశించినది, స్మృతి లభించినది అని కదా గీతాప్రబోధము విన్న అర్జునుని మాట!

కాన అర్జునునివలె జీవులెల్లరు ప్రపన్నులు కావలెను. మాయను దాటవలెను.

## 34

అవ:- హరిదాసులచే భగవత్ప్రాప్తిమార్గము చూపబడినవారికి కర్మకలాపములు, తపస్సులు మున్నగు స్వతంత్రప్రయత్నములతో పని లేదనుచున్నారు—

### బౌళి

నరహరి నీ దయమీఁదట - నా చేఁతలు గొన్నా?
శరణాగతియును జీవుని - స్వతంత్రము రెండా? ॥పల్లవి॥

---

1. రఘు., 6-30.  2. అ. సం., 9-57.
3. గీత., 18-73.

1. మొఱయుచు నరకపు వాకిలి - మూసిరి హరి నీ దాసులు
తెఱచిరి వైకుంఠపురము - తెరువుల వాకిళ్లు,
నఱికిరి పాపము లన్నియు - నుగ్గుగ నిటు తూర్పెత్తిరి:
వెఱవము వెఱవము కర్మపు - విధులింక మాకేలా? ॥నర॥

2. పాపిరి నా యజ్ఞానము - పరమాత్ముండ నీ దాసులు
చూపిరి నిను నామతిలో - సులభముగా నాకు,
రేపిరి నీపై భక్తిని - రేయినిం బగలును నాలో
వోపము వోపము తపములు - వూరకె యింకనేలా? ॥నర॥

3. దిద్దిరి నీ ధర్మమునకు - దేవా! శ్రీ వేంకటేశ్వర!
అద్దిరి నీ దాసులు నీ - ఆనందములోన,
ఇద్దరి నీ నా పొందులు - యేర్పరి చిటువలెం గూర్చిరి
వొద్దిక నొద్దిక నాకింక - మదోగ్యము లేలా? ॥నర॥

1. మొఱయుచు = శబ్దించుచు.

2. నీ ధర్మమునకు = భగవత్ప్రాప్తి కనుగుణమైన భాగవతధర్మమునకు.

నరహరీ! నీదయ నాపై గల్గిన పిమ్మట నాకై నేను చేసికొనవలసిన పనులు కొన్ని మిగిలియున్నవా? నిన్ను శరణు జొచ్చిన జీవునికి మరల స్వతంత్రత ఎక్కడిది?

శ్రీహరీ! నీదాసులు ఆనందముతో కోలాహల మొనర్చుచు నరకద్వారమును బంధించిరి. వైకుంఠనగరమున కేగు మార్గముల తలుపులు తెఱచిపెట్టిరి. మా పాపము లన్నిటిని నుగ్గునూచముగ నరిచి తూర్పారబట్టిరి. ఇక మేము భయపడవలసిన నిమిత్తము లేనేలేదు. మాకిక కర్మకాండకు సంబంధించిన విధానములతో పనియేమి?

పరమాత్మా! నీదాసులు నా యజ్ఞానమును తొలగించిరి. నా హృదయమునందే నిన్ను నాకు సులభముగా జూపిరి. రేయి పవళ్లు నాలో నీపై భక్తిని పురికొల్పిరి. మేమిక తపస్సులు చేయజాలము. నిష్ప్రయోజనమైన తపస్సులతో నిక మాకేమి పని?

దేవా! శ్రీ వేంకటేశ్వరా! నీదాసులు నన్ను నీకు శరణాగతునిగా వొనర్చి భాగవతధర్మమున కలవడజేసిరి. నీ స్మరణకీర్తనాదులచే గల్గు అమందమైన ఆనందములో ముంచిరి. నీకు నాకు ఇట్లు నీ దాసు లొద్దికగా కలయిక ఘటించిరి. తపస్సు మున్నగు స్వతంత్రప్రయత్నములు నాకింక వలదు. నాకు వాటితో నిక సాధించవలసిన దేమున్నది?

వి:- భగవదున్ముఖుడు గానంతవరకు జీవుడు తాను స్వతంత్రుడ నని విర్రవీగు చుండును. భగవద్దాసులగు ఆచార్యులు భగవంతుని మహిమను వేనోళ్ళ కొనియాడుచు భగవత్ప్రాప్త్యుపాయమును జనులకు బోధింతురు. అత్తరి శుభసంస్కారము గలవారు హరిదాసుల నాశ్రయించి వారి ప్రబోధములను గ్రహించి శరణాగతిని ముఖ్యోపాయముగా ననుష్ఠింతురు. తమ సమస్తభారమును భగవంతునికి సమర్పించుటే శరణాగతిలోని ముఖ్యరహస్యము. అట్లొనర్చినవారు ఆపై తాము స్వతంత్రుల మని తలంపరు. కర్మకలాపములు, తపస్సులు మొదలగు ఉద్యోగము లిక వారి కనావశ్యకములు. కావున జీవుడు శరణాగతు డగునంతవరకే స్వతంత్రుడనని గర్వించును. ఆ తరువాత వానికి స్వాతంత్ర్య మనునది లేదు.

హరిని జేరుటకు హరిదాసులైన ఆచార్యులే మార్గదర్శకులు, వారు ఆశ్రితుల పాపములు తొలగింతురు. అజ్ఞానమును హతమార్తురు. భగవంతునియందు భక్తిని పురికొల్పుదురు, ముక్తికి త్రోవ జూపుదురు. జీవునికి దేవునితో కలయిక ఘటింతురు. కావున ఈ సంకీర్తనములో జీవులకు ముక్తి గూర్చుటయందు హరిదాసుల సహాయము చక్కగా ప్రశంసింపబడినది.

ప్రపన్నులైన భక్తులకు నరకప్రాప్తి లేదు. పాశమును చేతబూనిన తన భటుని జూచి యము డతనితో రహస్యముగ "మధుసూదనప్రపన్నులను విడిచి పుచ్చుము. నాపెత్తనము ఇతరులమీదనే గాని వైష్ణవులపై కాదు సుమా?" అని చెప్పునని విష్ణుపురాణము వాకొనుచున్నది—

స్వపురుష మభివీక్ష్య పాశహస్తం
వదతి యమః కిల తస్య కర్ణమూలే।
పరిహర మధుసూదనప్రపన్నాన్
ప్రభురహ మన్యనృణాం న వైష్ణవానామ్॥[1]

1. విష్ణు., 3-7-14.

శరణాగతుల కిట్టి ఉత్తమగతి గల్గుటకు వారికి శరణాగతితత్త్వమును బోధించు హరిదాసులే కారణమగుచున్నారు. కావుననే శ్రుతియు 'ఆచార్యవాన్ పురుషో వేద'1, 'ఆచార్యాద్ధ్యేవ విద్యా విదితా'2, 'ఆచార్యః ప్లావయితా' అని ఆచార్యుని మహిమను ప్రశంసించుచున్నది.

న్యాసతిలకమున వేదాంతదేశికులు ఆచార్యమహిమ నిట్లు కీర్తించిరి—

అన్ధోఽనన్ధగ్రహణవశగో యాతి రంగేశ ! యద్వత్
పంగు ర్నౌకాకుహరనిహితో నీయతే నావికేవ !
భుంక్తే భోగా నవిదితనృపః సేవకస్యార్భకాదిః
త్వ త్సంప్రాప్తౌ ప్రభవతి తథా దేశికో మే దయాళుః ॥3

అనగా, గ్రుడ్డివాడు కన్నులు గలవాని సాయమున గమ్యము జేరును. కుంటివాడు నావికునిచే నది దాటింపబడును. రాజ సేవకునిబిడ్డ స్వయముగా రాజు నెరుంగకున్నను భోగముల ననుభవించును. అట్లే ఆచార్యుని దయచే సామాన్యుడు భగవంతుని చేరుచున్నా డని అభిప్రాయము. అందుచేతనే ఆధ్యాత్మికమార్గములో ఆచార్యోపాసన మెంతో ప్రాధాన్యము వహించుచున్నది.

## 35

అవ:- శ్రీహరి నాశ్రయించిన భక్తుల కెందును ఎట్టి కొఱతయు లేదనుచున్నారు—

### లలిత

చాలఁ జాలు నీ హరియే మాకును - సకల క్రియలకు నాయకుఁడు
నాలుక తుదనే యీతఁ డుండఁగా-నలుగడ నెవ్వరి వెదకేము. ॥పల్లవి॥

1. ఛాందోగ్యం. , 6-14-2.
2. ,, 4-9-3.
3. న్యా. తి. , 21.

1. ఏలినవాఁడట లక్ష్మీ విభుఁడట - యేమిటను గొరత మా కిఁకను
నాలో నున్నాఁడు బ్రహ్మతండ్రియట - నా కాయుష్యము బాఁతా,
పాలజలధిపై దేవునివారము-పాఁడి మాకు నిఁక నే మరుదు
అలిగపఁగ నేమింతటి వారము-అన్యుల కిఁకఁ జెయి చాఁచేమా. ॥చాలు॥

2. భూకాంతాపతి కింకరులము యీ - భూమి యన్నియును మా సొమ్మే
పైకొని చక్రాయుధుఁడే మా దాపు - భయము లన్నిఁటాఁ బాసితిమి,
ఈకడ నచ్యుతు మరఁగు చొచ్చితిమి - యెన్నటికిని నాశము లేదు
ఏ కొఱఁతని యిఁక నాసపడుచు-నే మెవ్వరికి నోళ్లు దెరచెదము.॥చాలు॥

3. శ్రీ వైకుంఠుని దాసులమట యర - చేతిది మోక్షము మా కిదివో
పావన గంగాజనకుని బంట్లము - పాపము లన్నిటఁ బాసితిమి,
శ్రీ వేంకటపతి వరము లియ్యఁగాఁ - జిక్కిన వెలుతులు మాకేవి
యీ వైభవములఁ దనిసిన మాకును-యితరులఁ దగిలెడి దిఁకనేది?॥చాలు॥

1. బాఁతా = దుర్లభమా.

2. దాపు = సమీపము; రక్షణ.

ఇదే మాకు చాలు. ఇంతకంటె మాకేమియు వలదు. ఈ శ్రీహరియే మాకు ఎల్లపనులకు నాయకుడై యున్నాడు. ఇతడు మా నాలుకతుదనే ఉన్నాడు. (మే మితనిని సదా జపించుచున్నా మనుట.) ఇట్లుండగా నలువైపుల మే మింకెవ్వరిని వెదకుదుము? వేరొకరికోసమై వెదకవలసిన అక్కఱ మాకు లేనే లేదు.

ఈతడు సకలైశ్వర్యముల కధిదేవతయైన శ్రీ మహాలక్ష్మికే మగడు. మమ్మే లినవా డితడే. ఇంక మాకెందైన కొరత కలదా? సర్వలోకములను సృష్టించి ఆయువుబోయు బ్రహ్మను గన్న తండ్రి నాలోనే ఉన్నాడు. ఇక నా కాయుష్షనకు కొదువయా? పాలకడలిపై పవ్వళించు దేవునివారము మేము. ఇక మాకు పాడి కేమి లోటు? పరికించి చూడగా భగవదాశ్రయముచే మే మింతటివార మైతిమి. ఇక ఇత రులచెంత చేయి చాపుదుమా?

మేము భూదేవతా భర్తయగు శ్రీహరికి దాసులము. ఈ పొలము లన్నియు మా సొమ్మే. తిరుగులేని సుదర్శనచక్రమును చేపట్టిన నారాయణుడే మాకు దిక్కు. మేమెల్ల కడల భయముల బాపినవారమే. మేము అచ్యుతుని మరుగు చొచ్చితిమి. మా కెప్పటికిని నాశము లేదు. ఇంక ఏమి కొరతని ఆశపడి మే మెవరిచెంత నోరు దెరచి ఏమి యాచించవలెను ?

మేము శ్రీ వైకుంఠుని దాసులము. మాకు మోక్ష మరచేతనే ఉన్నది. (మోక్ష మనగా వైకుంఠనివాసమే గదా !) పాపములెల్ల కడిగివేయు పవిత్రగంగానదికి తండ్రియగు వెన్నుని సేవకులము మేము. అన్నివిధముల పాపములనుండి విడివడితిమి. సర్వైశ్వర్య నిధియగు శ్రీ వేంకటేశ్వరుడే మాకు వరము లిచ్చు దేవత. మా కిక వెలితి యేది ? ఇన్ని వైభవములతో సంపూర్ణముగా తృప్తినొందిన మాకు ఇతరుల వెంట బడి దేబిరించవలసిన దేమున్నది ?.

వి:- ఈ సంకీర్తనమున లక్ష్మీవిభుడు, బ్రహ్మ తండ్రి, పాలజలధిపై దేవుడు-మున్నగు భగవద్వాచకములైన పదములన్నియు సాభిప్రాయముగా ప్రయోగింపబడినవి. ఏ కొఱతయు లేకుండుట కేలినవాఁడు లక్ష్మీవిభుడగుటయే కారణము. ఆయుష్యము లోపింపకుండుటకు బ్రహ్మ తండ్రి లోనుండుట కారణము. పాడి అరుదు గాకుండుటకు పాలకుడు పాలజలధిపై దేవు డగుట కారణము. ఇట్లే పై ప్రయోగములను గూడ సమన్వయించుకొనవలెను.

## 36

అవ:- పాపములు దొలగి జన్మబంధములు వీడుటకు హరిభక్తియే సులభోపాయ మనుచున్నాడు—

### వంగాళ కౌశిక

ఇది నమ్మలేఁడు పుణ్యా-లేమేమో చేసీ దేహి
పొదలి యిందు శంకనే - పొడ వెక్కలేఁడా. ॥పల్లవి॥

1. మంచిమందు గొన్నవాఁడు - మహామహారోగముల
అంచెలఁ బాసి సుఖి - యయ్యీ నట,
అంచితపు హరినామ - మనే మందు గొన్నవాఁడు
పొంచి పాపరోగములఁ - బోఁదోలలేఁడా. ॥ఇది॥

2. జోడు దొడిగినవాఁడు - చొక్కపు టలుగులకు
వోడక రణజయము - నొందీ నట,
వాడక హరిదాస్యపు - వజ్ర పంజరపువాఁడు
పీడ జన్మపుటమ్ములు - విదలించలేఁడా. ॥ఇది॥

3. వైపగుఁ గాణాచి గల - వాఁడు దరిద్రముఁబాపి
పైపై సంపదలతో - బ్రదికీ నట,
దాపై శ్రీ వేంకటేశు పా - దములందుఁ గాణాచి
యే పొద్దూఁ గలుగువాఁడు - యెక్కువ గాఁడా. ॥ఇది॥

ప॥ దేహి = దేహముగలవాఁడు, జీవుడు,
2. జోడు = కవచము.
3. కాణాచి = విధి.

దేహధారియైన జీవుడు తనకు మేలుగోరి ఏమేమో పుణ్యకార్యములు చేయు చున్నాడు. సులభసాధ్యమైన యీ హరిభక్తి మార్గమును నమ్మలేడు. ఈ తెరువున నడచినచో అతడు ఉన్నతగతి నొందలేడా?

గొప్ప గొప్ప రోగములకు గురియయిన వాడు తగిన మందు సేవించి ఆ రోగములను బాపి సుఖించుచున్నాడట; ఇక పూజితమైన హరినామ మనెడు ఔషధమును సేవించినవాడు పాపము లనెడు వ్యాధులను పోగొట్టుకొనలేడా?

కవచము దాల్చినవాడు సూటిగా దగిలిన వాడి ములుకుల కేమాత్రము జంకక రణరంగమున విజయ మొందుచుండుట ప్రసిద్ధము. ఇక హరిదాస్య మనెడు వజ్ర పంజరమున నున్నవాడు పునర్జన్మము లనెడు బాణములను విదలించుకోజాలడా?

అనువైన విధి నార్జించినవాడు పేదరికము వీడి తులలేని సంపదలతో తుల దూగుచు జీవించుచున్నాడట; ఇక ఎప్పుడును శ్రీ వేంకటేశ్వరుని దివ్యపాదములనే తన పెన్నిధిగా భావించి సేవించువాడు గొప్పవాడు (ముక్తుడు) కాడా? తప్పక కాగలడని భావము.

వి:- పాపపరిహారమునకును, మోక్షప్రాప్తికిని శరీరధారు లేవేవో పుణ్య కార్యము లొనర్చుచు అందుకై మితిమీరిన ద్రవ్యమును వెచ్చించుచు రేయిపోని

ప్రయాసలకు గురి యగుచుందురు. నిజముగా వారి కోరికలు నెరవేరుటకు హరిభక్తియే సులభోపాయము. కాని దానిని వారు నమ్మలేకున్నారు. నమ్మినచో భగవన్నామ సంకీర్తనముచేతనే ఔన్నత్యము నందగలరు.

> 'హరినామ కథన దావానల జ్వాలచే
> కాలవే ? ఘోరాఘ కాననములు'1

అని భాగవతము. మరియు హరిదాస్యముచే సులభముగా జననమరణాత్మకమైన సంసారమునుండి విడివడవచ్చును.

> 'సంసార జీమూత సంఘంబు విచ్చునే
> చక్రి దాస్య ప్రభంజనము లేక ?'2

అని ప్రహ్లాదుని వచనము. కాన హరిచరణముల నాశ్రయించి తరింపు డని అన్నమయ్య ముముక్షువులను హెచ్చరించినాడు.

భక్తిచేతనే హరికృప లభించును గాని, తపోజ్ఞానాదులచే లభింప దనుటకు గోపికలే ప్రమాణ మని పెద్దల సూక్తి—

> న తపోభి ర్న వేదైశ్చ న జ్ఞానేన న కర్మణా ।
> హరిర్హి సాధ్యతే భక్త్యా ప్రమాణం తత్ర గోపికాః ॥3

ఈ సంకీర్తనమున భౌతికవిషయములను దృష్టాంతముగా జూపి పారమార్థికమునందు ప్రవృత్తి బోధింపబడినది. దీనిచే భౌతికపదార్థములను నమ్మినవాడే ఫలసిద్ధి నొందుచుండ శ్రీహరిసేవలో నిమగ్నుడైనవాడు తరించుననుటలో సందేహ మొంద వలసిన పనిలేదని స్పష్టపడుచున్నది. ఈ ధోరణిలో సాగిన కీర్తన లింకను ఈ వాఙ్మయములో పెక్కు గలవు. ఉదాహరణమునకు—

గౌళ

> నమ్మవలెఁగాని యె - న్నఁడు సందేహము లేక
> యిమ్ముల దేవుఁడు వర - మిచ్చుచే మరుదు ? ॥పల్లవి॥
>
> మగనిపై బత్తిసేసి - మంచిలోకా లెక్కెరట
> తగు దండ కొలవట్టి - తత్వగతి గనే రట,
> పగుటున నొక వేరువట్టి - పాముఁ బట్టే రట
> తగిలి హరిదాసులు - ధన్యులౌ టేమరుదు. ॥నమ్మ॥

---

1. భాగ., 1-50. 2. భాగ., 7-171.
3. పద్మ-ఉత్తర (6). . 190-19.

ఏలికకు ధనమిచ్చి - హితభోగా లందే రట
కేలఁగత్తి పూని పగ - గెల్చే రట,
గాలి లోలోఁ బూరించి - ఘనసిద్ధు లయ్యే రట
యేలీల హరిదాసులు - యీడేరు పేమరుదు. ॥నమ్మ॥

దిక్కుల యజ్ఞాలు చేసి - దివిజు లయ్యే రట
మొక్కి విప్రుల నర్చించి - మించి సిరులందే రట
పక్కన నలమేల్మంగ - పతి శ్రీ వేంకటేశ్వరు
అక్కునఁ గొల్చిన దాసులు - జ్ఞానులౌ పేమరుదు.[1] ॥నమ్మ॥

దేసాళం

పరుల సేవలు చేసి - బ్రదికే రటా
సిరివరు దాసులు - సిరులందు టరుదా ? ॥పల్లవి॥

కోరి వొక నరునిఁ - గొలిచిన వారలు
ధీరులై పలిగెలఁ - దిరిగే రట,
కూరిమి బ్రహ్మాండ - కోటు లేలెడివాని
వార లింతటఁ జన - పరులౌ టరుదా ? ॥పరు॥

చేకొన్న తుమ్మిద - చేపడ్డ కీటము
లాకడఁ దుమ్మిదఁ - లయ్యీ నట,
శ్రీకాంతుని పాద - సేవకు లగువార
లే కులజులయినా - నెక్కుడౌ టరుదా ? ॥పరు॥

ధరణీశు నాజ్ఞల - తమ దేశములయందు
సిరుల నాణెపుముద్ర - చెల్లీ నట,
తిరు వేంకటాద్రి శ్రీ - దేవుని ముద్రలు
ధరియింపఁగా నిం - తటఁ జెల్లు టరుదా ?[2] ॥పరు॥

---

1. అ. సం., 7-30. 2. అన్న. సం., 34.

37

అవ:- శరణాగతులైన హరిదాసులకు ముక్తి సులభ మనుచున్నారు—

## దేసాక్షి

అల్లనాఁడే యిదెరఁగ - మైతిమి గాని
యిల్లిదె దేవునికృప - యీడ నున్నది సుండి. ॥పల్లవి॥

1. చేరువ వో మోక్షము - శ్రీహరి భక్తికిని
ధారుణిఁ గర్మమునకే - దవ్వు గాని,
యీరీతి నింద్రియముల - నించుకంతే దాఁటిన
దూరముగాదు జ్ఞానపు - తోవ వున్నది సుండి. ॥అల్ల॥

2. ధరఁజేతిది వైకుంఠము - తనిదాస్యమునకు
పరధర్మముల కగ - పడదు గాని,
అరుదైన యాసల - ఆయము వొడిఁచేతే
అరసియాకంతగుండా - నందవచ్చుఁజుండి. ॥అల్ల॥

3. తలఁపులో దక్కీముక్తి - తగు శరణాగతికి
శిలుగుఁ బుణ్యములకుఁ - జిక్కదు గాని,
తెలిసి శ్రీ వేంకటేశు - తిరుమంత్రము నాలికెఁ
బలికి నాడనే దివ్య - పదమబ్బుఁజుండి. ॥అల్ల॥

2. ఆయము = మర్మము; కంత = క్రంత: సందుత్రోవ.

3. దివ్యపదము = కైవల్యము.

ఈ భువిలో పుట్టిననాడే ఈ విషయము నెఱుగమైతిమి. ఇదిగో ! పరమాత్ముని దయ యీ చెంతనే ఉన్నది. ఇది తెలియక ఇంతవరకు ఎన్నో చిక్కుల పాలైతిమి.

ఇలలో ముక్తి కర్మమునకే మిగుల దూరముగా నున్నదిగాని శ్రీహరి భక్తికది మిక్కిలి దగ్గఱగనే ఉన్నది. జ్ఞానమార్గము మనకు దూరము గాదు. ఇంద్రియముల నించుకంత దాటిన చాలును. ఆ త్రోవ చేరగలము.

శ్రీ హరిదాస్యపరునకు వైకుంఠము చేతిలోనే ఉన్నది. ఇతరోపాయములచే అది చే జిక్కునది గాదు. మితిలేనివై ఆశ్చర్యకరములైన. ఆశలయొక్క మర్మమును ఛేదించిన చాలును. అట్లు ఛేదింపగా ఏర్పడిన సందు స్త్రోవనుండి వైకుంఠము నందు కొనవచ్చును.

మోక్షము కష్టసాధ్యములైన పుణ్యములకు జిక్కదు గాని సులభమైన శరణాగతి ననుష్ఠించువానికి తలపుననే తగులువడియున్నది. శ్రీ వేంకటేశ్వరుని తిరుమంత్రము నుచ్చరించిన చాలును. వెనువెంటనే కైవల్యము కరగత మగును.

వి:- 'తద్దూరే తద్వన్తికే'[1] అని శ్రుతి.

అనగా ఆ బ్రహ్మము తన్నుపాసించువారికి చేరువలోను, ఉపాసింపనివారికి దూరము గాను ఉన్నదని భావము. ఈ విషయమునే భాగవత మిట్లు పేర్కొనుచున్నది—

కోరినవారల కెల్లను
జేరువ కైవల్యపదము సిరివరుని మదిం
గోరవి వారల కెల్లను
దూరము మోక్షప్తి యెన్ని త్రోవల నైనన్.[2]

జీవుడు సాధింపదగిన పరమలక్ష్యము మోక్షము. అది కర్మలచేత గాని, భగవద్దాస్యముతో సంబంధములేని ఇతరోపాయములచేత గాని లభింపదు. భక్తిమార్గమున వయనించు శ్రీహరిదాసుల కది సులభము. బహు వ్యయసాధ్యము లైన ఏవేవో పుణ్యకర్మము లొనర్చి ప్రయాసపడుటకంటె సుకరమైన శరణాగతి ననుష్ఠించి ముక్తి నొందుట సులభము.

ఇంద్రియ నిగ్రహము, ఆశలు వీడుట, భగవన్నామోచ్చారణము హరిభక్తులు పాటింపదగిన పరమధర్మములు. ఇంద్రియములు స్వాధీనములు గానంతవరకు జ్ఞాన మార్గము గోచరింపదు. ఆశాబంధములను త్రెంచుకోనంతవరకు వైకుంఠము కనిపింపదు. ఇంద్రియనిగ్రహాదులను పాటించు శరణాగతునిపై భగవద్దయ ప్రసరించును. అది వానిని వెనువెంటనే ముక్తుని గావించును. కాన క్లేశకరములైన కర్మమార్గాదులను పరిత్యజించి ప్రపత్తి ననుష్ఠించి ముక్తి నొందవలె నని తాత్పర్యము.

---

1. ఈశ., 5. 2. భాగ., 6-158.

38

అవ:- జీవుని రక్షణ దేవుని కర్తవ్యమని చెప్పుచు తన్ను కాపాడుమని శ్రీహరిని ప్రార్థించుచున్నాడు—

లలిత

సొమ్ము గలవాఁడు తన - సొమ్ము చెడ నిచ్చునా
కమ్మి నీ సొమ్మను నేను - కాపాడవే హరీ! ॥పల్లవి॥

1. పసుర మడవిఁబడ్డ - బసురము గలవాఁడు
దెసలు వెద కింటికిఁ - దెచ్చుకొన్నట్టు,
వసగా నాసలలోన - వడిఁబడ్డ నా మనసు
యెసగ మళ్ళించవే న - న్నేలిన గోవిందుఁడా. ॥సొమ్ము॥

2. గొందిఁబంట నేయువాఁడు - కొలుచులు పరకళ్ళఁ
జిందకుండా గాదెఁబోసి - చేరి కాచీని,
కందువ మమ్ముఁ బుట్టించి - కన్నవారి వాకిళ్ళఁ
జెంది కావనియ్యకువే - జీవునిలో దేవుఁడా. ॥సొమ్ము॥

3. కడుపులోని శిశువు - కన్నతల్లి దన్నితేను
బెడగు లెంచక కని - పెంచీ నటా।
యెడమీక శ్రీ వేంక - టేశ నీ కుక్షిలో నేను
తడవి తప్పు నేసినా - దయఁగావవే. ॥సొమ్ము॥

ప॥ కమ్మి = క్రమ్మి, పైకొని.

1. వసగాఁ = వశముగా.

2. కొలుచులు = ధాన్యములు, పరకళ్ళఁ = ప్రక్కలలో, కందువఁ = సామర్థ్యముతో.

3. బిడగులు = వెడగులు, తప్పిదములు.

శ్రీహరీ ! సొమ్ముగల యజమాని ఏ పరిస్థితులలో నైనను తనసొమ్ము చెడ నిచ్చునా ? జీవుడనైన నేను దేవుడవైన నీ సొమ్ము. కాన నన్ను వదలక కాపాడు కొనుమా ।

ఒక పశువు అడవిలో జిక్కుకొన్నచో దాని యజమానుడు అన్నిదిక్కులు వెదకి చివరికి దాని నింటికి తెచ్చుకొనును. అట్లే నీ సొమ్మైన నాచిత్తము ఆశలకు వశమై అందు చిక్కుకొన్నది. నాకు ప్రభువైన గోవిందా ! ఈ చిత్తమును ఆశలనుండి మంచి త్రోవలోనికి మళ్ళించు.

ఒకమూల పైరు వెట్టినవాడు కోత పూర్తి కాగానే ధాన్యము ఇటు నటు చిందిపోకుండునట్లు గాదెబోసి చేరి రక్షించుకొనుచున్నాడు. నేర్పుతో నీవు మమ్ము సృష్టించితివి. మేము కన్నవారి వాకిళ్ళకెల్ల బోయి కావలి గాయు దుఃస్థితికి వచ్చినాము. జీవునిలో అంతర్యామిగా నున్న ఓ దేవుడా ! ఈ దుఃస్థితినుండి మమ్ము తొలగించవయ్యా !

కడుపులో నున్న శిశువు కన్నతల్లిని దన్నినను ఆమె ఆ బిడ్డ తప్పు లెంచక తని పెంచుచున్నది గదా ! శ్రీ వేంకటేశ్వరా ! నీ గర్భములోనున్న నేను అజ్ఞానముతో తప్పు చేసినను ఆగ్రహించి విడువక దయతో కాపాడుమా !

వి:- దేవు డొక్కడే స్వతంత్రుడు. జీవు లెల్లరు ఆయనకు లోబడినవారే. వారికి ప్రభు వాపరమాత్మడే కాన ఆయన సొమ్ములుగా ఇచట జీవులు నిరూపింపబడిరి. అందుచే మార్జాల కిశోర న్యాయము ననుసరించి (పిల్లి తన కూనల రక్షకై తానే దీక్ష బూనినట్లు) దేవుడే జీవులను రక్షించవలసియున్నాడు; కాన అన్నమయ్య ఈ కీర్తనమున భగవంతునికే ఆయన కర్తవ్యమును జ్ఞప్తికితెచ్చి తన్ను రక్షింపుమని వేడినాడు.

దేవుని కుక్షిలో జీవు డున్నాడని చెప్పుట ఉచితమే. పదునాలుగు భువనములను కుదురుగా తన కుక్షిలో నిల్పుకొన్న నేర్పరి గదా ఆ పరమేశ్వరుడు: యశోదకు ఆయన నోట బ్రహ్మాండములు గన్పించినట్లు భాగవతమున ప్రసిద్ధమే. గీతలో విశ్వరూప ప్రదర్శనముగూడ ఈ రహస్యమునే వెల్లడించుచున్నది.

## 39

అవ:- మోక్షము శ్రీహరిదాసుల అంతరంగమునందే కలదు గాని ఇంకెందును లేదనుచున్నాడు—

లలిత

కల దందే పో సర్వముఁగలదు - కామితార్థమును గలదు

కలదు కలదు శరణాగతులకు హరి-కైంకర్యంబున మోక్షము గలదు.

॥పల్లవి॥

1. ఆకాశంబున మోక్షము వెదకిన - నందులోపలా లేదు
పైకొని తానెంత వెదకి చూచినా - పాతాళంబున లేదు,
ఈకడ ధరలో మూల మూలలను - యెందు వెదకినా లేదు
శ్రీకాంతుని మతిఁజింతించి యాసలఁ-జిక్కక తొలఁగిననందే కలదు.
॥కల॥

2. కోటి జన్మములు యెత్తిన ముక్తికి - కొన మొదలేమియు గనరాదు
వాటపు సంసారములోఁ గర్మపు - వార్ధి యీఁదినాఁ గనరాదు,
కూటువతో స్వర్గాదిలోకములఁ - గోరి వెదకినాఁగనరాదు
గాటపు కేశవభక్తి గలిగితే-కైవల్యము మతిఁగానఁగవచ్చు. ॥కల॥

3. సకలశాస్త్రములు చదివినాఁబరము - చక్కటిమార్గము దొరకదు
వికటపు పలువేల్పుల నెందరిఁగడు - వెదకి కొలిచినా దొరకదు,
అకలంకుడు శ్రీ వేంకటగిరిపతి - అంతరంగమున నున్నాఁడనుచును
ప్రకటముగా గురుఁడానతి యిచ్చిన-పరము సుజ్ఞానము తనలో
దొరకు. ॥కల॥

2. కూటువ = సాధనసంపత్తి.

3. పరము = మోక్షము; అకలంకుఁడు = దోషరహితుడు.

శ్రీహరిని శరణుజొచ్చినవారికి భగవత్కైంకర్యమునందే సమస్తము గలదు. అందే వారు కోరిన సంపద గలదు. అందే ముమ్మాటికి మోక్షముగూడ గలదు.

ఆకసములో వెదకినను మోక్ష మచ్చట లేదు. ప్రయత్నించి తానెంత వెదకి చూచినను పాతాళమునగూడ లేదు. ఈ భూవలయములో మూలమూలల ఎచ్చట అన్వేషించినను దొరకదు. ఇంకెచ్చట ఉన్నదనగా, రమాకాంతుని హృదయములో భావించి ఆశలకు వశముగాక తొలగినవారికి వారి హృదయమునందే మోక్షము కలదు.

కోటిజన్మము లెత్తినను మోక్షమునకు ఆది, అంతము ఏమియు కనిపించదు. సంసారములోబడి కర్మసముద్రములో తల మున్కలుగా ఈతలు కొట్టినను మోక్షము కంటబడదు. తగిన సాధనసంపత్తితో స్వర్గాదిలోకములకు పోయినను ముక్తి దృష్టి

గోచరము గాదు. మరి ఎచ్చట కనిపించు ననగా, దృఢమైన విష్ణుభక్తి కల్గియున్నచో వారివారి చిత్తమునందే మోక్షమును కనుగొనవచ్చును.

సమస్తశాస్త్రములు చదివినను మోక్షపదమునకు ఋజువైన త్రోవ లభింపదు. వికటమైన దేవతల నెందరిని వెదకి సేవించినను దొరకదు. దోషరహితుడైన శ్రీ వేంకటేశ్వరుడు అంతరంగమునందే ఉన్నాడని ఆచార్యుడు ఉపదేశించిన మోక్షమునకు సంబంధించిన విజ్ఞానము భగవద్భక్తునకు తనలోనే లభించును.

వి:- మోక్షమనునది ఒక పదార్థము గాదు. అది ఎక్కడనో, ఏ మూలనో ఒదిగి లేదు. విషయవాసనలకు, భోగవాంఛలకు దూరమైన చిత్తస్థితియే మోక్షము. "భోగేచ్ఛామాత్రకో బంధ స్తత్త్యాగో మోక్ష ఉచ్యతే" అని యోగవాసిష్ఠము. ఈ చిత్తస్థితి కర్మలచేతను, శాస్త్రాధ్యయనాదులచేతను, నానాక్షుద్రదేవతారాధనలచేతను పొందబడునది గాదు. అది శ్రీ హరిభక్తిచేతనే సాధింపదగియున్నది. భగవద్భక్తుడై ఆశాపాశములనుండి విడివడినవానికి మోక్షము సదా హృదయమునందే ఉన్నది. భగవంతుడంతరాత్ముడై అందరి హృదయములలో ఉన్నాడను తత్త్వము గురూపదేశముచే ఎఱుంగదగియున్నది. అట్లెరిగి భగవద్దాస్య మొనర్చువానికి మోక్ష మనుభవగోచరమగునని తాత్పర్యము.

ఇట్టిభావమే మరొక సంకీర్తనమున నిట్లు వివరింపబడినది___

బౌళి

తెలిసినవారికి - తెరువిదే మరిలేదు
నలినాక్షుఁ బొగడెడి - నామములో నున్నది. ॥పల్లవి॥

ఆకసాన లేదు మోక్ష - మటు పాతాళమున లే
దీకడ భూలోకమందు - యెందులేదు,
పైకొని ఆసలెల్ల - పారఁదోలి వెదకితే
శ్రీకాంతుఁ బొగడేటి - చిత్తములో నున్నది. ॥తెలి॥

సురలవద్ద లేదు - శోధించ నమృతము
పరి దిక్కులందు లేదు - జలధిలో లేదు,
శరణాగతుల పాద - జలములు చేర్చికొనే
హరిదాసులఁ బూజించే - అరచేత నున్నది. ॥తెలి॥

రాజసాన సుఖమేది - రాసికర్మ మందునేది
వోజతోడ నియతుడై - వుండినా నేది,
సాజాన శ్రీ వేంకటేశు - సరి ముద్రలు ధరించే
తేజముతో విజ్ఞాన - దేహములో వున్నది.1 ॥తెలి॥

పై రెండు సంకీర్తనములయందును ప్రథమచరణములలో చెప్పబడిన భావమునకు సరియైన శ్లోకము యోగవాసిష్ఠమున నిట్లు గన్పట్టుచున్నది—

న మోక్షో నభసః పృష్ఠే న పాతాళే న భూతలే।
మోక్షోహి చేతో విమలం సమ్యక్‌జ్ఞాన విబోధకమ్ ॥2

## 40

అవః- దశావతారములతో ముడిపెట్టి సంసారి సాధుజీవితమును వర్ణించుచున్నాడు—

### సామంతం

సంసారమే మేలు - సకల జనులకును
కంసాంతకుని భక్తి - గలిగితే మేలు. ॥పల్లవి॥

1. వినయపు మాటల - విద్య సాధించితే మేలు
తనిసి యప్పులలోన - దాఁగకుంటే మేలు,
మునుపనె భూమి దన్ను(ను?) - మోచి దించకుంటే మేలు
వెనుకొన్న కోపము - విడిచితే మేలు. ॥సంసా॥

2. కోరి వాకరి నడిగి - కొంచపడకుంటే మేలు
సారె సారె జీవులను - చంపకుంటే మేలు,
భారపుటిడుమలను - పడకుండితే మేలు
కారించి తిట్లకొడి - గట్టకుంటే మేలు. ॥సంసా॥

---

1. అన్న. సం., 60. 2. యో. వా. II., P. 1848.

3. పరకాంతల భంగ - పరచకుంటే మేలు
దొరకొని కెళవులు - దొక్కకుంటే మేలు,
అరుదైన శ్రీ వేంక - టాద్రి విభునిఁ గొల్చి
యిరవై నిశ్చింతుఁడైతే ఏ నిన్నిటాను మేలు. ॥సంసా॥

1. విద్య = చదువు, వేదము, అప్పులు = ఋణములు, నీళ్ళు.

2. కారించి = కష్టపెట్టి,

3. కెళవులు = ప్రక్కలు. అపమార్గములు; ఇరవై - స్థిరమై.

కంసుని బొరిగొన్న భగవంతునిమీద భక్తి గల్గినచో ప్రజ లెల్లరకును సంసారముున నుండుటే మేలు.

వినయముగల మాటలతో గురువుల నాశ్రయించి చదువు నభ్యసించి వివేకము గల్గియున్నప్పుడే సంసారము సుఖకర మగును. తన కున్నదానితో తనివి నొంది ఇతరులచెంత అప్పులు దీసి చిక్కువడక స్వతంత్రముగా జీవింపగల్గినప్పుడే సంసారము మేలగును. జీవితమును నిరుపయోగము జేసికొని తన్ను భూమి వ్యర్థముగా మోచి దించినదన్న నిందకు పాత్రముగాక తన బ్రదుకు పదిమంది కుపయోగపడునట్లు ప్రవర్తించుట మేలు. మరియు తన్ను వెంబడించుచున్న కోపమును విడనాడి శాంతి గల్గియున్నప్పుడే సాంసారికజీవనము శుభప్రద మగును.

సంసారి ఒకరిని యాచించి గౌరవము పోగొట్టుకొనకుండినప్పుడే మేలొందును. చీటికి మాటికి జీవులను చంపక అహింసాధర్మమును పాటించినప్పుడే శ్రేయస్సు నొందును. లేనిపోని పనులలో తలదూర్చి పెద్ద కష్టములు పడక సుఖముగా బ్రదికినప్పుడే ధన్యు డగును. మరియు ఇతరులను బాధించి వారిచే తిట్టుపడక గౌరవముతో నున్నప్పుడే బాగుపడును.

పరస్త్రీల నవమానింపక తల్లులవలె గౌరవించినప్పుడే సంసారయాత్ర హాయిగా నుండును. అపమార్గములు ద్రొక్కి నానాయాతనలకు గురిగాక ఉన్నచోటనుండి సుఖించినప్పుడే సంసారము సఫల మగును. చిక్కు లెన్ని తన్ను పైకొన్నను లెక్కచేయక అపురూపమైన శ్రీ వేంకటాద్రీశ్వరుని సేవించి స్థిరచిత్తుడై చింతలు లేక మం గలిగినచో సంసారమే మేలు.

వి:- సంసారము పెక్కు చిక్కులకు నిలయము. అందువల్లనే ఘోరసాగర ముతో దానిని పోల్తురు. కాని శరణాగతి నొందిన భక్తులకు సంసారము కష్టకరము కాదు. భక్తితోపాటు సంసారులు పాటింపదగిన కొన్ని ముఖ్యధర్మము లీపాటలో పేర్కొనబడినవి.

వినయముతో విద్య నభ్యసించుట, అప్పులపాలు కాకుండుట, భూమికి బరువైన వ్యర్థజీవితము గడపకుండుట, కోపము వీడుట, యాచనావృత్తి లేకుండుట, జీవులను హింసింపకుండుట; ఇడుములకు లోనుగాకుండుట, ఇతరులను నొప్పించి వారిచే దూషింపబడకుండుట; పరస్త్రీల నవమానింపకుండుట, అపమార్గమున బడకుండుట అను పది ధర్మములను చక్కగా పాటించినప్పుడే సంసారము మేలగును, లేనిచో అది క్లేశకరమే యని భావము.

పై ధర్మములను బోధించు నెపముతో పాటలోని రెండున్నర చరణములకు చెందిన పది పంక్తులలో పరమాత్ముడు గావించిన దశావతారచర్యలు వ్యతిరేకవిధమున పేర్కొనబడినవి.

భగవంతుడు మత్స్యావతారమున వినయముతో గాక క్రౌర్యముతో, సోమకుని వధించి విద్యను, అనగా వేదములను సంపాదించినాడు. కూర్మావతారమున అప్పులలో (నీళ్ళలో) దాగినాడు. వరాహావతారమున భూమిని మోచి దించినాడు. నరసింహావతారమున మిక్కిలి కోపముతో హిరణ్యకశిపుని పరిమార్చినాడు. వామనుడై బలి చక్రవర్తిని యాచించినాడు. పరశురాముడై అనేకజీవులను (క్షత్రియులను) చంపినాడు. శ్రీరాముడై పెద్దపెద్దకష్టములు పడినాడు శ్రీకృష్ణుడై గోపికల నేడ్పించి వారి తిట్లకు గురియైనాడు. బుద్ధుడై త్రిపురాసుర వనితల భంగపరచినాడు. కలికియై తురగము నెక్కి ఇరుప్రక్కల అంకెము ద్రొక్కి పయనించినాడు.

ఈ పై చర్యలన్నియు సామాన్యకుటుంబికి విరుద్ధములైనను విశ్వకుటుంబియైన వెన్నునికి తప్పక పాటింపదగినవే యగుట ఇందలి విశేషము. అన్నమయ్య కవితా చమత్కృతి కీ కీర్తనము చక్కని నిదర్శనము. దశావతార స్తుతిపరములైన పలు సంకీర్తనములలో ఇట్టి చమత్కృతినే ఆయన ప్రదర్శించియున్నాడు.

41

అవ:- ధర్మములు, కర్మములు మున్నగున వన్నియు విష్ణుమాయావిలాసములే యని ప్రతిపాదించుచున్నాడు___

పాడి

నీ మాయ లింతే కాక - నీరజనాభుఁడ యివి
నామీఁది నిజమనెట్టు - నమ్మే దయ్యా! ॥పల్లవి॥

1. బాలుఁడనై నేఁజన్నుఁ - బాలు దాగేనాఁడు
యీలయనుష్ఠానము లెం - దుండె నయ్యా!
చాలి యా నేనె బ్రహ్మ - చారి నయిన మీఁద
వాలి యివె యెందుండి - వచ్చె నయ్యా! ॥నీమా॥

2. నేను దినదినమును - నిద్దుర వోయేవేళ
పూని నిత్య కర్మము లెం - దుండె నయ్యా!
జ్ఞానముతో మేలుకొని - సంసారినైన వేళ
ఆనుకొని యెందుండి - అంటుకొనె నయ్యా! ॥నీమా॥

3. ఏడకర్మ మేడధర్మ - మింతలో నన్యాపై తే
వేడుక కివి యెల్లా నీ - విలాసాలు,
జాడ నీ మనసు వస్తే - సరుగఁ గరుణింతువు
వోడక శ్రీ వేంకటేశ! వున్నమద్దు లేఁటికి. ॥నీమా॥

పద్మనాభా! నిత్యనైమిత్తికాది కర్మములు, ఆచారములు, వాటికి సంబంధించిన ధర్మములు నీ మాయచే కలిగినవే. వాటిని నే నెట్లు నిజమని నమ్మగలనయ్యా!

బాలుడనై నేను తల్లి చనుబాలు త్రావునప్పుడు ఈ యనుష్ఠానము లన్నియు ఎక్కడ ఉండినవి? అట్టి నేనే కొంత పెరిగి బాల్యము గడచి బ్రహ్మచారినైన పిమ్మట ఈ యనుష్ఠానము లన్నియు ఎక్కడనుండి వచ్చి నా మెడ జుట్టుకొన్నవి?

ప్రతిదినము నేను నిద్రించునప్పుడు ఈ నిత్యకర్మము లన్నియు ఎక్కడ దాగి యున్నవి? నిద్రనుండి లేచి నా యీ సంసారమును స్మరించుకొన్నంతనే పై కర్మము లెల్ల ఎక్కడనుండి వచ్చి నన్నంటుకొనుచున్నవి?

ఆ పిమ్మట నేను సన్న్యాసి నైనంతనే ఇంతవరకు నన్ను వదలని కర్మములు, ధర్మములు ఎం దేగుచున్నవి ? శ్రీ వేంకటేశ్వరా ! ఇవి యన్నియు వేడుకకై నీ వొనర్చిన మాయా విలాసములే కాని మరేమియు గావు. నీకు మాపై మనస్సు వచ్చినచో తప్పక దయజూచి కాపాడుదువు. అంతే కాని తర్కించు వ్యర్థమైన మాటలచే ప్రయోజన మేమి ?

వి:- బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అని నాల్గాశ్రమములు శాస్త్రములలో విధింపబడినవి. ఒక్కొక్క ఆశ్రమము నందును అనుష్ఠింపదగిన ఆచారములు వేఱువేఱుగా నిరూపింపబడినవి. చనుబాలు త్రాగు శైశవావస్థయందుమాత్రము ఎట్టి అనుష్ఠానములును లేవు. మరియు జాగ్రదవస్థలో జీవుడాయా కర్మములు లొనర్చుచున్నాడే గాని నిద్రావస్థలో అన్నియు విస్మరించి సంగరహితుడగుచున్నాడు. బ్రహ్మచారిగా, గృహస్థుడుగా మనుజుడు పాటించిన కర్మములు, ధర్మములు సన్న్యాసాశ్రమములో ప్రవేశించినంతనే దూర మగుచున్నవి.

కాన ఈ ధర్మ కర్మములకు నిలుకడ లేదు. అవి శాశ్వతములు గావు. పైగా తెచ్చిపెట్టుకొన్నవే గాని సహజసిద్ధములు గావు. అయ్యవి భగవన్మాయావిలాసములు మాత్రమే. వాటిని నమ్ముకొని మనుజులు ముక్తి కేగలేరు. భగవత్కృప యొక్కటే మోక్షము నొసంగగలదు. కాన దానికై పాటుపడవలెనని తాత్పర్యము.

బ్రహ్మచారు లొనర్చు వేదాధ్యయనాదులు, గృహస్థులు చేయు పంచ యజ్ఞాదులు, సన్న్యాసు లాచరించు బ్రహ్మానుష్ఠానము మున్నగునవి సోపానక్రమమున మోక్షమునకు త్రోవలని శాస్త్రములు చెప్పుచున్నవి. కాని భగవద్భక్తి హీనులైనచో పై యనుష్ఠానము లన్నియు వ్యర్థములే యని అన్నమయ్య అభిప్రాయము.

## 42

అవ:- మాయాప్రేరితులైన జీవుల సంసారప్రవృత్తి వైచిత్ర్యమును వర్ణించుచున్నాడు—

### సాళంగనాట

**తానెంత బ్రదుకెంత - దైవమా నీ మాయ యెంత**
**మానవుల లంపటాలు - మరి చెప్పఁగలదా ?** ॥పల్లవి॥

1. చెంగి నేలఁబారేటి - చీమ సంతతమును
కలసి వూరకే పారుఁ - గమ్మర నెంకో మరలి,
యలయోంచి కాపురము - ధాన్యములు గూడబెట్టు
యిల సంసారము దని - కింక నెంతగలదో ॥ఇంతె॥

2. ఏదో బాయిటఁబారే - యీఁగ సయితమును
వాడదేరం నడవుల - వాలి వాలి,
కూడబెట్టుఁదేనెలు - గొందులఁ బిల్లలఁబెట్టు
యేడకేడ సంసార - మింక నెంతగలదో ॥ఇంతె॥

3. హెచ్చి గిజగాఁడ్లు సయితి - మెంతో గూఁడువెట్టు
తెచ్చి మిణుఁగురుఁబురువు - దీపము వెట్టు,
తచ్చి శ్రీ వేంకటేశ నీ - దాసులు చూచినగుదు
రిచ్చలఁదానీ సంసారి - మింక నెంతగలదో ॥ఇంతె॥

ప్ర॥ లంపటాలు = తగులములు.

1. కమ్మర = క్రమ్మర, మరల.

2. వాడుదేరఁగా = అలసిపోవునట్లుగా.

3. తచ్చి = త్రచ్చి, పరిశీలించి.

జీవుఁ డెంతటివాడు ? అతని బ్రతు కెంతటిది ? దేవా ! సర్వమునకు కారణమైన నీ మాయ యెంత ప్రభావము కలది ? మనుజుల సంసారపు తగులము లిట్టివని చెప్పు టకు వీలగునా ?

నేలపై బారు చీమగూడ తోటి చీమలతో గలసి ఊరకే ఎక్కడికో పోవును. అక్కడినుండి తిరిగి మరల ఎక్కడికో పయనించును. కాపురము నెత్తిపై బెట్టుకొని ఎందెందో తిరిగి ధాన్యములు సమకూర్చును. స్వల్పమైన ఆ చీమకు ఇంకను ఎంత సంసారము కలదో కదా !

ఎక్కడనో బయట దిరుగు ఈగగూడ అలసిపోవునట్లుగా అడవులలో చెట్లపై, తీగలపై వ్రాలి వ్రాలి తేనెలు కూడబెట్టును. సందు గొందులలో పిల్లల బెట్టి పెంచును. ఈయీగ కదియెక్కడి సంసార వ్యామోహమో! ఇంకను అందుకై అది యెంత పాటుపడవలసి యున్నదో!

గిజగాండ్లు అందుకని పూని చిత్రముగా గూండ్లు కట్టును. అందులో మిణుగురు పురుగులను దెచ్చి దీపము పెట్టును. శ్రీ వేంకటేశ్వరా! నీ దాసులైన భాగవతులీ జీవుల సంసారభ్రమను తలపోసి నవ్వుచుందురు. జీవులపాలిటి కింకను చేయవలసిన సంసార మెంత మిగిలియున్నదో కదా!

వి:- దేవుని మాయ జీవులను సంసారములో బడవేసినది. చీమలు, ఈగలు, పక్షులు మొదలు మానవులవరకు గల ప్రాణులెల్లరు ఈ సంసారపు లంపటముతో తల మునకలై తపించుచున్నారు. ఎంతగా అనుభవించినను వీరికి తృప్తి అనునది లేదు. ఎంతో కాలమునుండి చేయుచున్న సంసారమునే ఇప్పుడును చేయుచున్నారు. ఇట్లింక ఎంతకాలము చేయగలరో ఎవరి కెరుక? అందుచే జీవుల సంసారభ్రమ అనంతమై చిత్రాతి చిత్రముగా నున్న దన్న విషయ మీ పాటలో తేటపరుపబడినది.

చీమలు మున్నగు ప్రాణులు సంసారమునకై పడుపాట్లు పాటలో వర్ణింపబడి నవి. అల్పజీవులే ఇంతగా శ్రమపడుచుండ, ఇక మానవుల లంపటములు చెప్ప వలెనా! వారు వానికంటె ఎక్కువగనే తగులములపా లగుచున్నారు. జంతువులు, పక్షులు తమ సంతానమును కొంత వయస్సు వచ్చువరకే స్వార్థములేని మమకారముతో పెంచుచున్నవి. మానవు లట్లు కాదు. వారు తమ బిడ్డ లెంతవారైనను వారిపై భ్రాంతి వీడుట లేదు. పైగా ఈ భ్రాంతి వార్ధక్యమున తమ్ము తమ బిడ్డలు కాపాడుదురన్న స్వార్థముతో గూడియున్నది. ఈ రీతిగా లంపటము లెక్కువగుకొలది వారి శ్రమగూడ పెరుగుచునే యున్నది.

కాని భగవద్దాసులు మాత్రము ఇందు కతీతముగా నున్నారు. వారిపై మాయ పనిచేయదు. కాన వారు సంసారమున దగులుకొనరు. సంసారములో నున్నను తామ రాకుపై నీటివలె అంటకుందురు. అందుచే వారు సదా సంతుష్టులై ఇతర జీవుల పాట్లు చూచి తమలో తాము నవ్వుకొనుచు ఆత్మానందములో ఓలలాడుచుందురు.

# 43

అవ:- విరోధులు, అవిరోధులు అని చూడక తనతో ఏవిధముగనైన సంబం ధముగల ఎల్లవారికి సముడై భగవంతుడు ముక్తి నొసగు నన్నచున్నారు—

## మంగళ కౌశిక

ఇందరు నీ కొక్కసరి - యెక్కువ తక్కువ లేదు
చెంది నీ సుద్దులు యేమి - చిత్రమో కాని. ॥పల్లవి॥

1. నీ నామ ముచ్చరించి - నెరవేరె నొక్క మౌని,
నీ నామము వినక - నెరవేరె నొకడు,
పూని నిన్ను నుతియించి - భోగియాయ నొకఁడు
మోనమున నిన్ను దిట్టి - మోక్షమందె నొకఁడు ॥ఇంద॥

2. మతిలో నిన్ను దలంచి - మహిమందె నొకయోగి
తతినిన్ను దలఁచకే - తగిలె నిన్నొకఁడు,
అతిభక్తిఁ బనివేసి - అధికుఁడాయ నొకఁడు.
వతతముఁ బనిగొని - సఖుఁడాయ నొకఁడు. ॥ఇంద॥

3. కౌఁగిటి సుఖము లిచ్చి కలిసిరి గొందరు
ఆఁగి నిన్ను వెంటఁదిప్పి - ఆప్తులు మేలందెను,
దాఁగక శ్రీ వేంకటేశ - దగ్గరైన దవ్వయిన
మాఁగి నిన్ను దలపోసే - మనసే గుఱుతు. ॥ఇంద॥

వ॥ సుద్దులు = వృత్తాంతములు.

1. మోనమున = దురాగ్రహముతో.

2. ఆఁగి = ఆపి.

దేవా ! నీయెడల అనుకూలముగా కొందరు, ప్రతికూలముగా మఱికొందరు ప్రవర్తించినారు. ఎట్లు ప్రవర్తించినను ఈ చెప్పబోవు వారందరు నీదృష్టిలో సమానులే, వారిలో ఒకడు ఎక్కువ, మరొకడు తక్కువ అని నీవు తలంపవు. నీచరిత్ర లెంత చిత్రములో కదా !

ఒక మునీశ్వరుడు సతతము నీనామ ముచ్చరించి ముక్తి నొందెను. మరొకడు నీనామము వినకయే ముక్తు డయ్యెను. ఒకడు పూనికతో నిన్ను స్తుతించి అష్టైశ్వర్య సంపన్ను డయ్యెను. మరొకడు దురాగ్రహముతో నిన్ను నిందించి మోక్షము చూర గొనెను.

ఒక యోగి చిత్తములో నిన్ను సదా ధ్యానించి మహిమ గలవాడయ్యెను. మరొకడు నిన్ను మదిలో తలంపకయే నీ సాన్నిధ్యమునకు చేరెను. ఒకడు మిక్కిలి భక్తితో నీకు ఊడిగ మొనరించి మహనీయు డయ్యెను. మరొకడు నీచే సదా ఊడిగము చేయించుకొని నీకు మిత్రు డయ్యెను.

కొందరు నీకు ఆలింగన సౌఖ్యము నిచ్చి నీతో కలిసికొనిరి. ఆవులు గూడ నిన్ను తమవెంట త్రిప్పుకొని శుభములు వడసెను. శ్రీ వేంకటేశ్వరా! దగ్గఱగానైనను, దూరముగానైనను (అనుకూలముగా నైనను, ప్రతికూలముగా నైనను) పరిపాకము నొంది నిన్ను చింతించు చిత్తమే నిన్ను పొందుటకు తగిన గుర్తు. (కడపటి ఉపాయము)

వి:- సమోఽహం సర్వభూతేషు ।

న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ॥[1]

అను గీతోక్తి ననుసరించి భగవంతున కొకడు ద్వేషింపదగినవాడు గాని, మఱొకడు ప్రేమింపదగినవాడు గాని లేడు. ఆయన సర్వప్రాణులయెడ సముడై యున్నాడు. తనకు విరోధులైన వారియెడలకూడ ఆయనకు ద్వేషము లేదు. అనుకూలముగా గాని, లేదా ప్రతికూలముగా గాని తన్ను స్మరించిన చాలును. అట్లు స్మరించువారి కెల్ల పరమాత్ముడు ముక్తి నొసగుచున్నా డను పరమార్థము నీపాట తేటపరచుచున్నది.

ఈ సంకీర్తనమున ప్రథమచరణము మొదటి పంక్తినుండి తృతీయచరణము రెండవపంక్తివరకు వివిధరీతుల భగవంతునితో సంబంధము కలిగి ఉత్తమగతి నొందిన వారు పలువురు పేర్కొనబడిరి.

(1) సదా భగవన్నామము నుచ్చరించి తరించిన మునీంద్రుడు నారదుడు.

(2) భగవన్నామమును వినను అని పట్టుబట్టి చెవులకు గంటలు కట్టుకొని తిరిగి చివరికి భగవత్సాన్నిధ్యము నొందినవాడు ఘంటాకర్ణుడు.

1. గీత., 9-29.

(3) పేదరికము భరించలేక తన చిననాటి చెలికాడైన శ్రీకృష్ణు నాశ్రయించి స్తుతించి ఆయన అనుగ్రహమునకు పాత్రుడై సకలవిధ సంపదలు పొంది తుదకు ముక్తుడైనవాడు కుచేలుడు.

(4) ధర్మరా జొనర్చిన రాజసూయయాగమున దురాగ్రహముతో కృష్ణుని నిందించి తద్ద్వారా ముక్తినొందినవాడు శిశుపాలుడు.

(5) ఇతరచింతలు మాని సదా భగవంతుని చిత్తములో దలచి మహిమ నొందిన యోగీంద్రుడు శుకుడు.

(6) మహాపాపాత్ముడై భగవంతు నేమాత్రము తలచక అవసానసమయమున 'నారాయణ' నామధారి అయిన తన కొడుకు పేరు పిలిచినంతమాత్రమున నరకమును దొలగించుకొని వైకుంఠమున కరిగినవాడు అజామిళుడు.

(7) అతి భక్తితో కృష్ణునికి సను లొనర్చి ఉత్తమగతి నొందినవాడు ఉద్ధవుడు. (ఇక్కడ కృష్ణావతారమునే ప్రధానముగా గ్రహించుట ఉచితము.)

(8) తనకు సారథిగా కృష్ణునిచే పని చేయించుకొని సఖ్యము నెరపినవాడు అర్జునుడు.

(9) కౌగిటి సుఖము లిచ్చి భగవంతునిలో లీనమైనవారు గోపికలు.

(10) తమకు పాలకునిగా గోపాలుని వెంట ద్రిప్పుకొన్నవి గోవులు.

నారదాదులు భగవంతుని ప్రేమతో ధ్యానించి ముక్తినొందిరి. శిశుపాలుడు న్నగువారు భగవంతునితో వైరము వహించియు తుదకు ఆయనతో ఐక్యమొందిరి. కాన అనుకూల మార్గముననైనను, ప్రతికూల మార్గముననైనను భగవంతునిపై చిత్తముంచినవారు ముక్తు లగుదురు.

అందువలననే భాగవతమున ధర్మజునితో నారదు డిట్లు నుడివెను —

తస్మా ద్వైరానుబంధేన నిర్వైరేణ భయేన వా ।
స్నేహా త్కామేన వా యుంజ్యాత్ కథంచిన్నేక్షతే పృథక్ ॥[1]

గోప్యః కామా ద్భయా త్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః ।
సంబంధా ద్వృష్ణయః స్నేహా ద్యూయం భక్త్యా వయం విభో ॥[2]

1. భాగ., 7-1-25. 2. భాగ., 7-1-30.

ఇందుకు పోతనగారి అనువాదము—

అలుకనైన చెలిమినైన గామంబున
నైన బాంధవముననైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ
జేరవచ్చు వేఱుసేయ డతఁడు.[1]

కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్,
ప్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామధ్యాన గరిష్ఠుఁడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా ![2]

## 44

అవ:- భగవద్దాసులలో హెచ్చుతక్కువలు లేవనుచున్నాడు—

### లలిత

హీనాధికము లింక - నేడ నున్నవో కాని
అనిన దాస్యము పొత్తు - అందరికి నొకటే. ॥పల్లవి॥

1. నానావర్ణములవారు - వరహరిఁ దలఁచేటి
ఆ నామమంత్రజప - మది యొకటే.
పూని యాతనిఁ గొలిచి - భువి వేఱైనాను
మోదమునఁ బొందేటి - మోక్షమూ నొకటే ॥హీన॥

2 వెనకకు ముందరికి - విష్ణుకింకరుల కెల్ల
పనివడి కైకొనేటి - భక్తి యొక్కటే.
వునికి నా దేవుఁడు - వాఁడే అంతర్యామి
మనెడి వైష్ణవకుల - మత మెల్లా నొకటే. ॥హీన॥

1. భాగ., 7-14. 2. భాగ., 7-18.

3\. భేదాభేదము లేదు - పెక్కుమరఁగులు లేవు
ఆది నంత్యమునను ము - క్తాత్మ లొక్కటే,
శ్రీ దేవుఁడైనట్టి - శ్రీ వేంకటేశ్వరుని
యాదరానఁబొందు శర - ణాగతియు నొకటే. ॥హీన॥

ప॥ హీనాధికములు = తక్కువ, ఎక్కువలు.
1\. మోనమునను = మౌనముతో.

భగవంతుని దాస్యముతోడి సంబంధము భక్తుల కెల్లవారికి ఒకేవిధముగా నున్నది. అందెట్టి భేదమును లేదు. ఇంక హెచ్చుతక్కువ లెక్కడ నున్నవి ?

వివిధవర్ణములకు జెందిన ప్రజలు నరహరిని దలంచుటకు సాధనముగా ఉపయోగించు నామమంత్రజపము ఒకటే. ఇలలో ఏ జాతికి జెందినవారైనను తుదకు మౌన నియతితో పొందగల మోక్షముగూడ ఒక్కటే.

విష్ణుసేవకుల కందరికిని గతకాలమున గాని, రాబోవుకాలములో గాని ఆక్కరతో స్వీకరింపదగిన భగవద్భక్తి యొక్కటే. ఆ దేవు డొకడే జీవులందరిలోను అంతర్యామిగా నున్నాడు. ఆయన నుపాసించు వైష్ణవవర్గమునకు జెందినవారి మతము గూడ ఒక్కటే. అందు వ్యత్యాసములు లేవు.

ఇందులో భేదాభేదములు లేవు. పెక్కు రహస్యములు లేవు. మొదటగాని, తుదినిగాని (సంసారములో తగుల్పడుటకు ముందుగాని, అందుండి విడివడిన తర్వాత గాని) ముక్తాత్మలన్నియు ఏకరూపములే. లక్ష్మీపతియైన శ్రీ వేంకటేశ్వరుని ప్రేమతో పొంది మోక్షసుఖ మనుభవించుటకు ముఖ్యోపాయమైన శరణాగతివిధానము గూడ ఒక్కటే.

వి:- నామజపము భగవంతుని స్మరించుటకు సాధనము. ఆ జపవిధానములో జాతిభేదములు లేవు. అట్లే భక్తిమార్గముగూడ జీవులకందరికి ఒకే పద్ధతితో విధింపబడి యున్నదిగాని జాతి లింగాదిభేదము అందు పాటింపబడలేదు. భక్తిచే చివరికి పొందదగినది మోక్షము. ఆ మోక్షసుఖములోగూడ ఎట్టి జాతిభేదము లేదు. ఏ జాతివారైనను ఉచితోపాయము ననుష్ఠించినచో ఒకేవిధమైన మోక్షమునే పొందుదురు. ముక్తాత్ములలో తేడా లేదు. శరణాగతిలో వ్యత్యాసము లేదు.

ఇక భక్తులలో వాడు తక్కువ, వీడెక్కువ అను తరతమభావ మెందున్నది ? వైష్ణవమతములో అట్టి భేదము లేనేలేదు. కాన అందరికి అది అనుష్ఠింపదగిన దని తాత్పర్యము.

## 45

అవ:-భగవంతునికంటె భక్తుడే ఘనుడని పైకి చెప్పుచునే భగవంతుని ఘనత సాటిలేని దని వ్యక్తమొనర్చుచున్నాడు—

### దేసాళం

నేనే పో ఘనుఁడను - నీ కంటెను
దానవారి నీవు నాకు - దైవమవు గాన. ॥పల్లవి॥

1. నేరుపున నాకైతే - నీ దిక్కుఁగలను గాని
చేరి నీకావల దిక్కు - చెప్పి చూపఁగలదా,
ఆరయ నీవైతే నాకు - నాధారముగలవు గా
నూరకే నీకాధారము - వున్నదా యెక్కఁడను ? ॥నేనే॥

2. నన్నుఁ గొల్చిన నలిగె - నేడు నాకుఁ గద్దు గాని
సన్నుతి నీకు నొకరి - నలిగున్నదా,
పెన్నిధి నిన్నుఁదలఁచే - పేరు నాకుఁ గద్దు గాని
వున్నదా నీకుఁదలఁచ - నొకరి పేరైనను ? ॥నేనే॥

3. ఈవులెల్ల నాకైతే - నియ్యఁగలవుగాక
ఆవల నీ కీవులియ్య - నన్యు లున్నారా,
శ్రీ వేంకటేశ నాకు - జీవాంతరాత్మవు నీవు
భావించనంతరాత్మ యె - వ్వటి నీకు నున్నదా ? ॥నేనే॥

2. నలిగె = ఆశ్రయము, చనవు.

రక్కసులకు శత్రుడవైన ఓ దేవా ! నీవు నాకు దైవమై యున్నావు. (నీకు వేరే దైవము లేదు.) అందువల్ల నీకంటె నేనే గొప్పవాడను సుమా !

నాకు నీవలన అన్నివిధముల సమర్థమైన రక్షణ కలదు గాని నీకు చూపి చెప్పుటకు మరొకరినుండి రక్షణ లేనేలేదు. నీవు నా కాధారముగా నున్నావు గాని నీ కాధార మెందును లేదు.

నిన్ను సేవించినందువలన నీ చనవు నా కున్నది గాని నీకు మరొకరిని సేవించుటకును వారి ప్రాపు పొందుటకును అవకాశము లేదు. నిన్ను స్మరించుట కనువుగా

పెన్నిధియైన నీ నామము నా కున్నది గాని నీవు స్మరించుట కొక్కరి పేరైనను నీకు లేదు.

ఏమి కావలసినను నా కిచ్చుటకు నీవు గలవుగాని నీకు గావలసిన విచ్చు టకితరు లెవ్వరును లేరు. శ్రీ వేంకటేశ్వరా! నీవు నా కంతరాత్మగా నున్నావు గాని శాశ్వతుడవైన నీ కంతరాత్మవైనవాడు మరొకడు లేడు. కాన ఎన్నివిధముల చూచి నను నీకంటె నేనే ఘనుడ నని భావము.

వి:- లోకములో ఎవనికి రక్షకులు, ఆధారభూతులు, అవసరమైనపుడు స్మరింప దగినవారు, వలసినవెల్ల చేకూర్చువారు, అన్నివిధముల సాయపడువారు ఉందురో వారు గొప్పవాడు. ఈ సహాయము లెవ్వియు లేనివాడు దిక్కులేని దీనుడుగా భావింప బడును. జీవునికి దేవుడు దిక్కుగా, ఆశ్రయముగా, స్మరణీయుడుగా, సమస్త వస్తు ప్రదాతగా ఉన్నాడు. కాని దేవుని కీ సౌకర్యము లెవ్వియు లేవు. అందుచే దేవుని కంటె జీవుడే ఘను డని ఈ సంకీర్తనములోని వాచ్యార్థము.

దేవు డెల్లవారికి రక్షకుడు. ఆయనకు మరొకరి రక్షణతో పనిలేదు. పరమా త్ముడు సర్వమునకు ఆధారభూతుడు. ఆయనకు వేరే ఆధార మనావశ్యకము. భగ వంతుడు సర్వజన సేవ్యుడు. ఆయన మరొకరిని సేవించి వారి ప్రాపుగొన నవసరము లేదు. స్వామినామ మందరికి కీర్తనీయము. ఆయనకు మరొకరిపేరు స్మరింపవలసిన పని లేదు. శ్రీహరి సర్వాభీష్ట ప్రదాత, అవాప్త సమస్తకాముడు. ఆయన కోరదగిన వస్తువు లెవ్వియు లేవు. పరాత్పరుడు సర్వాంతరాత్ముడు. ఆయనకు వేరే అంతరాత్మ యొకడు నియామకుడుగా లేడు. కాన భగవంతుడు సర్వోత్కృష్టుడని తాత్పర్యార్థము.

'న తస్య కశ్చి త్పతిర స్తి లోకే'[1] ఇత్యాది శ్రుతులు ఆ పరమాత్ముని సర్వో త్కృష్టునిగా చాటుచున్నవి. 'ఒరులుగారు నాకు నొరులకు నేనౌదు, నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేడు'[2] ఇత్యాది భాగవత వచనములుగూడ ఈ యర్థమునే నిరూపించు చున్నవి.

వాగ్గేయకారులలో సుప్రసిద్ధు డయిన త్యాగయ్య పై సంకీర్తనలోని భావముతో సంపదించు ఒక కృతిని ఇట్లు గానము చేసియున్నాడు.

అనాథుడను గాను రామ నే
అనాథుడవు నీవని నిగమజ్ఞుల
సనాతనుల మాట విన్నాను నే.[3] ॥అనా॥

1. శ్వేతాశ్వ., 6-9. 2. భాగ., 8-552. 3. త్యా. కీ., 11.

46

అవ:- శ్రీకాంతుడు దక్క తక్కిన దేవతల కొలుపు విష్ఫలమనుచున్నాడు—

## గుండక్రియ

అతఁడు లక్ష్మీకాంతుఁ - డన్నియు నొసఁగుఁగాక
యితరులవేఁడుకొంటే - నేమి గలదు? ॥పల్లవి॥

1. మోదముతో నొకమాని - మొదలఁబోసిన నీరు
పాదుకొని కొనకెక్కి - ఫలించుఁగాక,
ఆదిమూలమగు హరి - నాతుమ సేవించక
యే దైవములఁగన్నా - నేమి సెలవు? ॥అత॥

2. తల్లి భుజించిన వెల్లా - తగు గర్భము శిశువు
కెల్లఁగాఁగఁ బరిణామ - మిచ్చుఁగాక.
ఉల్లములోపలి హరి - కొసఁగని పూజలెల్లా
వెల్లిఁజింతపంటివలె - వృథా వృథా! ॥అత॥

3. ఓలినెంత జారిపడ్డా - నూరకే యెవ్వరికైనా
నేలే యాధారమై - నిలుచుఁగాక,
తాలిమి శ్రీ వేంకటేశుఁ - దలఁచక తలఁచినా
పాలించ నాతఁడేకాక - పరులకు వశమా? ॥అత॥

1. ఆతుమను = ఆత్మలో; సెలవు = ఉపయోగము.

2. పరిణామము = మార్పు, క్షేమము; వెల్లిని = ప్రవాహములో.

ఆ విష్ణుపు సంపదలకెల్ల అధిదేవతయైన లక్ష్మికి మగడు. కావున కోరినవెల్ల అతడిచ్చును గాని తక్కినవారి నడిగి ప్రయోజన మేమి?

సంతసముతో ఒక చెట్టుమొదట బోసిన నీరు వేళ్ళకు దిగి అందుండి కొమ్మలు, రెమ్మలకు నెగబ్రాకి ఫలించును. అంతేకాని కొనకొమ్మలపై నీరు చల్లి లాభ

మేమి ? అట్లే దేవతల కెల్లరకు ఆదిమూలమైన శ్రీహరి నాత్మలో సేవించి సుఖపడ వలెను. అట్లుకాక తక్కిన ఏ దేవతల నాశ్రయించినను ఉపయోగము లేదు కదా !

తల్లి తినెడు పదార్థములన్నియు ఆమె గర్భమునందలి శిశువున కంది పోషణ చేకూర్చి క్షేమ మొసంగును. అట్లే హృదయాంతరాళములో నున్న శ్రీహరి కొనర్చిన పూజ లన్నియు సఫలము లగును. అట్లు కాని పూజలెల్ల వరద గలిపిన చింతపండువలె వ్యర్థములే.

ఎక్కడనుండి ఎంతగా జారిపడినను ఎవ్వరికైనను చివరి కాధారమై నిల్చునది నేల యొక్కటే. అట్లే శ్రీ వేంకటేశ్వరుని స్మరింపక ఆయన మూర్తిభేదములైన దేవతాంతరములను స్మరించినను చివరికి పాలించవలసినవాడు ఆ శ్రీనివాసు డొక్కడే. ఇతరులు పాలింప కర్తలు గాజాలరు.

ని:- కోరికలు తీరుటకై ప్రజలు పలు దేవతలను భజింతురు. కాని దేవతల కెల్లరకు మూలమైనవాడు ఆదిదేవుడైన శ్రీమన్నారాయణు డొక్కడే. అందువలననే-

"అతడే బ్రహ్మణ్య దైవ - మాదిమూలమైనవాఁడు
అతని మానుటలెల్ల - నవిధిపూర్వకము."[1]

"హరి యవతారములే - యఖిల దేవతలు."[2]

ఇత్యాదిగా అన్నమయ్య శ్రీహరి మాహాత్మ్యమును పెక్కుతెరగుల కీర్తించినాడు. అంతేకాదు. ఆయా దేవతల నాయా కార్యములందు నియమించినవాడు గూడ శ్రీ హరియే. పైగా అతడు లక్ష్మీకాంతుడు గాన అర్థార్థులయిన భక్తుల కోరికలను మంచి ముగా తీర్చగలడు. కావున చిల్లరదేవతల నాశ్రయింపక శ్రీహరినే సేవించుట ఫల ప్రదమని సంకీర్తనాచార్యు డిట ప్రబోధించినాడు.

"మొదలుండఁ గొనలకు - మోచి నీళ్ళు వోయనేల
యెదలో నీవుండఁగా - నితరము లేలా ?"[3]

"గొరబై మొదలుండఁగాఁ - గొనలకు నీరేల
దొర దైవ మితఁడే - తుదగల ఫలము."[4]

ఇత్యాదులైన ఇతరపదములలో గూడ ఈ భావమునే అన్నమయ్య ప్రకటించినాడు.

1. అ. సం. , 9-69. 2. అ. సం. , 9-272.
3. అ. సం. , 5-291. 4. అ. సం. , 7-172.

ఒకవేళ ఇతర దేవతల నాశ్రయించినను ఆ దేవతలు శ్రీహరి తమ కొసంగిన ప్రకారమును వినియోగించియే జీవులను పాలింపవలసియున్నారు. ఇట్టి స్థితి నటిగా మూలదైవ సేవ భజించుట విజ్ఞులయిన భక్తుల కర్తవ్యమని గ్రహింపవలెను.

ఈ భావమునే ప్రకటించు మరొక సంకీర్తన మిదె—

గుండక్రియ

ఎన్నిటి కెన్నిటికని - యెక్కడఁ దగిలెదము
పన్నిందు దేవ - మాకుఁ జాలు. ॥పల్లవి॥

ముఖరమై మాఁకులకు - మొదలఁ బోసిన నీరు
శిఖలకుఁ దనువెక్కి - చిగిరించిన యట్టు,
నిఖిల ప్రయోజనాలు - నీమూలమే కాన
మఖపతి మీసేవే - మాకుఁ జాలు. ॥ఎన్ని॥

వరుసల నిన్నిటా - వన్నె బంగారమే
పరిపరివిధముల - పలుసొమ్ము లైనట్లు,
నిరతిఁ గర్మఫలాలు - నీమూలమే కాన
పరు గురుడవు నీవే - మాకుఁ జాలు. ॥ఎన్ని॥

వెలయ శ్రీవేంకటేశ - వివిధ జంతువులకు
అలవిలేని భూమే - యాధారమైనట్లు,
నెలవు దేవతలకు - నీ వేలిక గాన
మలసి నీ శరణమే - మాకుఁ జాలు.[1] ॥ఎన్ని॥

గీతలో శ్రీకృష్ణుడుగూడ ఇతర దేవతాసమర్చనములు తన సమర్చనయందే విధిపూర్వకముగా పర్యవసించుచున్న వని చెప్పెను.

యేఽప్యన్య దేవతా భక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః ।
తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్ ॥ [2]

---

1. అ. సం. . 11-1-45. 2. గీత. , 9-23.

## 47

అవ:- దైవము తప్ప మరెవ్వరును సంసారప్రవృత్తి కలపాటుపడిన జీవులను కాపాడలేరనుచున్నాడు—

బౌళి

గోనెలె కొత్తలు - కోడె లెప్పటివి
నానిన లోహము - నయ మయ్యీనా ? ॥పల్లవి॥

1 మున్నిటి జగమే - మున్నిటి లోకమె
యెన్నఁగఁ బుట్టుగు - లివె వేరు,
నన్ను నెవ్వరు - నతి బోధించిన
విన్న నేఁటనే - నే నెఱిఁగేనా. ॥గోనె॥

2. చిత్తము నాఁటిదె - చింతలు నాఁటివె
యిత్తల భోగము - లివె వేరు.
సత్తగు శాస్త్రము - చాయ చూపినా
కొత్తగ నేనిఁక - గుణి నయ్యేనా. ॥గోనె॥

3. జీవాంతరాత్ముఁడు - శ్రీ వేంకటేశుఁడె
యీవల భావన - లివె వేరు,
ధావతి కర్మము - తప్పఁదీసినా
దైవము గావక - తలఁగీనా. ॥గోనె॥

ప॥ లోహము = ఇనుము.

2. సత్తగు = సత్యమైన.

3. ధావతి = దుడుకైన.

పైన గప్పిన గోనెలే (శరీరములే) క్రొత్తవి గాని కోడెలు (ఆత్మలు) ప్రాతవే. ఇనుము నెంతగా నీట నానబెట్టినను దాని సహజస్వభావమైన గట్టితనమును వీడి మెత్తబడదు గదా !

ఈ జగత్తు అనాదికాలమునుండి ఉన్నదే. ఈ లోకము ముందునుండి ఉన్నదే కాని నిన్న, నేడు పుట్టినది కాదు. ఎప్పటి కప్పుడు మరణించి మరల జన్మించుచున్న ఈ పుట్టుకలు మాత్రమే క్రొత్తవై వేఱుగా నున్నవి. ఇట్టి నాకు ఎంత పెద్ద గురువు పెన్నిరీతుల తత్త్వము బోధించినను అనాదికాలమునుండి అజ్ఞుడనైయున్న నేను నిన్న, నేటిలో అనగా ఒకటి రెండు దినములలో పరమార్థస్వరూపము తెలిసికొని కడతేరగలనా!

పలు వాసనలకు నెలవైన ఈనా చిత్తము నేను జన్మించుట మొదలైన నాటి నుండి నన్ను వదలక వెంబడించుచునే యున్నది. అందు పొడచూపు పలురకము లైన చింతలు కూడ ఆనాటినుండి అందు నెలకొనియున్నవే. ఎప్పటి కప్పుడు అను భవమునకు వచ్చుచున్న ఈ భోగములుమాత్రమే కొంగ్రొత్తలై వేరు వేరుగా నున్నవి. సత్యస్వరూపమైన శాస్త్రము ఎంతగా త్రోవ చూపినను అజ్ఞానమున కలవాటుపడియున్న నేను ఇప్పుడు క్రొత్తగా గుణవంతుడను కాగలనా?

శ్రీ వేంకటేశ్వరుడే జీవులకెల్ల అంతర్యామిగా నున్నాడు. ఆయనగూడ పురాతనుడే కాని నవీనుడు కాడు. ఈ జీవుల అభిరుచులు మాత్రమే పలుతెరగుల నున్నవి గాని ఆయన సదా ఏకరూపుడుగానే యున్నాడు. జీవులను ముప్పుత్రిప్పల బెట్టు దుడుకైన కర్మము ఎంతగా వారిని తప్పుద్రోవల నడిపింప జూచినను దైవము దయదలచి వారిని కాపాడునేగాని వదలిపెట్టునా?

వి:- ఆత్మ నిత్యుడు. శరీరము లనిత్యములు. పైన గప్పుకొను వస్త్రములవంటి శరీరములు మాత్ర మెప్పటి కప్పుడు మారుచున్నవి గాని ఆత్మలో ఎట్టి మార్పును లేదు. ఈ విషయమునే అన్నమయ్య తన సహజదోరణిలో 'గోనెలె కొత్తలు కోడె లెప్పటివి' అని చెప్పినాడు.

మాయాప్రభావమునకు లోనైన జీవాత్ముడు దేహధారియై పలు తప్పుత్రోవలు త్రొక్కుచున్నాడు. అతని కాపద్ధతి అలవాటైపోయినది. ఎంత నానబెట్టినను ఇనుము మెత్తబడదు. అట్లే ఎంతగా బోధించినను అజ్ఞుడు సరియైన త్రోవకు రాడు.

"ముంచి ముంచి నీటిలోన మూల నావఁ బెట్టుకొన్నా
మించిన గొడ్డలి నేఁడు - మెత్తనయ్యీనా ?
పంచ మహాపాతకాల - బారిఁ బడ్డ చిత్తమిది
దంచి దంచి చెప్పినాను - తాఁకి వంగీనా ?"[1]

అని అన్నమయ్య మరొకచో ఈ భావమునే విడమరచి చెప్పినాడు.

మానవుని మంచి త్రోవలోనికి మరలించుటకు సద్గురువులు, సచ్ఛాస్త్రములు గావించు సదుపదేశము లవసరమై యున్నవి. కాని ఆ యుపదేశములు వినినంతనే మనస్సును నిగ్రహించుకొని సంస్కరింపబడు స్థితిలో మానవులు లేరు. ఇక వారి నెవరు కాపాడుదురు ? అన్నచో దైవమే దయదలచి కాపాడక తప్పదని అన్నమయ్య ప్రకటించుచున్నాడు.

అనగా దైవానుగ్రహ మున్నప్పుడే గురూపదేశము పైనను, శాస్త్రవాక్యముల మీదను విశ్వాసమేర్పడును. అప్పుడే మనుజులు సరియైన దారికివచ్చి సత్యస్వరూప మును గుర్తించి ముక్తులు కాగలరు. కాన మొదట దైవానుగ్రహమునకై సాధకులు ప్రయత్నింప వలెనని గ్రహింపనగును.

## 48

అవ:- భగవత్కృపలేనిచో సంసారపథమునుండి మోక్షమార్గమున కేగుట సాధ్యము కా దనుచున్నాడు—

### శుద్ధ వసంతం

ఏమి సేయువాఁడ - నివి విరస మొకటొకటి
తామసం బొకవంక - తత్వ మొకవంక. ॥పల్లవి॥

1. ఇతరోపాయ రా - హిత్యుండు గాఁడేని
అతిశయంబగు మోక్ష - మది యబ్బదు.
సతతోద్యోగాను - చరితుండు గాఁడేని
వితత సంసారసుఖ - విధి నడవదు. ॥ఏమి॥

---

1. అ. సం., 5-190.

2. వివిధేంద్రియ విషయ - విముఖుండు గాఁడేని
యివల వైష్ణవధర్మ - మిసి యబ్బదు.
అవిరళంబగు దే - హానుసరణము లేక
భవమాత్రమున సుకృత - ఫల మబ్బదు. ॥ఏమి॥

3. పరమానంద సం - పన్నుండు గాఁడేని
చరమవిజ్ఞాన ని - శ్చలుఁడు గాఁడు,
ఇరవయిన శ్రీ వేంక - టేశ ! యిటువలె నీవు
కరుణించకున్న దు - ర్గతులచే భ్రమసీ. ॥ఏమి॥

ప॥ తామసంబు = అజ్ఞానము; తత్త్వము = జ్ఞానము.

1. ఇతరోపాయ రాహిత్యుండు = అన్యములైన ఉపాయములు లేనివాడు, సతతోద్యోగానుచరితుండు = ఎల్లప్పుడు యత్నపరుడై యుండువాడు, వితత సంసార సుఖవిధి = విస్తృతమైన సంసారమునందలి సౌఖ్యము.

2. వివిధేంద్రియ విషయవిముఖుండు = నానావిధములైన ఇంద్రియసుఖముల నొల్లనివాడు; అవిరళంబు = ఎడతెరపి లేనిది; భవమాత్రమున = పుట్టుక మాత్రముచే.

3. చరమవిజ్ఞాన నిశ్చలుఁడు = కడపటిదైన శరణాగతియందు నిలుకడ గలవాడు.

నే నేమి చేయుదును ? ఇవి రెండును పరస్పరవిరుద్ధముగా నున్నవి. ఇందులో కటి తమోమయమైన అజ్ఞానదశ. మరొకటి తత్త్వప్రాప్తి కనువైన విజ్ఞానదశ. ప్రవృత్తి పరమైన మొదటిదశను వదలలేకున్నాను. అది వదలనిదే నివృత్తిపరమైన ఖము నా కబ్బుట లేదు.

'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని భగవంతుడు బోధించినట్లు సమస్తములైన తరోపాయములను వదలి శరణాగతి నొందనిచో మహోన్నతమైన మోక్షము లభిం దు. కాని ఎల్ల వేళల ఏదో ఒక ధర్మము నాచరింపనిచో విపులమైన ఈ సంసార యాత్ర ఒక అడుగైన ముందుకు సాగదు.

శ్రోత్రాదులగు ఇంద్రియములకు సంబంధించిన శబ్దస్పర్శాది విషయసుఖము లలో విరక్తి గలుగనివానికి పరమభాగవతు లాచరించు వైష్ణవధర్మము లభింపదు. కాని ఎడతెగని దేహధర్మములైన ఇంద్రియప్రవృత్తుల ననుసరింపనివానికి పుట్టినంత మాత్రమున పుణ్యఫలములైన ఐహికభోగము లనుభవమునకు రావు.

క్షణికమైన లౌకికానందమును వదలి శాశ్వతమైన ఆత్మానందము నార్జింపని వాడు అంతిమ విజ్ఞానమైన ప్రపత్తిలో కుదురుకొనలేడు. శాశ్వతుడవైన శ్రీ వేంక టేశ్వరా ! ఇట్టి సంకటస్థితిలోనున్న జీవునిపై నీవు దయ జూపకున్నచో వాడు దుర్గతులపాలై భ్రమించును.

వి:- అన్య చ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయః
తే ఉభే నానార్థే పురుషం సినీతః ।
తయోః శ్రేయ ఆదదానస్య సాధు
భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే ॥[1]

అని శ్రుతి వచనము. దీని తాత్పర్య మిది—

"శ్రేయస్సు, ప్రేయస్సు అనునవి రెండును పరస్పరము భిన్నములై భిన్న ప్రయోజనములు గల్గియున్నవి. అవి జీవుని బంధించుచున్నవి. వాటిలో శ్రేయస్సును చేపట్టినవాడు సద్గతి నొందును. ప్రేయస్సును వరించినవాడు దుర్గతి చెందును."

ఈ పాటలో 'తామసంబు' అను పదము ప్రేయోమార్గమును, 'తత్త్వము' అను పదము శ్రేయోమార్గమును నిర్దేశించుచున్నని. వివేకియైన వానికి శ్రేయోమార్గమే అనుసరింపదగినది. కాని అది అంత తేలికయైన పని గాదు. 'శ్రేయాంసి బహు విఘ్నాని' అన్నట్లు అది పెక్కు చిక్కులతోగూడిన దుర్గమమైన మార్గము. ప్రహ్లాద నారదాదులవలె సమస్తోపాయములను వీడి భగవంతు నొక్కనినే ఆశ్రయించినగాని శ్రేయము చేకూరదు. కాని సంసారి ఉపాయములనెల్ల వదలజాలడు. ఏదో ఒక ఉపాయము లేనిచో సంసారయాత్ర జరుగదు గదా

అట్లే విషయ పరాఙ్ముఖుడు కాకున్నచో భాగవతధర్మము పట్టువడదు. కాని దేహము కర్మఫలము. ఇంద్రియప్రవృత్తి దానికి సహజధర్మము. పుణ్యఫలములు విషయసుఖములద్వారముననే అనుభవమునకు రావలసియున్నవి. కావ దేహి దేహము ననుసరింపక జీవింపలేడు.

1. కఠ. , 2-1.

మరియు లౌకికానందమును వీడని వానికి బ్రహ్మానందము లభింపదు. కాని ప్రారబ్ధ కర్మబద్ధుడైన జీవునికి లౌకికానందమును వదలుట శక్యమగు పనిగాదు. ఇట్టి స్థితిలో అత డేమి చేయగలడు? అతనికి శ్రేయోమార్గము శ్రేష్ఠమైనదని తెలిసినను దాని నమసరింపలేని దుఃస్థితిలో నున్నాడు. ఇక వానికి భగవత్కృపయే శరణ్యము. అందుకై జీవులు పాటుపడవలె ననుట పరమార్థము.

అందువలననే భగవద్దయను దీనులపాలిటి కల్పలతగా, అపరాధమునకు ముఖ్యమైన ప్రాయశ్చిత్తముగా, సంసారసాగరమును తరింపజేయు నావగా వేదాంతదేశికులు కీర్తించిరి—

కృపణజన కల్పలతికాం
కృతాపరాధస్య నిష్క్రియా మాద్యామ్ ।
వృషగిరి నాథదయే ! త్వాం
విదన్తి సంసారతారిణీం విబుధాః ॥1

## 49

అవ:- ముందే జాగరూకులై కాంతా కనకాదులతోడి సంగమునకు లొంగక తప్పించుకొనవలెను గాని తరువాత చింతించి ప్రయోజనము లేదనుచున్నాడు—

### రామక్రియ

ముందే తొలఁగవలె – మోసపోక సంగ మెల్ల
కొందువఁబోయిన నీళ్లు – కట్టగట్ట వచ్చునా? ॥పల్లవి॥

1. అనలముఁ బొదగంటే – నండనున్న మిడుతలు
పనిలేకున్నా నందుఁ – బడకుండీనా?
వనిఁగి చెలులఁగంటే – పురుషుల చూపు లెల్లా
ననిశము నందు మీఁద – నంటఁబారకుండునా? ॥ముందే॥

2. గాలపుటెఱ్ఱలఁగంటే - కమ్మి నీటిలో మీలు
జాల నా పసలఁజిక్కి - చావకుండీనా ?
ఆలరి బంగారుగంటే - నందరి మనసులూను
పోలిమి నాపసఁజిక్కి - పుంగుడు గాకుండునా ? ॥ముందే॥

3. చేరి ముత్యపుఁజిప్పల - చినుకులు నినిచితే
మేర తేట ముత్యములై - మించకుండీనా ?
ధారుణి శ్రీ వేంకటేశు - దాసుల సంగతి నుంటే
పోరచి నేజీవులైనఁ - బుణ్యులు గాకుందురా ? ॥ముందే॥

ప॥ కందువన = నేర్పుతో.

1. పొనిఁగి = తేజము చెడి; అనిశము = ఎల్లప్పుడు.

2. కమ్మి = క్రమ్మి; ఆలరి = దుశ్శీలుడు; పుంగుడుగాకుండునా = దిగజారిపోకుం డునా ? (బుంగుడు = పుంగుడు)

3. పోరచి = కానుక. ఇచట 'ఘనతతో' అను లక్ష్యార్థమున 'పోరచిన' అని ప్రయో గించినట్లున్నది.

ముముక్షువులైనవారు మోసమునకు గురిగాక జాగరూకులై ముందే విషయసుఖ ముల తోడి సంగమునుండి తొలగవలెను. నీళ్లు పోయిన తర్వాత నేర్పుతో కట్టగట్టి లాభ మేమి?

విప్పును గన్నచో చెంతనున్న మిడుతలు పనిలేకున్నను అందు పడకుండ ఉండలేవు. అట్లే కాంతల గన్న పురుషులచూపు లెల్లవేళల వారిపై ప్రసరింప కుండ ఉండలేవు.

గాలములకు దగిల్చిన ఎఱ్ఱలను గాంచినచో నీటిలోని చేపలు వాటిపై మూగి ఆ రుచికి జిక్కి వేదనతో చావకుండ పోవు. అట్లే వలపించి చిక్కులబెట్టు పాడు బంగారును గన్నచో ఎల్లవారి చిత్తములను దాని మిసమిసలకు వశమై దిగజారి పోకుండ ఉండజాలవు.

ముత్యపు చిప్పలలో చినుకులు నింపినచో అవి తేటము త్తెములై ప్రకాశింపక మానవు. అట్లే శ్రీ వేంకటేశ్వర దాసులతోడి సాంగత్యము గల్గియున్నచో ఎట్టివారైనను ఘనతతో పుణ్యాత్ములు కాకపోరు.

వి:- గతజల సేతుబంధనము వ్యర్థము. అట్లే కాంతా కనకాదులతోడి సాంగత్యమునకు వశమై అందుచే గల్గు దుష్ఫల మనుభవమునకు వచ్చిన పిమ్మట విచారించి లాభము లేదు. కాన విజ్ఞు లయినవారు ముందే మెలకువ గల్గి భోగ్యవస్తువులతోడి సంగమును తొలగించుకొనవలెనని ఈ సంకీర్తనము బోధించుచున్నది.

విషయధ్యానమువలన సంగము, సంగమువలన కామము, కామమువలన క్రోధము, క్రోధమువలన సమ్మోహము, సమ్మోహమువలన స్మృతి విభ్రమము, స్మృతిభ్రంశమువలన బుద్ధినాశము సంభవింపగా జీవుడు తుదకు అధోగతిపా లగు నని భగవద్గీత ప్రతిపాదించుచున్నది.

ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తేషూపజాయతే ।
సంగా త్సంజాయతే కామః కామా త్క్రోధోఽభిజాయతే ॥
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥[1]

మఱియు స్త్రీ నిప్పుకణము వంటిది. పురుషుడు నేతికుండవంటివాడు. నేయి అగ్ని స్పర్శ లేనంతవరకు గట్టిగా నుండును. ఆ స్పర్శ కల్గినంతనే కరగిపోవును.

అంగారసదృశా నారీ ఘృతకుంభసమః పుమాన్
అస్పర్శా ద్దృఢతా మేతి తత్సంపర్కా ద్విలీయతే ॥[2]

కావున నేయి కరగకుండ నుండవలెనన్న నిప్పునెంతకు దానిని గొనిపోకుండుటే ముఖ్యకర్తవ్యము. పురుషులు స్త్రీలోలురు కాకుండ నుండుటకు స్త్రీలతో సాంగత్యము లేకుండ జేసికొనుటే ముఖ్యోపాయము. అందువలననే—

పరసతుల గోష్ఠి నుండిన
పురుషుడు గాంగేయుడైన భువి నిందవడున్.[3]

అని సుమతి శతకకారుడు నుడివెను.

1. గీత., 2-62, 63. 2. బ్రహ్మ. P. -26. 3. సు. శ., 74.

కాంతలు యువకులకు మాత్రమే కొంతకాలము మోహకారిణు లగుదురు. కనక మట్లుగాదు. అది స్త్రీ బాలవృద్ధ షండాదుల కెల్లరకు ఎల్లవేళల మోహకమై యున్నది.

స్త్రీరూపం మోహకం పుంసో యూన ఏవ భవేత్క్షణమ్ ।
కనకం స్త్రీ బాలవృద్ధ షండానా మపి సర్వదా ॥[1]

కావున కాంతా కనకముల పొంత బోక భగవద్భక్తులతో చెలిమి గలిగి శ్రేయము నొందవలెను.

## 50

అవ:- గీతలోని భగవద్వచనము నుదాహరించుచు ముముక్షువులకు శ్రీ వేంకటేశ్వరు డొక్కడే సేవింపదగినవా డనుచున్నాడు—

### బౌళి రామక్రియ

ఇదివో శ్రుతిమూల - మెదుటనే వున్నది
సదరముగా హరి - చాటీ నదివో ! ॥పల్లవి॥

1. ఎనసి పుణ్యము సేసి - యేలోక మెక్కిన
మనికై భూమియందు - మగుడఁబొడముచే,
పొనిగి "యా బ్రహ్మ - భువనా ల్లోకాః
పునరావృత్తి" యనెఁ - బురుషోత్తముఁడు. ॥ఇది॥

2. తటుకున శ్రీహరి - తన్నునే కొలిచిన
వటుగతితో మోక్ష - పదము నులభ మనె,
ఘటన "మాముపేత్యతు - కౌంతేయ మహిని
నటనఁ బునర్జన్మ - న విద్యతే". ॥ఇది॥

---

1. శా. ప., 41 92.

3. ఇన్నిటా శ్రీ వేంకటేశ్వరు సేవె
వన్నినగతి నిహ - పరసాధన మదే.
మన్నించి యాతఁడే - "మన్మనా భవ"యని
అన్నిటా నందరి - కానతిచ్చెఁగాన. ॥ఇది॥

ప॥ శ్రుతిమూలము = వేదములకు మూలము; సదరముగా = సమగ్రముగా; స్పష్టముగా.

జనులారా ! వేదములకెల్ల మూలకారణమైన పరబ్రహ్మ మిదిగో ఎట్టయెదుటనే కలదు. శ్రీహరి స్వస్వరూపమును అదిగో స్పష్టముగా ప్రకటించుచున్నాడు.

పుణ్యకర్మ లొనర్చి ఎట్టి ఉత్తమలోకమునకు బోయినను ఆ పుణ్యము వ్యయమైనంతనే మఱల భూమిపై పుట్టక తప్పదు. పురుషోత్తముడైన కృష్ణుడు - "ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినో ఒర్జున ! = బ్రహ్మలోకమువఱకు గల లోకము లన్నియు మఱల జన్మమును గల్గించునవే" యని అర్జునునితో చెప్పెను.

మఱియు "మాముపేత్య తు కౌన్తేయ । పునర్జన్మ న విద్యతే"- కౌంతేయా ! నన్ను పొందినవానికి పునర్జన్మము లేదు" అని చెప్పి తన్ను సేవించినవానికి మోక్షము సులభమని తెలిపియున్నాడు.

కావున ఎన్నివిధముల చూచినను శ్రీ వేంకటేశ్వరుని సేవయే చేయదగినది. ఇహమునను, పరమునను ఉత్తమగతికి సాధన మది యొక్కటే. ఆ భగవంతుడే జీవులపై కృపగలిగి "మన్మనా భవ" - నాయందే మనస్సు గలవాడవై యుండుము" అని అందరికి ఆనతిచ్చినాడు గదా !

వి:- "శ్రుతి స్మృతీ మమైవాజ్ఞా" — 1
శ్రుతి స్మృతులు నా ఆజ్ఞయే అని భగవద్వచనము. మరియు—

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై,2

అను శ్రుతి ననుసరించి బ్రహ్మను సృష్టించి అతని చెంతకు వేదములను పంపినవాడు శ్రీ హరియే అనుట స్పష్టము. కాన శ్రీమన్నారాయణుడే వేదములకు మూలమైనవాడు.

1. వి. ధ. , 76-31. 2. శ్వేతాశ్వ. . 6-18.

ఆ భగవంతుడే గీతలో—

ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినో ఒర్జున ।
మా ముపేత్య తు కౌంతేయ ! పునర్జన్మ న విద్యతే ॥1

అని చెప్పెను. అనగా "భూలోకమునుండి బ్రహ్మలోకమువఱకు గల లోకములన్నియు పునరావృత్తి గలవి. అర్జునా ! నన్ను చేరినవారికి మాత్రము పునర్జన్మ లేదు" అని భావము.

భోగేచ్ఛతో యజ్ఞాదు లొనర్చి పుణ్యము నార్జించినవారు స్వర్గమున కేగుదురు. అచట దివ్యభోగముల ననుభవింతురు. పుణ్యము క్షీణింపగనే మఱల భూలోకమున జన్మింతురు. ఈ విధముగా కామ్య కర్మపరులు పై లోకములకు, క్రిందిలోకములకు రాకపోకలు గావించుచుందురు. ఈ విషయమునే గీత ఇట్లు చెప్పినది—

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే ॥2

అట్లుకాక అనన్యచేతస్కుడై సతతము శ్రీహరినే స్మరించుచు నిత్యయుక్తుడై యుండు యోగికి ఆ దేవుడు సులభుడై యుండును. అట్టి మహాత్ములు ఆ భగవంతుని పొందినవారై మరల దుఃఖనిలయమైన పునర్జన్మను పొందరు. ఈ విషయమునే శ్రీ కృష్ణు డిట్లు నుడివెను.

అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః ॥

1 గీత 8.16 2 గీత 9.20, 21.

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥1

మరియు గీత చివర భగవంతుడు సర్వ గుహ్యతమమైన పరమ వచనము విల్లు మడివెను.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥2

దీనిభావ మిది—

అర్జునా ! నాయందు చిత్తము నిల్పుము. నా భక్తుడ వగుము. నన్ను పూజింపుము. నాకు నమస్కరింపుము. నీవు నన్నే చేరగలవు. ప్రీతిపాత్రుడవు గాన నీకు ప్రతినజేసి చెప్పుచున్నాను. సర్వధర్మములను వీడి నన్నొకనినే శరణు పొందుము. నేను నిన్ను సర్వపాపములనుండి తొలగింపగలను. దుఃఖింపకుము.

కాన మోక్షాపేక్ష గలవారందరు శ్రీ వేంకటేశ్వరునే సేవించి ముక్తి నొందవలె నని అన్నమయ్య ప్రబోధించినాడు.

## 51

అవః- తన్ను తాను సంస్కరించుకొనుట కుపయోగపడని చదువులు నిరుపయోగము లనుచున్నాడు—

### శ్రీరాగం

చదివితిఁ దొల్లి కొంత - చదివే నింకాఁ గొంత
యెదిరి నన్నెఱఁగను - యెంతైన నయ్యో ! ॥పల్లవి॥

1. ఒరుల దూషింతుఁగాని - వొకమారైన నా
దురితకర్మములను - దూషించను,
పరుల నవ్వుదుఁగాని - పలు యోనికూపముల
నరకపు నామేను - నవ్వుకోను. ॥చది॥

1. గీత., 8-14, 15. 2. గీత., 18-65, 66.

2. లోకులఁ గోపింతుఁగాని - లోని కామాదు లనెటి
కాకరి శత్రులమీఁదఁ - గడుఁగోపించ,
ఆకడబుద్ధులు చెప్పే - అన్యుల బోధింతుఁగాని
తేకువ నాలోని హరిఁ - దెలుసుకోలేను. ॥చది॥

3. ఇతరుల దుర్గుణము - లెంచి యెంచి రోతుఁగాని
మతిలో నా యాసలు - మానలేను,
గతిగా శ్రీ వేంకటేశుఁ - గని బ్రదికితిఁగాని
తతి నిన్నాళ్ళదాఁకా - దలపోయలేను. ॥చది॥

2. కాకరి = మాయావి; తేకువ = వివేకము.

పూర్వము కొంతవరకు చదివితిని. ఇంకను మరికొంత చదువుచునేయున్నాను, చదువగలను గూడ. ఎంత చదివినను ఎదుటివాని స్వరూపస్వభావములను గురించిగాని, నన్నుగురించి గాని ఇసుమంతయు తెలియజాలకున్నాను. అయ్యయ్యో! ఈ రీతిగా నాబ్రదుకు వ్యర్థమైపోయినది.

ఇతరులలోని తప్పులనెంచి వారిని పలుమారులు నిందింతును గాని ఒక్కసారియైన నే నొనర్చు పాపకర్మములను పరిశీలించుకొని నన్ను నేను నిందించుకొనను. ఇతరులు పడు పాట్లు చూచి నవ్వుదును గాని వివిధయోని కూపములబడి నరకయాతన ననుభవించుచున్న నా శరీరమును చూచి నవ్వుకొనను.

ఇతర జనులపై చీటికి మాటికి కోపింతునే గాని నాకు బద్ధశత్రువులై నాలోనే దాగియున్న మాయావులైన కామక్రోధాదులపై కోపము జూపను. ఉపదేశము లొనర్చి పరులను ప్రబోధింతును గాని నాలోనే అంతర్యామియై యున్న శ్రీహరిని వివేకము నుపయోగించి తెలిసికొనజాలకున్నాను.

మాటికి మాటికి ఒరుల దుర్గుణములు తలచి రోతపడుదును గాని నా చిత్తములో నెలకొనియున్న ఆశలు వదలలేకున్నాను. చివరికి శ్రీ వేంకటేశ్వరుని దర్శించి ఆయన అనుగ్రహముచే బ్రదికితిని గాని ఇంతవరకు ఆ దేవదేవుని మహిమను గుర్తింపలేనైతిని.

వి:- 'ఎంత చదువు చదివి ఎన్ని విన్ననుగాని

హీనుఁ డవగుణంబు మానలేడు.'[1]

అని వేమన్న వచించెను. తత్త్వజ్ఞుడు గానివాని చదువు భుక్తికే గాని ముక్తికి పనికి రాదు. సదసద్వివేకము నొసంగజాలని చదువు నిష్ప్రయోజనము.

ఇతరులను దూషించుట, పరిహసించుట, కోపించుట, వారి కుపదేశము లొన ర్చుట, వారి తప్పులెన్నుట - అనునవి సాధారణముగా వివేకరహితులైన విద్యావంతు లొనర్చు తప్పిదములు. వీటినే అన్నమయ్య ఈ పాటలో ఎత్తి చూపి ఆత్మసంస్క-రణమునకు, ఆత్మోన్నతికి అవసరమైన పద్ధతులను బోధించినాడు.

తమ తప్పులు తాము పరిశీలించుకొనుట, తమ జననమరణాది దురవస్థలకు తామే నవ్వుకొనుట, అరిషడ్వర్గముపై కోపించుట, అంతరాత్మలోని హరి నెరుగుట, ఆశలు వీడుట అనునవి ఆచరణీయములైన ధర్మములు. వీటిని పాటించినప్పుడే చదువు సఫల మగును. పాటించుట సాధ్యము కాకున్నను భగవంతుని శరణాగతి నొందినవాడు ధన్యాత్ముడై సద్గతి నొందగలడు.

## 52

అవ:- లౌకికవిషయములపై ఆసక్తి వీడి పరమార్థమైన భగవంతుని కృపకై పాటుపడవలె ననుచున్నాడు—

లలిత

అతని భజియించరో - ఆతుమలాల శ్రీ

పతి యితని కరుణే - ఫల మింతే కావి. ॥పల్లవి॥

1. సంగమే భంగముసుండి - సకల విరక్తులాల

వెంగలి విషయములే - విషముసుండి,

అంగపు బంధువులెల్ల - అంటు బంధములసుండి

సంగతి హరి యొకఁడే - పత మింతే కావి. ॥అత॥

---

1. వేమ., 753.

2. మోహమే దాహముసుండి - మోక్షోపాయకులాల
సాహస సంసారమే ని - స్సారముసుండి,
దేహము గొన్నాళ్ళకు సం - దేహమై తోఁచుసుండి
శ్రీహరి సేవొక్కటే వ - చ్చినదింతే కాని. ॥అత॥

3. కోపమే తాపముసుండి - కోరని సాత్త్వికులాల
రూపులేని భోగమెల్ల - ఋణము సుండి,
కైపుసేసి యిన్నిటాను - గడచి శ్రీ వేంకటేశు
నోపి శరణని మనే - దొక్కటేసుండి ! ॥అత॥

ప॥ ఆతుమలాల = జీవాత్మలారా !

1. సతము = శాశ్వతము.
2. మోక్షోపాయకులాల = మోక్షసాధనపరులారా .
3. కైపుసేసి = విరక్తిగొని.

జీవాత్మలారా ! ఐహికవిషయములపై భ్రాంతివీడి శ్రీమన్నారాయణు నొక్క-వినే సేవింపుడు. అతడే లక్ష్మీపతి. అతని కృపయే మనుజుడై పుట్టినందుకు సాధించి తీరవలసిన ఫలము. జీవితమునకు మరొక ప్రయోజనము లేనే లేదు.

అంతట విరక్తిగల జిజ్ఞాసువులారా ! భోగ్యపదార్థములతోడి సంగమే కడకు మీకు భంగము గలిగించునది. వ్యర్థములైన ఈ విషయసుఖములే మిమ్ము హతమార్చు విషములు. శరీరసంబంధముగల బంధువులెల్లరు మిమ్ము పైకొని బంధించు బంధములే. ఆలోచింపగా శ్రీహరి యొక్కడే మీకు నిత్యసుఖ మొసంగగల శాశ్వత మూర్తి. ఇంకెవరును మి మ్ముద్ధరించువారు లేరు.

ముముక్షువులారా ! కాంతా కనకాదులపై మీరు పెంచుకొన్న మోహమే మిమ్ము దహించివేయు దాహము (తీరని దప్పి). అత్రముతోగూడిన మీ సంసారమే సారహీనమైనది. మమకారముతో ముచ్చటపడి మీరు పెంచుకొన్న దేహము కొన్నాళ్ళకు సందేహమునకు నెలవై నిలుకడలేని దగుచున్నది. మీరు భక్తితో నొనర్చు శ్రీహరిసేవ ఒక్కటే మీవెంటవచ్చి మిమ్ము సుఖింపజేయునది గాని మరేదియు సుఖకరము గాదు.

కోరిక ఉడిగిన సాత్త్వికులారా ! కోపమే నిజముగా తాపము గలిగించునది. శాశ్వతము గాకపోవుటచే రూపులేనివైన భోగములెల్ల నానాటికి వృద్ధియై మిమ్ము శ్రమపెట్టు ఋణములే. కాన విషయ విరక్తిగల్గి పట్టుదలతో శ్రీ వేంకటేశ్వరుని శరణొందుడు. అది యొక్కటే మీరు సుఖించుటకు తగినమార్గము సుండీ !

వి:- వివేకముగల మానవజన్మ లభించినందుకు పరమప్రాప్యమైన భగవత్కృపను సాధించుటే జీవుల కర్తవ్యమై యున్నది. విరక్తులకు లౌకికవిషయములతో నెట్టి సంగమును తగదు. క్షణిక సుఖము నాశించి విషయముల నపేక్షించువాడు పరమార్థమునకు దూరమై భంగపడును. విరక్తిమార్గమున కాలిడిన ముముక్షువులు గూడ ప్రమాదవశమున విషయసుఖములకు వశులై పతన మొందుట కలదు. అట్టివారిని దృష్టిలో నుంచుకొనియే హెచ్చరికగా అన్నమయ్య ఈ పాట పాడినాడు. 'సకలవిరక్తులాల !', 'మోక్షోపాయకులాల !', 'కోరని సాత్త్వికులాల !' అన్న సంబోధనలలోని ఆంతర్య మిదే.

విషయము లిట విషముతో పోల్చబడినవి. దోషదృష్టితో జూచినచో కృష్ణసర్ప విషముకంటె విషయమే తీవ్రమైనదనియు, విషము తిన్నవానినే చంపును గాని విషయము కంటితో కన్నవానినిగూడ చంపువనియు శంకరభగవత్పాదుల నుడివిరి—

> దోషేణ తీవ్రో విషయః కృష్ణసర్ప విషాదపి।
> విషం నిహన్తి భోక్తారం ద్రష్టారం చక్షుషా ఒప్యయమ్ ॥[1]

మరియు జీవాత్మన కంతరాత్మయైన పరమాత్మయే అన్నివిధముల ఆశ్రయింపదగిన బంధువు. తక్కిన దేహసంబంధులైన బంధువు లందరు ఎప్పటి కప్పుడు వీడిపోవువారే గాని శాశ్వతమైనవారు గారు. పైగా వారు జీవుని సంసారముతో బంధింతురు. గాన బంధములే యగుచున్నారు.

ముముక్షువునకు మోహము తగదు. మోహావిష్టునకు తత్త్వము గోచరింపదు. మోహపరవశుడు విస్తారమైన సంసారమును నపారముని భ్రమింపును. అందుచే వాడు వివిధక్లేశములకు గురియగుచున్నాడు. దేహము క్షణభంగురమైనది గాన మోక్షాపేక్షగలవాడు దేహముపై మోహమును విడవాడవలెను.

1. వివే., 79.

కోపాదిదుర్గుణములు తాపహేతువులై జీవునికి క్లేశము కల్గించుచున్నవి. వివేకవంతుడు వాటిని దరి జేరనీయడు. మరియు భోగములు క్షణికములు గాన నిజముగా వాటికి అస్తిత్వము లేదు. అనుభవించుకొలది అవి జీవునికి తమపై ఆసక్తిని పెంపొందించుచునే యుండును. కాన విషయసంగమును, బంధుప్రీతిని, సంసారమోహమును, దేహభ్రాంతిని, కామక్రోధాదులను వదలవలెను. శాశ్వతుడైన శ్రీ హరినే శరణొందవలెను. అట్లొనర్చినవాడు హరికృపకు పాత్రుడై ముక్తినొందును.

## 53

అవ:- అర్థ కామములతోడి సంగము వీడినంతనే జీవుడు పవిత్రుడగు నను చున్నాడు—

### భవుళి

పురుషుఁడే యధముఁడు - పొంచి యెందుఁ దగులక
పురుషోత్తమునికంటె - పుణ్యుఁడవు నపుడే. ॥పల్లవి॥

1. పురుషజంతువులెల్ల - పొంచి యాఁడు జంతువుల
తరవాయి గొనివెంటఁ - దగులుగాని,
ధరనాఁడు జంతువులు - తగ పురుషజంతువుల
యిరవు వెదకఁబోవు - యిది యెట్టి మాయో. ॥పురు॥

2. సారెకు నర్థమునకు - జనులెల్ల దాసులై
కోరి వెదకుచుఁ దిరు - గుదురు గాని,
చేరువ యర్థములెల్ల - జీవులకు దాసులై
యీ రీతి వెదకవు - యిది యెట్టి మాయో. ॥పురు॥

3. లోకము నడవడిది - లోనుగాక యిందుకెల్లా
యేకచిత్తమున నుండే - యెక్కుడుగాని,
దాకొని శ్రీ వేంకటేశు - దాసుఁడైన వానికిని
యేకముగఁ బంపు వేసు - నేమి మాయో కాని. ॥పురు॥

1. తరవాయి = వరుస; ఇరవు = స్థానము.

2. దాకొని = మఱుగుపడి.

అర్థ కామములయందు తగులు వడిన పురుషుడే అధముడు. జాగరూకుడై ఎందును తగులువడక యుండెనేని అప్పుడే అతడు పురుషోత్తమునికంటె పవిత్రుడగును.

ఇలలో మగ జంతువులన్నియు పొంచికొనియుండి వరుసగా ఆడుజంతువులను వెంబడించుచున్నవి. కాని ఆడుజంతువు లావిధముగా పురుషజంతువుల నెలవు వెదకుచు వెంబడుట లేదు. ఇది యెట్టి మాయయో అర్థమగుట లేదు.

సకలజనులు మాటిమాటికి అర్థమునకు దాసులై దానినే వెదకుచు తిరుగుచుందురు. కాని జీవులకు దాసులై అర్థములు వారి నారీతి వెదకుటలేదు. ఇది యెట్టి మాయయో గోచరము గాకున్నది.

అర్థకామముల విషయములో లోకముయొక్క నడవడి ఈ రీతిగా నున్నది. ఈ ప్రవృత్తికి లొంగక మనస్సును నిగ్రహించి భగవదేకతత్పరుడై యుండుటే గొప్పతనము. అట్లు భోగభాగ్యములపట్ల విరక్తుడై శ్రీ వేంకటేశ్వరుని దాసుడైన భక్తునకు ఈ మాయ లొంగిపోయి చెప్పినపని చేయుచున్నది. ఇది యెంత విచిత్రమైన మాయయో!

వి:- ధర్మార్థ కామమోక్షము లనెడు చతుర్విధపురుషార్థములలో సాధారణముగా జనులెల్లరు అర్థకామములయందే ఎక్కువ మక్కువ చూపుదురు. వాటిని సాధించు ప్రయత్నములో ధర్మాధర్మములను విచారింపక అవివేకులై ప్రవర్తింతురు. ఈ విధముగా అర్థ కామాసక్తులు చివరి కధోగతి పాలగుచున్నారు.

భోగభాగ్యములపట్ల విరక్తులైనవారు దుర్వ్యావృత్తులు లేక సదా ఏకమనస్కులై భగవంతునే భజింతురు. కావుననే అసంగుడైన పురుషుడు పురుషోత్తమునికంటె పవిత్రుడగునని అన్నమయ్య చెప్పినాడు. భాగవతుల పవిత్రతాతిశయమును ప్రశంసించుటకే అట్లు చెప్పబడినది.

స్త్రీ పురుషు లిరువురిలోను కామ ప్రవృత్తియున్నను స్త్రీలకున్న నిగ్రహము పురుషుల కుండదు. భారతమునందలి ఈ పద్య మిట స్మరణీయము—

మగ లడఁకువ నుండక తమ
తగులమ పాటింతు రెట్టి తగులం బైనన్
మగువల యెడన యడంగుం
దగవు విడిచి యడిచిపడరు ధైర్యము పేర్మిన్.1

మాయాప్రభావముచేతనే జను లీవిధముగా అర్థకామములకు లొంగిపోవు చున్నారు. ఆ మాయాస్వరూప మెవ్వరికిని గోచరమగునది కాదని తెలుపుటకే 'ఇది యెట్టి మాయో' అని ఆశ్చర్యము ప్రకటింపబడినది. అందరిని మాయ తనవశములో నుంచుకొనును కాన భగవద్దాసునకు మాత్రము మాయ తానే వశమైపోవును. కాన మాయను గెల్చుటకు భగవద్దాస్యమే తగిన సాధనమని తాత్పర్యము.

54

అవ:- భగవత్ప్రాప్తికై యత్నించుచుండే జీవునకు ముఖ్యకర్తవ్య మనుచున్నాడు.

ధన్నాసి.

నాకుఁ గలపని యిదె - నారాయణుఁడ నీవు
శ్రీకాంతుఁడవు నాకు - సిద్ధించుకొరకు. ॥పల్లవి॥

1 జలధివంటిది సుమీ - చంచలపు నా మనసు
కలవింద్రియములనెటి - జలచరములు.
వొలసి భక్తెనెటి - వోడ యెక్కితి నేను
జలశాయి! నీవనెటి - సరకు దెచ్చుటకు. ॥నాకు॥

2. కొండవంటిది సుమీ - కొనకెక్కు నా మనసు
వుండుఁ గామాదులను - వురు మృగములు,
వుండి నీ శరణమను - వూఁతగొని యెక్కితివి
కొండలప్ప! నీ వనెటి - కొన ఫలముకొరకు ॥నాకు॥

3. టీ(తీ?)వులను ధరణివం - టిది సుమీ నామనసు
ౕవె. శ్రీ వేంకటేశ! - నిక్షేపము.
వావాత నీ వనెటి - వసి దవ్వకై కొంటి
భూవిభుడ నీ వనెటి - పురుషార్థము. ॥నాకు॥

1. భార. విరా., 2-261.

1. ఒలసి = పనిపడి.

2. ఉరుమృగములు = పెద్ద మృగములు.

3. శ్రీపులను = వైభవములయందు; నిక్షేపము = నిధి: వావాతక = వాచికమైన కైంకర్యముతో; వసి = కూచిగా చెక్కిన కొయ్య.

నారాయణా ! నీవు లక్ష్మీ కాంతుడవు. ఎట్లయినను నిన్ను సాధించి నా వానినిగా జేసికొనుటే నాకు గల ముఖ్యమైన పని.

సాగరజలములలో శయనించిన ఓ పరమాత్మా ! రికించుకైన నిలుకడలేని నా చిత్తము సముద్రమువంటిది. అందు శ్రోత్రాదులైన ఇంద్రియము లనెడు విపత్కరమైన పెక్కు జల జంతువులు కలవు. పరమ ప్రాప్యుడవైన 'నీవు' అనెడి సరకు తెచ్చుటకై నేను 'నీ భక్తి' యను పడవనెక్కి పయనించితిని.

ఏడుకొండల స్వామీ ! అడ్డమాక లేక దిగ్దిగంతముల కెగబ్రాకు నా మనస్సు కొండవంటిది. అందు కామ క్రోధాదులనెడు పెద్దపెద్ద క్రూరమృగములు గలవు. 'నీవు' అనెడి అంతిమఫలమును సంపాదించుటకై 'నీ శరణము'నే ఊతగా గొని నేను కొండ యెక్కితిని.

పలు తలపులకు నెలవై విశాలమైన నా చిత్తము భూమివంటిది. శ్రీ వేంకటేశ్వరా ! అందు నిగూఢమైన నిధివి నీవే. భూవల్లభా : నీ నామసంకీర్తన మూవమైన వాచిక కైంకర్యముచే నిన్నే త్రవ్వుటకు సాధనమైన కొయ్యగా గ్రహించి త్రవ్వి త్రవ్వి కడకు 'నీవు' అనెడి పురుషార్థమును గైకొని నేను ధన్యుడనైతిని.

వి:- మనుజునకు భగవత్ప్రాప్తియే ముఖ్యలక్ష్యము. అందుకు సాధనము భక్తి ప్రపత్తులతోగూడిన భగవన్నామస్మరణమే. దానిని చేపట్టి పరమ పురుషార్థమైన భగవత్ప్రాప్తి నొందవలెనని ఈ సంకీర్తనము బోధించుచున్నది.

మనస్సు సముద్రముతోను, పర్వతముతోను, భూమితోను ఇచ్చట క్రమముగా పోల్చబడినది. సముద్రము అలలతో సదా చలించుచుండును. అట్లే మనస్సు పలు తలపులతో నిలుకడలేని దగుచున్నది. సాగరములో తిమి తిమింగిలాదులైన ఘోర జల జంతువులు గలవు. మనస్సులోగూడ శ్రోత్రాదులైన ఇంద్రియము లున్నవి. ఆ జల జంతువులవలె ఈ యింద్రియములుగూడ జీవులకు ఉపద్రవకరములే. సముద్రమున పయనించువారు పడవనెక్కి జల జంతువులనుండి తప్పించుకొనుదురు. జిజ్ఞాసువు

భక్తి నాశ్రయించి ఇంద్రియములనుండి తప్పించుకొనును. పడవలో పయనించు వ్యాపారి సరకు లార్జించునట్లు భక్తి నాశ్రయించి సాధకుడు భగవంతుని పొందును.

మనస్సు బహుదూరము వ్యాపించుస్వభావము కలది గాన ఎత్తైన కొండతో పోల్చబడినది. ఫలార్థియగువాడు కొండకొన కెక్కునట్లు భగవంతుని పొందగోరు వాడు చింతారహితమైన అమనస్కస్థితి నొందవలెను. కొండలో సింహ వ్యాఘ్రాది క్రూరమృగము లుండును. అట్లే మనస్సులో కామ క్రోధాద్యరిషడ్వర్గ ముసున్నది. కావుననే ఆ కొండలో అంతిమఫలమైన భగవంతుని పొందగోరువాడు ఆయన శరణ మునే ఊతగా గొని యెక్కవలెను.

లెక్కలేని తలంపులనెడు వైభవముల కాశ్రయమైనది గాన చిత్తము నానా పదార్థములకు నెలవైన భూమితో పోల్చబడినది. భూమిలోపల నిధి నిగూఢముగా నున్నట్లే జీవుని చిత్తములో దేవు డంతర్యామిగా నున్నాడు. నిధిని ఖననసాధనము లతో కష్టపడి త్రవ్వి పైకి దీయవలెను. అట్లే భగవన్నామ స్మరణాది పద్ధతులచేతనే భగవత్ప్రాప్తి యనెడు పురుషార్థమును సాధింపవలెను.

ఇక్కడ మూడు చరణములలోను 'జలశాయి!, కొండలప్ప!, భూవిభుడ !' అను సంబోధనములు సాభిప్రాయములు. భగవంతుడు 'జలశాయి' గావుననే చవ స్సనెడు జలధిలో పయనించువానికి ఆశ్రయింపదగిన వాడగుచున్నాడు. మరియు వానిని తరింపజేయుచున్నాడు.

అతడు 'కొండలప్ప' కావుననే మనస్సనెడు కొండ నెక్కువానికి సాధింపదగిన చివరిఫల మగుచున్నాడు. మరియు కొండ నెక్కుటలో వానికి సాయముగూడ చేయు చున్నాడు.

అతడు 'భూవిభుడు' కావుననే మనస్సనెడు భూమిలోనున్న నిధి యగు చున్నాడు. మరియు భూమిని త్రవ్వువానికి సాధన సంపత్తి నొసగి యుపకరించు చున్నాడు. తన్ను సాధింపబూనినవానికి తన్నే (తన నామస్మరణనే) సాధనముగా గూడ నొసంగుట ఇందలి మరొక విశేషము. ఈ పాటలో నిర్వహింపబడిన సాంగరూప రూపణము అన్నమయ్య కల్పనాశక్తికి చక్కని నిదర్శనము.

౯౯

అవ:- ప్రవృత్తిమార్గమున నుండు సంసారులు హరినామస్మరణచే నివృత్తి మార్గఫలము నందగల రనుచున్నాడు—

## కాంభోది

అంతటనె వచ్చి కాచు - నాపద్బంధుఁడు హరి
వంతుకు వానికి నతని - వాఁడనుటే చాలు. ॥పల్లవి॥

1. బంతిఁగట్టి నురిపేటి - పసురము లెడనెడఁ
బొంతి నొక్కొక్క[1]గవుక - పుచ్చుకొన్నట్లు,
చెంతల సంసారము సేయు - నెఱుఁడందులోనె
కొంత గొంత హరినాత్మఁ - గొలుచుటే చాలు. ॥అంత॥

2. వరుసఁజేఁదు దినే - వాడు యెడనెడఁగొంత
[2]సరవితోడుతఁ దీపు - చవిగొన్నట్టు
[2]దురిత విధులు వేసి - దుఃఖించు మానవుఁడు
తరువాత హరిపేరు - దలఁచుటే చాలు. ॥అంత॥

3 కడుఁబేదైనవాఁడు - కాల కర్మవశమున
అడుగులోనె [3]నిధాన - మటుగన్నట్టు,
[3]ఎడసి శ్రీ వేంకటేశు - నెరఁగక గురునాజ్ఞ
[3]పొడగన్నవాని భక్తి - పొడముటే చాలు. ॥అంత॥

1. కవుక = కబళము.

2. సరవితోడుత = క్రమముగా. దురితవిధులు = పాపకృత్యములు; సహజ సిద్ధములైన నిందితకర్మములు.

3. నిధానము = నిధి; ఎడసి = తొలగి; పొడగన్నవాని = భగవత్స్వరూపము నెరింగినవాని.

లౌకికమార్గములో పయనించు సంసారులు సదా భగవద్భావనలో మునిగిలేక పోయినను వంతుకు, ప్రసిద్ధిమాత్రమునకైన 'మేము భగవద్దాసులము' అన్న చాలును. వెంటనే ఆపద్బంధుడైన శ్రీహరి వారిని రక్షించును.

వరికుప్పలు నురుపుటకై బంతిగట్టిన పశువులు అప్పుడప్పుడు ఒక్కొక్క కబళము సమీపమునుండి గ్రహించి తృప్తి నొందుచుండును. అట్లే సదా సంసార

ములో ఉన్న మానవుడు వీలైనప్పుడెల్ల పరమాత్ముని చిత్తమున నిల్పినచో ధన్యు డగును.

ఎప్పుడును చేదు దినువాడు మధ్యలో అప్పుడప్పుడు తీపు చవిచూచి సంతసించు నట్లు దుష్కృతము విధిగా చేయవలసివచ్చుటచే దుఃఖించు మనుజుడు వెంటనే హరి నామస్మరణ చేసినచో పాపవిముక్తు డగును.

నిరుపేదవా డొకడు కాలము పక్వమగుటచే తన పూర్వపుణ్యము ఫలించి ఒక్క అడుగులో పెన్నిధిని సాక్షాత్కరించుకొని కృతార్థుడగును. అట్లే భగవత్స్వరూపము నేమాత్రము నెఱుంగక, పరమాత్మునికి దూరమైనవాడు గురుని ఆనతిచే భగవదను భవమునొందిన హరిదాసులపై భక్తి నిల్పినచో కృతకృత్యు డగును.

వి:- భగవంతుడు కరుణామయుడు. యోగులవలె సదా తన్ను స్మరింపజాలని సంసారులనుగూడ ఆయన అప్పుడప్పుడు తన్ను తలంచినచో ఆపదనుండి కాపాడును. సాక్షాత్తుగా భగవంతుని భావింపజాలనివారు సైతము భగవద్దాసులపై భక్తి నిల్పిరేని ధన్యాత్ములగుదురని మూడవ చరణములోని సారాంశము.

బంతిగట్టిన పశువులతోను, చేదు దినువారితోను సంసారులను, దురితవిధు లాచ రించువారిని క్రమముగా పోల్చుటచే వారిస్థితి దయనీయమని వ్యక్తమగుచున్నది.

సహజసిద్ధములైన, కొన్ని కర్మములు నింద్యములు కలవు. అవియే ఇక్కడ 'విధులు' అను శబ్దముచే వివక్షితములు. వీటి దుష్ఫలితముల నివారించుటకే బ్రహ్మ యజ్ఞాది పంచయజ్ఞములు విధింపబడినవి. సదోషములైనను సహజకర్మలను విడువ రాదని గీతావచనము. 'సహజం కర్మ కౌన్తేయ న దోషమపి న త్యజేత్',[1]

'దురితవిధులు' అనుమాటకు 'జారచోరాది నిషిద్ధకర్మములు'లని అర్థము చెప్ప రాదు. అవి చేయుచునే అప్పుడప్పుడు శ్రీహరిని స్మరించుచుండిన చాలు అని భావిం చుట తగదు. అట్టివి దురుపలవాటులో నున్నను పరమాత్ముని స్మరించి పశ్చాత్తాపము నొంది మరల అవి చేయకుండ జాగరూకత వహింపవలెను. "ఏమి చేసినను ఫరవా లేదు. భగవంతుని స్మరించినచో అన్నిపాపములు పటాపంచ లగును" అను శుష్క వేదాంతుల మాటలు విశ్వసనీయములు గావు. నిజముగా భక్తి కుదిరినవాడు ఘోర దుష్కృత్యముల కెన్నడును పాల్పడనేరడు.

---

1. గీత., 18-48.

## 56

అవ:- అన్నవస్త్రాదులకై పరులచెంత దైన్యము పనికి రాదనుచున్నాడు—

### నాగవరాళి

వెగ్గలమింతా - వృథా వృథా
తగ్గి పరులతో - దైన్యములేలా. ॥పల్లవి॥

1. పెంచఁగఁ బెంచఁగఁ - బెరిగీ నాసలు
తుంచఁగఁ దుంచఁగఁ - దొలఁగునవి.
కంచము కూడును - కట్టిన కోకయు
వంచన మేనికి - వలసినదింతే. ॥వెగ్గ॥

2. తడవఁగఁ దడవఁగఁ - దగిలీబంధము
విడువఁగఁ విడువఁగ - వీడునవి (ది?).
గుడిశలోన నొక - కుక్కిమంచమున
వొడలు సగమునను - వుండెడిదింతే. ॥వెగ్గ॥

3. మరవఁగ మరవఁగ - మాయలెయింతా
మురహరుఁ దలచితె - మోక్షము.
విరతి (శ్రీ) వేంకట - విలయుఁడె కాయపు
గరిమల విలిచిన - కాణాచింతే. ॥వెగ్గ॥

ప॥ వెగ్గలము = అధికము.

3. కాణాచి = చిరకాల మనుభవము వ మన్నది.

మిక్కుటములైన ఈ లేనిపోని ప్రయాసలన్నియు వ్యర్థములు. దైన్యము గల్గి ఇతరులచెంత ఇంత దైన్యము వహించు టెందుకు ?

ఆశలు మన మెంతెంతగా పెంచుకొందుమో, అంతంతగా పెరుగును. మన మెంతగా వాటిని తగ్గించుకొందుమో అంతగా అవి తగ్గిపోవును. తా వెంతగా నమ్ముకొన్నను ఎప్పుడో తన్ను మోసగించి భూమిపై బడమన్న ఈ శరీరమునకు కావలసిన దొక కంచము కూడు, కట్టు బట్టయే గదా !

ఈ సంసారబంధమును మన మెంతగా పైబెట్టుకొందుమో, అంతగా అది మనల బంధించును. ఎంతగా మనము దానిని విడిచిపెట్టుదుమో, అంతగా అది మనల వీడిపోవును. చిన్న గుడిసెలో ఒక ఇక్కి మంచముపై వాల్చినచో ఈ మేను అందు గూడ సగముచోటే ఆక్రమించును. ఇంతే కదా! దీనికై ఇంత కష్టపడనేల?

భగవంతుని మన మెంతగా మరతుమో, అంతగా మనలను మాయలు పైకొనును. ఆ మురారిని సదా స్మరింతుమేని మోక్షము కరతలామలకమగును. శ్రీ వేంకటేశ్వరు డొకడే మన శరీరములకు సంబంధించి పెద్దరికములలో చిట్టచివరికి శేషించు పెన్నిధి.

అనగా చిరకాలార్జితపుణ్యమై అంతర్యామిగా ఆ దేవుడు మన శరీరములకు పెద్దరిక మిచ్చి అందు నిల్చి సదా మనచే అనుభవింపదగియున్నాడు. కావున భగవత్స్మరణతో ముక్తి నొందవలెను, దైన్యములౌని లేనిపోని చిక్కులలో పడరాదని భావము.

వి:- 'ఆశాపాశము తా గడున్నిడుపు లే దంతంబు'[1] అని భాగవతమున చెప్పినట్లు ఆశ కంతము లేదు. మఱియు హవిస్సుచే అగ్నివలె కామోపభోగముచే కామము వృద్ధినొందునే కాని శమింపదని పెద్దల వచనము—

న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభి వర్ధతే ॥[2]

కాని ఆశలను, కామములను పెంచుటయు, త్రుంచుటయు పురుషప్రయత్నముపై ఆధారపడియున్నది. కావుననే అన్నమయ్య ముముక్షువులను ఆశలను త్రుంచుతవియు, బంధములను త్రెంచుడనియు, భగవంతుని స్మరింపుడనియు హెచ్చరించినాడు.

ఈ సంకీర్తనము నందలి భావమునే మరొకచో నిబంధించుచు బంధములు, ఆశలు మున్నగునవి హరి కల్పితములనియు, హరిని శరణు జొచ్చినవారి నవి అంటవనియు సంకీర్తనాచార్యు డిట్లు పాడినాడు—

ఆహిరి

ఎందరివెంట లి - సేగేము
చందపు హరి నీ - శరణనియెదము. ॥పల్లవి॥

1. భాగ., 8-574. 2. వాయు., 93-95.

పెంచినఁ బెరుగును - పెక్కు బంధములు
తుంచినఁ దునుగును - దుఃఖములు.
ఎంచగ నేటికి - యింద్రియ మహిమలు
చుంచుల హరి నీ - సూత్రము లివియే. ॥పెంచ॥

వలపినఁ బారును - బహుళపు టాసలు
తలపినఁ దరుగును - తన మదము.
వెలుఁగ నేటికి , వెడ కర్మములు
కలకుల హరి - నీ కల్పిత మిదియే. ॥పెంచ॥

చేసినఁ జెలఁగును - జిగి సంసారము
మూసిన ముణుఁగును - మోహములు,
ఈసుల శ్రీ వేంక - టేశ్వర యివి నీ
దాసులఁ దడపెట్టు - తగు నీ మహిమ.[1] ॥పెంచ॥

57

అవ:- బాలకృష్ణుని అమానుష లీలలను వర్ణించుచున్నారు —

వళవలు జంపె

వెఱపించఁబోయి తానె - వెఱచెఁ దల్లి యశోద
మఱచి యీ బాలునెట్లు - మానినెంటా నుండెనో. ॥పల్లవి॥

1. వెంట రాకు మని కృష్ణు - వెరపించి యశోద
వొంటి మందలో గొంగ - వున్నాఁడనె.
అంటి గొంగ యెంత మన్నాఁ - డని నోరు దెరచితే
పెంటలై బ్రహ్మాండాలు - పెక్కు గానవచ్చెను. ॥వెఱ॥

2. చందమామఁ బాడి తల్లి - సరిఁబొత్తుకు రమ్మంటే
చందురుఁ జూచి కృష్ణుఁడు - సన్న చేసెను.
ముందరఁ జంద్రుడు వచ్చి - మొక్కితే యశోద చూచి
ముందేలా యంటివో యని - మొంచి వెరగందెను. ॥వెఱ॥

1. అ. సం., 16-265.

3. పాలార్చి తొట్టెలలోఁ - బండఁబెట్టి యశోద
నీల వర్ణుఁ దొంగిచూచె - నిద్దురో యని.
ఓలి శంఖచక్రాలతో - నురము శ్రీ సతితోడ
యీ లీల శ్రీ వేంక - టేశుఁడై యున్నాఁడు. ॥పెలు॥

ప్ర॥ మానిసెంటా = మానిసి + అంటా = మనుష్యుడనుచు.

1. గొంగ = శత్రువు.

2. సన్న = సంజ్ఞ; మించి = అతిశయించి.

3. పాలార్చి = ఆపేంచి; ఓలిఁగా = వరుసతో.

తుంటరియైన బాలకృష్ణుని అల్లరిపనులు మాన్పించదలంచి తల్లి యశోద భయ పెట్టబోయినది. కాని లీలామానుష విగ్రహుడైన ఆ గోపబాలుని చెయిదములు చూచి తానే భయపడినది. అట్లు భయపడియు మరల అతని నిజస్వరూపమును మరచి మనుజ శిశువని భావించుచు ఎట్లు లాలించి పాలించినదో గదా !

ఒకనాడు యశోద తాను మందకు పయనమైనది. కృష్ణుడు వెంబడించినాడు. "నావెంట రావద్దు. మందలో బూచి వున్నాడు. వాడు నిన్ను పట్టుకొనగలడు సుమా:" అని బెదరించి భయపెట్టబోయినది. వెంటనే కృష్ణుడు "ఏదీ? ఆ దొంగ యెక్కడ ఉన్నాడో చూపు" అనుచు బాల్యచేష్టగా నోరు తెరచెను. అందు చూడగా యశోదకు దిబ్బలు దిబ్బలుగా పెక్కు బ్రహ్మాండములు కనిపించినవి. అవి చూచి తుద తామెయే భయపడినది.

మరొకనాడు యశోద చిన్ని కృష్ణుని ఆడించుచు 'చందమామ రావే, జాబిల్లి రావే' అనుచు పాట పాడి "మా కృష్ణునితో కలసి ఆడుకొందువుగాని రా" అని చంద మామను పిలిచినది. కృష్ణుడు చంద్రునిజూచి మెల్లగా సైగ చేసినాడు. వెంటనే ఆకసమునుండి రివ్వున చంద్రుడు దిగివచ్చి యశోద యెదుట నిలిచి నమస్కరించినాడు. అది చూచి ఆమె దిగ్భ్రమజెంది నేనేల మందు చంద్రుని రమ్మంటినో యని వెరగు పడినది.

మరొకదినము యశోద నీలమేఘశ్యాముడైన కుమారుని ఆడించి ఊయెల తొట్టెలో పండబెట్టి 'నిద్రించినాడా !' యని తొంగిచూచెను. శంఖ చక్రములతో, వక్షమున శ్రీ మహాలక్ష్మితో శ్రీ వేంకటేశ్వరరూపము దాల్చియున్న తనయుడు తల్లిని వెరపొందజేసినాడు.

వి:- కృష్ణావతారమున భగవంతుడు గావించిన బాల్యచేష్టలు సుప్రసిద్ధములు. అవి భాగవతము, హరివంశము మున్నగు గ్రంథములలో విస్తారముగ వర్ణింపబడినవి. అన్నమయ్యగూడ శ్రీ కృష్ణుని లీలలను ఎడనెడ అపూర్వమైన కల్పనలతో వర్ణించి యున్నాడు. ఈ సంకీర్తన అట్టి వర్ణనలలో నొకటి.

శ్రీ కృష్ణుడు మన్ను దిన్నాడని యితర బాలురు చెప్పగా 'మన్నేందుకు దింటివి ?' అని తల్లి వానిని శిక్షింపబోయెను. అప్పు డతడు—

'అమ్మా ! మన్ను దినంగ నే శిశువనో ఆఁ కొంటినో వెఱ్ఱినో
నమ్మం జూడకు వీరి మాటలు, మది న్నన్నీవు కొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు; కాదేనిన్ మదీయాస్య గం
ధ మ్మాఘ్రాణము సేసి వానవనముల్ తప్పైన దండింపవే.'[1]

అని పలికి నోరుదెరచి చూపెను. అంతట—

ఆ లలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వనభూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాదికరండమైన బ్రహ్మాండంబున్[2]

అని భాగవతమున వర్ణింపబడి యున్నది. కృష్ణుని యీ చేష్టనే అన్నమయ్య ఇట తన కల్పనాచాతుర్యమును మేళవించి సందర్భమును మార్చి వర్ణించెను.

కృష్ణుని మహిమను భావించియు యశోద వైష్ణవ మాయాప్రభావముచే మరల అతనిని తన బిడ్డగానే తలంచి మమకారము నొందెను.

జడమతి వడి మోహమున వా
పడఁ తుక సర్వాత్ముఁ డనుచుఁ - బలుకక యతనిన్
గొడుకని తొడపై నిడుకొని
కడు వేడుకతోడ మమత - గావించె నృపా ![3]

ఈ మాయాశక్తిని మనసున నిడుకొనియే "మఱచి యీ బాలు వెట్టుమాని యెంటా నుండెనో" అని సంకీర్తనాచార్యుడు ఆశ్చర్యమును ప్రకటించెను.

---

1. భాగ., 10-337. 2. భాగ., 10-338.
3. భాగ., 10-347.

58

అవ:- కర్తవ్యకర్మము, పాపపుణ్యములు అజ్ఞానులకే కాని సుజ్ఞానులకు లేవను చున్నాడు.

దేసి

అజ్ఞానుల కివి - యరుహము లింతే
సుజ్ఞానుల కివి - చొర నేలయ్యా ॥పల్లవి॥

1. దైవము నమ్మిన - దాసులకు
కావింపఁగ మరి - కర్మము లేదు,
దావతి జలనిధి - దాఁటిన వారికి
నోవల మరియును - నోడేలయ్యా ॥అజ్ఞా॥

2. గురుకృప గలిగిన - గుణనిధికి
అరయఁబాప పు - ణ్యము మరిలేదు,
విరసపుఁ జీఁకటి - వెడలిన వారికి
వరగ మరియుదీ - పం బేలయ్యా ॥అజ్ఞా॥

3. జగము లెరుఁగు వై - ష్ణవులకును
తగిలెటి యపరా - ధంబులు లేవు,
అగపడి శ్రీ వేంక - టాధిపుఁ గొలిచితే
యెగువ దిగువ మా - కెదు రేదయ్యా ॥అజ్ఞా॥

వ॥ అరుహములు = అర్హములు.

1. దావతి = ఉద్ధతమైన; ఓవల = అవల ?

ఈ చెప్పబోవునవి అజ్ఞానులకే తగినవి. ఇంతే కాని సుజ్ఞానులైనవారు ఇందులో ప్రవేశింప వలసినవని యేమున్నది ?

ప్రపన్నులై భగవంతుని నమ్మిన భాగవతులకు తర్వాత చేయదగిన పని యేదియు లేదు. ఒడుదొడుకులతో దుస్తరమైన సముద్రము నెట్లో ప్రయాసపడి దాటిన వానికి మరల వడవతో పని యేమున్నది ?

గురుని కృపకు పాత్రుడైన గుణవంతుని కిక పుణ్యపాపము లనునవి లేవు. చిమ్మ చీకటినుండి బయటపడినవానికి మరల దీప మెందుకయ్యా!

జగత్ప్రసిద్ధులయిన వైష్ణవ శ్రేష్ఠులకు అంటగల అపరాధము లెవ్వియు లేవు. శ్రీ వేంకటేశ్వరుని సేవించిన మాకు పై లోకములలోగాని. క్రింది లోకములలోగాని ఎదు రెక్కడిదయ్యా!

వి:- మనుజుడు సత్కర్మము లాచరించుట భగవంతునిపై మనస్సు నిల్చి విశ్వాసమేర్పడి భక్తి గల్గుటకే. అది కలిగినపిమ్మట చేయవలసిన దేదియు లేదు. ఇంకను అట్టివా రేదో చేయుచున్నారన్నచో వారి భక్తి విశ్వాసములు పూర్ణము కాలేదనియే తలంచవలెను. ప్రపన్నుడు తిరిగి కర్మమార్గములో ప్రవేశింపరాదనియు, అట్లు ప్రవేశించినచో దేవు డతనిపై ప్రీతిని విడనాడుననియు అన్నమయ్య మరొకచో చెప్పియున్నాడు—

"హరిఁ బ్రపత్తి నమ్మిన నరుఁడు
తిరుగఁ గర్మ మార్గమునకుఁ జొచ్చిన-
దేవుఁడు దన వాత్సల్యము వదలు."[1]

గురుని కృపచే పవిత్రుడైన శిష్యునికి పాపపుణ్యాత్మకములైన ఉభయకర్మములు నశించుచున్నవి. గురువు అనేకజన్మలనుండి వచ్చిన కర్మబంధములను జ్ఞానాగ్నిచే కాల్చివేయువాడని గురుగీతలో చెప్పబడినది—

అనేకజన్మ సంప్రాప్త కర్మబంధ విదాహినే।
జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీ గురవే నమః॥[2]

కాని శిష్యుడు గురుకృపకు అర్హమైన గుణములను తా నార్జించుకొనవలెను. అందుచేతనే 'గురుకృప గలిగిన గుణనిధికి' అని చెప్పబడినది. గుణవంతునిమీదనే సద్గురుకృప ప్రసరించును.

వైష్ణవధర్మము నాచరించు పరమభాగవతుల కెట్టి యపరాధంబులును లేవు. విష్ణుభక్తిపరాయణులగుటచే వారిని పాపము లంటవు. వా రెక్కడ కేగినను అప్రతిహతముగా సంచరింపగలరు. ఈ భావమునే విస్తరించు మరొకపాట యిది—

1. అ. సం., 6-22. 2. గు. గీ., 1-75.

దేసాళం

ఎదురులేక చరింతు - రెట్టైనా శ్రీ వైష్ణవులు
మదించి నేనుగులకు - మట్టుమేర వున్నదా? ॥పల్లవి॥

భాగీరథిలోనఁ - బాపమున్నదా పుణ్య
భోగపు వేదములలో - బొంకు లున్నవా?
సాగరపు టమృతపు - చవిలోఁ జేఁ దున్నదా?
ఆగతి హరిదాసుల - కపరాధ మున్నదా? ॥ఎదురు॥

ఆకసములోన నెరు - సందున్నదా భూమిఁ
జేకొని రవి యెదుటఁ - జీఁకటున్నదా?
యీకడఁ గామధేనువు - కియ్యరాని వున్నవా?
కైకొన్న ప్రపన్నులను - గరిహించ నున్నదా? ॥ఎదురు॥

హరినామ మంత్రములో - నౌగాము లున్నవా?
గురుకృప గలిగియు - గొరతున్నదా?
సరవి శ్రీ వేంకటేశు - శరణన్నవారికి
విరసంబు లందులో - వెదకఁగఁ గలదా?[1] ॥ఎదురు॥

౭౪

అవ:- జీవుల సుఖదుఃఖములకు వారివారి గుణదోషములే కారణము లను చున్నాడు—

నాదరామక్రియ

దైవము దూరఁగ నేల - తమ నేర్పు నేరమింతే
యీవలఁ దమ కర్మము - లెంచరు మనుజులు. ॥పల్లవి॥

1. మొల్లమి గాలి యొకటె - మంచి తూరుపెత్తు చోట
పొల్లకట్టు కడఁబడె - పోగువడె గట్టి వెల్లా,
ఉల్లమూళో శ్రీ హరి - ఒకఁడై వుండు సతవి
నొల్లరై రి యసురలు - వొలిసిరి సురలు. ॥దైవ॥

---

1. అ. సం. , 9-112.

2. మించిన జల్లి యొకటె - మీఁద నందు దొడ్డ వెల్ల
చంచల సన్నము లెల్లా - సందులఁగారు,
ఎంచఁగ హరి యొకఁడె - యెరఁగక కొందరైతే
కొంచపై రీతనిఁ గొల్చి - కొందరైతె (రి?) మనులు
||దైవ||

3. కోవిలలఁ గాకులును - కోరి యొక్క రీతి నుంకు
యీవల వసంతవేళ - నేరు పడును,
శ్రీ వేంకటేశ్వరుని - సేవకులు మనుజుల
భావ మొకరీతి నుండు - ఫలములే వేరు. ||దైవ||

1. మొల్లమి = సాంద్రము; పొల్లకట్టు = గింజపట్టని ధాన్యపురాశి; ఒలిసిరి = వలచిరి.

2. జల్లి = జల్లెడ.

జీవులకు గల్గు పెక్కు సుఖదుఃఖములకు, ఉచ్చ నీచావస్థలకు వారిలోని గుణదోషములే హేతువులుగాని మరేమియు గాదు. ఈ సత్యము దెలిసికొనక కష్టనష్టములు కలిగినప్పుడెల్ల దైవమును తిట్టుటవలన ప్రయోజనమేమి? మానవు లట్టి సందర్భములలో దేవుని దూషింతురే కాని తా మొనర్చు పనులలోని మంచి చెడుగులను గమనింపరు.

సాంద్రమై వీచుగాలి ఒకటే. కాని ధాన్యము నెత్తి తూర్పారబట్టుచోట తాలుక లన్నియు దవ్వుగా పడును. గట్టి ధాన్యమంతయు అచ్చటనే పోగుపడును. అట్లే అందరి హృదయములయందును అంతర్యామిగా నున్నవాడు శ్రీహరి ఒక్కడే. ఆయనను తిరస్కరించి రక్కసు లెల్ల రాయనకు దూరమై నశించిరి. దేవత లాయనను చేరి భజించి వృద్ధినొందిరి.

జల్లెడ ఒక్కటే. కాని అందలి పదార్థములలో పెద్దవన్నియు మీదనే నిలుచును. సన్ననివి సందులనుండి జారి క్రింద పడిపోవును. అట్లే భావింపగా, పరమాత్మ డొక్కడే. ఆయన స్వరూపము తెలియంగక కొందరు అల్పులై పోయిరి. ఎఱింగి సేవించిన మరికొందరు మహనీయులైరి.

కోకిలలును, కాకులును నల్లగా చూచుట కొక్కరీతిగానే ఉండును. కాని వసంతసమయము రాగానే అవి వేఱుపడిపోవును. . అట్లే భగవంతుని సేవించువారు, సేవింపనివారు నగు మనుజు లందరు ఆకృతినిబట్టి ఒకేవిధముగా నుందురు. కాని ఫలానుభవకాలము వచ్చినప్పుడు వారివారికి గల్గు ఫలములు మాత్రము వేఱువేఱుగా నుండును.

వి:- భూషింపబడువారు, దూషింపబడువారు, ఉత్తమగతి నొందువారు, అధోగతిపా లగువారు ఇట్లు లోకములో మనుజులు పలుతెఱగుల కాన్పించుచున్నారు. అందుకు కారణము వారివారి శుభాశుభకర్మములే గాని మరేమియు గాదు. దైవము సాక్షి మాత్రమై యున్నది. ఈ సంగతి తెలియక అజ్ఞులు తమకు వచ్చిన చిక్కులకు దైవమును నిందింతురు. ఇది తగదనియు, తమ కర్మగతిని తామే మార్చుకొని ఉత్తమస్థితి నొందవలెననియు ఈ పాట బోధించుచున్నది.

సజ్జనులు ఉద్ధరింపబడుటకు, దుర్జనులు సంహరింపబడుటకు వారిలోని సౌజన్య దౌర్జన్యములే హేతువులు. పురాణములలోని సురాసురుల గాథలన్నియు ఈ విషయమునే నిరూపించుచున్నవి.

'దైవీ సంపద్విమోక్షాయ నిబన్ధా యాసురీమతా'[1] అని దైవసంపద మోక్షమునకు, ఆసురసంపద నరకమునకు త్రోవ దీయునని గీత చెప్పుచున్నది.

> కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పిక కాకయోః ।
> వసన్తకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః ॥[2]

అని ప్రాచీనుల సూక్తి. కాకి కోకిలలు చూచుట కొకేరీతిగా నున్నను, వసంతము వచ్చిన వెంటనే పంచమస్వరముతో మధురగానమొనర్చి కోకిల తన గొప్పతనమును ప్రదర్శించును. కాకి కాకిగానే మిగిలిపోవును. అట్లే భాగవతులు ఫలానుభవకాలము వచ్చినప్పుడు ఉత్తమఫలమైన మోక్షమును చూరగొందురు. దుష్టులు దుర్గతి నొందుదురు.

కాన చీటికి మాటికి దైవమును దూరుట మాని మనుజులు తమ ప్రవృత్తిని సంస్కరించుకొనవలెనని భావము.

---

1. గీత., 16-5. 2. సుభా. భా., P. 225.

60

అవ:- అనవరతము దైవభజన చేయుచు సమబుద్ధి గలిగియుండవలె నను చున్నాడు—

## సామంతం

దైవ మొక్కఁడె సం - తత భజనీయుఁడు.
భావమున సమబుద్ధిఁ - బాయఁగఁ దగదు. ॥పల్లవి॥

1. హరియే సకలాంత - రాత్మకుం డటుగాన
తిరమై యొకరి నిం - దింపఁ దగదు.
అరయఁగ లోకము - లనిత్య మటుగాన
మరిగి కొందరి మీది - మమతయు వలదు. ॥దైవ॥

2. బహు కల్పితము లెల్లఁ - బ్రకృతి మూలమె కాన
గహనపుఁ దన వుద్యో - గము వలదు,
సహజ విహారుఁడు - సర్వేశ్వరుఁడు గాన
వహిఁదానె వచ్చినవి - వలదనఁ దగదు. ॥దైవ॥

3. తపములు జపములు - దాస్యమూలమె కాన
ఉపమల సందేహ - మొగి వలదు,
యెపుడును శ్రీ వేంక - టేశ్వరు సేవించి
చపలచిత్తము వారి - సంగ మిఁక వలదు. ॥దైవ॥

1. తిరమై = స్థిరమై.
2. గహనపు = కష్టమైన; వహి = విధము.
3. ఉపమల = ఉపాయములలో.

ఎల్లవేళల జీవుల కారాధింప దగినవాడు భగవంతు డొక్కడే. పరమాత్ముడు సర్వత్ర సమముగా వ్యాపించియున్నాడు గాన భగవద్భజనపరు లెన్నడును సమదృష్టిని వీడరాదు.

సమస్తజీవులకు అంతరాత్ముడైనవాడు శ్రీహరియే. కావున ఒకరిపై ద్వేషము బూని వీరించు టెంతమాత్రము తగదు. ఈ లోకము లన్నియు అశాశ్వతము లైనవే. ఎవ్వరును మనల నంటిపెట్టుకొని కలకాల ముండబోరు. కావున కొందరిపై మమకారము గూడ ఉచితము గాదు.

మాయామయమైన ప్రకృతినుండియే చిత్రవిచిత్రములైన అనేక కల్పనలు ఏర్పడుచున్నవి. అంతే కాని కష్టపడి జీవులు తమకు తాముగా ప్రయత్నించి సాధించున దేమియు లేదు. అందుచే అట్టి ప్రయత్నము చేయవలదు. అంతటికి నియామకుడైన పరమాత్ముడు సహజ లీలాతత్పరుడు కాబట్టి ఆ దేవుని సంకల్పముచే తమకు తాముగా వచ్చినవాటిని వలదన దగదు.

మోక్షప్రాప్తికై చేయు తపములు, జపములు మున్నగున వన్నియు భగవద్దాస్యమూలములే కాని అన్యములు కావు. కావున ఆయా సాధనలకు జెందిన భగవత్ప్రాప్త్యుపాయములపట్ల సంశయము గల్గియుండరాదు. సర్వదా శ్రీ వేంకటేశ్వరునే సేవించుచున్నవారికి చపలచిత్తులై దైవమును భజించని, లేదా వివిధదేవతల నారాధించెడు మూఢులతో నెట్టి సంబంధము పనికిరాదు.

వి:- సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥[1]

అను గీతోక్తి ననుసరించి నశించిపోవు సమస్తభూతములలో నాశము లేక సమముగా వెలుగొందు సర్వేశ్వరుని చూచినవాడే జ్ఞాని. అట్టివాడు ఎన్నటికిని సమదృష్టిని వీడడు.

మఱియు కొందరిని దూషించుట, మరికొందరిని భూషించుట అనునది సర్వత్ర పరమాత్మను భావింపలేని అజ్ఞు డొనర్చు పనియేగాని విజ్ఞుని పనిగాదు. భగవద్భక్తునకు అశాశ్వతములైన సాంసారిక సంబంధములపై గాని, లౌకిక పదార్థములపై గాని మమకార ముండరాదు.

భారమంతయు పరమేశ్వరునికి సమర్పించినవాడు తనకు మంచి కల్గినను, చెడు కల్గినను అంతయు ఆ జగన్నాటక సూత్రధారుని లీల యని భావించి ఊరకుండునే గాని లేనిపోని యత్నము లొనర్పడు.

1. గీత., 13-27.

భగవత్ప్రాప్తి కెన్నో ఉపాయములు శాస్త్రములలో ప్రతిపాదింపబడినవి. అవి యన్నియు చివరకు భగవత్కైంకర్యమునందే పర్యవసించును. కావ వాటి విషయమున సాధకున కెట్టి సంశయములు ఉండరాదు. భగవద్దాస్యరూపమైన భక్తిమార్గమున పయనించువాడు, జప తపో వ్రతాదిమార్గములలో నున్నవారిని ఈసడించుటయు యుక్తము గాదు. అట్లే భక్తులకు స్థిరచిత్తులైన భాగవతులతో సాంగత్యము ఒగునే కాని చపలచిత్తులైన మూఢులతో కలయిక తగదు.

## 61

అవ:- జిహ్వాచాపల్యము, వస్త్ర గృహాభరణాదులగు సంపదలపై ఆశ, బంధువులతోని తగులము తగవనుచున్నాడు—

### ముఖారి.

చవి నోరి కేడఁదెత్తు - సంపదేడఁదెత్తు వీని
నవరించుకే నా - సంపదిది గాదా. ॥పల్లవి॥

1. పచ్చడా లెక్కడఁ దెత్తు - పట్టు చీర లేడఁదెత్తు
వెచ్చ నిండ్లేడఁ దెత్తు - వెంటవెంటను,
తెచ్చిన యీ పచ్చడము - దేహమిది వెంటవెంట
వచ్చెఁగాక తన్నుఁదానె - వద్దనఁగ వచ్చునా. ॥చవి॥

2. దొరతనమేడఁదెత్తు - దొడ్డసొమ్ము లేడఁదెత్తు
యెరవుల సిరుల నే - నేడఁదెత్తు,
వెరవున నే నెవ్వరిని - వేసరించఁజాలక
దరిచేరుకే దొర - తనమిది గాదా। ॥చవి॥

3. తోడఁబుట్టువుల నేడఁ - దోడితెత్తుఁ జుట్టాల
నేడఁదెత్తు సుతులసొం - దేడఁదెత్తును,
వేడుకైన సొంపు శ్రీ - వేంకటేశు దలఁచుకే
యాడులేని బంధుకోటి - యాతఁడె కాఁడా. ॥చవి॥

2. ఎరవుల సిరులు = కొలదికాలము వాడుకొనుటకై అరువుగా పరులవద్ద తెచ్చుకొను సంపదలు; వేసరించజాలక = బాధించజాలక.

నోటికి రుచికరములైన పదార్థము లెక్కడనుండి తెత్తును? ఇష్టభోగముల ననుభవింపగోరు నా మనస్సును తృప్తిపఱచుటకై వివిధములైన సంపదలు నే నెక్కడనుండి కొని రాగలను? జిహ్వాచాపల్యమును, సంపదలకై ఆరాటపడు చిత్తమును అరికట్టుటే కదా నాకు నిజమైన సంపద!

నేను పోయినచోట్ల నెల్ల రకరకములైన పచ్చడముల నెందుండి తేగలను? పట్టుచీర లెచ్చటనుండి సంపాదింతును? వెచ్చని యిండ్లు నా కెట్లు లభించును? ఈ శరీరమే నేను దెచ్చుకొన్న పచ్చడము. ఇది నే నెక్కడికి పోయినను (ప్రతిజన్మము నందును) నాతోడ వచ్చుచునే యున్నది. దీనిని 'నీవు రావద్దు' అనుటకు నావలన నగునా?

పెత్తనము నెక్కడనుండి తెత్తును? విలువైన సొమ్ముల నెందుండి తీసికొని రాగలను! మూన్నాళ్ళ ముచ్చటకై నావి కాని ఐశ్వర్యములను నే నెవ్వరి నడిగి తేగలను? ఇతరుల నెవ్వరిని శ్రమపెట్టకుండ ఉచితమైన జీవనోపాయముతో గట్టు జేరుటే గదా నాకు నిజమైన దొరతనము?

తోబుట్టువుల నెందుండి తోడితెత్తును? చుట్టముల నేడనుండి కొనిరాగలను? కొడుకులతోడి పొందును నే నెందుండి తీసికొనివత్తును? శ్రీ వేంకటేశ్వరుని చిత్తమున దలచుటే నాకు సంతోషకరమైన పొత్తుగాని, బంధువులతోడి పొందు పొందు గాదు. ఆ పరమాత్మ యొక్కడే నాపాలిటికి పలువిధముల సాటిలేని బంధువు. ఇతర బంధువులు బంధువులు గారు.

వి:- భోగసాధనములైన లౌకికసంపదలు సంపదలు గావు. కోరికలను విగ్రహించుటే నిజమైన సంపదయన్న భావమీ సంకీర్తనమున చక్కగా నిరూపింపబడినది.

జిహ్వాచాపల్యము ఇంద్రియనిగ్రహమును నిరోధించి పలువిధములగు పతనములకు దారిదీసి జీవులను బద్ధుల నొనర్చుచున్నది. భూవలయమునందలి ప్రాణులెల్ల జిహ్వోపస్థములకు వశపడి బంధము నొందుచున్నవనియు, వాటిని జయించినచో బంధము తొలగుననియు ఉత్తరగీత బోధించుచున్నది—

పృథివ్యాం యాత్రి భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్ ।
జిహ్వోపస్థ పరిత్యాగే కో న ముచ్యేత బంధనాత్ ॥1

దేహియైన ఆత్మకు దేహమే ఒక వస్త్రము వంటిది. మానవుడు జీర్ణవస్త్రములు వదలి నూతనవస్త్రములను ధరించునట్లే ఆత్మ జీర్ణశరీరములు వదలి నూతన శరీరములు ధరించుచున్నదని భగవద్గీత చెప్పుచున్నది—

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ ॥2

అన్నమయ కోశమగు శరీరమే ఒక వస్త్రమైయుండ దానిపై గప్పుటకు వివిధములైన వస్త్రములను జీవు డాశించుట వింతగా నున్నది. కావ ఇతరులను ధన ధాన్య గృహ వస్త్రాదిసంపదలకై యాచింపక స్వతంత్రముగా జీవించుటే నిజమైన దొరతనము. ఇతరులను విసిగించి వారి యీవితో నెఱపు దొరతనము దొరతనము గాజాలదని తాత్పర్యము.

దేవుడే జీవున కన్నివిధముల బంధువు గాని తదితరులు బంధువుల గారని తత్త్వజ్ఞుల మతము. అందుచే పరమాత్మనే సర్వస్వముగా భావించుచు పెద్ద లిట్లు వినుతించిరి—

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవ దేవ ॥3

## 62

అవ:- భగవత్ప్రాప్తి కుపయోగింపని చదువులు, సంసారప్రవర్తనలు నిష్ప్రయోజనము లనుచున్నాడు—

## గుండక్రియ

నాటకమింతా – నవ్వులకే
పూటకు బూటకు – బొజ్జే పోషు. ॥పల్లవి॥

1. ఉ. గీత., 3-5. 2. గీత., 2-22. 3. ?

1. కోటి విద్యలును - గూటికొఱకె పో
చాటువ మెలగేటి - శరీరికి,
తేటల వాఁకలి - దీరిన పిమ్మట
పాటుకుఁబాటే - బయలై పోవు. ॥నాఁట॥

2. మెఱసేటి వెల్లా - మెలుఁతల కొఱకే
చెఱల దేహముల - జీవునికి,
అఱమరపుల మఱ - మందిన పిమ్మట
మొఱఁగుకు మొఱఁగే - మొయిలై పోవు. ॥నాఁట॥

3. అన్ని చదువులును - నాతనికొఱకే
సన్నెరిఁగిన సు - జ్ఞానికివి
యిన్నిట శ్రీ వేంక - టేశు దాసువికి
వెన్నెల మాయలు - విడివడిపోవు. ॥నాఁట॥

ప॥ పొల్లు = వ్యర్థము.

1. చాటువ = చాటింపు.

2. మెఱసేటిది = ప్రకటముగా చేయునది; మెలుతలు = స్త్రీలు; అఱమరపుల = సగము మైమరపులో గూడిన; మొఱఁగు = వంచన: మొయిలు = మబ్బు.

3. సన్న = సంజ్ఞ, రహస్యము : వెన్నెలమాయలు = వెన్నెలవలె పైకి ఆహ్లాదకరముగానుండి త్వరలో నశించు అశాశ్వతమైన మాయలు.

ఈ సంసారనాటక మంతయు చివరికి నవ్వులపా లగునదే. ఇందలి ప్రతిచేష్టయు ఏ పూట కాపూట వ్యర్థమై పోవుచున్నది.

పలుపాటులు పడి కోటివిద్యలు గడించి మహాపండితు డను ప్రశస్తి పొందిన వానికి ఆ కోటివిద్యలు కూటికొఱకే గాని తత్త్వజ్ఞానమునకు కొఱగావు. ఆ చదువులచే ఆర్జించిన ధనముతో ఆకలి దీరినపిమ్మట అందుకై పడినపాట్లన్నియు శూన్యములు, అనగా నిష్ప్రయోజనము లగుచున్నవి.

చెఱసాలవంటి దేహములో చిక్కుకొన్న జీవుడు సంసారియై ప్రకటముగా చేయు పైపై మెఱుగువను లన్నియు స్త్రీలకొఱకే. వారితో రమించి సగము బాహ్య ప్రపంచ విస్మరణతోగూడిన శరీరసుఖము ననుభవించిన పిమ్మట తాను చేసిన మోసపు పను లన్నియు మబ్బువలె రూపులేనివై పోవును.

చదువులలోని రహస్యము నెఱిగిన సుజ్ఞానికి అన్ని చదువులు ఆ పరమాత్మను చేరుటకే. శ్రీ వేంకటేశ్వరుని దాసుడైనవానికి అన్నియెడల వెన్నెలవలె నిలుకడలేక పైపైకి ఆహ్లాదకరములుగా తోచు మాయలు తమంత తాము విడివడి పోవుచున్నవి.

వి:- లౌకిక విద్యలన్నియు ధనము నార్జించి భోగము లనుభవించుటకే వినియోగింపబడుచున్నవి. శరీరమున్నంతవరకు, ఆకలి, భోగకాంక్షలు ఉండును. శరీరపతనముతో అవి నశించును. అందుచే పై విద్యలకై పడినపాట్లుగూడ తరువాత నిష్ప్రయోజనము లగుచున్నవి.

కాని చదువులనన్నిటిని భగవత్ప్రాప్తికే సాధనములుగా జేసికొన్న ముముక్షువునకు శరీర మున్నప్పుడును, అది పతనమైన తర్వాతను సుగతియే లభించుచున్నది. కాన భగవద్దాసుల చదువులు వ్యర్థములు కావు. వారు మాయల కతీతులై నిత్యసుఖమును చూరగొందురు.

శంకర భగవత్పాదులుగూడ శుష్కపాండిత్యము లన్నియు భుక్తికే గాని ముక్తికి గావని చెప్పిరి—

వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యాన కౌశలమ్ ।
వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే ॥[1]

భగవద్దాసుడైన ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు నీవేమి చదివితివో చెప్పుమన 'చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ!'[2] అని యతడు సమాధానము చెప్పెను. కాన ప్రహ్లాదుడు 'సన్నెరిగిన సుజ్ఞానులలో' ఒక డగు చున్నాడు.

"ఎనయ నీతని - నెఱుఁగుటకే పో
వెనకవారు చది - విన చదువు,
మనసున నీతని - మఱచుటకే పో
పనివడి యిప్పటి - ప్రౌఢల చదువు.[3]

అని మరొకచో అన్నమయ్య చదువుల ప్రయోజనము భగవత్సాక్షాత్కారమే యని ప్రతిపాదించెను. 'వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః'[4] అన్న భగవద్వచనములోని తాత్పర్యముగూడ ఇదే.

1. వివే., 60. 2. భాగ., 7-168.
3. అ. సం., 11-3-25 4. గీత., 15-15.

## 63

అవ:- గీతలో భగవానుడుచెప్పిన చొప్పున జ్ఞానాజ్ఞానములను వివరించుచున్నాడు-

### ముఖారి

ఇందుకు విరహితము - లివ్నియు నజ్ఞానమని
చందమున గీతలందుఁ - జాటీ సిదివో. ॥పల్లవి॥

1. మానావమానములు - మాని డంబు విడుచుట
వూని హింసకుఁ జొరక - యోరుపు గలుగుటయు.
అవి మతిఁగరఁగుట - యాచార్యోపాసన
తానెప్పుడు శుచియౌట - తప్పని విజ్ఞానము. ॥ఇందు॥

2. అంచల సుస్థిరబుద్ధి - యాత్మవినిగ్రహము
అంచిత విషయ (విరతి ?[1]) విర - హంకారాలు,
ముంచిన జన్మ దుఃఖ - ములు దలపోయుట
కంచపు సంసారము - గడుచుటే జ్ఞానము. ॥ఇందు॥

3. అరిమిత్ర సమబుద్ధి - యనన్య భక్తియు
నరి నేకాంతకమును (న ?[2]) - సజ్జన సంగవిముక్తి,
ధర నధ్యాత్మజ్ఞాన - తత్వము దెలియుట
గరిమలందుట శ్రీ వేం - కటపతి జ్ఞానము.

ప॥ విరహితములు = శూన్యములు, చందముగ = పద్ధతిగా.

1. డంబు = దంభము, మతిఁగరఁగుట=చిత్తమును ఋజుమార్గములో నుంచుట.

---

1. 'అంచితవిషయ విరహంకారాలు' అనియే రేకులోను, ముద్రిత ప్రతిలోను గల పాఠము. 'ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ' (గీత. 13-9) అను మూలముతో సరిపడుటకై 'విరతి' అను పదము చేర్చుట తగును.

2. 'సజ్జన సంగవిముక్తి' అని రేకులోని పాఠము. 'అరతిర్జనసంసది' (గీత. 13-11) అని మూలము. కావున 'జనసంగ విముక్తి' అని కాని, లేదా 'అసజ్జన సంగ విముక్తి' అని కాని పాఠమైనప్పుడే అర్థము సంగత మగును.

2. ఆత్మవినిగ్రహము = మనస్సును నిగ్రహించుట; అంచితవిషయ (విరతి) నిర హంకారాలు = మానితమైన విషయవైరాగ్యము, అహంకారము లేకుండుట; మించిన = అతిశయించిన; కంచపు = భోజనపాత్రవంటి (అందరిచే అను భూత మగుచున్న అని తాత్పర్యము).

3. అరిమిత్ర సమబుద్ధి = శత్రు మిత్రులయందు సమభావము, అనన్యభక్తి = భగవంతునికంటె అన్యమునందు సోకని భక్తి; అసజ్జనసంగ విముక్తి = దుర్జనులతోడి పొత్తు వీడుట; అధ్యాత్మజ్ఞానతత్త్వము = అధ్యాత్మిక విజ్ఞానము లోని రహస్యము; గరిమలందుట = ఉత్కృష్టమైన స్థితి నందుట.

భగవంతుడు గీతలందు 'ఇది జ్ఞానము' అని తెల్పి ఇంతకంటె భిన్నమైనది 'అజ్ఞానము' అని ప్రకటించెను.

మానావమానములు వర్జించుట, దంభము లేకుండుట, హింసాప్రవృత్తి లేని వాడగుట, ఓర్పుగల్గియుండుట, మతిలో కపటము వీడుట, గురుసేవ, శౌచము అను నవియే విజ్ఞానము.

సడలియు కదలికలేని బుద్ధి, మనోనిగ్రహము, విషయసుఖములయందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, జన్మతో ముడిపడియున్న జరావ్యాధి మరణాది దుఃఖములు తరించుట, పుత్ర మిత్ర కళత్రాదులతో గూడిన సంసారమును గడచుటయే జ్ఞానము.

శత్రు మిత్రులయందు సమభావము గల్గియుండుట, భగవంతునియందు అనన్యమైన భక్తి గల్గియుండుట, విజనస్థలమున నుండుట, దుర్జనసాంగత్యమును వీడుట, సదా ఆత్మధ్యానముచే తత్త్వము నెఱుంగుట, శ్రేష్ఠాతిశ్రేష్ఠమైన జ్ఞానప్రయోజనమును పొందుట - ఇదియే శ్రీ వేంకటేశ్వరుడు చెప్పిన జ్ఞానము. దీనికి భిన్నమైనదెల్ల అజ్ఞానము.

వి:- గీత 13 వ అధ్యాయము, క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగమున జ్ఞానాజ్ఞానముల స్వరూప మిట్లు వివరింపబడినది—

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః ॥

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥
అసక్తి రనభిష్వఙ్గః పుత్రదార గృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥
మయి చానన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ ।
వివిక్తదేశ సేవిత్వ మరతి ర్జన సంసది ॥
అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం తత్త్వ జ్ఞానార్థ దర్శనమ్ ।
ఏతత్ జ్ఞానమితి ప్రోక్తం అజ్ఞానం యదతో ఽన్యథా ॥[1]

ఈ గీతార్థమునే అన్నమయ్య ప్రకృత సంకీర్తనములో వివరించినాడు.

## 64

అవ:- దేవుడే కరుణింపవలెను గాని జీవుడు తనకు తానుగా పరమార్థము నెఱుంగజాల డనుచున్నాడు—

### బౌళి రామక్రియ

ఎన్నఁడు నేఁ గందు నిందు - నిందిరాపతి నీవె
కన్నె లెదుట నుండి - కరుణింతుగాక । ॥పల్లవి॥

1. పొదమిన యట్టై నిన్ను - పొంచి కొలిచే నంటె
కదు నాకిప్పుడు నివే - కము చాలదు,
అదరి యంతటిమీఁద - నై నాఁ దెలియఁ బోతే
వది జవ్వన మదము - వళమిందు గాదు. ॥ఎన్న॥

2. వెనకనేఁ బ్రౌడనై - విరతిఁ బొందే నంటే
దన వాంఛ నేమియుఁ - దడవ నీదు,
తనువు ముదిసి నీకుఁ - దపము నేవేనంటే
వొనర నేమిటికిని - వోపిక లేదు. ॥ఎన్న॥

1. గీత., 13-8, 9, 10, 11, 12.

3. శ్రీ వేంకటేశ! ఈ - సిలుగులఁ బెట్టనేల
కైవశమై నీవు - గలి గుండఁగా,
నీవె కృప వేసి - నేఁడిటు గావకున్న
పావనమైన యీ - పద మెందుఁ గద్దు. ॥ఎన్న॥

2. ప్రౌఢనై = ప్రౌఢుడనై, ప్రగల్భుడనై, నడివయసు వాడనై; విరతి = వైరాగ్యమును.

3. సిలుగులు = చిక్కులు.

శ్రీ లక్ష్మీపతీ : అజ్ఞుడనైన నేను ఎప్పుడు నీ మహిమను గుర్తించి నిన్ను సేవించి సుగతి నొందగలను : నా దుఃస్థితిని గుర్తెరిగిన నీవే దయదలచి నాకు ప్రత్యక్షమై కాపాడుదువు గాక :

పుట్టినంతనే నిన్ను కనిపెట్టుకొనియుండి సేవింతునన్నచో, అప్పుడు నీ ప్రభావమును, నిన్ను పూజించవలసిన ఆవశ్యకతను గుర్తింపగల తెలివి నాకు లేదు. పోనీ. కొంత పెరిగి బాల్యము గడచి యౌవనదశ ప్రాప్తించినప్పుడైన నిన్ను తెలిసికొందు మన్నచో యౌవనమదము నన్ను పైకొనుటచే అది నాకు సాధ్యము గాకున్నది.

ఇంకను పెద్దవాడనై యౌవనదశ గడచి నడివయస్సు ప్రాపించిననాడైన విషయసుఖములనుండి విరక్తిపొంది నిన్ను సేవింతువన్నచో ధనకాంక్షతో గూడిన నా మనస్సు నన్ను మరొక వ్యాసంగమునకు మరలనీయదు. పోనీ, వార్ధక్యమునైన నీకై తప మొనర్తునన్నచో ఆ స్థితిలో ఏమి చేయుటకును శక్తి చాలదు.

శ్రీ వేంకటేశ్వరా : నీవు నా కంటుబాటులో నుండియు నన్నెందుకీ చిక్కుల పాలు చేసెదవు ? నీవే దయజూపి నే డిట్లు నన్ను కాపాడకున్నచో పవిత్రమైన యీ పదవి నా కింకెందు గలదు ?

వి:- జీవునకు పుట్టినంతనే తన పుట్టుకకు కర్తయైన పరమేశ్వరుని భజించుట ముఖ్యకర్తవ్యము. కాని శైశవావస్థలో ఎవరికిని విశ్వకర్తయైన పరమాత్ముని గుర్తించు తెలివి యుండదు. కొంత వయస్సు వచ్చినవిమ్మటనే జీవుడు వివేకియై దేవుని గుర్తింపగలడు. బాల్యము గడచిన పిదపనైన అట్లు చేయువా రెందరు గలరు ?

శైశవమునం దజ్ఞానము, యౌవనదశలో కాంతావ్యామోహము, వృద్ధప్రాయములో ధనకాంక్ష మనుజుని భగవంతునకు విముఖునిగా నొనర్చుచున్నవి. కాని

కాలు చాచుకొనియున్న ముసలితనమున శక్తి చాలమితోపాటు ఎన్నో రోగములు, జీవుని కుంచించివేయుచున్నవి. అందుచే అప్పుడుగూడ భగవంతుని చింతించుట సాధ్యము కాకపోవుచున్నది. కావుననే శంకర భగవత్పాదులు—

బాల స్తావత్క్రీడాసక్తః తరుణ స్తావ త్తరుణీసక్తః।
వృద్ధస్తావ చ్చిన్తాసక్తః పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః॥[1]

అని లోకస్థితిని వర్ణించిరి. అనగా బాలు డాటపాటలతోను, యువకుడు యువతుల తోను, వృద్ధుడు మనోవేదనలతోను కాలము గడపుచున్నాడు. పరబ్రహ్మమునుగూర్చి చింతించువా డొక్కడును లేడని భావము.

ఈ స్థితిలో జీవుడు తనకు తానుగా భగవంతుని దెలిసికొనలేడు గాన భగవంతుడే దయజూపి వీనిని కాపాడవలెనని అన్నమయ్య చెప్పినాడు. కాని భగవంతుని దయ తనపై ప్రసరించునట్లు భక్తిగల్గి ప్రవర్తించుటమాత్రము జీవుని కర్తవ్యము. తాను పరమభాగవతుడై 'సంకీర్తనాచార్యుడు' అన్న పవిత్రపదవి నధిష్ఠించుటకు కారణము భగవత్కృపయే అని అన్నమయ్య చివరి చరణములో స్పష్టము చేసినాడు.

## 65

అవ:- సర్వాంతర్యామియైన పరమేశ్వరు నెఱుంగజాలని తన అజ్ఞతను నిందించుచున్నాడు—

### మాళవశ్రీ

ఇందుకుఁగా నా యెరఁగమి - నేమని దూరుదును
అందియు నినునేఁ దెలియక - అయ్యో నేనిపుడు. ॥పల్లవి॥

1. ఆతుమలోన నుండి - యఖిలోపాయములు
చేతనునకు నీవే - చింతించఁ గాను,
కాతురపడి నేను - కర్త ననుచుఁ బమలు
యీతలఁ జెప్పఁగఁబూనే - విస్సిరో! ॥ఇందు॥

1. భజగో., 7.

2. తను విటు నీ వొసఁగి - తగు భాగ్యము నీవై
అనువుగ జీవుని నీ - యటు నీవే లఁగను,
తవియక నే నొరులు - దాత లనుచుఁ బోయి
కనుఁగొని వేడఁగఁ దొడఁగేఁ - గటకటా! ॥ఇం॥

3. శ్రీ వేంకటాద్రి పై నుండి - చేరి తన్ను లెదుటను
సేవ గొని యిటే కృప - సేయఁగాను,
సోవలఁ గన్న వారెల్లాఁ - జుట్టము లంటా నేను
జీవులతోఁ బొందు సేసేఁ - జెల్లఁబో! ॥ఇందు॥

1. కాతురపడి = అధీరుడనై.

దేవా ! నీవు నాలోనే ఉన్నావు. ఇంతగా సన్నిహితుడవైన నిన్నందుకొనియు అందుకొన్నట్లు తెలియక నేను దీనుడనైతిని. ఇందుకు నా అజ్ఞానమును నే నేమని నిందింతును ?

ఆత్మలో అంతరాత్మగానుండి జీవునకు వలసిన ఉపాయము లన్నింటిని నీవే ఆలోచించి అందు తనువుగా ప్రవర్తింపజేయుచున్నావు. మతి చెదరిన నేను ఇన్నిటికి కర్తనని తలచి నా చేసిన పను లిట్టిట్టివని బడాయితనముతో చెప్పుకొన ప్రయత్నించుచున్నాను. ఇది యెంతో నింద్యము కదా !

నాకీ శరీరము నిచ్చినది నీవే. నాకుగల సంపదయంతయు నీవే. జీవు నెట్లు పాలింపవలెనో అట్లు నీయంతట నీవే పరిపాలించుచున్నావు. ఇట్టి నీ యీవితో తృప్తి పడక నేను నా కెట్టిసంబంధములేని ఒరు లెవరో ఏమో ఇత్తురనుచు బోయి వారిని యాచించుచున్నాను. అయ్యయ్యో ! ఇది యెంత వైచిత్ర్యము ?

నీవు శ్రీ వేంకటాచలముపై నెలకొన్న ప్రత్యక్షదైవమవై నాసేవ లందుకొని దయతో నన్ను కాపాడుచున్నావు. మూర్ఖుడనైన నేనిది గుర్తింపక కంటబడిన వారెల్లరు నాకు చుట్టములని పెక్కుమంది జీవులతో పొత్తు పెట్టుకొనుచున్నాను. కటకటా ! ఇది యెంత దుఃఖకరము ?

వి:- సర్వేశ్వరుడు సర్వమునకు నిర్వాహకుడు. అతడు జీవాత్మునిలో అంతరాత్మడై యున్నాడు. జీవుని చేష్టల కన్నింటికి కర్త అతడే. శరీరమును, నాని

పోషణ కనువగు సంపదను జీవున కిచ్చువా డతడే. ఇది తెలియక జీవులు కర్తృత్వ మును తమపై విడుకొని కష్టపడుచున్నారు. ఇతరుల నాశ్రయించుచున్నారు. ఇది మిక్కిలి శోచనీయమైన స్థితి. కావున జీవుడు విజ్ఞుడై పరమాత్ముని ప్రభావమును గ్రహించి అంతయు ఆయనకే సమర్పించి ఆయననే ఆశ్రయించి ముక్తుడు కావలెనని తాత్పర్యము.

## 66

అవ:- తనలో తానుండి తత్త్వము దలపోయువానికి బంధము లన్నియు తొలగు ననుచున్నాడు___

### లలిత

నేనై విడువ వద్దు -తానై తగుల వద్దు
తానే తానై వుండేఁ - దగులెల్ల మాను. ॥పల్లవి॥

1. పొద్దు వొద్దు హరిఁ దలఁ - పునఁ దలపోయఁగ
ఒద్దికైన పలు చేఁత - లున్న వెల్లా మరచును.
విద్దిరించు వానిచేతి - నిమ్మపంటి వలెనే
బుద్ధితోఁ గర్మములు గొ - బ్బున జారిపోవును. ॥నేనై॥

2. పలుమారు గురుసేవఁ - బరఁగఁగాఁ బరగఁగా
చలి వాసి యాత్మ వి - జ్ఞానముఁ బొడచూపు,
కలగన్న వాఁడు మేలు - కనిన కలవలెనే
పలు సంసారము లెల్ల - భావనలై యుండును. ॥నేనై॥

3. పక్కన శ్రీ వేంకటేశు - పై భక్తి వొడమఁగా
అక్కజపు టిహపరా - లరచేతివి యౌను.
చొక్కపు పరుసమంటి - సొంపుగాని లోహము
వెక్కఁ బైఁడైనటు - నెరు సెల్లఁ దొలఁగును. ॥నేనై॥

2. చలివాసి = వ్యక్తమై.

3. నెరుసు = దోషము.

కర్మమయమైన ఈ సంసారబంధమును నాకు నేనై విడువవలసిన పని లేదు. అది తనకు తానై నన్ను తగులవలసిన పనియు లేదు. జీవుడు అంతర్ముఖుడై తనలో తానుండి తత్త్వమును తలపోయుచున్నచో సంసార లంపటము లన్నియు తమకు తాముగా ఊడిపోవును.

అంతరాత్ముడైన శ్రీహరిని అనుదినము చిత్తములో దలంచుచున్నవాడు తనకు ఒద్దికైన పనుల నన్నింటిని మరచిపోవును. నిద్రించిన వానిచేతి విమ్మపండు జారి నట్లే లోకమును మరచి శ్రీపతిని చింతించువాని కర్మములన్నియు వెంటనే తమకు తాముగా జారిపోవును.

మాటిమాటికి గురుసేవ చేయగా చేయగా ప్రతిబంధము లన్నియు తొలగి ఆత్మ స్వరూపజ్ఞానము తనంత తానే వ్యక్తమై భాసించును. కలగన్నవానికి మేలుకవినంతనే ఆ కల రూపులేనిదైనట్లు ఆత్మజ్ఞుడైనవానికి వివిధములైన సంసారప్రక్రియలు ఉనికి లేనివై వట్టి భావనలుగామాత్రమే మిగిలిపోవును.

చెంతనే ఉన్న శ్రీ వేంకటేశ్వరునిపై భక్తి గల్గినచో ఇహమునకు, పరము నకు చెందిన ఉత్తమగతులెల్ల హస్తగతము లగును. ఇంపుసొంపులు లేని ఇనుము చొక్కమైన పరుసము నంటినంతనే నిక్కపు బంగారమై నిగనిగ మెరసినట్లు జీవుడు దేవునిపై భక్తి గల్గియున్నచో తన అజ్ఞానదోషము నంతయు తొలగించుకొని విజ్ఞాన స్వరూపుడై వెలయును.

వి:- సంసారము కర్మమయమైన బంధమై జీవులను పెనవేసికొనియున్నది. ఈ బంధమును త్రెంచుకొనుటే మోక్షము. అనాదిగా జీవుడీ సంసారప్రవృత్తి కలవడి యున్నాడు గాన తనకు తానుగా దానిని వదలుకొనజాలడు. సంసారముగూడ వీనిని తనకు తానుగా వదలిపెట్టి పోదు. ఏలన కర్మానుగుణముగా జీవుని బంధించుటే దాని స్వభావము.

ఈ స్థితిలో జీవునకు ముక్తి యెట్లు సిద్ధించును ? అను ప్రశ్నకు అన్నమయ్య సముచితమైన సమాధానము నొసంగుచున్నాడు. సదా భగవంతుని దలచుట, నిత్యము గురుసేవ యొనర్చుట, భగవద్భక్తి గల్గియుండుట అను ధర్మములను పాటించినచో సంసారబంధము లన్నియు తమకు తాముగా నశించిపోవునని ఈపాట తేటపరచు చున్నది.

సహజముగా కర్మలవైపు ప్రసరించునది చిత్తము. దానిని సంతత భగవచ్చింతనచే కర్మలనుండి మరల్పవలెను.

మఱియు గుర్వనుగ్రహము లేనివాడు ఆత్మతత్త్వము నెఱుంగజాలడు. గురుప్రసాదముచే తనలో అంతర్యామిగా నున్న పరమాత్మను నిరీక్షించు సమత్వపరునికే ఆత్మజ్ఞానము కలుగునని గురుగీతలో శివుడు వచించెను—

గురుప్రసాదతః స్వాత్మ న్యాత్మారామ నిరీక్షణాత్ ।
సమతా ముక్తి మార్గేణ స్వాత్మజ్ఞానం ప్రవర్తతే ॥[1]

కావున గుర్వనుగ్రహముకొఱకై సదా గురుసేవ యొనర్పవలెను.

అన్నిటికన్న మిన్నయైనది హరిభక్తి. అది సమస్త కిల్బిషములను శమింపజేసి జీవుని దేవుని చెంతకు జేర్చును.

## 67

అవ:-నిజమైన సుఖము పరమాత్ముని సేవలోనే కలదనుచున్నాడు—

### వరాళి

ఎఱిఁగీ నెరఁగదు - యేమి సేతు మతి
హరిదాస్యం - బదియే సుఖము. ॥పల్లవి॥

1. వెతలఁ బొరలే ఘన - విభవము కంటే
అతిపేదరిక - మది సుఖము,
గతి నెరవుల సిం - గారము కంటెను
సతమగు తన వి - చ్చలమే సుఖము. ॥ఎఱిగీ॥

2 పలు బాములఁబడు - పగలిటి కంటే
తెలిసి నిద్రించురా - తిరి సుఖము,
అలమట గడించు - నమృతము కంటే
కలపాటి తనకు - గంజే సుఖము. ॥ఎఱిగీ॥

1. గు. గీ., 155.

3. పరపీడ లోనఁగు - భవమున కంటే
ధరఁబొడ మని చం - దము సుఖము,
గరిమల శ్రీ వేం - కటపతి నీకే
శరణనియెడి నా - జన్మమె సుఖము. ॥ఎరిగీ॥

1. ఎరవులు = అరువుగా పరుల నడిగి తెచ్చుకొను సొమ్ములు; సతము = శాశ్వతము; నిచ్చలమే = నిశ్చలమే.

3. భవము = పుట్టుక; పొడమని చందము = జన్మరహితస్థితి.

శ్రీ హరిదాస్య మొక్కటే నిక్కముగా సుఖము నొసంగునది. మరి యేదియును సుఖకరము గాదు. ఈ సంగతి తెలిసియు నా చిత్తము తెలిసినట్లు ప్రవర్తించుట లేదు. ఇందుకు నేనేమి చేయుదును?

పెక్కు చిక్కులబడి ఆర్జించు పెద్ద సంపదకంటె ఎట్టి చిక్కులును లేని కటిక పేదరికమే సుఖము. ఇతరుల నడిగి ఎరవుగా తెచ్చుకొన్న సొమ్ములచే చేసికొను సింగారముకంటె ఎట్టి ఆడంబరము లేని శాశ్వతమైన తన నిశ్చలస్థితియే సుఖావహము.

వలు కష్టములపాలగు పగటివేళకంటె చీకు చింతలు లేక గాఢనిద్రలో గడపు రాత్రియే సుఖము. ఎంతో శ్రమపడి సంపాదించు అమృతముకంటె ఎట్టి శ్రమయు లేక లభించిన గంజియే సుఖకరము.

మాటిమాటికి ఇతరులను పీడించుచు జీవితయాత్ర సాగించు పుట్టుకకంటె ఇలలో పుట్టుకలేని స్థితియే సుఖము. అన్నివిధముల గొప్పవాడవైన శ్రీ వేంకటేశ్వరా! నిన్నే శరణు జొచ్చు నాజన్మమే సుఖకరము.

వి:- సుఖాపేక్షతో మానవు లర్థము నార్జింపగోరి ఎన్నో శ్రమలకు గురియగుచున్నారు. ఎందరినో పీడించుచున్నారు. ఆర్జించిన విత్తమును కాపాడుకొనుటకై పరితపించుచున్నారు. గాఢనిద్రలో గడపు కాలమువదప్ప తక్కిన సమయములలో వారికి విశ్రాంతి యన్నది లేదు. ఐనను శ్రమకు దగిన సుఖము వారికి దక్కుట లేదు. తన కున్నదానితో తనివి జెందెడు పేదవాని కున్న సుఖము ధనికున కెక్కడిది? పుట్టి ఇక్కట్టుల పాలగుటకంటె పుట్టుకలేని స్థితి; అనగా మోక్షమే సుఖకరమైనది. అట్టి స్థితి భగవద్దాస్యమువలననే పొందదగినది యన్నది. కాబట్టి శ్రీహరిని శరణొందుటయే శాశ్వత సుఖప్రాప్తికి త్రోవయని తాత్పర్యము.

## 68

అవ:- సన్మార్గమున ప్రవర్తించుచు శ్రీహరిని భజింపుమని చిత్తమును హెచ్చరించుచున్నారు—

### దే: గాంధారి

నమ్మితిఁ జుమ్మీ వో మనసా-నాకే హితవయి మెలఁగుమీ
మున్నూటికి నేఁ జెప్పితిఁ జుమ్మీ-మురహరు నామమె జపించుమీ
॥పల్లి॥

1. తలఁచకు మీ యితర ధర్మములు-తత్వజ్ఞానము మఱవకుమీ
కలఁగకుమీ యే పనికైనను-కడు శాంతంబున నుండు మీ,
వలవకుమీ వనితల కెప్పుడు-వైరాగ్యంబున నుండుమీ
కొలువకుమీ యితర దైవముల-గోవిందునినే భజించుమీ ॥నమ్మి॥

2. కోరకుమీ దేహ భోగములు-గొనకొని తపమే చేకొనుమీ
మీరకుమీ గురువుల యానతి-మెఱయఁ బురాణములే వినుమీ,
చేరకుమీ దుర్జన సంగతి-జితేంద్రియుఁడవై నిలువుమీ
దూరకుమీ కర్మ ఫలంబును-ధ్రువ వరదునినే నుతించుమీ॥ నమ్మి॥

3. వెఱవకుమీ పుట్టుగులకు మరి-వివేకించి ధీరుఁడ వగుమీ
మఱవకుమీ యలమేల్మంగకు-మగఁడగు శ్రీ వేంకటపతిని,
కెఱలకుమీ మాయారతులను-కేవల సాత్త్వికుడవు గమ్మీ
తొఱలకుమీ నేరములను సిం-ధుర రక్షకునినె సేవించుమీ ॥నమ్మి॥

1. ఇతరధర్మములు = భగవత్ప్రాప్తికి ఉపకరింపని ధర్మములు.
2. గొనకొని = ప్రయత్నించి, జితేంద్రియుఁడవై = జయించబడిన ఇంద్రియములు గలవాడవై, ధ్రువవరదుని = ధ్రువునకు వరమిచ్చిన శ్రీమన్నారాయణుని.
3. కెఱలకుమీ - త్రుళ్ళి పడకుమీ, మాయారతులను = మాయతోగూడిన సంపదలయందలి ఆసక్తులతో, సింధురరక్షకుని = గజేంద్రుని కాపాడినవానిని.

ఓ చిత్తమా ! నేను నిన్నే నమ్మినాను సుమా ? నాకే మేలు గల్గించుచు ప్రవర్తించుము. నేను మున్నూటికి నీకు బోధించుచున్నాను. మురాంతకుడగు నారాయణ నామమునే జపింపుము.

భగవత్ప్రాప్తికి హేతువులగు భాగవతధర్మములు దప్ప ఇతరధర్మముల నెన్న టికినీ తలంపకుము. పరతత్త్వ విజ్ఞానమును విస్మరింపకుము. ఎంతపని పైబడినను కలతనొందక ధైర్యముతో నుండుము. మిక్కిలి శాంతిగలిగి ప్రవర్తింపుము. ఎప్పు డును వనితలకై వలపు పెంచుకొనకుము. ఐహిక భోగములపట్ల వైరాగ్యము గలిగి యుండుము. ఇతర దేవతలను సేవింపకుము. గోవిందునే సేవింపుము.

శారీరకభోగములు కోరకుము. ప్రయత్నముతో తపస్సే చేపట్టుము. గురువుల యాజ్ఞ మీరకుము. భగవద్వర్ణనాత్మకములైన పురాణగాథలనే ప్రకటముగా వినుము. దుర్జనులతోడి పొత్తున జేరకుము. ఇంద్రియములను నిగ్రహించి ధీరతతో నుండుము. ఏ కర్మములకు వచ్చు ఫలములను నిందింపకుము. ధ్రువునకు వరములిచ్చిన శ్రీమ న్నారాయణునే స్తుతింపుము.

జన్మము లెత్తవలసి వచ్చినదని భయపడకుము. వివేకముగలిగి ధీరుడవై జన్మములను సార్థకపరచుకొనుము. అలమేల్మంగకు పతియగు శ్రీ వేంకటేశ్వరు నెన్నడును విస్మరింపకుము. మాయామయములైన సంసారభ్రాంతులతో భ్రమసి పడ కుము. శుద్ధ సాత్త్విక ప్రవృత్తి గలవాడవు గమ్ము. నేరము లొనర్పకుము. గజేంద్రుని రక్షించిన శ్రీ మహావిష్ణువునే భజింపుము.

## 69

అవ:- ఏ ఒకనికో గాని భగవంతు నెఱుంగుటకు అందరికి వశము గాదను చున్నాడు—

### రామక్రియ

అందరి వశమా - హరి నెఱఁగ
కందువగ నొకఁడు - గాని యెరఁగఁడు. ॥పల్లవి॥

1. లలితపు పది గో - ట్ల నొకఁడు గాని
కలుగఁడు శ్రీ హరిఁ - గని మనఁగ.
ఒలిసి తెలియు పు - ణ్యుల కోట్లలో
ఇల నొకఁడు గాని - యెరఁగడు హరిని. ॥అంద॥

2. శ్రుతి చదివిన భూ - సురకోట్లలో
గతియను హరినె యొ - కొ నొకఁడు.
అతిఘను లట్టి మ - హాత్మ కోటిలో
తతి నొకఁడు గాని - తలఁచఁడు హరిని. ॥అంద॥

3. తుద కెక్కిన వి - ద్యల కోట్లలో
పొదుగు నొకఁడు తలఁ - పున హరిని.
గుదిగొను హరి భ - క్తుల కోట్లలో
వెదకు నొకఁడు శ్రీ - వేంకట పతిని. ॥అం ద॥

శ్రీహరి నెఱుంగుటకు అందరికి శక్యమా ! ఒకానొక విజ్ఞాని తప్ప పరమాత్మని జాడ నెరిగి గుర్తించువారు మరెవ్వరును లేరు.

పదికోట్ల మందిలో ఏ ఒక్కడో తప్ప మరెవ్వడును శ్రీహరిని గుర్తింపగల వాడు లేడు. అట్లు గుర్తించిన కోట్లకొలది పుణ్యాత్ములలో ఒక్కడు మాత్రమే హరి తత్త్వమును పూర్తిగా అనుభవమునకు తెచ్చుకొనుచున్నాడు.

వేదములు చదివిన కోట్లకొలది విప్రులలో 'హరియే గతి' అని చెప్పువాడు ఒకానొకడు మాత్రమే. అట్లు చెప్పు మహాఘనులైన పలువురు మహాత్ములలో ఏ ఒకడో తప్ప ఇంకెవ్వడును హరిని నిక్కముగా మదిలో భావింపడు.

విద్యావివేకాదులచే మహాప్రతిష్ఠ గాంచిన విశ్వస్వరూపులైన అనేక జీవుల గుంపులలో తలపున శ్రీహరిని నిల్పువా డొకడే. అన్నివిధముల అతిశయించిన హరి భక్తుల సమూహములలో శ్రీ వేంకటేశ్వరుని నిజముగా అన్వేషించి కనుగొనువా డొక్కడే.

వి:—ఎన్ని విషయములను తెలిసికొన్నను. [illegible] విజ్ఞాన మార్జించినను భగవంతు నెఱుంగక ముక్తి చేకూరదు. [illegible] సాధింపుటకు జనులు యత్నింతురు గాని భగవత్ప్రాప్తికై పారమార్థికముగా [illegible] చేయువా రరుదు. అట్లు ప్రయత్నించువారిలో గూడ త్రికరణశుద్ధిగా భగవంతుని [illegible] ఆయన దయకు పాత్రుడై ఆయన స్వరూపమును తాత్త్వికముగా గుర్తింపగలవాడు వేలకొలది జనులలో ఒక్కడే. అందుకే గీతాచార్యు డిట్లు నుడివెను—

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ [1]

ఈ గీతోక్తినే అన్నమయ్య ఇట వివరించినాడు.

1. గీత. - 7-3.

70

అవ:- మాయ కధీనులై సంసారమును వీడలేని జీవుల దుఃస్థితిని వర్ణించు చున్నాడు—

ఆహిరి

మాయల కగపడి - మఱిచెడి ప్రాణులు
రోయఁ దలఁచియును - రోయఁగ లేరు, ॥పల్లవి॥

1. మిస మిస మెఱవఁగ - మెల్లన చేరిరి
ముసిఁడిమాని ఫల - ములు చూచి.
రసమని సంసా - రపు బాలకులిదె
విసిగి చేదుగని - విరుగగ లేరు. ॥మాయ॥

2. బలు విష మొలికెడి - పాముఁ బట్టుకొని
అలరుచు నలుగడ - నాడేరు,
వొలసి యాసలూ - ర్పులు నిగుడించఁగ
తెలిసియు వింకాఁ - దెలియఁగ లేరు. ॥మాయ॥

3. తేనె దెచ్చి క - త్తికి దారఁ బెట్టి (వి)
నానా విధముల - నాఁకేరు,
దీనత లణఁపెడి - తిరు వేంకటపతి
చేని వంబలకుఁ - జెయి చాఁచ లేరు. ॥మాయ॥

మాయకు వశమగుటచే బుద్ధిహీనులై కుటిలసంసారమున దగులువడిన జీవులు ఆ సంసారమువల్ల రోత జెంది విడువదలచియు విడువజాలకున్నారు.

సంసారము నంటుకొనియున్న బాలకులు (అజ్ఞాని జనులు) ముష్టిచెట్టు పండ్లు మిసమిస మెఱయుచుండుట జూచి అందు తీపు గలదని తలచి ఇదిగో మెల్లగా వాటిదరి చేరిరి. చివరికి ఆ ఫలముల నాస్వాదింపగా చేదే అనుభవమునకు వచ్చినదిగాని అందు తీపు లేదాయెను. అట్లు విసుగుజెందియు మాయాప్రభావముచే వారు వాటిని విడిచి రాలేకున్నారు.

దారుణమైన విషము గ్రక్కుచున్న పామును చేతబట్టుకొని సంసారులు గంతులు వైచుచు నలువైపుల నాట్యము చేయుచున్నారు. ఆ పాము బుసకొట్టుచు ఆశలనెడు నిట్టూర్పులు నిగుడించుచున్నది. అందలి ప్రమాదమును గుర్తించియు మాయకు వశ పడుటచే పూర్తిగా గ్రహింపలేక అట్లే ఆడుచున్నారు.

తేనె తెచ్చి కత్తి వాదరపై పూసి అందలి విపత్తును గ్రహింపక పలుతెరగుల నాకుచున్నారు. దైన్యములను తొలగించు శ్రీ వేంకటేశ్వరు డనెడు చేని పంట సమృద్ధిగా లభించుచున్నను దాని నందుకొనుటకు మాత్రము ప్రయత్నింపకున్నారు.

వి:- మాయ దాటరానిది. 'మమ మాయా దురత్యయా' అని భగవానుడే చెప్పి యున్నాడు. మాయాప్రభావముననే సమస్త సంసారలీలలు సాగుచున్నవి.

అడుగడుగున ఎన్నో విపత్తులు సంసారములో నెదురగుచుండుట అందరికి అనుభవములోనున్న విషయమే. అందుచేతనే ఇట సంసారము ముష్టి చెట్టుగను, త్రాచుపాముగను, తేనెబూసిన కత్తి వాదరగను రూపింపబడినది. ఏదో సుఖ మనుభ వింప బోవుచున్నట్లు సంసారులు భ్రమ పడుచున్నారేగాని నిజముగా వా రనుభవించునది దుఃఖమే అను విషయము పై రూపణములచే వ్యక్తమగుచున్నది. విసిగియు జీవులు సంసారమును వీడి రాలేకుండుటకు హేతువు భగవన్మాయయే.

ఈ మాయను దాటుటకు తన్నే శరణొందవలెనని భగవంతుడు తెలపిచ్చి యున్నాడు——

'మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే.'

శ్రీ వేంకటేశ్వరుడు ఇట చేని పంటగా రూపింపబడినాడు. చేనిపంటవలె చేయి చాచినచో అందు వంత సన్నిహితముగా ఆ దేవు డున్నాడు. కాని మాయకు లోబడిన ప్రాణులు ముష్టిచెట్టు పండ్లు మున్నగు క్లేశకరములైన పదార్థములబోలు సంసార సుఖముల కెగబడుచున్నారే కాని చేని పంటవంటి శ్రీనివాసునికై ప్రయత్నించుట లేదు. భక్తిహీనులు భగవంతుని కొలు కెంతమాత్రము పాటువడక జనన మరణాత్మకమైన సంసార చక్రమునందే సదా పరిభ్రమించుచున్నారని అభిప్రాయము.

## 71

అవ:- శ్రీహరిని శరణు జొచ్చుటతప్ప ఇతరోపాయములు తనకు నచ్చవను చున్నాడు——

## సామంతం

ఏమనవచ్చును గొందరి - కింపౌ బులుసులు దీపులు
సోమరి తనమున నిన్నిటఁ - జొరదీ నా తలఁపు. ॥పల్లవి॥

1. పదిలంబుగ సర్వాత్మక - భావము దలఁచిన పిమ్మట
ముదమున నెవ్వరిఁ జూచిన - మొక్కక పోరాదు,
వదలక యిన్నిటను శ్రీ - వల్లభుఁడున్నాఁ డుండిన
హృదయము చంచల మిన్నిట-నెనయదు నా మనసు. ॥ఏమన॥

2. ఎక్కడఁ జూచినఁ బ్రాణుల - కిన్నియు నాచారములే
చిక్కక యిన్నియుఁ గైకొని - చేయక పోరాదు,
ముక్కవ నిన్నియు శ్రీహరి - మతములె కానీ అయినా
ఒక్కటియే చాలును నా - కొడఁబడ వితరములు. ॥ఏమన॥

3. ఏ రీతుల నటు చూచిన - నిందరు బలు దైవములే
కూరిమి నందరి నటువలెఁ - గొలువక పోరాదు.
ధారుణి వేంకటపతి చేఁ - తలు ఇవియైనాఁ గాని
కోరిక నాకితఁడే మరి - కొర కొర లిన్నియును. ॥ఏమన॥

లోకము భిన్నభిన్న రుచులు గలవి. కొందరికి పులుసు లిష్టము కాగా, మరి కొందరికి తీపు లిష్టము లగుచున్నవి. అట్లే కొందరు కొంతమంది దేవతల నారాధించు చుండ, మఱికొందరు వేరొక కొందరి నారాధించుచున్నారు. దీనికి నే నేమనగలను? నేను మాత్రము సోమరిని. అందుచే నా చిత్తము అన్ని రుచుల నాస్వాదించుటకు (అంతమంది వేల్పుల నారాధించుటకు) అంగీకరించదు.

సర్వులలోను అంతర్యామిగా నున్నవాడు ఆ పరమాత్మ యొక్కడే అని స్థిరముగా తలచిన తర్వాత ఎవరిని చూచినను సంతసముతో నమస్కరింపవలసినదే. లక్ష్మీపతి అంతటను నిండియున్నాడు. ఐనను నాచిత్తము చంచలమైనది కాన అన్నింటిని సమదృష్టితో పొందకున్నది. అందుచే నే నా పరమాత్మునికి దప్ప ఒరులకు నమస్కరింపలేను.

ఎక్కడ చూచినను జప తపో వ్రతాదులైన తరణోపాయము లన్నియు ప్రాణులకు ఆధారములుగానే ఉన్నవి. కావున అవి యన్నియు పాటింపదగినవే. అన్నియు శ్రీహరి కభీష్ట మైన మతములే. ఐనను ఆ దేవుని శరణాగతి యొక్కటియే నాకు చాలును. తదితరములు నాకు గిట్టవు.

ఏ రీతిగా పరిశీలించి చూచినను ఇందరు పెద్దపెద్ద దేవతలే. అందుచే అందరిని ప్రేమతో ఆరాధింపవలసినదే. లోకములో గల వివిధములైన ఈ ఆరాధనలన్నియు శ్రీ వేంకటేశ్వరుడు కల్పించినవే. కాని నాకు మాత్రము కోరిక ఆ ఒక్క దేవుని మీదనే. తక్కినవా రెవ్వరును నా కభీష్టమైనవారు కారు.

వి:- 'పరుల గొలవకుంటే పతివ్రతాభక్తి' అనియు,

> 'గట్టిగా శ్రీ వేంకటేశు కైంకర్యమే సేసి
> తట్టు ముట్టు లేనిదే - తగ నిజభక్తి.'[1]

అనియు భక్తిభేదములను పేర్కొనుచు అన్నమయ్య మరొకచో ప్రస్తుతించినాడు. అట్టి పతివ్రతాభక్తినే, నిజభక్తినే ప్రకృత సంకీర్తనములో వివరించినాడు.

హరి సర్వాత్మకు డనుటయందును, సమస్త తరణోపాయములు హరి కల్పితము లనుటయందును అన్నమయ్యకు గట్టి నమ్మకము లేకపోలేదు. 'హరి యవతారములె అఖిల దేవతలు' ఇత్యాది కీర్తనములలో దేవతలెల్లరు హరికి మారురూపులే అని ఆయన నొక్కి వక్కాణించియున్నాడు. ఐనను తాను హరిని తప్ప మరొకరిని సేవింపజాలనని చెప్పుటచే హరియందు ఆయనకు గల అచంచలమైన విశ్వాసము ప్రకటింపబడినది. 'ఒక్కటియే చాలును' అనుటచే ఒక్క శరణాగతి పద్ధతియే తమ్ము కడతేర్చుటకు చాలునన్న దృఢవిశ్వాసము స్పష్టీకరింపబడినది. హరి సర్వాత్మకుడని అంగీకరించుచునే హరినితప్ప ఒరులను తా నారాధింపలేనని చెప్పుటచే హరిపై తన కున్న పతివ్రతాభక్తి ఎంత పరాకాష్ఠకు చెందినదో అన్నమయ్య ఇట వ్యక్తము గావించినాడు. ఇట్టి గట్టినమ్మకమే ప్రపత్తికి పట్టుగొమ్మయని శాస్త్రములు ప్రతిపాదించుచున్నవి.

---

1. అ. సం., 7-285.

## 72

అవ:- సంసారికి భగవంతుని శరణుజొచ్చువరకు దుఃఖమునుండి విడుదల లేదనుచున్నాడు—

### ఆహిరి

ఇట్టె సంసారి - కేదియు లేదాయ
తట్టువడుటే కాని - దరిచేర లేదు. ॥పల్లవి॥

1. ములిగి భారపు మోపు - మోఁచేటి వాఁడు
అలసి దించుకొను - నాడాడను,
అలరు సంసారికి - నదియు లేదాయ
తొలఁగని భారమెం - దును దించ లేదు. ॥ఇట్టె॥

2. తడవి వేఁప చేఁదు - త్రాపెడి వాఁడు
ఎడయెడఁ దినుఁ దీ - పే మైనను,
అడరు సంసారికి - నదియు లేదాయ
కడుఁ జేఁదె కాని యె - క్కడఁ దీపు లేదు. ॥ఇట్టె॥

3. దొరకొని హేయమే - తోఁడేటి వాఁడు
పరితవించును మేనఁ - బరిమళము.
అరిది సంసారికి - నదియు లేదాయ
ఇరవు వేంకటపతి - నెఱుఁగ లేఁడు. ॥ఇట్టె॥

ప॥ తట్టువడుట = బాధపడుట.

1. ములిగి = మూలిగి.

3. హేయము = త్యజింపదగినది; పరితవించుచు = వరించుచు. పూయుచు; ఇరవు = ఆశ్రయము.

సంసారములో నున్నవానికి ఎట్టి సుఖము లేదు. అతడెంత పేపటికిని ఏదో ఒక కారణముచే బాధపడుచుండునే కాని సంసారసాగరముయొక్క తీరము చేరలేని వానికి, వీలు చిక్కుటలేదు.

శ్రమపడి మూలిగి బరువైన మోపు మోయువాడు అలసిపోయినప్పుడెల్ల అక్కడక్కడ తన మోపు దింపుకొని విశ్రాంతి గైకొనును. కాని సంసారికి మాత్రము తన సంసారభారము దించుకొను వెరవు లేదు. అది తొలగద్రోయరాని బరువై వానిపై బడియున్నది, కాన దానిని జీవితాంతము దించుకొనుట కవకాశము లేకున్నది.

వేప చేదు త్రాగువాడు చేదుకు విసిగినప్పుడెల్ల కొంత తీపు దిని తృప్తి నొందగలడు. కాని సంసారికి అట్లు చేయుటకు అనువు గాకున్నది. సంసారములో అనుభవమునకు వచ్చు పదార్థములెల్ల చేదేగాని అందెక్కడను తీపన్నది లేనే లేదు.

రోతపడి త్యజింపదగిన వస్తువులను తోడి శుభ్రపరచువాడు దుర్గంధముతో గూడిన తన శరీరమును కడిగి ఎడనెడ సుగంధద్రవ్యములను పూసికొనగలడు. కాని సంసారికి హేయమైన తన బంధమును వదలించుకొనుట కవకాశము లేదు. వాడు ప్రకృతికి బద్ధుడగుటచే సమస్త సృష్టి కాధారమైన శ్రీ వేంకటేశ్వరుని తెలియజాలకున్నాడు.

వి:- సంసారసాగరములో బడి ఎడతెగని ఇక్కట్లకు గురియగుచు దరిచేరలేని జీవుల దుఃస్థితి ఈ సంకీర్తనములో వర్ణింపబడినది. పరమాత్ముని తత్త్వము నెఱుంగజాలనంతవరకు ఈ దుర్గతి వానికి తప్పుట లేదు. ప్రకృతిబంధమును త్రెంచుకొని సర్వేశ్వరుని తెలిసికొన్ననాడు వాడు క్లేశములనుండి విడుదల పొందును. 'ఇరవు వేంకటపతి నెఱుగలేడు' అనుటలోని రహస్య మిదే.

సంసారమును భారపు మోపుతోను, వేప చేదుతోను, హేయపదార్థముతోను పోల్చుటచే అందు తగులుపడిన జీవుల క్లేశము లెట్టివో వ్యక్తీకరింపబడినవి.

46 వ నిడు రేకులోని మరొకపాటలో గూడ సంసారశ్రమ గాలియూయెలలో నూగినట్లు విరతిలేనిదై పెక్కు చిక్కులు కల్గించుచున్నదని చెప్పుచు అన్నమయ్య ఇట్లు వర్ణించినాడు—

ఆహిరి

చాలదా నా - సంసారము
గాలి యుయ్యేలలఁ దొలఁ - గక యూఁగవలసె. ॥పల్లవి॥

పాపపుణ్యము లనెడి - బల్లిదుల వెంటనే
దీపించు బంటనై - తిరిగి తిరిగి,
పైపైనె దేహంపుఁ - బల్లె లోనఁగిన నరక
కూపముల మడిదున్ని - కొని బ్రదుకవలసె. ॥చాల॥

చిత్తమను విభుఁజేరి - చెలఁగి విషయంబులకు
కొత్త గమికాఁడనై - కొలిచి కొలిచి,
హత్తుకొని మోహంబులను - ప్రధానుల మెదుట
గత్తంపు మొగసాలఁ - గలదించ వలపె (?) ॥చాల॥
గాటంపు దురితముల - కై జీతగాఁడనై
చేకొన కోరికలఁ - జేరి చేరి,
ఈటాడఁ విరు వేంక - టేశుఁ గవ కిన్నాళ్లు
కోట కొమ్మల కెగపి - గుంపించ వలపె.1 ॥చాల॥

## 73

అవ:- భగవద్భక్తి ఎడతెగనిదై యుండవలెనని యుద్బోధించుచున్నారు -

### బౌళి

పరమ సుజ్ఞానులకు - ప్రపన్నులకు
మరుగురుని మీఁదట - మనసుండ వలదా. ॥పల్లవి॥

1. ఆఁకలి గొన్నవానికి - నన్నముపై నుండి నట్టు
యేఁకట వుండవలదా - యీశ్వరునిపై.
కాఁకల విటులచూపు - కాంతలపై నుండినట్టు
తేఁకువ నుండ వలదా - దేవుని మీఁదటను. ॥పర॥

2. పసి బిడ్డలకు నాస - పాలచంటిపై నున్నట్లు
కొసరి భక్తివలదా - గోవిందునిపై.
వెస దెరువరి తమి - విడిదలపై నున్నట్టు
వసియించవలదా శ్రీ - వల్లభు మీఁదటను ॥పర॥

3. నెప్పున ధనవంతుఁడు - నిధి గాచి యుండినట్టు
తప్పక శ్రీ వేంకటేశుఁ - దగులవద్దా,
అప్పనమైన భ్రమ - ఆలజాలాల కున్నట్టు
యిప్పుడే వుండవలదా - యీతని మీఁదటను. ॥పర॥

1. అ. సం., 11-2-27.

ప॥ మరు గురునిమీఁద = మన్మథుని తండ్రియైన విష్ణునిపై.

1. ఏఁకట = మిక్కిలి యపేక్ష: కాఁకల = మన్మథతాపముతో గూడిన.

2. తమి = అపేక్ష.

3. నెవ్వునఁ = నేర్పుతో; అప్పసమైన = ఎడతెగని; అలజాలాలు = నీట గిర గిర దిరుగు ఒకరకపు పురుగులు.

("తటతటన నీటిమీదట నాలజాలంబు లిటు నటు చరించవా యాది యాది" అని మరొక ప్రయోగము).[1]

శ్రేష్ఠమైన సుజ్ఞానము గలవారికి, ప్రపత్తిమార్గము ననుసరించువారికి మాధవు నిపై సదా మనస్సు లగ్నమై యుండవలెను.

ఆకలిగొన్నవానికి అన్నముపై నుండినట్లు భక్తునకు పరమేశ్వరునిపై తీవ్ర మైన అపేక్ష యుండవలెను. కామార్తులైన విటుల చూపు కాంతలపైననే ఉండినట్లు జిజ్ఞాసువులకు దేవునిమీదనే దృఢమైన దృష్టి యుండవలెను.

పసిబిడ్డలకు పాలచంటిపైననే ఆశ ఉన్నట్లు భక్తులకు గోవిందునిపైననే భక్తి స్థిరమై యుండవలెను. బాటసారి అపేక్షయంతయు తాను విడియుచోటనే ఉన్నట్లు ప్రపన్నునకు శ్రీనాథునిమీదనే లక్ష్య ముండవలెను.

ధనికుడు ఏమరుపాటులేక నేర్పుతో తన ధనపేటికను కాచుకొనియుండినట్లు శరణాగతుడు శ్రీ వేంకటేశ్వరునే అనుసరించి యుండవలెను. అలజాలములకు నీటిపై ఎడతెగని భ్రమణ మున్నట్లు ఈ దేవునిపై భక్తులకు సంతతప్రేమ యుండవలెను.

వి:- భగవంతుని ఎప్పుడో ఒకసారి చిత్తమున భావించిన చాలునా ? లేక సదా ఆ పరమాత్మని చింతించుచుండవలెనా ? అను సంశయము గలవారికి ఈ సంకీర్తనము తగిన సమాధానము నొసంగుచున్నది. ప్రపన్నుడు దృఢవ్రతుడై పరమేశ్వరుని సంతతము చింతించుచుండవలెనే గాని ఎప్పుడో ఒకసారి భావించుట చాలదు.

గీతలో శ్రీ కృష్ణుడు దృఢవ్రతులైన ప్రయత్నశీలురు భక్తితో నిత్యయుక్తులై తన్ను సంతతము కీర్తించుచు, నమస్కరించుచు ఉపాసించుచుందురని చెప్పెను.

---

1. అ. సం., 11-3-39.

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥1

నారదుడు అనన్య భక్తుని ప్రవర్తనమును వివరించుచు అట్టివాడు భగవత్స్వ రూపమునే చూచును, దానినే వినును, దానినే చింతించునని చెప్పెను—

తత్ప్రాప్య తదేవావలోకయతి, తదేవ శృణోతి, తదేవ చిన్తయతి.2

మరియు తైలధారవలె అవిచ్ఛిన్నమైన భగవంతునియందలి ప్రీతియే భక్తి యనియు, అదియే క్రమాభివృద్ధినొంది పూర్ణస్థితి నొందుననియు, పూర్ణభక్తిచే జ్ఞానము చేతవలెనే సంసారమును దాటుననియు పెద్దలు పేర్కొనిరి—

అచ్ఛిన్నా తైలధారావత్ ప్రీతిర్భక్తి రుదాహృతా ।
వర్ధమానా చ సా భక్తిః కాలే పూర్ణా భవిష్యతి ।
పూర్ణయా పరయా భక్త్యా జ్ఞానేనేవ భవం తరేత్ ॥3

అన్నపానాది నిత్యకృత్యములు చేయునప్పుడుగూడ ప్రహ్లాదాదులు భగవత్పాద ములు నేమరకుండిరని భాగవతము తెల్పుచున్నది. పరతత్త్వజ్ఞుడైన భక్తుని స్థితిని సీతారామాంజనేయ సంవాద మిట్లు వర్ణించినది—

పరపురుషాను రక్తిగల భామిని యెల్లపనుల్ గృహంబునన్
బొరిఁబొరిఁ జేయుచున్ ప్రియుని బొందు సుఖంబుగఁ జూచురీతి భా
స్వర పరతత్త్వవేది నిజవర్ణ నిజాశ్రమయోగ్య ధర్మముల్
నిరతము సల్పుచున్ బరమ నిర్మల సౌఖ్యము గాంచు నెమ్మదిన్. 4

## 74

అవ:- అన్నమయ్యను భగవదవతారముగా కీర్తించుచు ఆయన సంతతివారు పాడిన పాట—

### సౌరాష్ట్రం

హరి యవతారమె - అతఁ డితఁడు
పరము సంకీర్తన - ఫలములో విలిచె. ॥పల్లవి॥

1. గీత., 9-14. 2. నా. భ. సూ. - 55.
3. సూ. ప్ర. 4. సీ. రా. సం. 3-115.

1. ఉన్నాఁడు వైకుంఠమున - మున్నాఁడు యాచార్యునొద్ద
ఉన్నతోన్నత మహిమ - నన్నమయ్య.
ఉన్నవి సంకీర్తనాలు - వొట్టుక లోకములందు
పన్నిన నారదాదులు - పైపైఁ బాడఁగను. ॥హరి॥

2. చరియించు నొకవేళ - సనకాది మునులలో
హరిఁబాడుఁ దాళ్ళపాక - అన్నమయ్య.
తిరమై యాళువారల - తేజము దానై యుండు
గరుడానంత ముఖ్య - ఘనుల సంగడిని. ॥హరి॥

3. శ్రీ వేంకటాద్రి మీఁద - శ్రీ పతి కొలువునందు
ఆవహించెఁ దాళ్లపాక - అన్నమయ్య.
దేవతలు మునులును - దేవుఁడని జయ వెట్టఁ
గోవిదుఁడై తిరిగాడీఁ - గోనేటి దండను. ॥హరి॥

ప॥ పరము = మోక్షము.

2. తిరమై = స్థిరమై; సంగడిని = పార్శ్వమునందు.

అన్నమయ్య శ్రీహరి యవతారమే. ఇతడు మోక్షమును సంకీర్తనఫలముగా స్థాపించినాడు.

అన్నమయ్య వైకుంఠములో మహోన్నతమైన మహిమతో నొప్పారుచు ఆచార్యుని చెంతనే యున్నాడు. నారదుడు మున్నగువారు మాటిమాటికి పాడగా అన్నమయ్య పాటలు లోకములం దెల్లెడల వ్యాపించియున్నవి.

శ్రీహరిని కీర్తించు తాళ్ళపాక అన్నమయ్య ఒకొ్కకవేళ సనకాది మునీంద్రులతో గూడి సంచరించుచుండును. గరుడుడు, శేషుడు మున్నగు నిత్యసూరుల చెంత తాను స్థిరమైన ఆళ్వార్ల తేజోరూపముతో ప్రకాశించుచుండును.

తాళ్ళపాక అన్నమయ్య శ్రీ వేంకటాచలముపై శ్రీకాంతుని కొలువుకూటమునందు నెలకొనియున్నాడు. దేవతలు, మునులు 'ఈయన దేవుడే' అని జయజయ ధ్వానముల గావించుచుండగా ఆయన కోనేటిచెంత భగవత్తత్త్వజ్ఞుడై సంచరించుచుండును.

వి:- అన్నమాచార్యుల మహిమాతిశయ మిట కీర్తింపబడినది. ఆయన ముక్తుడై వైకుంఠమున నిత్యసూరులతోను, సనకాది మునులతోను గూడియున్నట్లు పేర్కొనుటే కాక హరి యవతారమే అతడని చెప్పుట ఇందు గుర్తింపవగియున్నది. సంకీర్తనాచార్యు డీ లోకమును వీడిపోయిన పిమ్మట తదనుయాయులు ఆయనను భగవదవతారముగా భావించి పూజించిరని దీనిచే తెలియుచున్నది. శ్రీహరి సంకీర్తనచే ముక్తి లభించునని శాస్త్రములు ప్రతిపాదించుచున్నవి. తన జీవితము నందుకు ప్రత్యక్ష నిదర్శనముగా ప్రజలకు చూపి అన్నమయ్య సుప్రతిష్ఠిత చరిత్రుడైనాడు. కావున నే పరమును సంకీర్తనఫలముగా ప్రతిష్ఠించిన ధన్యజీవిగా ఇచ్చట ఆయన కీర్తింప బడినాడు.

ఈ రీతిగనే పద కవితా పితామహుని ప్రశస్తిని చాటు మరికొన్ని సంకీర్తనలు ఆయన రచనలుగా గుర్తింపబడిన రేకులలో ఎడనెడ కనిపించుచున్నవి.[1] ఆయన సంతతివా రెవరో వీటిని రచించియుందురు. సంకలన కర్తల పొరపాటువ నవి పై రేకులలోని కెక్కినవని పెద్ద లూహించుచున్నారు. ఈ కీర్తనలు అన్నమయ్య మహిమను, ఆయన రచనల గొప్పతనమును, ఆ కాలమున తదనుయాయుల కాయనపై గల భక్త్యతిశయమును చక్కగా ప్రకటించుచున్నవి. అందుచే వాఙ్మయ పరిశోధకుల దృష్టిలో వాటి కెంతో ప్రాముఖ్యము గలదు.

ఉదాహరణమున కీ క్రింది రెండు సంకీర్తనములను పరిశీలింపుడు——

లలిత

శరణంటి మాతని - సంబంధమునఁ జేసి
మరిగించి మము నేలి - మన్నించవే. ॥పల్లవి॥

సకలవేదములు - సంకీర్తనలు చేసి
ప్రకటించి నినుఁబాడి - పావనుఁడైన,
అకలంకుఁడు తాళ్ళపా - కన్నమాచార్యుల
వెకలియై యేలిన శ్రీ - వేంకట నిలయ. ॥శర॥

నారదాది సనకస - నందనాదులవలె
పేరుకొని నిన్నుఁబాడి - పెద్దలైనట్టి,
ఆరీతిఁ దాళ్ళపా - కన్నమాచార్యుల
చేరి యేలినయట్టి - శ్రీ వేంకట నిలయ. ॥శర॥

1. అ. సం. , 6-24; 6-100; 6-151; 8-127; 8-183; 9-184; సంఖ్యగల సంకీర్తన లిన్నియు పీ కోవకు జెందినవే.

సామవేద సామగాన - సప్త స్వరములను
జాముతో నీసతి నిన్నుఁ - బాడిన యట్టి,
ఆముకొన్న తాళ్ళపా - కన్నమాచార్యుల
వేమరు మెచ్చిన శ్రీ - వేంకట నిలయ.1

దేసాళం

యితఁడే ముక్తిదోవ - యితఁడే మా యాచార్యు
డితఁడు గలుగఁబట్టి - యిందరు బదికిరి. ॥పల్లవి॥

అదివో తాళ్ళపాక - అన్నమాచార్యులు
యిదె వీఁడే శ్రీ వేంక - టేశు నెదుట,
వెదవెట్టి లోకములో - వేదములన్నియు మంచి
పదములు సేసి పాడి - పావనము సేసెను. ॥ఇత॥

అలరుచుఁ దాళ్ళపాక - అన్నమాచార్యులు
నిలచి శ్రీ వేంకట - నిధియే తానై,
కలిదోషములు వాప - ఘన పురాణములెల్ల
పలుకుల నించి నించి - పాడినాఁడు హరిని. ॥ఇత॥

అంగవించెఁ దాళ్ళపాక - అన్నమాచార్యులు
బంగారు శ్రీ వేంకటేశు - పాదములందు,
రంగుమీర శ్రీ వేంకట - రమణుని యలమేలు
మంగమ యిద్దరిఁ బాడి - మమ్ము గరుణించెను.2 ॥ఇత॥

## 75

అవ:- పరమాత్మునకు మంగళము పాడుచున్నారు—

**లలిత**

**మంగళం గోవిందునకు జయ - మంగళం గరుడధ్వజునకును,**
**మంగళము సర్వాత్మునకు ధర్మ స్వరూపునకూ. జయజయ ॥పల్లవి॥**

1. అ. సం., 6-24.  2. అ. సం., 8-183.

1. ఆదికిని నాథైన దేవున - కచ్యుతున కంభోజనాభువ
కాదికూర్మంబైన జగ - దాధారమూర్తికిని,
వేద రక్షకునకును సంతత - వేదమార్గ విహారునకు నలి
భేదికిని సామాదిగాన - ప్రియ విహారునకు. ॥మంగ॥

2. హరికిఁ బరమేశ్వరునకును శ్రీ - ధరునకును గాలాంతకునకును
పరమ పురుషోత్తమునకును బహు - బంధ దూరునకు,
సురముని స్తోత్రునకు దేవా - సురగణ శ్రేష్ఠునకు గరుణా
కరునకును గాత్యాయనీనుత - కలితనామునకు. ॥మంగ॥

3. పంకజాసన వరదునకు భవ - పంక విచ్ఛేదునకు భవునకు
శంకరున కవ్యక్తునకు వా - శ్చర్య రూపునకు,
వేంకటాచల వల్లభునకును - విశ్వమూర్తికి నీశ్వరునకును
పంకజా కుచకుంభ కుంకుమ - పంకలోలునకు. ॥మంగ॥

1. సామాదిగాన ప్రియవిహారునకు = సామవేద మూలకమైన గానమునందు ప్రియమైన లీల గలవానికి,
2. కాలాంతకునకును = కాలాతీతునకు; కాత్యాయనీ నుతకలితనామునకు = పార్వతిచే స్తుతింపబడిన శుభప్రదమైన నామము గలవానికి.
3. పంకజాకుచ కుంభ కుంకుమ పంకలోలునకు = లక్ష్మీదేవియొక్క స్తనకలశములమీది కుంకుమపు కలపమునందు దానక్తుడైన వానికి.

గోవిందునకు మంగళము. గరుడకేతనునకు జయమంగళము. సర్వమునకు ఆత్మయైనవానికి శుభ మంగళము. ధర్మమే స్వరూపముగా గలవానికి నిత్య మంగళము.

మూలమునకు మూలమైన దేవునకు, చ్యుతిలేనివానికి, పద్మనాభునకు, తొలి కూర్మమై లోకమునకెల్ల ఆధారమైన మూర్తి గలవానికి, వేదమును కాపాడువానికి, ఎల్లవేళల వేదమార్గమునవే విహరించువానికి, సామవేదమునుండి జనించిన గానము నందు ప్రీతిగలవానికి సదా మంగళము.

శ్రీహరికి, పరమేశ్వరునకు, లక్ష్మీధరునకు, కాలాతీతునకు, శ్రేష్ఠుడైన పురుషోత్తమునకు, బంధములకెల్ల దూరమైనవానికి, దేవతలు, మునులు గావించు స్తోత్ర

ములు గలవానికి, దేవాసుర సమూహములో శ్రేష్ఠుడైనవానికి, దయకు నిలయమైన వానికి, పార్వతి వినుతించు మంగళకరమైన నామములు గలవానికి పరమ మంగళము.

బ్రహ్మకు వరము లిచ్చినవానికి, సంసారమాలిన్యమును కడిగివేయువానికి, భవునకు, శంకరునకు, వ్యక్తము గానివానికి, అచ్చెరువుగొల్పు రూపము గలవానికి, విశ్వాకారునకు, ఈశ్వరునకు, లక్ష్మీదేవియొక్క కుచకుంభములమీది కుంకుమవు కలపమునం దాసక్తుడైనవానికి, శ్రీ వేంకటాద్రీశ్వరునకు మహా మంగళము.

వి:- కదలేని జగములు - గల్పించే బ్రహ్మదేవు
దదరి యే దేవు నాభి - యందుఁ బుట్టెను.[1]

అని మరొకచో అన్నమయ్య పేర్కొన్నట్లు సృష్టికర్తయైన చతుర్ముఖబ్రహ్మను గన్నవాడు గాన 'ఆదికి నాదైన దేవుడు'గా శ్రీహరి యిట కీర్తింపబడినాడు.

పార్వతీదేవి సదా శ్రీహరి నామములను స్తుతించుచుండుననుట పురాణ ప్రసిద్ధము. శివునకు సామాన్యనామములైన 'భవునకు, శంకరునకు' అను విశేషణముల నిచట ఉపయోగించుటచే శివునితో కేశవుని కభేదము సూచింపబడినది. 'భవ కమల భవ మాధవరూప'[2] ఇత్యాదులగు విశేషణములుగూడ ఇట్టివే. స్థూలదృష్టి గలవారికి యభేదము గోచరము గాదు. అందుచేతనే తరువాతి విశేషణములు (అవ్యక్తునకు, ఆశ్చర్యరూపునకు) భగవత్స్వరూపమును వ్యక్తము గానిదిగాను, ఆశ్చర్యావహము గాను నిర్దేశించుచున్నవి.

'శ్రీధరునకు, పంకజా కుచకుంభ కుంకుమ పంకలోలునకు' అను విశేషణములచే నిత్యానపాయినియైన కమలాదేవితో గూడిన భగవంతుని రూపు కీర్తింపబడినది. ఇందుచే దేవునితోపాటు దేవికిని మంగళము పాడినట్లైనది.

ద్వితీయభాగము సమాప్తము.

శ్రీ సద్గురు పరబ్రహ్మార్పణమస్తు.

ఓమ్ తత్ సత్ ఓమ్.

---

1. అ. సం. 11-1-92.  2. అ. సం. , 11-2-37.

## మరికొన్ని

# అన్నమయ్య పాటలు

### 1. శ్రీరాగం

అదివో అల్లదివో - హరివాసము
పదివేల శేషుల - పడగల మయము. ॥అది॥

అదె వేంకటాచల - మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల - కపురూపము,
అదివో నిత్య నివాస - మఖిల మునులకు
అదె చూడుఁ డదె మ్రొక్కు - డానందమయము. ॥అది॥

చెంగట నల్లదివో - శేషాచలము
నింగి నున్న దేవతల - నిజవాసము,
ముంగిట నల్లదివో - మూలనున్న ధనము
బంగారు శిఖరాల - బహు బ్రహ్మమయము. ॥అది॥

కైవల్యపదము వేం - కటనగ మదివో
శ్రీ వేంకటపతికి - సిరులైనవి,
భావింప సకల సం - పదరూప మదివో
పావనముల కెల్ల - పావన మయము. ॥అది॥

(5-29)

### 2. పాడి

నారాయణ తే - నమో నమో
నారద సన్నుత - నమో నమో. ॥నారా॥

మురహర భవహర - ముకుంద మాధవ
గరుడ గమన పం - కజనాభ,
పరమపురుష భవ - బంధ విమోచన
నరమృగ శరీర - నమో నమో. ॥నారా॥

జలధిశయన రవి - చంద్ర విలోచన
జలరుహ భవనుత - చరణయుగ,
బలిబంధన గో - పవధూ వల్లభ
నలినోదర తే - నమో నమో. ॥నారా॥

ఆదిదేవ సక - లాగమ పూజిత
యాదవకుల మో - హన రూప,
వేదోద్ధర శ్రీ - వేంకట నాయక
నాదప్రియ తే -నమో నమో. ॥నారా॥

(11-183 P.)

## 3. సామంతం

కొండలలో నెలకొన్న - కోనేటిరాయఁడు వాఁడు
కొండలంత వరములు - గుప్పెడు వాఁడు. ॥కొండ॥

కుమ్మర దాసుడైన - కురువరతి నంబి
యిమ్మన్న వరములెల్ల - నిచ్చిన వాఁడు,
దొమ్ములు సేసినయట్టి - తొండమాం జక్కురవర్తి
రమ్మన్న చోటికి వచ్చి - నమ్మినవాఁడు. ॥కొండ॥

అచ్చప వేడుకతోడ న - నంతాళువారికి
ముచ్చిలి వెట్టికి మన్ను - మోఁచినవాఁడు,

మచ్చిక దొలఁకఁ దిరు - మల నంబితోఁడుత
నిచ్చ నిచ్చ మాటలాడి - నొచ్చినవాఁడు. ॥కొండ॥

కంచిలోన నుండఁ దిరు - కచ్చి నంబిమీఁదఁ గరు
ణించి తనయెడకు ర - ప్పించిన వాఁడు,
యెంచి నెక్కుడైన వేంక - టేశుఁడు మనలకు
మంచివాఁడై కరుణఁ బా - లించినవాఁడు. ॥కొండ॥

(5-93)

## 4. ముఖారి

నానాఁటి బదుకు - నాటకము
కానక కన్నది - కైవల్యము. ॥నానా॥

పుట్టుటయు నిజము - పోవుటయు నిజము
నట్టనడిమి పని - నాటకము,
యెట్ట యెదుటఁగల - దీ ప్రపంచము
కట్టఁ గడపటిది - కైవల్యము. ॥నానా॥

కుడిచే దన్నము - కోక చుట్టెడిది
నడుమంత్రపు పని - నాటకము,
వొడి గట్టుకొనిన - వుభయకర్మములు
గడి దాఁటినపుడె - కైవల్యము. ॥నానా॥

తెగదు పాపము - తీరదు పుణ్యము
నగి నగి కాలము - నాటకము,
యెగువనె శ్రీ వేంక - టేశ్వరుఁ డేలిక
గగనము మీఁదిది - కైవల్యము. ॥నానా॥

(9-287)

## 5 దేసాక్షి

భావములోనా - బాహ్యమునందును,
గోవింద గోవింద యని - కొలువవో మనసా ॥ ॥భావ॥

హరి యవతారములే - యఖిల దేవతలు
హరిలోనివే బ్ర - హ్మాండంబులు,
హరి నామములే - అన్ని మంత్రములు
హరి హరి హరి హరి - యనవో మనసా ॥ ॥భావ॥

విష్ణుని మహిమలే - విహిత కర్మములు
విష్ణుని పొగడెడి - వేదంబులు,
విష్ణుఁ డొక్కఁడే - విశ్వాంతరాత్ముఁడు
విష్ణువు విష్ణువని - వెదకవో మనసా ॥ ॥భావ॥

అచ్యుతుఁ డితఁడే - ఆదియు నంత్యము
అచ్యుతుఁడే యసు - రాంతకుఁడు,
అచ్యుతుఁడు శ్రీ వేంక - టాద్రిమీఁద నిదె
అచ్యుత అచ్యుత శర - ణనవో మనసా ॥ ॥భావ॥

(9-272)

## 6. సాళంగనాట

ముద్దుగారే యశోద - ముంగిటి ముత్యము వీఁడు.
తిద్దరాని మహిమల - దేవకీ సుతుఁడు. ॥ముద్దు॥

అంత నింత గొల్లెతల - అరచేతి మాణికము
పంతమాడే కంసుని - పాలి వజ్రము,
కాంతుల మూడులోకాల - గరుడ పచ్చఁబూస
చెంతల మాలో నున్న - చిన్ని కృష్ణుఁడు. ॥ముద్దు॥

రతికేళి రుక్మిణికి - రంగుమోవి పగడము
మితి గోవర్ధనపు గో - మేధికము,
సతమై శంఖచక్రాల - సందుల వైడూర్యము
గతియై మమ్ముఁ గాచేటి - కమలాక్షుఁడు. ॥ముద్దు॥

కాళింగుని తలలపై - గప్పిన పుష్యరాగము
యేలేటి శ్రీ వేంకటాద్రి - యింద్రనీలము
పాలజలనిధి లోనఁ - బాయని దివ్యరత్నము
బాలునివలెఁ దిరిగీఁ - బద్మనాభుఁడు. ॥ముద్దు॥

(9-288)

## ౭. సామంతం

మనుజుఁడై పుట్టి - మనుజుని సేవించి
అనుదినమును దుఃఖ - మందనేలా? ॥మను॥

జుట్టెడు కడుపుకై - చొరనిచోట్ల చొచ్చి
పట్టెడు కూటికై - బతిమాలి,
పుట్టిన చోటికే - పొరలి మనసు పెట్టి
వట్టి లంపటము - వదలనేరఁడు గాన. ॥మను॥

అందరిలోఁ బుట్టి - అందరిలోఁ జేరి
అందరి రూపము - లటు తానై,
అందమైన శ్రీ వేంక - టాద్రీశు సేవించి
అందరాని పద మందె - నటు గాన. ॥మను॥

(11-262 P)

## ౮. రామక్రియ

పండెకాదఁ బుట్టిపట్టి - పాయలంవంటి యెంత
చందమాయఁ జూదరమ్మ - చందమామ వంట. ॥పండె॥

మునుపఁ బాలవెల్లి - మొలచి పండిన పంట
ఘనుపై దేవతలకు - విచ్చు పంట,
గొనకొని హరి కన్ను - గొనచూపుల పంట
ఘనువీథి వెగడిన - వెన్నెలల పంట. ॥పంటె॥

వలరాజు పంపున - వలపు వి త్తిన పంట
చలువై పున్నమనాటి - జాజరపంట,
కలిమి కామినితోడ - కారు కమ్మిన పంట
మలయుచుఁ దమలోని - మర్రి మావిపంట. ॥పంటె॥

విరహుల గుండెలకు - వెక్కసమైన పంట
వరగ చుక్కలరాసి - భాగ్యము పంట,
అరుదై తూరుపుగొండ : నారగఁ బండిన పంట
యిరవై శ్రీ వేంకటేశు - వింటిలోని పంట. ॥పంటె॥

(11-32 P.)

9. ధన్నాసి

దేవదేవం భజే - దివ్య ప్రభావం
రావణాసురవైరి - రణపుంగవం. ॥దేవ॥

రాజవర శేఖరం - రవికుల సుధాకరం
ఆజానుబాహుపీ - లాభ్రకాయం,
రాజారి కోదండ - రాజ దీక్షాగురుం
రాజీవలోచనం - రామచంద్రం. ॥దేవ॥

నీలజీమూత స - న్నిభ శరీరం ఘనవి
శాలవక్షం విమల - జలజనాభం,
కాలాహి నగహరం - ధర్మ సంస్థాపనం
భూలలనాధిపం - భోగి శయనం. ॥దేవ॥

పంకజాసన వినుత - పరమ నారాయణం
శంకరార్జిత జనక - చాప దళనం,
లంకా విశోషణం - లాలిత విభీషణం
వేంకటేశం సాధు - విబుధ వినుతం. ॥దేవ॥

(11-285 P.)

10 భూపాళం

విన్నపాలు వినవలె - వింత వింతలు
పన్నగపు దోమతెర - పైకెత్త వేలయ్యా ॥విన్న॥

తెల్లవారె జామెక్కె - దేవతలు మునులు
అల్ల నల్ల నంతనింత - నదిగో వారే,
చల్లని తమ్మిరేకుల - సారసపుఁ గన్నులు
మెల్లమెల్లనె విచ్చి - మేలుకొన వేలయ్యా ॥విన్న॥

గరుడ కిన్నర యక్ష - కామినులు గములై
విరహపు గీతముల - వింతాలాపాల,
పరిపరి విధములఁ - బాడేరు విన్నదివో
సిరిమొగము దెరచి - చిత్తగించ వేలయ్యా ॥విన్న॥

పొంకపు శేషాదులు తుం - బురు నారదాదులు
పంకజ భవాదులు నీ - పాదాలు చేరి,
అంకెల నున్నారు లేచి - అలమేలు మంగను
వేంకటేశుఁడా రెప్పలు - విచ్చి చూచి లేవయ్యా ॥విన్న॥

(4-25)

11. భూపాళం

ఏ కులజుఁ డేమి - యెవ్వఁడైన నేమి
ఆకడ నాతఁడె - హరి నెరిఁగినవాఁడు ॥ఏకు॥

పరగిన సత్య సం - పన్నుఁడైనవాఁడే
పరనింద పేయఁ ద - త్పరుఁడు గానివాఁడు,
అరుదైన భూత ద - యానిధి యగువాఁడే
పరులు దానే యని - భావించువాఁడు. ॥ఏకు॥

నిర్మలుఁడై యాత్మ - నియతి గలుగువాఁడే
ధర్మతత్పరత బుద్ధిఁ - దగిలినవాఁడు,
కర్మమార్గములు - గడపని వాఁడే
మర్మమై హరిభక్తి - మరవనివాఁడు. ॥ఏకు॥

జగతిపై హితముగా - జరియించువాఁడే
పగలేక మతిలోన - బ్రదికిన వాఁడు,
తెగి సకలము నాత్మఁ - దెలిసినవాఁడే
తగిలి వేంకటేశు - దాసుఁడయినవాఁడు. ॥ఏకు॥

(5-195)

## 12. శుద్ధవసంతం

చేరి యశోదకు - శిశువితఁడు
ధారుణి బ్రహ్మకుఁ - దండ్రియు నితఁడు. ॥చేరి॥

సొలసి చూచినను - సూర్యచంద్రులను
లలి వెదచల్లెడు - లక్షణుఁడు,
నిలిచి నిలుపున - నిఖిల దేవతల
కలిగించు సురల - గనివో యితఁడు. ॥చేరి॥

మాటలాడినను - మరి యజాండములు
కోటులు వొడమెడి - గుణరాశి,
నీటగు నూర్పుల - నిఖిల వేదములు
చాటువ నూరెటి - సముద్ర మితఁడు. ॥చేరి॥

ముంగిటఁ బొలసిన - మోహన మాత్కలఁ
బొంగించే ఘన - పురుషుఁడు,
సంగతి మావంటి - శరణాగతులకు
వంగము శ్రీ వేంక - టాధిపుఁ డితఁడు. ॥చేరి॥

(9-196)

## 13. శంకరాభరణం

పొడగంటిమయ్య మిమ్ము - పురుషోత్తమా ! మమ్ము
నెడయకవయ్య కో - నేటి రాయఁడా ! ॥పొడ॥

కోరి మమ్ము నేలినట్టి - కులదైవమా ! చాల
నేరిచి పెద్దలిచ్చిన - నిధానమా !
గారవించి దప్పిదీర్చు - కాలమేఘమా ! మాకు
చేరువఁ జిత్తములోని - శ్రీనివాసుఁడా ! ॥పొడ॥

భావింప గైవసమైన - పారిజాతమా ! మమ్ము
చేవదేరఁ గాచినట్టి - చింతామణీ !
కావించి కోరికలిచ్చే - కామధేనువా ! మమ్ము
తావై రక్షించేటి - ధరణీధరా ! ॥పొడ॥

చెడనీక బ్రదికించే - సిద్ధమంత్రమా ! రోగా
లడఁచి రక్షించే ది - వ్యౌషధమా !
బడిఁ బాయక తిరిగే - ప్రాణబంధుఁడా ! మమ్ము
గడియించినట్టి శ్రీ వేం - కటనాథుడా ! ॥పొడ॥

(అ. చ. పి. P. 21)

## 14. శంకరాభరణం

అలరులు గురియఁగ - నాడెనదే
అలకలఁ గులుకుల - నలమేలు మంగ. ॥అల॥

అరవిరి సొబగుల - నతివలు మెచ్చఁగ
అరతెర మరుగున - నాడె నదే,
వరుసగ పూర్వ దు - వాళపు తిరుపుల
హరిఁ గరగింపుచు - నలమేలు మంగ. ॥అల॥

మట్టపు మలపుల - మట్టెల కెలకుల
తట్టెడి నడపుల - దాటె నదే,
పెట్టిన వజ్రపు - పెండెపు దళుకులు
అట్టిటు చిమ్ముచు - నలమేలు మంగ. ॥అల॥

చిందుల పాటల - శిరిపొల యాటల
అందెల మ్రోతల - నాడె నదే,
కందువ తిరు వేం - కటపతి మెచ్చఁగ
అందపు తిరుపుల - నలమేలు మంగ. ॥అల॥

(12-24)

## 15. సాళంగపాట

పలుకుఁ దేనెల తల్లి - పవళించెను
కలికి తనముల విభుని - గలసినది గాన. ॥పలు॥

నిగనిగని మోముపై - నెరులు గెలఁకులఁ జెదర
పగలైన దాఁకఁ జెలి - పవళించెను,
తెగని పరిణతులతో - తెల్లవారినదాఁక
జగదేకపతి మనసు - జట్టిగొనెఁ గాన. ॥పలు॥

కొంగుజారిన మెరుఁగు - గుబ్బ లొలయఁగఁ దరుణి
బంగారు మేడపైఁ - బవళించెను,
చెంగలువ కనుఁగొనల - సింగారములు దొలఁక
అంగజ గురునితోడ - నలసినది గాన. ॥పలు॥

మురిపెంపు నటనతో - ముత్యాల మలుఁగుపై
పరవశంబునఁ దరుణి - పవళించెను,
తిరువేంకటాచలా - ధిపుని కౌఁగిటఁ గలపి
అరవిరై నునుజెమట - నంటినది గాన. ॥పలు॥

(4-74)

## 16. పాడి

చక్కని తల్లికి - చాంగుభళా తన
చక్కెర మోవికి - చాంగుభళా । ॥చక్క॥

కులికెడు మురిపెపు - కుమ్మరింపు తన
పలుపు జూపులకు - చాంగుభళా ।
పలుకుల సొలపులఁ - బతితోఁ గసరెడి
చలముల యలుకకు - చాంగుభళా ! ॥చక్క॥

కిన్నెరతో పతి - కెలన నిలుచు తన
చన్ను మెరుఁగులకు - చాంగుభళా ।
ఉన్నతిఁ బతిపై - నొరగి నిలుచు తన
సన్నపు నడిమికి - చాంగుభళా । ॥చక్క॥

జందెపు ముత్యపు - సరుల హారముల
చందన గంధికి - చాంగుభళా ।
విందయి వేంకట - విభుఁ బెనఁచిన తన
నంది దండలకు - చాంగుభళా ॥ ॥చక్క॥

(12-107)

## 17. శంకరాభరణం

తరుణి నీ యలుక కేం - తటి దింతి నీవేఁ
గరుణించఁ గదర వేం - కట శైలనాథా । ॥తరు॥

ఒకమారు సంసార - మొల్లఁ బొమ్మని తలఁచు
ఒకమారు విధిసేఁత - లూహించి పొగడు,
ఒకమారు తనుఁజూచి - వూరకే తలవూఁచు
నొకమారు హర్షమున - నొంది మే మఱచు. ॥తరు॥

విన్నుఁజూచి ఒకమారు - నిలువెల్లఁ బులకించు
తన్నుఁజూచి వొకమారు - తలపోసి నగును,
కన్ను దెరచి వినుఁజూచి - కడు సిగ్గువడి నిలిచి
యిన్నియును దలపోసి - యింతలో మఱచు. ॥తరు॥

వదలైన మొలనూలు - గదియించు నొకమారు
చెదరిన కురులెల్లఁ - జెరుగు నొకమారు
అదనెరిగి తిరువేంక - టాధీశ పొందితివి
చదురుఁడవు వినుఁబాయఁ - జాల దొకమారు. ॥తరు॥

(12-70)

## 18. ముఖారి

ఇది గాక సౌభాగ్య - మిదిగాక తపము మఱి
యిది గాక వైభవం - బిఁక నొకటి కలదా. ॥ఇది॥

అతివ జన్మము సఫల - మై పరమయోగివలె
నితర మోహాపేక్ష - లిన్నియును విడిచె,
పతి కోరికలు మహా - శాంతమై యిదె చూడ
సతత విజ్ఞాన వా - సనవోలె నుండె. ॥ఇది॥

తరుణి హృదయము కృతా - ర్థతఁబొంది విభుమీఁది
పరవశానంద సం - పదకు నిరవాయ,
సరసిజానన మనో - జయమంది యింతలో
సరిలేక మనసు ని - శ్చలభావ మాయ. ॥ఇది॥

శ్రీ వేంకటేశ్వరుని - జింతించి పరతత్త్వ
భావంబు నిజముగాఁ - బట్టెఁ జెలి యాత్మ,
దేవోత్తముని కృపా - దీనురాలై యిపుడు
లావణ్యవతికి ను - ల్లంబు దిటమాయ. ॥ఇది॥

(2-17)

## 19. శ్రీరాగం

హరి యవతార మీతఁడు - అన్నమయ్య
అరయ మాగురుఁ డితఁ - డన్నమయ్య. ॥హరి॥

వైకుంఠనాథునిచద్ద - వడిఁ బాడుచున్నవాఁడు
ఆకరమై తాళ్ళపాక - అన్నమయ్య,
ఆకసపు విష్ణుపాద - మందు నిత్యమై వున్నవాఁడు
ఆ కడీకడఁ దాళ్ళపాక - అన్నమయ్య. ॥హరి॥

క్షీరాబ్ధిశాయి చిక్కె - సేవింపుచు నున్నవాఁడు
ఆరితేరి తాళ్ళపాక - అన్నమయ్య,
ధీరుఁడై సూర్యమండల - తేజమువద్ద నున్నవాఁడు
ఆ రీతులఁ దాళ్ళపాక - అన్నమయ్య. ॥హరి॥

యీవల సంసారలీల - యిందిరేశుతో నున్నవాఁడు
ఆవటించి తాళ్ళపాక - అన్నమయ్య,
భావింప శ్రీ వేంకటేశు - పాదములందే వున్నవాఁడు
ఆవభావమై తాళ్ళపాక - అన్నమయ్య. ॥హరి॥

(8-100)

## 20. మంగళకౌశిక

క్షీరాబ్ధి కన్యకకు - శ్రీ మహాలక్ష్మికిని
*నీరజాలయమునకు - నీరాజనం. ॥క్షీరా॥

జలజాక్షి మోమునకు - జక్కవ కుచంబులకు
నెలకొన్న కప్పురపు - నీరాజనం,
అలివేణి తురుమునకు - హస్తకమలంబులకు
నిలువు మాణిక్యముల - నీరాజనం. ॥క్షీరా॥

చరణకిసలయములకు - సకియ రంభోరులకు
నిరతమగు ముత్తేల - నీరాజనం,
అరిది జఘనంబునకు - అతివ నిజనాభికిని
నిరతి నానావర్ణ - నీరాజనం. ॥క్షీరా॥

పగటు శ్రీ వేంకటేశు - పట్టపురాణియై
వెగడు సతి కళలకును - నీరాజనం,
జగతి నలమేల్మంగ - చక్కందనములకెల్ల
నిగుడు నిజశోభనపు - నీరాజనం. ॥క్షీరా॥

(20-295)

---

* నీరజాలయకును - అను పాఠము సంగతము.